# సంగీత విద్యా ప్రకాశిక





శ్రీ ఆకొండి శ్రీనివాస రాజారావు B.Sc., B.Ed.,
(ఆకాశవాణి కళాకారులు)

రోహిణి పబ్లికేషన్స్
మెయిన్ రోడ్, రాజమండ్రి - 1.

# Sangeeta Vidya Prakasika

- *Akondi Srinivasa Raja Rao* B.Sc., B.Ed.,



First Edition : *June 95*
Second Edition : *August 97*

**PRICE : Rs. 100/-**

**Cover Design :** *Bapu*

Printers :
*Sri Arunodaya*
*Vijayawada - 2.*

Published by :

© 73444

**ROHINI PUBLICATIONS**

Main Road, **RAJAHMUNDRY.**



సద్గురు శ్రీ మెహెర్ చైతన్యాజీ మహరాజ్

# ఆశీస్సులతో...

# సంగీత విద్యా ప్రకాశిక

ప్రముఖ సంగీత
విద్వాంసుల
అభిప్రాయములు

శ్రీ నేదునూరి కృష్ణమూర్తి
శ్రీ ఎన్.సి.హెచ్. కృష్ణమాచార్యులు
శ్రీ బాలాంత్రపు రజనీ కాంతరావు
శ్రీ వి. కమలాకర రావు
శ్రీ కోటిపల్లి ప్రకాశరావు
శ్రీ మునుగంటి శ్రీరామమూర్తి
శ్రీ ఎమ్. కృష్ణమోహన్

# సరిగమల కథాక్రమం


1. ప్రకాశకుల మనవి
2. ఆరోహణ
3. ప్రముఖుల అభిప్రాయాలు
4. సంగీతానికి ఉన్న ప్రత్యేకతలు 27
5. సంగీతం దేనితో ఏర్పడుతుంది? 28
6. సంగీతం ఎలా ఏర్పడింది? 30
7. పూర్వపు సంగీత వాద్యాలు 32
8. సంగీతంలో ఉన్న పద్ధతులు 33
9. రాగ సంప్రదాయ పద్ధతి అంటే ఏమిటి? 34
10. రాగ సంప్రదాయంలో రకాలు 36
11. కర్ణాటక సంగీతానికి ఆ పేరు ఎలా వచ్చింది? 37
12. సంగీతం బాగా నేర్చుకున్న వాళ్ళను ఏమంటారు? 38
13. సంగీతం గురించిన పుస్తకాలు, వాగ్గేయకారులు 40
14. నాదం 44
15. ధ్వని ప్రసారం 45
16. పౌనఃపున్యం 46
17. సంగీతధ్వనులు ఎందుకు వినడానికి బాగుంటాయి? 47
18. సంగీత ధ్వనులు లక్షణాలు 48
19. ప్రతిధ్వని 50
20. పౌనఃపున్యం దేనిపై ఆధార పడుతుంది? 51
21. స్థాయి 54
22. ఆరోహణ, అవరోహణ 58
23. స్వర పేటిక 59

24. శృతులు

25. ఇరవైరెండు శృతుల పట్టిక 63

26. శృతులు వాటి పౌనః పున్యాలు 65

27. అనురణాత్మక ధ్వనులు 68

28. గమకాలు 69

29. గమకాలు-రకాలు 70

30. షోడశ స్వరస్థానాలు 73

31. రాగాలు, రాగం అంటే ఏమిటి? 77

32. రాగాల మూర్ఛనలు 80

33. రాగానికి ఎన్ని స్వరాలుండాలి? 81

34. రాగాలు - రకాలు 82

35. జనక రాగాలు 83

36. జనకరాగాలు ఏర్పడేతీరు 85

37. జనకరాగాల్లో రకాలు 87

38. డెబ్బైరెండు మేళకర్త రాగాల పట్టిక 90

39. జన్యరాగాలు 92

40. జన్యరాగాలు పుట్టే విధానం 92

41. వర్జ్య రాగాల్లో రకాలు 95

42. వక్రరాగాల్లో రకాలు 101

43. ఉపాంగ - భాషాంగ రాగాలు 103

44. జనకరాగం నుంచి వచ్చే జన్యరాగాలు ఎన్ని? 105

45. ఒక పాట ఏ రాగంలో ఉందో ఎలా తెలుస్తుంది? 106

46. రాగాలు - వాటి లక్షణాలు 144

47. తాళం 144

48. తాళం అంటే ఏమిటి? 147

49. తాళం అన్న శబ్దం ఎలా పుట్టింది? 147

| | | |
|---|---|---|
| 50. | క్రియలు-రకాలు | 148 |
| 51. | అంగాలు - రకాలు | 151 |
| 52. | తాళాలు | 152 |
| 53. | సప్తతాళాలు | 158 |
| 54. | చాపు తాళం | 159 |
| 55. | కీర్తనలకు తాళం వేయడం ఎలా? | 162 |
| 56. | లయ, క్రియకు వచ్చే అక్షరాలు | 163 |
| 57. | క్రియకు వచ్చే అక్షరాలను పెంచడం ఎలా? | 164 |
| 58. | జాగా | 165 |
| 59. | గతులు | 166 |
| 60. | తాళం తప్పడం | 167 |
| 61. | కొన్ని కీర్తనలు వాటిరాగాలు తాళాలు | 170 |
| 62. | పాటల్ని రాసే పద్ధతి | 175 |
| 63. | సంగీత వాద్యాలు | 196 |
| 64. | సంగీత కచేరీలు | 220 |
| 65. | సంగీత కచేరీలలో ఏమిపాడతారు? వాయిస్తారు? | 222 |
| 66. | పూర్వపు సంగీత కచేరీలు | 233 |
| 67. | సంగీతం ఎలానేర్చుకోవాలి? | 234 |
| 68. | వాగ్గేయ కారుల చరిత్రలు | 236 |
| 69. | జయదేవుడు | 237 |
| 70. | అన్నమయ్య | 241 |
| 71. | పురందర దాసు | 245 |
| 72. | నారాయణ తీర్థులు | 249 |
| 73. | రామదాసు | 251 |
| 74. | క్షేత్రయ్య | 255 |
| 75. | త్యాగరాజు | 258 |
| 76. | ముత్తుస్వామి దీక్షితార్ | 273 |

77. శ్యామ శాస్త్రి 279
78. స్వాతి తిరునాళ్ 284
79. వీణ కుప్పయ్యర్ 287
80. పట్నం సుబ్రహ్మణ్యయ్యర్ 289
81. సదాశివ బ్రహ్మేంద్ర 290
82. పల్లవి శేషయ్యర్ 291
83. మైసూర్ సదాశివ రావు 292
84. సుబ్బరాయ శాస్త్రి 292
85. గోపాల కృష్ణభారతి 293
86. అరుణాచల కవిరాయర్ 293
87. పైడాల గురుమూర్తి శాస్త్రి 294
88. రామనాథపురం శ్రీనివాస అయ్యంగార్ 294
89. సుబ్బరామ దీక్షితులు 296
90. మహా వైద్యనాథయ్యర్ 297
91. మైసూర్ వాసుదేవాచార్య 298
92. హరి కేళ నల్లూర్ ముత్తయ భాగవతార్ 300
93. సారంగపాణి 302
94. పాపనాశన్ శివన్ 302
95. తూము నరసింహదాసు 303
96. మునిపల్లె సుబ్రహ్మణ్యకవి 304
97. అల్లూరి వెంకటాద్రి స్వామి 304
98. సంగీత విద్వాంసులు 306
99. కర్ణాటక సంగీతం - ఇతర సంగీతాలు 313
100. సంగీతం ఎందుకు నేర్చుకోవాలి? 322
101. సంగీతం ఎలా వినాలి? 325
102. సంగీతం పై నూతన పరిశోధనలు 328
103. ఉపయుక్త గ్రంథసూచి 333

# ప్రకాశకుల మనవి

నిర్వివాదాస్పదమైన భౌతిక శాస్త్ర ప్రాతిపదిక గలిగిన శాస్త్రీయ సంగీతం గురించి విశదపరచగల గ్రంథాలు 'మార్కెట్'లో లభిస్తున్నప్పటికీ, అవి సంగీత రంగంలో అంతో యింతో కృషి చేసిన వారికే తప్ప, ప్రాథమిక జ్ఞానం కోసం ప్రాకులాడే సామాన్యులకి - దురవగాహంగానే మిగిలిపోతున్నాయన్న సత్యం కించిత్కఠోర మైనదే.

ఈ వర్తమాన భూమిక మీద - సామాన్యులకు సైతం సంగీతజ్ఞానం, దాని విశిష్ఠత పట్ల సదవగాహన కలిగించాలనే సత్సంకల్పంతోనే మేమీ 'సంగీత విద్యా ప్రకాశిక' అనే గ్రంథాన్ని ముద్రింపించాము.

ఇందుకు సహకరించిన వారెందరో వున్నప్పటికీ అతిముఖ్యులు శ్రీ ముద్దా సురేష్ (నవలారచయిత - కాకినాడ); శ్రీమునుగంటి శ్రీరామమూర్తి (సంపాదకులు 'గానకళ' - సంగీతమాసపత్రిక ) గార్లకు, మా కోరికను మన్నించి ఈ గ్రంథ ప్రాముఖ్యతని గురించి తమ అభిప్రాయాలను వ్రాసియిచ్చిన పెద్దలకూ వినయ పూర్వకంగా కృతజ్ఞతలను తెలియబర్చుకుంటున్నాము.

ఇక - అతిప్రధానులు, ముఖ్యాతి ముఖ్యులు ఈ గ్రంథ రచయిత శ్రీ ఆకొండి శ్రీనివాస రాజారావు B.Sc., B.Ed., (ఆకాశవాణి విద్వాంసులు) గారికి ప్రత్యేక అభినందనల నందజేయడం సమంజసంగానే భావిస్తున్నాము. ఎందుచేత నంటే - మేము ఎంత తొందరపెట్టినా, వారు మాత్రం వేగపడక నిదానంగానే ఈ రచనను మెల్లగా పూర్తిచేసి - మహామహోపాధ్యాయుల చేత ప్రశంసల నందుకోవడమే అందుకు కారణం.

చివరగా - ఈ పుస్తకాన్ని ఇంత అందంగానూ, ముద్రారాక్షసాలు లేకుండానూ ముద్రించేందుకు విశేషవ్యయ ప్రయాసల కోర్చిన 'శ్రీ పద్మావతి టైప్ సెట్టర్స్-రాజమండ్రి' వారికి కూడా మా ధన్యవాదాల నర్పించు కుంటున్నాము.

ఎంతమంది ఎన్ని రకాలుగా కృషిచేసినా ఏదోకోణంలో, ఏదోరకమైన దోషం శేషంగా వుండిపోవడం సహజం. అటువంటి దోషాలేమైనా యిందులో దొర్లివుంటే-మాదృష్టికి తీసుకునివచ్చిన సహృదయులకు కూడా ఎంతో ఋణపడి వుంటామని తెలుపుకుంటూ.

సదా సహృత్సేవలో
పైల అప్పారావు
రోహిణి పబ్లికేషన్స్, రాజమండ్రి-1

# ఆరోహణ

సంగీతం గురించి తెలియని సామాన్యులకు సంగీతంపై అభిరుచిని, ఆసక్తినీ, అవగాహనను కల్గించేందుకు ఉపయోగింపబడాలనే ఉద్దేశ్యంతో రాసిన పుస్తకం ఇది.

'పలికెడిది భాగవతమట పలికించెడివాడు రామభద్రుండట' అన్నట్లు ఈ పుస్తకాన్ని నాచేత రచింపచేయించినది నా ఆధ్యాత్మిక గురుదేవులు సద్గురు శ్రీ మెహెర్ చైతన్యజీ మహరాజ్ వారేనని నా ప్రగాఢ విశ్వాసం. ఈ పుస్తకంలో వారి ఫొటోను ప్రచురించేందుకు అనుమతి నిచ్చినందుకు వారి పాదపద్మాలకు వినయంతో నమస్కరిస్తున్నాను.

అసలు ఈపుస్తకాన్ని రచించే అవకాశం నాదికాదు. శ్రీ రోహిణి పబ్లికేషన్స్‌వారు 'గానకళ' సంగీత మాసపత్రిక సంపాదకులైన శ్రీ మునుగంటి శ్రీరామమూర్తిగారిని, ఈ పుస్తక రచన చేయమని కోరారు. శ్రీ శ్రీరామమూర్తిగారు వారికి లభించిన ఆ అవకాశాన్ని అంతులేని అభిమానంతో నాకు ఇచ్చారు. అంతేకాదు ఈ పుస్తకాన్ని రాయడంలో నాకు ఎన్నో సలహాలు, సూచనలతో పాటు చాలా రిఫరెన్స్ పుస్తకాల్ని కూడా అందించారు. వారికి నేనెంతో ఋణపడి ఉన్నాను.

నాదాన్ని గురించి, శృతులు గురించి నాకు తెలియని ఎన్నో విషయాలు చెప్పడమే కాకుండా, చిత్తుప్రతిని ఆమూలాగ్రం చదివి ఈ పుస్తక రచనలో నాకు మార్గదర్శకత్వం నెరపిన బహు గ్రంథకర్త శ్రీ ఎ.వి.యస్. రామారావుగారికి నేనెంతో కృతజ్ఞుడను.

ఈ పుస్తకాన్ని చదివి, వారి అమూల్యమైన అభిప్రాయాన్ని తెలిపిన నా గురుదేవులు 'సంగీతకళానిధి' శ్రీ నేదునూరి కృష్ణమూర్తి గారికి నా వందన శతాల్ని అర్పిస్తున్నాను. అలాగే ఈ పుస్తకం గురించి విలువైన అభిప్రాయాల్ని తెలిపి, నన్ను ఆశీర్వదించిన 'కళాప్రపూర్ణ' శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావు గారికి; 'సంగీత సాహిత్య కళానిధి' శ్రీ ఎన్.సి.హెచ్. కృష్ణమాచార్యులు గారికి; ప్రముఖ సంగీత విద్వాంసులు శ్రీ కోటిపల్లి ప్రకాశరావుగారికి; ప్రముఖ మృదంగ విద్వాంసులు శ్రీ వి. కమలాకర్ గారికి; శ్రీమునుగంటి శ్రీరామ మూర్తి గారికి; నా కృతజ్ఞతాభివందనాలు తెలియ జేసుకొంటున్నాను.

నేను సంగీత విద్వాంసుణ్ని కావాలని కలలుగన్న మా నాన్నగారు కీ.శే. ఆకొండి వెంకటరత్నంగారు (కవి, రచయిత) నా అభివృద్ధిని చూసేందుకు ఇక్కడ లేకుండా దూర తీరాలకు తరలి పోయారు. నాకున్న ఈ కొద్దిపాటి రచనా శక్తి వారినుంచి నాకు సంక్రమించినదే. వారికి నా బాష్పాంజలి అర్పిస్తున్నాను.

ఈ పుస్తక రచనలో ఎన్నో సంగీత గ్రంథాలు, వివిధ పత్రికలలో ప్రచురితమైన సంగీత వ్యాసాలు నాకు తోడ్పడ్డాయి. ఆ పుస్తక రచయితలకు, వ్యాసకర్తలకు నా కృతజ్ఞతలు.

ఈ పుస్తకంలో ప్రచురించేందు కోసం, తమదగ్గర గల సంగీత వాద్యాల్ని ఫొటోలు తీసుకోనిచ్చిన మృదంగ విద్వాంసులు శ్రీ నందివాడ మల్లికార్జునరావుగారికి, నాదస్వర విద్వాంసులు శ్రీ పసుపులేటి వెంకటరమణ గారికి నా కృతజ్ఞతలు తెలుపుకొంటున్నాను.

ఇంకా ఈ పుస్తక రచనలో నాకు సహకరించిన మా కుటుంబ సభ్యులకు, ముఖ్యంగా నా సహధర్మచారిణికి, ఈ పుస్తకాన్ని ఎంతో వ్యయ ప్రయాసలకోర్చి ప్రచురించిన శ్రీ రోహిణి పబ్లికేషన్స్ వారికి నాహృదయ పూర్వక కృతజ్ఞతలు.

నేను సంగీత విద్వాంసుణ్ని కాను. అలాగే చేయి తిరిగిన రచయితను కాను. అందువల్ల భాషాపరమైన దోషాలుకాని, సంగీత శాస్త్ర సంబంధమైన దోషాలుకాని ఏమైనా దొర్లినట్లయితే వాటిని విద్వాంసులు పెద్దమనసుతో మన్నించి, దోషాల్ని నాకు తెలిపితే మలిముద్రణలో సవరించుకుంటానని సవినయంగా తెలియ జేస్తున్నాను. అలాగే పాఠకుల సలహాలు, సూచనల్ని కూడా ఆహ్వానిస్తున్నాను.

చివరిగా ఒక్కమాట - పుస్తకం మీ చేతుల్లో ఉంది. ఈ పుస్తక రచనలో నేనెంతవరకు కృతకృత్యుడనయ్యానో మీరే నిర్ణయించాలి.

ఆకొండి శ్రీనివాస రాజారావు
7-9-5, సాంబమూర్తి వీధి,
రామారావు పేట,
కాకినాడ - 4

సంగీత కళానిధి

నేదునూరి కృష్ణమూర్తి

ఫ్లాట్ నెం. 47/6, ఎమ్.వి.పి. కాలని,

విశాఖపట్నం.

భగవంతుని సృష్టిలో సంగీత కళను మించినది మరొకటి లేదు. సంగీతం వినాలనే ఆసక్తి ఉండడమే ఒక విశేషం. దానికితోడు ఈ కళలో ఉండే శాస్త్రీయ విషయాలు తెలుసుకొని వినగలగడం, అదొక పెద్దవరం. ఆ వరాన్ని పొందడానికి ఈ గ్రంథం చాలా ఉపయోగపడుతుంది.

సంగీతంలో ఉండే గొప్పదనాలు తెలుసుకొనే కొద్దీ ఆనందంతోపాటు, ఈ కళమీద గౌరవం కూడా పెరుగుతుంది. మన వాగ్గేయకారులు మనకి తెలిసే భాషలో మనకందించిన రచనలు ఎన్నో ఉన్నాయి. వాటిలోని సంగీత కళా సౌందర్యాలనూ, శాస్త్రీయ విలువలూ తెలుసుకొని విని, ఆనందించగలిగిన నాడే మన వాగ్గేయకారుల ఋణం తీర్చుకొన్నవాళ్ళమవుతాము. యిది మన ధర్మం కూడా.

ఈ గ్రంథంలో చి. రాజారావు ఆ విలువలను తెలుసుకోవడానికి, సంగీతాన్ని సంపూర్ణంగా ఆస్వాదించడానికి అవసరమైన ఎన్నో విషయాలు రాశాడు. ఇది చదివి, సామాన్య శ్రోత గొప్ప రసజ్ఞుడైన శ్రోతగా రూపు చెందగలడని ఆశిస్తున్నాను.

(సం) నేదునూరి కృష్ణమూర్తి

# ఆశాసనము

చి. ఆకొండి శ్రీనివాస రాజారావు వ్రాసిన 'సంగీత విద్యా ప్రకాశిక' గ్రంథం కొంచెం. ఇంచుమించుగా నేను ఆమూలాగ్రంగా చూచినట్లే. వయస్సు చిన్నదయినా సంగీతవిద్యలో శాస్త్రపరంగానూ ఇటు అభ్యాసపరంగానూ అనుభవం సంపాదించి వ్రాసినట్లు నాకు తోచినది. రెండు మూడు రేడియో ప్రోగ్రాములు విన్నాను. పాటకూడా మంచి ధోరణిలో ఉన్నది.

ఈ గ్రంథంలో రాజారావు వ్రాసిన ప్రతి విషయమును నేనిక్కడ ఉదాహరించటం లేదు. ముఖ్యంగా నాదం, రాగాలు వాటిలోరకాలు, రాగాల లక్షణాలు, తాళాలు, వాగ్గేయకారుల చరిత్రలు మొదలయిన ఈ విషయాలన్నీ సాధారణంగా కొంత

సంగీత పరిచయం ఉండి తెలుసుకొనగోరే వారికే కాక డిప్లొమా మొదలయిన పరీక్షలకు వెళ్లే విద్యార్థులకు కూడా కరదీపికగా ఉన్నాయి. రాజారావు సంగీత లోకానికి ఒక మంచి గ్రంథం అందించినందుకు సంతోషిస్తున్నాను.

సంగీత విద్య అభ్బినా శాస్త్రపరం అయిన విషయాలను చక్కగా గ్రంథ రూపంలో పెట్టగలవారు చాలా తక్కువ మంది ఉన్నారు. నేనే చెయ్యలేదాపని. కనుక రాజారావు గ్రంథం అటు ప్రభుత్వపరంగానూ ఆమోదముద్ర పొందగలదని నేను విశ్వసిస్తూ ముందు ముందు మంచి పాఠములతో పూర్వవాగ్గేయ కారుల కృతులను కూడ సంపాదించి గ్రంథస్థం చేయగలందులకు ఆశాసిస్తున్నాను.

సంగీత సాహిత్య కలానిధి
గానకలా ప్రపూర్ణ
నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులు
విజయవాడ.

'Kalaprapoorna'

**Dr. B. Rajani Kanta Rao**

Door No; 30.20/3.15/6,

Lalbahadur Sastry Street,

Sitaram Puram

VIJAYAWADA - 520 002.

చి. ఆకొండి శ్రీనివాస రాజారావు రచించిన 'సంగీత విద్యా ప్రకాశిక' అనే సంగీత పరిచాయక గ్రంథం స్థాలీపులాకంగా చూసి చాలా సంతోషించాను. ఇందులోని రచనా రీతి పుస్తకం అని ప్రయోగించే అవకాశం కంటే విస్తృతంగాను, గ్రంథం అని ప్రయోగించే అవకాశానికి కొంచెం తక్కువగాను ఉంది. అంటే ఈ పుస్తకాన్ని విమర్శించడం కాదు.

ఈ 'సంగీత విద్యా ప్రకాశిక'

ఎవరికోసం ఉద్దేశించబడిందో ఆ జిజ్ఞాసువుల చేతుల్లో అంత తేలికగాను అంతబరువుగాను కాకుండా వారిశక్తికి అనువైన విధంగా ఉపయోగపడేటట్టు ఈ గ్రంథకర్త రచన విజయవంతమే అని చెప్పడానికి ఏమీ సందేహం లేదు. ఇందులో విద్వాంసుల సందేహాలకు, వివాదాలకు తావులేని విధంగా రచన సాగింది. మరీ గహనం అనిపించే విషయాలను వెన్నపూస, పంచదార కలిపి చెంచాతో నోటికి అందించే విధంగా ఈ రచన సాగింది అంటే - రచయితను అనావశ్యకంగా పొగడడం కానే కాదు.

సంగీత విద్యార్థులకు, జిజ్ఞాసువులకు హస్తభూషణం కాదగ్గ చాలా మంచి పుస్తకం. రచయితను హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను.

(సం) బాలాంత్రపు రజనీకాంత రావు

విజయవాడ

# శృతి

శాస్త్రీయ సంగీతాన్ని సులభతరంగా విశదపరచే తెలుగు పుస్తకాలు మనకు ఇంచుమించు లేనే లేవని చెప్పవచ్చు. అటువంటి తరుణంలో 'రోహిణి పబ్లికేషన్సు', రాజమండ్రి వారు ముందుకు వచ్చి అటు వంటి ప్రయత్నానికి పూనుకోవడం ముదావహం.

ప్రభుత్వపరంగా అనేక సంగీతకళాశాలలు నెలకొన్న కారణంగాను, శాస్త్రీయ సంగీతాన్ని నేర్వవలెననే జిజ్ఞాస పెరగటం వల్లను యువతరంవారు బహుళసంఖ్యలో అందరికీ అర్థం అయ్యే సంగీతపుస్తకాలు రావాలనే ప్రగాఢ కాంక్షను వెల్లడించడమే 'రోహిణి' వారి ఈ ప్రయత్నానికి నాంది అని చెప్పవలసి ఉంది.

సరళంగా ఉండి, మరీ అంతలోతులకు వెళ్ళకుండా అతి సామాన్యునికి కూడా అర్థమయ్యే సంగీతపరిచయ గ్రంథాన్ని వ్రాయమని కోరుతూ ఈ పబ్లిషర్సు నా వద్దకు వచ్చారు. అటువంటి గ్రంథం వ్రాయవలసిందిగా కోరారు. నాకున్న పనుల ఒత్తిడి వల్ల, ఇతర కారణాలవల్ల నాకు వ్రాయడానికి వీలుపడదని తెలుపుతూ 'శ్రీ ఆకొండి శ్రీనివాస రాజారావుగారి' పేరును సూచించాను. వారందుకు అంగీకరించారు.

రాజారావుగారు బి.యస్.సి. పట్టభద్రులు. ఆకాశవాణి బి.హై. ఆర్టిస్టు. దేశవ్యాప్తంగా కచేరీలు చేస్తున్న సంగీతకోవిదులు. శాస్త్రపరమైన లెఖ్ఖలుకూడా విడమరచి చెప్పగల ధీశాలి.

వీరి 'సంగీత విద్యా ప్రకాశిక' సరళమైన భాషలో సంగీతానికి సంబంధించిన విషయాలన్నింటినీ కూలంకషంగా విశదీకరించారు. వీరి గ్రంథం చదివితే మరిన్ని విషయాలను, మరింత లోతుగా తెలుసుకోవాలనే ఉత్కంఠ జనించడానికి ఆస్కారం కలుగుతుందనడంలో ఎంతమాత్రం సందేహం లేదు.

ఆ విధంగా పబ్లిషర్స్ యొక్క కోరిక, ఆశయం సఫలీకృతమైనదని చెప్పడానికి నాకు చాలా సంతోషంగా ఉంది.

ఇటువంటి గ్రంథాలను మరికొన్ని రాజారావు గారు వ్రాయాలని, రోహిణి పబ్లిషర్స్ వారు ఇలాంటి ప్రయత్నాల్ని కొనసాగించాలని మనసారా కోరుతున్నాను.

మునుగంటి శ్రీరామమూర్తి
సంపాదకుడు
'గానకళ' సంగీత మాస పత్రిక

'Mridanga Vidwanmani'

**V. KAMALAKAR RAO** B.A.,

Hotel Shantinivas

RAJAHMUNDRY-533 101

(A.P.) INDIA

I have gone through the book **'Sangeeta Vidya Prakasika'** written by Sri Akondi Srinivasa Raja Rao. He dealt with our carnatic music in a detailed manner and explained the differences of other music with that of our music. The laya part is dealt with in a simple and understandable manner which is appreciable.

I think this book is useful for students and as well as to those who want to have a detailed knowledge of carnatic music.

I wish all of them, who are involved in publishing this book, a great success.

(sd) **V. KAMALAKAR RAO**

**Kotipalli Prakasha Rao**

Lecturer in Violin (Rtd.)

Govt. College of Music & Dance

VIJAYAWADA (A.P.)

శ్రీ ఆకొండి శ్రీనివాస రాజారావు గారు వ్రాసిన 'సంగీత విద్యా ప్రకాశిక' పుస్తకము చూచి సంతోషపడినాను. అతి సులభశైలిలో సంగీత విద్యార్థులకే గాక కర్నాటక సంగీతమును గురించి తెలుసుకోవాలని అభిలాషగల వారందరికీ ఇది ఉపయోగ పడుతుంది. ఈ పుస్తకము మనదేశములోనే గాక త్వరలో విదేశాలలో కూడా ప్రాముఖ్యము పొందగల దని ఆశిస్తున్నాను.

రోహిణీ పబ్లికేషన్స్ (రాజమండ్రి) వార్కి అభినందిస్తున్నాను.

(సం) కోటిపల్లి ప్రకాశరావు

రాజమండ్రి

'Balgandharva Madhuragayaka'

**M. Krishna Mohan**

(A.I.R. & T.V. Artist)

Lecturer

Govt. Music & Dance College

RAJAHMUNDRY.

సంగీతం సామవేదం నుండి పుట్టింది. అయితే ఎందరో మహా నీయులు, విద్వాంసులు తరించి, తరింపజేసిన ఎందరో మహానుభావులు అందరికీ వందనములు. ముఖే ముఖే సరస్వతి అని నట్లుగా ఈ విద్యకు అంతులేదు. సంగీత శాస్త్రాన్ని గురించి ఎన్నో గ్రంథాలు రచింపబడ్డాయి. ఇంకా ఎన్నో రచింపబడాలి. అంతులేని ఈ విద్యపై ఎంత పరిశోధించినా, ఎన్ని గ్రంథాలు రచించినా, తనివి తీరదు, అంతుచిక్కదు.

మాతండ్రిగారు, మా గురువు అయిన 'మధుర గాన కళాసరస్వతి' కీ.శే. ఎమ్. ఎల్. నరశింహంగారి శిష్యపరంపరలో ఒకడిగా, నాకు సోదర సమానుడిగా, మంచిమిత్రుడు, యువసంగీతకిశోరం అయినటువంటి శ్రీ ఆకొండి రాజారావు రచించిన 'సంగీత విద్యా ప్రకాశిక'

అనే ఈ గ్రంథాన్ని పరిశీలించాక, యిది సంగీతం అభ్యసించే విద్యార్థులకు, ఒక దిక్సూచిలా ఉపయోగపడగలదని నేను ఆశిస్తున్నాను.

సంగీతాభివృద్ధికి, ప్రస్తుత తరుణంలో ఎన్నో రకాల అభివృద్ధి సాధనాలు, రేడియో, టెలివిజన్, లాంటివి ఉన్నా శాస్త్రాభ్యాసానికి గ్రంథం ఎంతో ఉపయోగపడుతుంది. శ్రీ రాజారావు రచించిన ఈ గ్రంథం ప్రతి సంగీత విద్యార్థి వద్ద, అన్ని సంగీత కళాశాలల్లోను, అన్ని లైబ్రరీలలోను తప్పనిసరిగా ఉండదగినదని నా అభిప్రాయం. చిన్న వయసులోనే యిటువంటి ఉపయుక్తమైన గ్రంథాన్ని రచించిన శ్రీ రాజారావు యింకా ముమ్ముందు ఎన్నో గ్రంథాలు వ్రాసి భావితరానికి, అందించాలని దానికి తగిన ఆయురారోగ్యాలను త్యాగరాజస్వామి వారికి ప్రసాదించాలని కోరుకుంటూ, యిటువంటి మంచి గ్రంథాన్ని ప్రచురించిన, ప్రచురణకర్త శ్రీ పైల అప్పారావు (రోహిణి పబ్లికేషన్స్ రాజమండ్రి) గారిని మనసార అభినందిస్తూ

శలవామరి !

(సం) ఎమ్. కృష్ణమోహన్

రాజమండ్రి



శ్లో॥ శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం
ప్రసన్నవదనం ధ్యాయేత్సర్వ విఘ్నోపశాంతయే

ఎవరైనా ఒక మంచి పాట పాడుతుంటే మనం విని ఎంతో ఆనందిస్తాం. ఒక మంచి చిత్రాన్ని చూసినా, ఒక మంచి కథవిన్నా 'అబ్బా! ఈ చిత్రం ఎంత బావుందో! అనో, ఈ కథ ఎంతోబాగుందనో మనం ఆనందపడతాం కదూ! మీరు హంపి, విజయనగరం, కోణార్క, లేపాక్షి లాంటి ప్రదేశాలకు ఎప్పుడైనా వెళ్ళారా? అక్కడ రాతిపైన చెక్కిన బొమ్మలు ఉంటాయి. వీటినే శిల్పాలు అంటాం. మంచి మంచి శిల్పాల్ని చూసినా మనం ఎంతగానో సంతోషిస్తాం. ఎవరైనా చక్కగా నృత్యం (dance) చేశారంటే మనం చూసి ఎంతో ఆనందిస్తాం.

పాటలు పాడడాన్ని సంగీతం అంటాం. అలాగే చిత్రాలు (బొమ్మలు) గీయడాన్ని చిత్రలేఖనం అంటాం. కథలు, పద్యాలు, నాటకాలు, గేయాలు స్వంతంగా రాయడాన్నే కవిత్వం అంటాం. సంగీతం, చిత్రలేఖనం, కవిత్వం, శిల్పాల్ని చెక్కడం మొదలైన వాటిని అన్నింటినీ కళలు అంటారు. ఈ కళలు మనకి ఎంతో ఆనందాన్ని, ఉత్సాహాన్ని కలిగిస్తాయి. ఎంతో కష్టపడి నేర్చుకొని, బాగా సాధన చేస్తేనే ఈకళలు వస్తాయి. దానికి తోడు భగవంతుడి దయ కూడా ఉండాలి. కళల్ని ఎవరైతే బాగానేర్చుకొంటారో వాళ్ళనే కళాకారులు అంటారు. కళలు అరవైనాలుగు ఉన్నాయని మన పూర్వీకులు చెప్పారు. వీటిలో సంగీతం, కవిత్వం, శిల్పకళ, నృత్యం, చిత్రలేఖనం మనస్సుకు చాలా హాయిని కలిగిస్తాయి. అందుచేత వీటిని లలితకళలు అంటారు. ఈ లలితకళల్ని మనం నేర్చుకొంటే మనలో ఎన్నో మంచి గుణాలు కలుగుతాయని చెబుతారు. పెద్దవాళ్ళపైన, దేవుడిమీద భక్తి, మనతోడి వాళ్లపైన ప్రేమ ఈ లలితకళలు నేర్చుకొంటే కలుగుతాయంటారు.

లలిత కళలు అంటే ఇష్టం లేనిది ఎవరికి? లలితకళల్లో ఒకటైన సంగీతం అంటే అందరికీ మరీ మరీ ఇష్టం. సరదాగా ఓ కూనిరాగమైనా తీయకుండా ఎవ్వరూ ఉండలేరు కదా! అమ్మ ఉయ్యాలలో చిన్న పాపాయిని ఉంచి కమ్మగా జోలపాడుతుంది. మరి స్కూల్లో ఎసెంబ్లి 'వందేమాతరం' పాడందే మొదలు కాదు. అలాగే అగస్ట్ 15న జండావందనం జేసి 'జనగణమన' పాడతారు. స్నానం చేస్తూ చాలా మంది కూనిరాగాలు తీస్తూంటారు. పొలాల్లో పనిచేసే వాళ్ళను ఎప్పుడైనా చూశారా? వాళ్ళుకూడా చక్కగా

పాటలు పాడుతూ శ్రమని మరచిపోతారు. పెళ్ళికాని, మరేదైనా శుభకార్యంకాని జరుగుతోందనుకోండి సన్నాయి మేళం ఉండితీరాల్సిందే. మరి పూర్వం యజ్ఞాలు, యాగాలు చేసేటప్పుడు కూడా సంగీతం పాడేవారు. ఇలా సంగీతం మన జీవితంలో ఒక భాగం అయిపోయింది.

అసలు ఈ సంగీతం అంటే ఏమిటి? ఈ సంగీతం దేనితో ఏర్పడుతుంది? ఎలా పుట్టింది? మొదలైన సంగీతం గురించి ఎన్నెన్నో విశేషాలు మనం ఈ పుస్తకంలో తెలుసుకొందాం.

## 1. సంగీతానికి ఉన్న ప్రత్యేకతలు

మిగిలిన కళలన్నీ ఒక ఎత్తు, సంగీతం ఒకఎత్తు. మిగిలిన కళలకన్నా సంగీతానికి ఎన్నెన్నో ప్రత్యేకతలు ఉన్నాయి. మనం బాగా చిన్నపిల్లలకి ఏదైనా ఒక మంచి చిత్రాన్ని చూపిస్తే వాళ్ళు దాన్ని చూసి, ఆనందపడగలరా? లేదుకదూ! అలాగే మనం ఓ ఆవుకి మంచి కథ చెబితే ఆ ఆవు ఆనందించగలదా? లేదుకదా?! అయితే సంగీతాన్ని మనం చిన్నపిల్లల దగ్గర పాడినా, పశువుల దగ్గర పాడినా కూడా అవి ఆనందిస్తాయి తెలుసా? అందుకే పూర్వం

"శిశుర్వేత్తి పశుర్వేత్తి వేత్తిగాన రసంఫణిః" అని చెప్పారు. దీని అర్థం ఏమిటంటే - చిన్న పిల్లలు, పశువులు, పాములు కూడా సంగీతం - అంటే ఇష్టపడతాయని. కృష్ణుడు మురళి ఊదుతుంటే పశువులు ఎంతో ఆనందపడేవి. మరి ఈ మధ్య

మొక్కలు కూడా సంగీతం అంటే ఇష్టపడతాయని, మంచి సంగీతం వినిపిస్తే పంట బాగా పండుతుందని కనుగొన్నారు. ఇలా సంగీతం అంటే మనకేకాదు, పశువులకి మొక్కలకి కూడా ఇష్టమే.

దేవతలు కూడా సంగీతం అంటే ఇష్టపడతారు. సరస్వతీదేవి వీణ వాయిస్తుందని, కృష్ణుడు మురళి వాయిస్తాడని మీ అందరికీ తెలుసు కదా! అలాగే మరి నారదుడు, తుంబురుడు కూడా బాగా సంగీతం పాడతారు. సంగీతంతో మనం దేవుడి దగ్గరకు చేరచ్చు. ఎలాగంటే దేవునిపై భక్తితో మనం ప్రతీరోజూ పాటలు పాడితే మనం దేవుణ్ని చేరచ్చు. దీనినే మోక్షం పొందడం అంటారు. త్యాగరాజు, రామదాసు, అన్నమయ్య, మొదలైన వారు ఎందరో సంగీతంతో మోక్షాన్ని పొందారు.

ఈ మధ్య - సంగీతంతో అనేక రోగాలు తగ్గించవచ్చునని కూడా కనుగొన్నారు తెలుసా?

ఇలా సంగీతానికి ఎన్నెన్నో ప్రత్యేకతలు ఉన్నాయి. కనుక సంగీతం అన్నికళల్లోకి గొప్పకళ.

## సంగీతం దేనితో ఏర్పడింది?

సంగీతం దేనితో ఏర్పడుతుందో చెప్పుకొందాం. సంగీతం స్వరాలతో ఏర్పడుతుంది. స్వరాలు అంటే వినడానికి, హాయిగా ఉండే శబ్దాలు అన్నమాట. కొన్నికొన్ని శబ్దాల్ని కొన్ని కొన్ని స్వరాలుగా ఏర్పరచారు. ఇలాంటి స్వరాలు ఏడు ఉన్నాయి. వీటినే సప్తస్వరాలు అంటారు. సప్తఅంటే ఏడు. వీటి పేర్లు ఏమిటంటే

1) షడ్జం 2) రిషభం 3) గాంధారం 4) మధ్యమం 5) పంచమం 6) ధైవతం 7) నిషాదం అయితే పాడేటప్పుడు వీటిని ఇలా పొట్టి పేరుతో పాడరు. షడ్జాన్ని 'స' అని, రిషభాన్ని 'రి' అని, గాంధారాన్ని 'గ' అని, మధ్యమాన్ని 'మ' అని, పంచమాన్ని 'ప' అని, ధైవతాన్ని 'ద' అని, నిషాదాన్ని 'ని' అని పాడతారు. ఇలా ఒకొక్క స్వరాన్ని ఒకొక్క అక్షరంతో పలికితేనే పాడడానికి వీలుగా ఉంటుంది.

మనం ఎన్నెన్నో పాటలు వింటూంటాం. ప్రతిపాటకి వెనుక ఈ స్వరాలు ఉంటాయి. స్వరాలు, లేనిదే సంగీతమే లేదు. ఉదాహరణకి 'వందేమాతరం' పాటను తీసుకొందాం. ఈ పాటకి వెనుక స్వరాలు ఉంటాయి. ఈ పాటకి వెనుక ఇలాంటి స్వరాలు ఉంటాయి.

| సా | రీ | మ | ప | మ | పా |
|---|---|---|---|---|---|
| వం | దే | మా | అ | త | రం |

| నరినీదాపా | మపమాగారీ |
|---|---|
| సుజలాం... | సుఫలాం.. |

| రి ప మ మ | గ రీ గ సా |
|---|---|
| మ ల య జ | శీ ఇ త లాం |

వందేమాతరం పాటకి వెనుక ఉన్న స్వరాల్ని గమనించారా? ఇందులో 'సా' అనే స్వరానికి బదులుగా 'వం' అనే అక్షరాన్ని పాడతాం. 'రీ' అనే స్వరానికి బదులుగా 'దే' అనే అక్షరాన్ని పాడతాం. ఏస్వరానికి బదులుగా ఏ అక్షరం పాడాలో ఆ స్వరాల

క్రిందనే రాశాను చూడండి. పాట అంతకూ ఇలా స్వరాలు ఉంటాయి.

ఇలా ప్రతీ పాట వెనుక వెన్నెముకలాగ స్వరాలు ఉంటాయి. అయితే పాట పాడుతున్నప్పుడు ఆపాటలో ఉన్న అక్షరాల్ని పాడతాం. అంతేకాని స్వరాల్ని పాడం. అందుచేత పాట పాడుతుంటే, వెనుక ఏ స్వరాలు ఉన్నాయో మనకి తెలియదు. బాగా సంగీతం వచ్చినవాళ్ళే పాటకి వెనుక ఉన్న స్వరాల్ని చెప్పగలుగుతారు. ఇలా పాటవెనుక ఉన్న స్వరాల్ని చెప్పగలగడాన్నే 'స్వరజ్ఞానం' అంటారు. పాట వెనుక ఉన్న స్వరాల్ని బాగా చెప్పగలిగితే స్వరజ్ఞానం బాగా ఉందంటాము.

## సంగీతం ఎలా ఏర్పడింది?

సంగీతం ఎప్పుడు ఏర్పడిందో, ఎలా ఏర్పడిందో చెప్పడం కష్టం. చాలా చాలా పూర్వకాలం నుంచీ మనదేశంలో సంగీతం ఉంది. ఎన్నెన్నో రకాల వాద్యాలు కూడా ఉన్నాయి.

ఇంద్రుడు బ్రహ్మను ఒక కళను సృష్టించమని అడిగాడని, బ్రహ్మ సామవేదం నుంచి సంగీతాన్ని సృష్టించాడని అంటారు. బ్రహ్మ ఈ సంగీతాన్ని భరతుడు అనే ఆయనకు నేర్పాడు. భరతుడు, భూమి మీదకు వచ్చి సంగీతాన్ని ప్రచారం చేశాడని చెబుతారు.

పూర్వం మానవులు వినే ధ్వనుల లోంచి స్వరాలు కనుగొన్నారని చెప్పుకోవచ్చు. నెమలి కూతలోను, ఏనుగు

ఘీంకారంలోను, కోకిల కూతలో, గుర్రం సకిలింపులో, ఎద్దువేసే రంకెలోను, ఒకటేమిటి అన్ని జంతువుల పలుకుల్లోను స్వరాలు విన్నారు - పూర్వమానవులు. వేదాలు - అనే గ్రంథాలు ఉన్నాయని మీ అందరికీ తెలుసుగా. ఈ వేదాలు నాలుగు ఉన్నాయి. ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం, అథర్వణ వేదం. ఈ వేదాలు ఎప్పుడు పుట్టాయో చెప్పలేం. చాలా పూర్వకాలం నుంచీ వేదాలు ఉన్నాయి. ఈ వేదాలు పాడతారు. పూర్వం వేదాల్ని ఒకే స్వరంతో పాడేవారు. అప్పటికి సప్తస్వరాలు ఏర్పడలేదన్నమాట. ఒకే స్వరం ఏర్పడింది. అందుకే ఆ ఒక్క స్వరంతోనే పాడేవారు. ఇలా ఒక్కస్వరంతో పాడడాన్నే 'ఆర్చిక' గానం అని అంటారు.

ఆ తరువాత ఇంకో స్వరాన్ని కనుగొన్నారు. అంటే ఇప్పుడు స్వరాలు రెండు వచ్చాయి. ఈ రెండు స్వరాలతో వేదాలను పాడేవారు. రెండు స్వరాలతో పాడడాన్ని 'గాథిక' గానం అంటారు. ఇప్పటికీ సప్తస్వరాలు గురించి తెలియని కొంతమంది ప్రజలు బాగా మారుమూల అడవుల్లో ఉన్నారు. వాళ్ళు పాటల్ని ఒక స్వరం, లేదా రెండు స్వరాలతోనే పాడతారు.

మరికొంత కాలానికి ఇంకోస్వరం కనుగొన్నారు. అంటే ఇప్పుడు- స్వరాలు మూడయ్యాయి. ఈ మూడు స్వరాలతో వేదాల్ని పాడడం ప్రారంభించారు. ఇలా మూడు స్వరాలతో పాడడాన్నే 'సామికగానం' అంటారు. ఈ మూడు స్వరాలని ఉదాత్తం, అనుదాత్తం, స్వరితం అని పిలుస్తారు. ఈ నాటికీ కూడా వేదాల్ని మూడు స్వరాలతోనే గానం చేస్తున్నారు.

సామవేద కాలం నాటికి ఏడుస్వరాలు ఏర్పడ్డాయి. ఈ

ఏడు స్వరాలని మనం ముందుచెప్పుకొన్నట్లు షడ్జం, రిషభం, గాంధారం అని ఇలా పిలుచేవారుకాదు. వీటిని కృష్ణ, ప్రథమ, ద్వితీయ, తృతీయ, చతుర్థ, మన్ద్ర, అతిస్వర్య అని పిలుస్తూ ఉండేవారు. ఇప్పటి స్వరాల ప్రకారం చూస్తే ఈ స్వరాలు 'మగరిసనిదప' అనే స్వరాలన్నమాట. ఆ తరువాత కొంతకాలానికి 'మగరిసనిదప' అనే వరుసలో ఉన్న ఈ స్వరాలనే 'సరిగమపదని' అనే క్రమంలోకి తీసుకొచ్చారు. 'మగరిసనిదప' అనే వరుసలో ఉన్న స్వరాలను మధ్యమగ్రామం అని పిలిచారు. కొత్తగా ఏర్పడిన 'సరిగమపదని' అనే క్రమంలో ఉన్న ఈ స్వరాలనే షడ్జగ్రామం అన్నారు. ఇలా సప్తస్వరాలు ఏర్పడ్డాక సంగీతం ఎంతో అభివృద్ధిచెందింది.

## పూర్వపు సంగీత వాద్యాలు

మనదేశంలో చాలా పూర్వకాలం నుంచీ ఎన్నెన్నో రకరకాల వాద్యాలు ఉన్నాయి. మన దేశంలో కనిపించే వాద్యాలు గ్రీకు, ఈజిప్టులాంటి దేశాలలో కూడాకనిపించవు. వేణువు (ఫ్లూట్ అంటారే - అది) మృదంగం (మద్దెల), వీణ లాంటివాద్యాలు చాలాపురాతనమైనవి. నంది మృదంగం వాయిస్తుంటే, శివుడు నృత్యం చేస్తాడు. నారదుడు 'మహతి' అనేవీణను వాయిస్తాడు. సరస్వతీదేవికి వీణ, కృష్ణుడికి వేణువు ఇష్టం అని ముందే తెలుసుకొన్నాం. ఇలా దేవతలకి కూడా వాద్యాలంటే ఎంతోఇష్టం.

పూర్వం భూమిలో ఒక గొయ్యి తవ్వి, దానిపైన జంతువుల

చర్మాన్ని పరిచి వాయిస్తూ ఉండేవారు. మృదంగం, డోలు లాంటి వాద్యాలు దీనినుండే రూపొంది ఉంటాయి. వీణని ఎప్పుడైనా మీరు చూశారా? వీణకి తీగెలుంటాయికదా! ఆ తీగల్ని మీటుతూ వీణ వాయిస్తారు. అయితే ఇలాంటి తీగలున్న వాద్యాలు ఏర్పడకముందు జంతువుల నరాలని తీగలుగా చేసి వాద్యాలను తయారు చేసేవారు. వెదురు గొట్టానికి రంధ్రాలు చేసి, వేణువును తయారు చేశారు. వేదాలలో ఎన్నో వాద్యాలు గురించి చెప్పారు. పావత, పావ, తుండు, కాహల, దుందుభి, కిన్నెరి, వేణువు, వీణ, ఆనకములు, గోముఖ, ఔదంబరి ఇలాంటివి ఎన్నో వాద్యాలు ఉండేవి. అయితే మన భారతీయ సంగీతంలో ప్రస్తుతం వీణ, వేణువు, సితార్, మృదంగం, గోటు, నాదస్వరం, తబలా, సంతూర్, సారంగి, శెహనాయ్ లాంటి ఎన్నెన్నో వాద్యాల్ని వాడుతున్నారు. వాద్యాల గురించి మనం ముందు ముందు విపులంగా చెప్పుకొందాం.

## సంగీతంలో ఉన్న పద్ధతులు

సంగీతంలో స్థూలంగా రెండు పద్ధతులు ఉన్నాయని చెప్పుకోవచ్చు. అవి స్వరసంప్రదాయ పద్ధతి. రెండోది రాగసంప్రదాయ పద్ధతి.

స్వరసంప్రదాయ పద్ధతినే ఇంగ్లీషులో 'హార్మోనికల్ సిస్టమ్' అంటారు. ఈ పద్ధతి ఎక్కువగా ఫ్రాన్స్, ఇటలీ, ఇంగ్లాండు, అమెరికాలాంటి దేశాల్లో అమల్లో ఉంది. ఈ పద్ధతిలో సప్తస్వరాల్ని

డో, రే, మి, ఫా, సో, లా, సి అని పిలుస్తారు. అంటే మనం స,రి,గ,మ,ప,ద,ని అని పిలిచినట్టు అన్నమాట. ఈ పద్ధతిలో పాటలు పాడటం కన్నా, వాద్యాలతే ఎక్కువ ప్రాముఖ్యం ఉంటుంది. ఒకేసారి చెవికి ఇంపుగా ఉండే కొన్ని స్వరాల్ని కలిపి వాద్యాలపైన వాయిస్తారు. చెవికి ఇంపుగా ఉండే ఈ స్వరాలగుంపునే 'కార్డ్స్' అంటారు.

రెండోరకం సంగీతం రాగ సంప్రదాయ పద్ధతి. ఇది మనదేశంలో పుట్టింది. రాగసంప్రదాయం మన సొత్తు అన్నమాట. ఈ రాగసంప్రదాయాన్ని ఇంగ్లీషులో 'మెలోడికల్ సిస్టమ్' అంటారు. స్వరసంప్రదాయంలో కొన్ని స్వరాల్ని ఒకేసారి కలిపి వాయిస్తారని చెప్పుకొన్నాం కదా! ఈ రాగ సంప్రదాయంలో అలా కాకుండా ఒక స్వరం తరువాత మరో స్వరం పాడడం లేదా వాయించడం చేస్తారు. మన పూర్వీకులకు స్వరసంప్రదాయ పద్ధతి కూడా తెలుసు. కానీ స్వరసంప్రదాయ పద్ధతికన్నా రాగ సంప్రదాయ పద్ధతిని బాగా అభివృద్ధి చేయడానికి వీలుంది. అందుకే రాగ సంప్రదాయ పద్ధతిని తీసుకొని, దానిని అభివృద్ధి పరచారు.

## రాగసంప్రదాయ పద్ధతి అంటే ఏమిటి?

మీరు ఎప్పుడైనా నృత్య ప్రదర్శన చూశారా? ఒకళ్ళు పాట పాడుతుంటే, పాటతో కూడా వీణ, వైలెన్, వేణువు, మృదంగం లాంటి వాద్యాలు వాయిస్తూ ఉంటారు. ఈ పాటకి తగినట్లుగా మరొకళ్ళు నృత్యం చేస్తూంటారు. అంటే పాట, నృత్యం, వాద్యాలు

కలిపి నృత్య ప్రదర్శన అవుతుందన్న మాట. పూర్వకాలంలో సంగీతం (రాగసంప్రదాయ పద్ధతి) నృత్యంలో కలిపి ఉండేది. అందుకేన పూర్వం ''గీతం వాద్యం, తథానృత్యం సంగీతముచ్యతే'' అని చెప్పారు. దీని అర్థం ఏమిటో తెలుసా? గీతం అంటే పాట, నృత్యం, వాయిద్యాలు కలిస్తే సంగీతం అవుతుంది. అని ఆయితే ఆ తర్వాత సంగీతం నృత్యం నుంచి వేరు పడింది. విడిగా అభివృద్ధి చెందింది.

మన సంగీతం గురించి ఇంకొక సంగీత గ్రంథంలో ఇలా చెప్పారు.

''రాగ స్వరశ్చ, తాళశ్చ త్రిభిస్సంగీత ముచ్యతే''. రాగం, స్వరం, తాళం కలిస్తే సంగీతం అవుతుంది అని దీని అర్థం. ఇప్పటి మన సంగీతం ఇలాంటిదే. స్వరాలు అంటే ఒక విధమైన ధ్వనులు అని ముందు చెప్పుకొన్నాం కదా! ఈ స్వరాల్ని వరుసగా రకరకాలుగా అమరుస్తారు. అంటే ఏ స్వరం తరువాత, ఏస్వరం పాడితే వినడానికి మంచి హాయిగా ఉంటుందో ఆ విధంగా స్వరాల్ని పేర్చుతారు. ఇలా పేర్చిన కొన్ని స్వరాలనే రాగాలు అంటారు.

మీరు ఎవరైనా పాట పాడుతున్నప్పుడు గమనించారో లేదో పాట పాడుతుంటే చేతిని కదుపుతూ ఉంటారు. దీనినే తాళం అంటారు. తాళం, రాగం, స్వరాలు కలిస్తే సంగీతం అవుతుంది. స్వరాలు, రాగాలు, తాళాలు గురించి విపులంగా ముందు ముందు మనం తెలుసుకొందాం.

# రాగ సంప్రదాయంలో రకాలు

మన భారత దేశం అంతా రాగ సంప్రదాయ సంగీతమే ఉంది. 13, 14 శతాబ్దాల వరకూ ఈ రాగ సంప్రదాయ సంగీతం మనదేశం అంతా ఒకేలా ఉండేది. 13 వ శతాబ్దంలో ఉత్తర భారత దేశాన్ని మహమ్మదీయులు పాలిస్తూ ఉండేవారు. ఆ మహమ్మదీయులతో పాటు, పర్షియా, అరబ్బు దేశాల సంగీతాలు కూడా మన దేశంలోకి వచ్చాయి. అలా వచ్చి, ఉత్తర భారత దేశంలో ఉన్న మన భారతీయ సంగీతంలో కలిసిపోయాయి. అలా మన భారతీయ సంగీతం, పర్షియా, అరబ్ దేశాల సంగీతాలతో కలిసి ఒక కొత్త సంగీతంలా రూపొందింది. అలా ఏర్పడిన సంగీతమే హిందుస్థానీ సంగీతం.

అయితే దక్షిణ భారతదేశానికి ఎక్కువగా విదేశీయులు రాకపోవడంతో, పర్షియా, అరబ్ దేశాల సంగీతాలు, దక్షిణ భారతదేశంలోకి ప్రవేశించలేదు. అందుచేత దక్షిణ భారతదేశంలో ఉన్న సంగీతం ఎక్కువ మార్పులు చెందకుండా ఉండిపోయింది. అలా ఎక్కువ మార్పులు చెందకుండా ఉన్న ఈ సంగీతాన్నే కర్ణాటక సంగీతం అంటారు.

ప్రస్తుతం ఉత్తర భారతదేశం అంతా హిందుస్థానీ సంగీతమే ప్రచారంలో ఉంది. కర్ణాటక, ఆంధ్రప్రదేశ్, తమిళనాడు, కేరళ, కొంకణి ప్రాంతాల్లో కర్ణాటక సంగీతం అమలులో ఉంది. ఒరిస్సా, మహారాష్ట్రాల్లో కొన్ని ప్రాంతాలలో కర్ణాటక సంగీతం,

హిందుస్థానీ సంగీతం రెండూ ప్రచారంలో ఉన్నాయి. మనం ఈ పుస్తకంలో మన కర్ణాటక సంగీతం గురించి పూర్తిగా తెలుసుకొందాం. హిందుస్థానీ, కర్ణాటక సంగీతాల మధ్య ఉన్న పోలికలు, భేదాలు గురించి కూడా వివరంగా ముందు ముందు చెప్పుకొందాం.

## కర్ణాటక సంగీతానికి ఆ పేరు ఎలావచ్చింది?

మీ అందరికీ అప్పుడే ఒక సందేహం వచ్చిఉండవచ్చు. కర్ణాటక సంగీతానికి ఆ పేరు ఎలా వచ్చింది? అని. కర్ణాలకు అంటే చెవులకు ఇంపుగా ఉండేది కర్ణాటక సంగీతం. అంటే ఈ సంగీతం వింటే మన చెవులకి ఎంతో హాయిగా ఉంటుంది. కనుక దీనిని కర్ణాటక సంగీతం అన్నారు.

'కరై' అంటే సముద్రతీరం. 'నాడు' అంటే దేశం. 'కరైనాడు' అంటే సముద్రతీరాన ఉన్న దేశం అన్నమాట. మన దక్షిణ భారతదేశం సముద్ర తీరానే ఉంది కదా! అందుచేత మన దక్షిణ భారతదేశాన్ని పూర్వం 'కరైనాడు', 'కరనాడు' అని పిలుస్తూ ఉండేవారు. ఈ కరనాడు అన్న పదమే క్రమంగా 'కర్ణాటక' గా మారింది. కర్ణాటక దేశం అంటే దక్షిణ భారతదేశం అన్నమాట. కర్ణాటక దేశంలో అంటే దక్షిణ భారతదేశంలో ప్రచారంలో ఉన్న సంగీతాన్ని కర్ణాటక సంగీతం అని పిలిచారు. ఈ విధంగా కర్ణాటక సంగీతానికి ఆ పేరు వచ్చింది.

# సంగీతం బాగా నేర్చుకొన్న వాళ్ళను ఏమంటారు ?

ఆటల్లో మంచి నైపుణ్యం ఉన్నవాళ్ళను ఏమంటారు ? 'క్రీడాకారులు' అంటారు కదా! అలాగే మరి సంగీతాన్ని బాగా నేర్చుకొని, బాగా సాధన చేసి, మంచి నైపుణ్యం సంపాదించుకొన్న వాళ్ళను ఏమంటారో తెలుసా ? వాళ్ళనే 'సంగీత విద్వాంసులు' అంటారు. హిందుస్థానీ సంగీతం బాగా నేర్చుకొన్న వాళ్ళను 'హిందుస్థానీ సంగీత విద్వాంసులు' అని, కర్ణాటక సంగీతం బాగా నేర్చుకొన్నవాళ్ళను 'కర్ణాటక సంగీత విద్వాంసుల'ని అంటారు. కొంతమంది పాడడం బాగా నేర్చుకొంటారు. అలాంటి వారినే 'గాత్ర సంగీత విద్వాంసులు' అంటారు. కొంతమంది రకరకాల వాద్యాల్ని వాయించడంలో నేర్పుకలిగి ఉంటారు. ఉదాహరణకి వీణ బాగానేర్చుకొంటే వీణ విద్వాంసులని, వైలెన్ బాగా నేర్చుకొన్నవాళ్ళను వైలెన్ విద్వాంసులని, మృదంగం నేర్చుకొంటే వారిని మృదంగ విద్వాంసులని ఇలా పిలుస్తారు. మద్రాసులో ఎక్కువ మంది సంగీత విద్వాంసులు ఉన్నారు.

సంగీతం నేర్చుకొన్నవాళ్ళను సంగీత విద్వాంసులు అంటారని తెలుసుకొన్నాంకదా! మరి సంగీతం అంటే బాగా ఇష్టం ఉండి, ఎంతో ఇష్టంతో సంగీతాన్ని వినే వాళ్ళను ఏమంటారో తెలుసా ? వాళ్ళనే శ్రోతలు అంటారు.

# సంగీత కచేరీలు

సంగీత విద్వాంసులు, చాలామంది శ్రోతల ముందు పాడడమో, వాయించడమో చేస్తారు. ఇలా సంగీత విద్వాంసులు శ్రోతల ముందు పాడడమో, వాయించడమో చేస్తే దానిని శ్రోతలు విని మెచ్చుకొంటారు. ఇలా శ్రోతలముందు విద్వాంసులు తమ విద్యను ప్రదర్శించడాన్నే 'సంగీత కచేరి' అంటారు.

గాత్ర విద్వాంసులు చేసే కచేరీని గాత్రకచేరీ అని, వీణ విద్వాంసులు చేసే కచేరీని వీణకచేరీ అని, వైలెన్ విద్వాంసులు చేసే కచేరీని వైలెన్ కచేరీ అని అంటారు.

పూర్వం అయితే సంగీత విద్వాంసుల్ని రాజులు పోషించేవారు. అప్పుడప్పుడు రాజుగారి సభలో రాజు, మంత్రులు, ఇంకా ఇతర పెద్దలు, గొప్పగొప్పవాళ్ళంతా ఉన్నప్పుడు సంగీత విద్వాంసులు కచేరీ చేసేవారు. రాజుగారు మెచ్చుకొని, విద్వాంసులకు బహుమతులు ఇచ్చేవారు. పూర్వం రాజులు సంగీత విద్వాంసుల మధ్య పోటీలుకూడా పెట్టేవారు.

ప్రస్తుతం రాజులు లేరుకదా! సంగీత విద్వాంసులు కచేరీలు ఏర్పాటుచేయడానికి సంగీత సభలున్నాయి. సంగీతసభను కొంతమంది వ్యక్తులు కలసి స్థాపిస్తారు. సభకు అధ్యక్షుడు, కార్యదర్శి (సెక్రటరీ) ఉంటారు. కచేరీలు ఏర్పాటు చేసేందుకు కొంతమంది కార్యవర్గ సభ్యులు కూడా ఉంటారు. సభను 'సెక్రటరీ' నిర్వహిస్తూంటాడు.

సంగీత సభకి ఒక పేరు ఉంటుంది. సభ అధ్యక్షుడు, కార్యదర్శి, కార్యవర్గసభ్యులు అంతాకలిసి ఆలోచించి, పెద్ద పెద్ద విద్వాంసుల్ని పిలిచి, వాళ్ళకచేరీలు ఏర్పాటు చేస్తారు. ప్రస్తుతం రేడియో, కేసెట్లు, టి.వి. ద్వారా కూడా సంగీతాన్ని వినవచ్చు.

కాకినాడలో శ్రీరామసమాజం, సరస్వతీ గానసభ లాంటి ప్రాచీన సంగీతసభలు ఉన్నాయి. మద్రాసులో మ్యూజిక్ అకాడమీ, కృష్ణగానసభ, రసికరంజనిసభ లాంటి సభలు చాలా ఉన్నాయి. మీ ఊళ్ళో సంగీత సభ ఉందా? ఉంటే, ఆ సభ ఏర్పాటుచేసే కచేరీలకి వెళ్ళి వినండి. సభలేక పోతే ఒక చిన్న సంగీత సభను ప్రారంభించండి.

సంగీత కచేరీ ఎలా జరుగుతుంది? కచేరీలో ఏమేమి ప్రదర్శిస్తారు? మొదలైన విషయాలు ముందు ముందు చెప్పుకొందాం. సరేనా?

## సంగీతం గురించిన పుస్తకాలు

పూర్వం సంగీతం గురించి చాలామంది పుస్తకాలు రాశారు. చాలా పూర్వం నుంచే సంగీతం గురించి రాసిన పుస్తకాలు మనదేశంలో ఎన్నో ఉన్నాయి. క్రీస్తు పూర్వం 4వ శతాబ్దంలో 'భరతుడు' అనే ఆయన 'నాట్య శాస్త్రం' అన్న పుస్తకాన్ని రాశాడు. ఇది నాట్య శాస్త్రం గురించి రాసిన పుస్తకమైనా దీనిలో సంగీతం గురించి కూడా ఎన్నెన్నో విశేషాలు ఉన్నాయి. మనకి దొరికిన సంగీత గ్రంథాలలో ఇదే చాలా పురాతనమైనది. ఇంకా

'కోహలుడు' అనే ఆయన 'సంగీతమేరు' అనే పుస్తకాన్ని, దత్తిలుడు 'దత్తిలం' అనే పుస్తకాన్ని, మతంగుడు 'బృహద్దేశి' అనే పుస్తకాన్ని రాశారు. నారదుడు అనే ఆయన 'సంగీతమకరందం' అనే పుస్తకాన్ని, పార్శ్వదేవుడు అనే ఆయన 'సంగీత సమయ సారం' అనే పుస్తకాన్ని రాశారు. క్రీ.శ. 13 శతాబ్దంలో 'శార్ఙ్గదేవుడు' అనే ఆయన దౌలతాబాద్‌లో ఉండేవాడు. పూర్వం ఈ దౌలతాబాద్‌నే దేవగిరి అనేవారు. ఈయన 'సంగీత రత్నాకరం' అనే గ్రంథాన్ని రాశాడు.

**13,14** శతాబ్దాల తరువాత మన భారతీయ సంగీతం రెండు రకాలుగా ఏర్పడింది అని మనం చెప్పుకొన్నాంకదా! **14**వ శతాబ్దంలో 'హరిపాలుడు' అనే ఆయన 'సంగీత సుధాకరం' అనే పుస్తకాన్ని రాశాడు. ఆయన ఈ పుస్తకంలో భారత దేశంలో సంగీతం రెండు రకాలని (హిందుస్థానీ, కర్ణాటక సంగీతాలన్నమాట) చెప్పాడు. **16**వ శతాబ్దంలో 'రామామాత్యుడు' అనే ఆయన 'స్వరమేళ కళానిధి' అనే పుస్తకం రాశాడు. అలాగే సోమనాధుడు ''రాగవిబోధం'' అనే పుస్తకం రాశాడు. **17**వ శతాబ్దంలో 'వెంకటముఖి' అనే ఆయన 'చతుర్దండి ప్రకాశిక' అనే గ్రంథాన్ని రాశారు. 'సంగీత సార సంగ్రహం', 'సంగ్రహ చూడామణి' అనే పుస్తకాలు కూడా మనకి దొరికాయి. ఈ రెండు పుస్తకాల్ని ఎవరు రాశారో తెలియదు. మన కర్ణాటక సంగీతానికి 'స్వరమేళ కళానిధి', 'చతుర్దండి ప్రకాశిక', 'సంగీత సార సంగ్రహం', 'సంగ్రహ చూడామణి' పుస్తకాలే ఆధారం అని చెప్పుకోవచ్చు.

ఈమధ్య శ్రీ పి. సాంబమూర్తి, శ్రీ విస్సా అప్పారావు,

శ్రీ విం.వ. నరసింహాచార్యులు, శ్రీ కె.వి. యస్. గిర్మాజీరావు, శ్రీ అరిపిరాల సత్యనారాయణ, శ్రీ ఎన్. వి. పార్థసారధి, శ్రీ ఎస్. ఆర్. జానకి రామన్, శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావు లాంటి వారు ఎందరో సంగీతం గురించి పుస్తకాలు రాశారు.

## వాగ్గేయ కారులు

పుస్తకాలు సంగీతం లక్షణాలని తెలుపుతాయి. సంగీతం అంటే ఏమిటి? రాగాలు అంటే ఏమిటి? అవి ఎన్ని ఉన్నాయి? అవి ఎలా ఏర్పడతాయి? తాళాలు అంటే ఏమిటి? అవి ఎన్ని? ఇలా సంగీతం గురించిన చాలా వివరాలు పుస్తకాలలో ఉంటాయి.

అయితే సంగీతం అంటే కేవలం పుస్తకాల్ని చదివి ఆనందించడం కాదు కదా! ఎవరైనా పాటలు పాడుతుంటే విని ఆనందిస్తాం. లేదా ఆ పాటల్ని వీణ మీదో, సన్నాయి మీదో, వైలెన్ మీదో వాయిస్తే విని సంతోష పడతాం. మరి అలా పాడడానికి, వాయించడానికి వీలైన పాటల్ని ఎవరు రాస్తారు? పాటల్ని రాయగలిగిన వాళ్ళను కవులు అంటారు. కవులు కేవలం పాటల్ని రాయగలరు. మరి పాటల్ని పాడాలంటే ఎలాగ? పాటకి స్వరాల్ని కూర్చాలి. ఇలా స్వరాల్ని కూర్చితేనే ఆ పాటని పాడడానికి వీలు పడుతుంది. కవులు పాటల్ని రాయగలరు కాని స్వరాల్ని కూర్చలేరు. స్వరాలను సంగీత విద్వాంసులు కూర్చుతారు. అప్పుడు ఆ పాటని పాడచ్చు. లేదా వాద్యాలపైన వాయించవచ్చు. ఇలా పాటని పాడచ్చు లేదా వాద్యాలపైన వాయించవచ్చు. ఇలా

పాటలకి స్వరాల్ని కూర్చడాన్నే 'స్వరపరచడం' అంటారు. కవులు పాటల్నిరాస్తారని, ఆ పాటకి సంగీతవిద్వాంసులు స్వరాల్ని కూర్చుతారని మనం తెలుసుకొన్నాం. అయితేకొందరు సొంతంగా పాటల్నిరాయగలరు. ఆ పాటకి స్వరాల్ని కూడాకూర్చగలరు. అంటే వాళ్ళకి సంగీతం, కవిత్వం రెండూ బాగావచ్చునన్నమాట. ఇలాంటివారినే 'వాగ్గేయకారులు' అంటారు. వీరినే 'బయకారులు' అనికూడా అంటారు. ఇలాంటి వాగ్గేయకారులు ఎందరెందరో ఉన్నారు. అన్నమయ్య, రామదాసు, క్షేత్రయ్య, జయదేవుడు, త్యాగరాజు, ముత్తుస్వామి దీక్షితులు, శ్యామశాస్త్రి వీళ్ళందరూ వాగ్గేయకారులే.

వాగ్గేయ కారులు రాసిన పాటల్ని 'పాటలు' అని కాకుండా వేరే పేర్లతో పిలుస్తారు. అన్నమయ్య, రామదాసు, త్యాగరాజు, ముత్తుస్వామి దీక్షితులు, శ్యామ శాస్త్రి రాసిన పాటల్ని కీర్తనలు లేదా కృతులు అని పిలుస్తూ ఉంటారు. అలాగే 'క్షేత్రయ్య' రాసిన వాటిని 'పదాలు' జయదేవుడు రాసిన వాటిని అష్టపదులు అని నారాయణ తీర్థులు రాసిన వాటిని 'తరంగాలు' అని ఇలా వాగ్గేయ కారులు రాసిన పాటలకి పేర్లు ఉన్నాయి. అంటే కీర్తనలు, కృతులు, పదాలు, అష్టపదులు, తరంగాలు ఇవన్నీ రకరకాల పాటలు లాంటివి అన్నమాట. సంగీత కచేరీలలో ఎక్కువగా కీర్తనల్ని పాడడం, లేకపోతే వాయించడం చేస్తారు. వాగ్గేయకారుల జీవితం గురించిన వివరాలు మనం ముందు ముందు చెప్పుకొందాం.

# 2. నాదం

ఒక డబ్బాలో రాళ్ళువేసి గిలకరించాం అనుకోండి. ఆ శబ్దం ఎలా ఉంటుంది? వినడానికి బాగుంటుందా? లేకపోతే ఒక బల్ల మీద కర్రతో గట్టిగా కొట్టామనుకోండి. ఆ శబ్దం ఎలా ఉంటుంది? వినడానికి బాగుండదు కదూ! అదే ఎవరైనా చక్కగా పాడినా, వీణ వాయించినా మనం విని ఎంతో ఆనందిస్తాం. కొన్ని శబ్దాలు లేదా ధ్వనులు వినడానికి ఇంపుగా ఉండవు. అలాంటి శబ్దాలనే చప్పుళ్ళు అంటాం. మరి పాట పాడినా, వీణ, వైలెన్, సన్నాయి లాంటి వాద్యాలు వాయించినా వచ్చేధ్వని వినడానికి ఎంతో బాగుంటుంది. ఇలాంటి ధ్వనినే 'సంగీతధ్వని' అంటాం. అంటే పాడినా, వాద్యాలు వాయించినా వచ్చేధ్వని, సంగీతధ్వని అన్నమాట. ఈ సంగీతధ్వనినే 'నాదం' అని కూడా అంటారు. ఈ నాదం నుంచి సంగీతం ఏర్పడింది.

మీ అందరికీ ఒక సందేహం వచ్చి ఉండవచ్చు. కొన్ని ధ్వనులు వినడానికి ఎందుకు బాగుంటాయి? కొన్ని ఎందుకు బాగుండవు? అని. ఈ విషయం తెలియాలంటే ముందు ధ్వని లేదా శబ్దం ఎలా ఏర్పడుతుందో తెలుసుకోవాలి.

ఒక దారాన్ని తీసుకొనిన ఒక చివర పంటితో నొక్కిపట్టుకొని, మరోచివర చేతితో గట్టిగా లాగి పట్టుకోండి. దారాన్ని వేలితో మీటండి. ధ్వని వస్తుంది. అలాగే పెద్ద రబ్బర్ బ్యాండ్ తీసుకొని పళ్ళతో పట్టుకొని, లాగి, వేలితో మీటితే వేరేధ్వని వస్తుంది.

రబ్బరు బ్యాండ్, దారం వీటిలోంచి ధ్వనివస్తున్నప్పుడు వాటిని పరిశీలించి చూడండి. దారం, రబ్బరుబ్యాండ్ అటు, ఇటు ఊగుతూ ఉంటాయి. అవి ఇలా ఉయ్యాలలాగ అటు, ఇటు ఊగడాన్నే కంపనాలు అంటారు. వస్తువులు ఇలా కంపనాలు చెందడం వల్లే ధ్వని ఏర్పడుతుంది. దారాన్ని లేదా రబ్బరు బ్యాండ్‌ను కంపించకుండా ఆపేస్తే ధ్వనికూడా ఆగిపోతుంది. గంట మీద కాని, పళ్ళెం మీదకాని ఒక దెబ్బ వేసి చూడండి. ధ్వని వస్తుంది. అప్పుడు ఆవస్తువుల్ని ముట్టుకోండి. అవి కంపనాలు చెందుతున్నట్లు మీ చేతికి తెలుస్తుంది. అలాగే మరి బల్లమీద గట్టిగా కర్రతో కొట్టినా బల్లకంపించి శబ్దం వస్తుంది. అంటే వస్తువు కంపనాలు చెందితే ధ్వని పుడుతుందన్నమాట.

## ధ్వని ప్రసారం

మీ ఇంటి దగ్గరగా ఒక గుడి ఉందనుకోండి ఆ గుడిలో గంట మ్రోగిస్తే, ఆగంట మీ ఇంటికి వినిపిస్తుంది కదా! ఆ గంట ధ్వని గుడి నుంచి మీ ఇంటిదాకా ఎలా వచ్చింది?

వస్తువులు కంపించడం వల్ల ధ్వని పుడుతుందని చెప్పు కొన్నాం కదా! వస్తువు కంపిస్తుంటే వస్తువుచుట్టూ ఉన్న గాలిలో అలలు ఏర్పడతాయి. ఈ అలలనే 'ధ్వని తరంగాలు' అంటాం. ఈ ధ్వని తరంగాలు గాలితో ప్రయాణించి మన చెవిని చేరుతాయి. అప్పుడు మనకి ఆ ధ్వని వినిపిస్తుంది. అంటే ధ్వని మన చెవిని చేరాలంటే గాలిలాంటి పదార్థం ఏదోఒకటి ఉండాలి. గాలేకాకుండా ధ్వని ఘనపదార్థాలలోను, నీటిలోను కూడా

ప్రయాణిస్తుంది. ధ్వని దేనిగుండా ప్రయాణిస్తుందో దానినే 'యానకం' అంటాం. గాలి, నీరు, ఘన పదార్థాలు (అంటే కర్ర, చెక్క, అట్ట, మొదలైనవి) ఇవన్నీ ధ్వని యొక్క యానకాలన్నమాట. ధ్వని తరంగాల రూపంలో ప్రయాణిస్తుందని తెలుసుకొన్నాంకదా! ఈ తరంగాల్ని సైన్స్ పుస్తకాలలో బొమ్మరూపంలో ఇలా చూపిస్తారు.

ధ్వని తరంగం పటం



## పౌనః పున్యం (ఫ్రీక్వెన్సీ)

వస్తువులు కంపనం చెందితే ధ్వని పుడుతుందని తెలుసుకొన్నాం. ఒక వస్తువు ఒక సెకను టైములో ఎన్నిసార్లు కంపనాలు చేస్తుందో శాస్త్రవేత్తలు లెక్కకడతారు. ఒక వస్తువు ఒక సెకనుటైమ్‌లో ఎన్ని సార్లు కంపించిందో ఆ కంపనాల సంఖ్యనే ఆ వస్తువు 'పౌనః పున్యం' అంటారు. పౌనః పున్యాన్ని ఇంగ్లీషులో 'ఫ్రీక్వెన్సీ' అంటారు. ఉదాహరణకి ఒక తీగ, ఒక సెకను టైములో **240** సార్లు కంపించింది అనుకొందాం. అంటే ఆ తీగ ఫ్రీక్వెన్సీ **240** అన్నమాట.

# సంగీతధ్వనులు ఎందుకు వినడానికిబాగుంటాయి?

సంగీత ధ్వనులు, వినడానికి బాగుంటాయని మనం ముందు తెలుసుకొన్నాం. సంగీతధ్వని ఎందుకు బాగుంటుందో చూద్దాం.

ఉదాహరణకి ఒక వస్తువు ఒక సెకనులో **240** సార్లు కంపించింది అనుకోండి. మళ్ళీ రెండో సెకనులో కూడా **240** సార్లే, అలాగే మూడో సెకనులో కూడా **240** సార్లే కంపించింది అనుకొందాం. ఈ విధంగా ప్రతీసెకనుకి పౌనః పున్యం మారకుండా **240** సార్లే కంపిస్తే ఆ ధ్వని సంగీతధ్వని అవుతుంది. వినడానికి బాగుంటుంది. అంతే వస్తువు పౌనః పున్యం సెకను, సెకనుకీ మారిపోకుండా స్థిరంగా ఉన్నట్లయితే ఆ ధ్వని సంగీతధ్వని. అలా కాకుండా పౌనః పున్యం ఒక క్రమ పద్ధతిలో లేకుండా, సెకను, సెకనుకీ మారిపోతే అప్పుడు వచ్చే ధ్వని వినడానికి బాగుండదు. ఇలా వినడానికి బాగుండని ధ్వనిని చప్పుడు అంటారు.

సంగీతధ్వని తరంగం



చప్పుడు తరంగం



# సంగీత ధ్వనుల లక్షణాలు

సంగీత ధ్వనులకి కొన్ని ప్రత్యేక లక్షణాలు ఉన్నాయి. అవి 1. పిచ్ 2. తీవ్రత 3. గుణం

**పిచ్ :** ఈ పిచ్ పౌనః పున్యం పైన ఆధారపడుతుంది. పౌనఃపున్యం పెరిగితే 'పిచ్' పెరిగింది అంటాం. పౌనః పున్యం తగ్గితే 'పిచ్' తగ్గింది అంటాం. ఉదాహరణకి సెకనుకి **240** పౌనఃపున్యం ఉన్న ధ్వనికన్నా, **256** పౌనః పున్యం ఉన్న ధ్వని పిచ్ హెచ్చు.

సంగీతం స్వరాలతో ఏర్పడుతుందని, స్వరాలంటే ఒకరకమైన ధ్వనులని మనం చెప్పుకొన్నాం కదా! ఈ స్వరాలు సంగీతధ్వనులు. అంటే రకరకాల పౌనః పున్యం ఉన్న సంగీత ధ్వనులే స్వరాలు అన్నమాట. సప్తస్వరాలలో 'స' పౌనః పున్యం, కన్నా 'రి' పౌనః పున్యం ఎక్కువ అలాగే 'రి' కన్నా 'గ' పౌనః పున్యం ఎక్కువ 'గ' కన్నా 'మ'; 'మ' కన్నా 'ప', 'ప' కన్నా 'ద' 'ద' కన్న 'ని' పౌనః పున్యాలు ఎక్కువగా ఉంటాయి.

**తీవ్రత :** రేడియోలో ఏదైనా పాట వింటున్నామనుకోండి. ఆ పాట మనకు అంత బాగా వినిపడక పోతే ఏం చేస్తాం? సౌండ్ పెంచుతాం. సౌండ్ పెంచితే ఆ పాట మనకి బాగా బిగ్గరగా వినిపిస్తుంది. సౌండ్ పెంచకముందు ఆ పాట ఎలా వినిపిస్తుంది? నెమ్మదిగా వినిపిస్తుంది కదా! బిగ్గరగా వినిపించినా నెమ్మదిగా వినిపించినా పాటలో ఉన్నస్వరాల పౌనః పున్యం మారదు.

కేవలం సౌండ్ లో మాత్రమే మార్పు ఉంటుంది. తీవ్రత అంటే ఇదే. ఎక్కువ సౌండ్ ఉన్న ధ్వని తీవ్రత ఎక్కువ. తక్కువ సౌండు ఉన్న ధ్వని తీవ్రత తక్కువ. తక్కువ తీవ్రత ఉన్నధ్వని అస్పష్టంగా వినిపిస్తుంది. ఎక్కువ తీవ్రతఉన్న ధ్వని బాగా స్పష్టంగా వినిపిస్తుంది.

తక్కువ తీవ్రత ఉన్న ధ్వనితరంగం



ఎక్కువ తీవ్రత ఉన్న ధ్వని తరంగం



గుణం : బయటకి వెళ్ళి ఇంటికి తిరిగి వచ్చిన మీ నాన్నగారు మీ ఇంటి తలుపు కొడుతున్నారనుకోండి. మీరు 'ఎవరది ?'' అని అడిగారనుకోండి. అప్పుడు మీ నాన్నగారు 'నేను' అని సమాధానం ఇస్తారు. మీరు మీ నాన్నగారి గొంతును బట్టి వెంటనే వచ్చింది మీ నాన్నగారని తెలుసుకో గలుగుతారు. అవునా ? మనం మనకి బాగా పరిచయం ఉన్న వారి గొంతును బట్టి

ఆ వ్యక్తిని చూడకుండానే వాళ్ళెవరో చెప్పగలం.

వీణ, వైలెన్, వేణువు లాంటి ఎన్నో రకరకాల వాద్యాలు ఉన్నాయని మనం చెప్పుకొన్నాం. సంగీతంతో కొద్ది పరిచయం ఉన్నవాళ్ళు ఆ వాద్యాలనుంచి వచ్చేనాదాన్ని బట్టి, ఆ వాద్యాలను చూడకుండా అవి ఏవాద్యాలో చెప్పగలరు. రకరకాల వాద్యాలమీద ఒకే పౌనఃపున్యం ఉన్నస్వరాన్ని వాయించినా కూడా, నాదాన్ని బట్టి అవి ఏ వాద్యాలో చెప్పవచ్చు. ఇలా వేరుగా గుర్తించ గలగడానికి కారణమైనదాన్నే 'గుణం' అంటారు. ఇలా సంగీత ధ్వనులకి కొన్ని ప్రత్యేకతలు ఉన్నాయి.

## ప్రతిధ్వని :

పెద్దగోడకి ఎదురుగా కొంతదూరంలో నిలబడి ఏదైనా మాట్లాడండి. మనం మాట్లాడినమాట మళ్ళీ ఆ గోడ దగ్గరనుంచి మాట్లాడి నట్లు తిరిగి వినపడుతుంది. అలాగే ఒక కొండ ముందు నిలబడి కేకవేస్తే ఆ కేక కొంతసేపటికి కొండలలోంచి వేసినట్లుగా మనకు వినిపిస్తుంది. ఇలా మనం చేసిన ధ్వని మనకు తిరిగి వినపడడాన్నే ప్రతిధ్వని అంటారు. ఇలాంటి ప్రతిధ్వని లోతైన బావుల్లో కూడా వస్తుంది. ఈ ప్రతిధ్వనికి కారణం ఏమిటి? ఏదైనా ఒక బంతిని గోడకి వేసికొట్టండి. ఆ బంతి తిరిగి మీదగ్గరకు వస్తుంది. అవునా? అలాగే ధ్వని తరంగాలు ప్రయాణిస్తుంటే వాటికి పెద్ద పెద్ద కొండలు, బిల్డింగులు, ఎత్తుగా ఉండేగోడలు అడ్డువచ్చాయనుకోండి, ధ్వనితరంగాలు తిరిగి వెనక్కి వచ్చేస్తాయి. ఇలా తరంగాలు వెనక్కి రావడాన్నే పరావర్తనం అంటాం. ధ్వని తరంగాలు పరావర్తనం చెందడం వల్ల ప్రతిధ్వని ఏర్పడుతుంది.

ప్రతిధ్వని వచ్చేచోట సంగీతకచేరీలు పెట్టకూడదు. ప్రతిధ్వనుల వల్ల కచేరీ గందరగోళంగా ఉండి, కచేరీని వినిమనం ఆనందించలేము. ప్రతిధ్వని తగ్గాలంటే కచేరీ జరిగే చోటులో వదులుగా; మడతలతో ఉన్న గుడ్డ తెరలు కట్టాలి. కిటికీలను అన్నింటినీ తెరచి ఉంచాలి. ఇలా చేయడం వల్ల ప్రతిధ్వని తగ్గుతుంది.

## పౌనఃపున్యం దేనిమీద ఆధారపడుతుంది?

వస్తువులు కంపిస్తే ధ్వని వస్తుందని, ఒక సెకనులో వస్తువుచేసే కంపనాలనే పౌనః పున్యం అంటారని మనం ముందే తెలుసుకొన్నాం. మీరు వీణ, వైలెన్, సితార్ లాంటి తీగలున్న వాద్యాల్ని ఎప్పుడైనా గమనించారా? వాటికి ఉన్న తీగలు, రెండు ప్రక్కలా బిగించబడి ఉంటాయి. ఒక వైపున తీగల్ని సన్నని బిరడాలకి (అంటే స్క్రూలులాంటి వాటికన్నమాట) బిగిస్తారు. ఆ బిరడాని తిప్పి, తీగను బిగుతుగాను, వదులుగాను చేయవచ్చు. ఇలా రెండు ప్రక్కల కట్టబడిఉన్న తీగ పౌనః పున్యం దేనిపైన ఆధారపడుతుందో మనం ఇప్పుడు తెలుసుకొందాం.

వీణ, వైలెన్ తీగల్ని ఒక ప్రక్కన బిరడాలకి బిగిస్తారని చెప్పుకొన్నాం కదా! బిరడా తిప్పితే తీగ బిగుతు మారుతుంది. పౌనఃపున్యం తీగ బిగుతుపైన ఆధారపడుతుంది. తీగ బిగుతు ఎక్కువైతే దాని పౌనః పున్యం పెరుగుతుంది. అంటే తీగ కొంత బిగుతుతో ఉన్నప్పుడు ఒక ధ్వని వచ్చింది. అనుకొందాం. తీగను ఇంకా బిగుతుగా చేస్తే ఇప్పుడు వచ్చేధ్వని ముందు

ధ్వనికన్నా ఎక్కువ పౌనః పున్యంతో ఉంటుంది.

ఒక దారాన్ని ఒక ప్రక్కన నోటితో పట్టుకొని, వేరొక వైపున చేతితో కొంత బిగుతుగా సాగదీసి పట్టుకొని, ఇంకొక చేతితో దారాన్ని మీటండి. వచ్చిన ధ్వనిని బాగా గమనించండి. ఇప్పుడు ఆ దారాన్ని ఇంతకు ముందు ఉన్న బిగుతుకన్నా ఎక్కువ బిగుతుగా పట్టుకొని, మళ్ళీ మీటండి. ధ్వనిని గమనించండి. ఇప్పుడు వచ్చిన ధ్వని ముందు ధ్వని కన్నా వేరుగా ఉంటుంది. దీనికి కారణం దారాన్ని బిగుతుగా పట్టుకోవడం వల్ల, దాని పౌనః పున్యం ముందుకన్నా పెరగడమే.

ఎవరైనా వీణ వాయిస్తుండే మీరు చూశారా? ఒక చేతి వేళ్ళతో, తీగని మీటుతూ ఉంటారు. రెండోచేతిని ఆ తీగమీద కదుపుతూ, ఆ తీగని నొక్కుతూ ఉంటారు. ఇలా ఎందుకు చేస్తారో తెలుసా?

మీరు ఒక దారాన్ని ఒక వైపు ఒక కుర్చీకి కట్టండి ఆ దారాన్ని పొడవుగా సాగదీసి మరోప్రక్కన ఇంకోకుర్చీకి కట్టండి. ఆ దారాన్ని మీటండి. ఆ దారం మొత్తం కంపిస్తుంది. అప్పుడు వచ్చేధ్వనిని గమనించండి. ఇప్పుడు దారంలో కొంత భాగాన్ని వేలుపెట్టి నొక్కి మళ్ళీ మీటండి. అప్పుడు దారం అంతా కంపిస్తుందా? కంపించదు. కొంతభాగాన్ని మీరు కంపించ నివ్వకుండా నొక్కిపట్టుకొన్నారుకదా! అందుకే కొంత భాగం కంపించదు. కొంతభాగమే కంపిస్తుంది. ఇప్పుడు వచ్చేధ్వని, ముందు వచ్చిన ధ్వనికన్నా వేరుగా ఉంటుంది. కంపించే దారంపొడవు మారడం వల్ల ఇప్పుడు వచ్చేధ్వని ముందు వచ్చిన

ధ్వనికన్నా తేడాగా ఉంటుంది. ముందు వచ్చిన ధ్వని కన్నా, తరువాత వచ్చిన ధ్వని పౌనః పున్యం ఎక్కువ. అందుకే ఈ రెండు ధ్వనులలో తేడా ఉంటుంది. ఈ విధంగా కంపించే తీగ పొడవు మారితే పౌనః పున్యం మారుతుంది. తీగ పొడవు పెరిగితే పౌనః పున్యం తక్కువ. తీగపొడవు తగ్గితే పౌనః పున్యం ఎక్కువ ఉంటుంది.

వీణ, వైలెన్ లాంటి వాద్యాలలో తీగని వేళ్ళతో నొక్కుతారు. అందువల్ల కంపించే తీగ పొడవు మారుతుంది. తీగపొడవు మారడం వల్ల రకరకాల పౌనః పున్యం ఉన్న ధ్వనులు ఏర్పడతాయి. రకరకాల పౌనః పున్యం ఉన్న ధ్వనులే స్వరాలు. అంటే తీగ పొడవును మార్చి, వీణ, వైలెన్, సితార్ లాంటి వాద్యాలలో స్వరాలు పలికిస్తారన్నమాట. ఇలా రకరకాల స్వరాల్ని పలికించడానికే తీగ మీద చేతిని కదుపుతారు.

తీగపౌనః పున్యం, తీగయొక్క మందం పైన కూడా ఆధారపడుతుంది. మందం ఎక్కువైతే ఆ తీగ పౌనః పున్యం తక్కువ. మందం తక్కువగా ఉండి సన్నగా తీగ ఉంటే ఆ తీగ పౌనః పున్యం ఎక్కువ ఉంటుంది.

తీగల్ని తయారు చేసిన పదార్థం బట్టికూడా పౌనః పున్యం మారుతుంది. ఒకే మందం, ఒకే పొడవు ఉన్న ఉక్కుతో చేసిన తీగ, ఇత్తడితో చేసిన తీగను తీసుకొని, వీటిని వీణకి బిగించి వాటి బిగుతును కూడా ఒకేలా చేశామనుకోండి అయినా వాటి పౌనః పున్యంలో తేడావస్తుంది.

# స్థాయి

పాట పాడాలన్నా, వాద్యాలు వాయించాలన్నా ముందు ఒక స్వరాన్ని ఆధారంగా తీసుకోవాలి. ఎంతో కొంత పౌనఃపున్యం ఉన్న స్వరాన్ని ఆధారంగా తీసుకొంటాం. ఇలా ఆధారంగా తీసుకొన్న ఈ స్వరాన్నే ఆధార షడ్జం అంటారు. అలా ఆధారంగా తీసుకొన్న స్వరం నుంచి పౌనః పున్యాల్ని పెంచుతూ, తగ్గిస్తూంటే రకరకాల స్వరాలు వస్తాయి. అంటే ఆధారంగా తీసుకొన్న 'స' కన్నా పౌనః పున్యాల్ని పెంచుతూ పోతే రి, గ, మ, ద, ని స్వరాలు వస్తాయి.

ఉదాహరణకి ఒక వీణ తీగని మీటాము అనుకొందాం. అప్పుడు కొంత పౌనః పున్యంతో ఉన్న ధ్వని వస్తుంది. ఆ ధ్వనిని మనం ఆధారంగా తీసుకొంటాం. అంటే అది 'స' స్వరం - అన్నమాట 'స' తరువాత 'రి' స్వరం రావాలంటే కంపించే తీగ పొడవు మారుస్తాం. అంటే తీగలో కొంతభాగం నొక్కుతాం. అప్పుడు తీగ పొడవు మారుతుంది. అందువల్ల తీగ పౌనఃపున్యం కూడా మారిపోయి, 'రి' స్వరం వస్తుంది. ఇలా కంపించే తీగభాగాన్ని తగ్గిస్తూ పోతే తీగ పౌనః పున్యం పెరుగుతూ 'రి, గ, మ, ద, ని' స్వరాలు వస్తాయి.

సరిగ్గా తీగమధ్యలో నొక్కి, తీగని మీటితే తీగలో సగభాగమే కంపిస్తుంది. ఇప్పుడు వచ్చే స్వరం యొక్క పౌనః పున్యం, మనం ఆధారంగా తీసుకొన్న షడ్జం స్వర పౌనః పున్యానికి

రెట్టింపు ఉంటుంది. దీనిని కూడా షడ్జం అనే అంటాం . అయితే మనం ఆధారంగా తీసుకొన్న షడ్జం స్వరానికి ఇది రెట్టింపు పౌనఃపున్యంతో ఉంది కాబట్టి, దీనిని తారస్థాయి షడ్జం అంటారు. తారస్థాయి అంటే హెచ్చుస్థాయి అన్నమాట. మనం ఆధారంగా తీసుకొన్న షడ్జం స్వరం నుంచి ని వరకు అంటే 'స, రి, గ, మ, ప, ద, ని' ఈ స్వరాల్ని మధ్యమస్థాయికి చెందిన స్వరాలు అంటాం. 'ని' తరువాత తారస్థాయి షడ్జం వస్తుందని తెలుసుకొన్నాం. తారస్థాయి షడ్జం నుంచి పౌనఃపున్యాల్ని ఇంకా పెంచుతూ పోతే మధ్యమ స్థాయి రిషభానికి రెట్టింపు పౌనఃపున్యం ఉన్న రిషభం; అలాగే మధ్యమస్థాయి గాంధారానికి రెట్టింపు పౌనఃపున్యం ఉన్న గాంధారం; మధ్యమస్థాయి మధ్యమం పౌనః పున్యానికి రెట్టింపు పౌనఃపున్యం ఉన్న మధ్యమం ఇలా నిషాదం వరకు మళ్ళీ స్వరాలువస్తాయి. ఈ విధంగా రెట్టింపు పౌనఃపున్యంతో ఉన్న ఈ స్వరాలన్నీ తారస్థాయికి చెందిన స్వరాలు. అంటే వీటి పౌనఃపున్యం మధ్యమస్థాయి స్వరాల పౌనఃపున్యానికి రెట్టింపు ఉంటుందన్నమాట.

మధ్యమస్థాయి స్వరాల పౌనఃపున్యంలో సగం పౌనః పున్యంతో ఉన్న స్వరాలు కూడా ఉంటాయి. అంటే ఇవి ఆధార షడ్జం క్రిందన ఉండే స్వరాలన్నమాట. మధ్యమ స్థాయి స్వరాల పౌనఃపున్యలలో సగం పౌనఃపున్యంతో ఉండే స్వరాల్ని 'మంద్రస్థాయి' స్వరాలు అంటాం. మంద్రస్థాయి, మధ్యమస్థాయి, తారస్థాయి - ఈ మూడు స్థాయిలను కలిపి త్రిస్థాయి అంటాం. త్రిస్థాయి అంటే మూడు స్థాయిలని అర్థం.

స్వరాల్ని రాసేటప్పుడు, అవి ఏస్థాయికి చెందిన స్వరాలో తెలియడానికి కొన్ని గుర్తులు పెడతారు. స్వరానికి క్రింద ఒక చుక్క పెడితే అది మంద్రస్థాయికి చెందిన స్వరం అని గుర్తు. స్వరానికి పైన చుక్క పెడితే అది తారస్థాయికి చెందిన స్వరం అన్నమాట. ఏచుక్కా లేక పోతే అది మధ్యమ స్థాయికి చెందినది.

స — మధ్యమస్థాయి

స̣ — మంద్రస్థాయి

స̇ — తారస్థాయి.

త్రిస్థాయిల గురించి బాగా అర్థం అవడానికి ఒక ఉదాహరణతో మీకు వివరిస్తాను. మనం ఆధార షడ్జంగా **240** పౌనః పున్యం ఉన్న స్వరాన్ని తీసుకుంటే, రిషభం పౌనః పున్యం **256**, గాంధారం పౌనఃపున్యం **300**, మధ్యమం పౌనః పున్యం **320**, పంచమం పౌనః పున్యం **360**, దైవతం పౌనఃపున్యం **384**, నిషాదం పౌనః పున్యం **450** ఉంటాయి. ఇవి మధ్యమ స్థాయి స్వరాల పౌనఃపున్యాలు. తారస్థాయి స్వరాల పౌనఃపున్యాలు నకి **480**, రికి **512**, గకి **600**, మకి **640** పకి **720** దకి **768**, నికి **900** ఉంటాయి. మంద్రస్థాయి స్వరాల పౌనఃపున్యాలు మధ్యమస్థాయి స్వరాల పౌనః పున్యాలలో నగం ఉంటాయి.



ఈక్రింది పటం చూడండి మీకు బాగా అర్థం అవుతుంది.

## త్రిస్థాయి

| మంద్ర స్థాయి (పౌనః పున్యాలు) | | మధ్యమ స్థాయి (పౌనః పున్యాలు) | | తార స్థాయి (పౌనః పున్యాలు) | |
|---|---|---|---|---|---|
| స | 120 | స | 240 | స | 480 |
| రి | 128 | రి | 256 | రి | 512 |
| గ | 150 | గ | 300 | గ | 600 |
| మ | 160 | మ | 320 | మ | 640 |
| ప | 180 | ప | 360 | ప | 720 |
| ద | 192 | ద | 384 | ద | 768 |
| ని | 225 | ని | 450 | ని | 900 |

మీ అందరికీ చిన్న సందేహం వచ్చిఉండచ్చు. ఆధారషడ్జం 240 తీసుకొంటే రిషభం 256 గాంధారం 300 అని. వీటి పౌనఃపున్యాలు ఎలావచ్చాయి? వీటిని ఎలాలెక్కకట్టుకోవాలి? అని మీ సందేహాన్ని ముందుముందు తీరుస్తాను. సరేనా?

## ఆరోహణ - అవరోహణ

చిన్నప్పుడు లెక్కల్లో, అంకెల్ని ఆరోహణ క్రమంలోను, అవరోహణ క్రమంలోనూ అమర్చడం మనమంతా నేర్చుకొన్నాం. ఆరోహణ క్రమం అంటే చిన్న అంకె నుంచి మొదలు పెట్టి, పెద్ద అంకె దాకా అంకెల్ని పేర్చడం. అలాగే అవరోహణక్రమం అంటే పెద్ద అంకెనుంచి చిన్న అంకెవరకూ రాయడం కదూ! అలాగే స్వరాలలో తక్కువ పౌనఃపున్యం ఉన్న స్వరం నుంచి మొదలు పెట్టి, ఎక్కువ పౌనఃపున్యం ఉన్న స్వరందాకా పాడినా, లేకపోతే వాద్యాలపై వాయించినా దానిని ఆరోహణ అంటారు.

ఆరోహణ: స రి గ మ ప ద ని స

మధ్యమ స్థాయి షడ్జం నుంచి తారస్థాయి షడ్జం దాకా పాడినా లేక పోతే వాయించినా అది ఆరోహణ అవుతుంది.

ఎక్కువ పౌనఃపున్యం ఉన్న స్వరం నుంచి మొదలు పెట్టి తక్కువ పౌనఃపున్యం ఉన్నస్వరం దాకా పాడితే అది అవరోహణ అవుతుంది. అంటే తారస్థాయి షడ్జం నుంచి మొదలెట్టి, మధ్యమ స్థాయి షడ్జందాకా పాడితే అది అవరోహణ అవుతుంది.

అవరోహణ: స ని ద ప మ గ రి స

ఆరోహణ, అవరోహణను కలిపి మూర్ఛన అంటారు

ఆరోహణ: స రి గ మ ప ద ని స

అవరోహణ: స ని ద ప మ గ రి స

## స్వరపేటిక

వస్తువులు కంపనం చెందితే ధ్వని వస్తుందని చెప్పుకొన్నాం కదా! మరి మనం మాట్లాడినపుడు, పాడినప్పుడు మన శరీరంలో ఏవి కంపిస్తాయి? అని మీకు సందేహం వచ్చిందా?

మనం మాట్లాడేందుకు, పాటలు పాడేందుకు మన శరీరంలో, స్వరపేటిక అనే ఒక అవయవం ఉంది. ఇది మన కంఠంలో ఉంటుంది. దీని వల్లే మనం మాట్లాడుతాం. పాటలు పాడతాం. మీ గొంతు దగ్గర చెయ్యిపెట్టి, ఏదైనా మాట్లాడి చూడండి కంపనాలు మీ చేతికి తెలుస్తాయి.

స్వరపేటిక శ్వాసనాళానికి పైకప్పులా అమర్చబడి ఉంటుంది. శ్వాసనాళం అంటే - మనం ముక్కుద్వారా గాలి పీల్చుకొంటాం కదా! ఈ గాలిని ఊపిరి తిత్తులలోకి తీసికెళ్ళే గొట్టం అన్నమాట. గాలి ఊపిరి తిత్తులలోకి వెళ్ళాలన్నా, ఊపిరితిత్తులలోంచి బయటకు రావాలన్నా, ఈ స్వరపేటిక నుంచే వెళ్ళాలి. స్వరపేటిక మధ్యలో స్వరతంత్రులు అనేవి ఉంటాయి. మనం గాలి పీల్చుకొంటే ఈ స్వరతంత్రుల మధ్య ఖాళీ ఏర్పడుతుంది. అందువల్ల గాలినిశ్శబ్దంగా ఊపిరితిత్తులలోకి చేరుకొంటుంది. అలాగే ఊపిరి వదిలినా కూడాను. అయితే మనం శబ్దం చేయాలి అనుకొన్నప్పుడు.

ఈ స్వరతంత్రులు బాగా దగ్గరకు వస్తాయి. గాలిని బయటకు రానీయకుండా అడ్డుకొంటాయి. ఈ అడ్డును తొలగించుకొని గాలి బయటకు రావాలి. ఇలా గాలి స్వరతంత్రుల అడ్డాన్ని తొలగించుకొని, బయటకు వచ్చేటప్పుడు ఈ స్వరతంత్రులు కంపిస్తాయి. అప్పుడు శబ్దం పుడుతుంది.

మగవాళ్ళలో స్వరతంత్రులు దళసరిగా, బలంగా పొడుగుగా ఉంటాయి. ఆడవాళ్ళ స్వరతంత్రులు సన్నగా, పొట్టిగా ఉంటాయి. వీటి పౌనః పున్యం, మగవారి స్వరతంత్రుల పౌనః పున్యం కన్నా ఎక్కువ. అందుకే ఆడవాళ్ళ కంఠధ్వని సన్నగా ఉంటుంది. ఆడపిల్లలకి, మగపిల్లలకి, కూడా 14,15 సంవత్సరాల వరకూ స్వరతంత్రులు ఒకేలా ఉంటాయి. అంటే సన్నగా, పొట్టిగానే ఉంటాయి. మగపిల్లలకి మాత్రం 14 నుండి, 18 సంవత్సరాల లోపులో స్వరతంత్రులు లావుగాను, పొడవుగాను మారిపోతాయి. అందువల్లనే మగపిల్లల కంఠధ్వని బొంగురుగాను లావుగాను మారుతుంది.

మనం ఎవరైనా పాడుతుంటే, పాడేవాళ్ళ గొంతు చాలా బాగుంది అనుకొంటూ ఉంటాం. పూర్వం గొంతునే 'శారీరం' అనేవారు. కొందరి గొంతులు చాలా బాగుంటాయి. వాళ్ళు అన్ని స్వరాలనూ సులువుగా పాడగలుగుతారు. వాళ్ళకి సంగీతం పాడడం తొందరగా వచ్చేస్తుంది. ఇలాంటి గొంతుకలనే 'సుశారీరం' అంటారు. సుశారీరం అంటే మంచి గొంతు అన్నమాట. కొంతమందికి సంగీతం పాడడం (అంటే గాత్రం) నేర్చుకోవాలను కొంటారు. అయితే వాళ్ళు తొందరగా స్వరాల్ని పాడలేరు. ఇలాంటి గొంతునే

'కుశారీరం' అంటారు. అంటే చెడ్డగొంతు లేదా పాడడానికి పనికిరాని గొంతు అనిఅర్థం. మరి ఇలాంటివాళ్ళు పాడడం నేర్చుకోకుండా వాద్యాల్ని నేర్చుకోవడం మంచిది.

కొంతమంది గొంతులు పాడడానికి బాగుండక పోయినా బాగా సాధన చేస్తే అప్పుడు పాడడానికి వీలుగా మారుతాయి.

## శృతులు

మనం స్థాయిగురించి ఇంతకు ముందే తెలుసుకున్నాం. ఆధారంగా తీసుకొన్న షడ్జం స్వరానికి రెట్టింపు పౌనఃపున్యం ఉన్న స్వరం తారస్థాయి షడ్జం అని కూడా మనం ముందు చెప్పుకొన్నాం. ఆధార షడ్జం లేదా మధ్యమ స్థాయి షడ్జానికి, తారస్థాయి షడ్జానికి మధ్య చాలా రకాల పౌనః పున్యాలు ఉన్న ధ్వనులు ఉంటాయి. ఈ ధ్వనులలో చెవికి ఇంపుగా ఉండే ఇరవైరెండురకాల ధ్వనుల్ని తీసుకొని, మన సంగీతంలో ఉపయోగిస్తున్నారు. వీటినే ఇరవైరెండు శృతులు అని పిలుస్తారు. ఈ శృతుల్ని ముందుగా గుర్తించిన వాడు భరతుడు. భరతుడు నాట్యశాస్త్రం అనే పుస్తకం రాశాడని మీకు ముందే చెప్పానుగా. ఆ పుస్తకంలో ఇరవైరెండు శృతులు గురించి వివరాలు ఉన్నాయి.

మనం స్వరాలు ఏడని చెప్పుకొన్నాం కదా! ఇరవైరెండు శృతుల్లోను మొదటి ధ్వని షడ్జం, ఆ తరువాత వచ్చే నాలుగు ధ్వనుల్ని (అంటే నాలుగు శృతుల్ని) రిషభాలుగా తీసుకొన్నారు. ఆ తరువాత నాలుగు శృతుల్ని గాంధారాలుగా, ఆ తరువాత

నాలుగు రకాల ధ్వనుల్ని మధ్యమాలుగా, ఆ తరువాత వచ్చిన ధ్వనిని పంచమంగా, ఆతరువాత నాలుగు ధ్వనుల్ని దైవతాలుగా, ఆ తరువాత నాలుగు ధనుల్ని నిషాదాలుగా తీసుకొన్నారు. అంటే రిషభాలలో నాలుగు రకాలు, గాంధారాలలో నాలుగు రకాలు, మధ్యమాలలో నాలుగు రకాలు, దైవతాలలో నాలుగు, నిషాదంలో నాలుగు రకాలు ఉన్నాయన్నమాట. స, ప లలో మాత్రం రకాలు లేవు. రి, గ, మ, ద, ని స్వరాలలో ఒకొక్క-దానిలోనూ నాలుగేసి రకాలు ఉన్నాయి. అంటే మొత్తం 5 x 4 = 20 శృతులు. ఈ ఇరవైకి, స, ప లను కలుపుకొంటే మొత్తం శృతులు ఇరవైరెండు అవుతాయి. స, పలలో రకాలు లేవు కనుక వాటిని ప్రకృతి స్వరాలు అన్నారు. రి, గ, మ, ద, ని స్వరాలలో రకాలున్నాయి కనుక వాటిని వికృతి స్వరాలు అన్నారు. ఈ ఇరవై రెండు శృతుల పేర్లు పట్టికలో ఇచ్చాను చూడండి.



# ఇరవైరెండు శృతుల పట్టిక

1) షడ్జం

రిషభాలు

2) ఏకశృతి రిషభం

3) ద్వి శృతి రిషభం

4) త్రిశృతి (శుద్ధ) రిషభం

5) చతుశృతి రిషభం

ఈ నాలుగు రిషభాలలో రకాలు

త్రిశృతి రిషభాన్నే శుద్ధరిషభం అని [illegible] అంటారు.

గాంధారాలు

6) శుద్ధ గాంధారం

7) సాధారణ గాంధారం

8) అంతర గాంధారం

9) చ్యుత మధ్యమ గాంధారం

ఈ నాలుగు గాంధారంలో రకాలు

మధ్యమాలు

10) శుద్ధమధ్యమం

11) తీవ్ర మధ్యమం

12) ప్రతి మధ్యమం

13) తీవ్ర ప్రతిమధ్యమం

ఈ నాలుగు మధ్యమాలలో రకాలు

14) పంచమం

దైవతాలు

15) ఏకశృతి దైవతం

16) ద్విశృతి (శుద్ధ) దైవతం

17) త్రిశృతి దైవతం

18) చతుశృతి దైవతం

ఈ నాలుగూ దైవతాలలో రకాలు

ద్విశృతి దైవతాన్నే శుద్ధదైవతం అనికూడా అంటారు.

నిషాదాలు

19) శుద్ధ నిషాదం

20) కైశిక నిషాదం

21) కాకలి నిషాదం

22) చ్యుత షడ్జనిషాదం

ఈ నాలుగు నిషాదంలో రకాలు

# శృతులు - వాటి పౌనః పున్యాలు

శృతులు అంటే భిన్న పౌనః పున్యాలు ఉన్న ధ్వనులు అని మనం ముందు చెప్పుకొన్నాం. ఈ శృతుల పౌనఃపున్యాలు ఎలా ఉంటాయో చూద్దాం.

మనం పాడాలన్నా, వాద్యాలు వాయించాలన్నా ముందు ఎంతో కొంత పౌనఃపున్యం ఉన్న ధ్వనిని తీసుకొంటాం. ఆ ధ్వనినే ఆధార షడ్జం అంటాం అని మనం ఇంతకు ముందే తెలుసుకొన్నాం. ఆధార షడ్జంగా ఎంత పౌనఃపున్యం ఉన్న స్వరాన్ని తీసుకోవాలి? కర్ణాటక సంగీతంలోను, హిందుస్థానీ సంగీతం లోను కూడా ఆధార షడ్జంగా ఎంత పౌనఃపున్యం ఉన్న ధ్వనినైనా తీసుకోవచ్చు. మనం ఎంత పౌనః పున్యం ఉన్న ధ్వనిని ఆధార షడ్జంగా తీసుకొంటామో, దానిని బట్టి ఈ ఇరవైరెండు శృతుల పౌనఃపున్యాలు ఆధారపడి ఉంటాయి.

ఉదాహరణకు 240 పౌనఃపున్యం ఉన్న ధ్వనిని ఆధార షడ్జంగా తీసుకొన్నాం అనుకొందాం. తారషడ్జం పౌనఃపున్యం దానికి రెట్టింపు ఉంటుంది. అంటే దాని పౌనఃపున్యం 240 X 2 = 480 ఉంటుందన్నమాట. మిగిలిన శృతులన్నీ ఆధార షడ్జానికి, తారషడ్జానికి మధ్యనే ఉంటాయని ముందు చెప్పుకొన్నాం. అందుచేత మిగిలిన శృతుల పౌనఃపున్యాలు 240 కన్నా ఎక్కువ, 480 కన్నా తక్కువగా ఉంటాయి.

కర్ణాటక, హిందుస్థానీ సంగీతాలలో ఆధార షడ్జం బట్టి

మిగిలిన శృతుల పౌనఃపున్యాలు ఆధారపడతాయి కాబట్టి, శృతుల పౌనఃపున్యాలు నిర్ధారణగా ఇంత అని ఉండవు. కానీ శృతుల పౌనఃపున్యాల మధ్య నిష్పత్తులు మాత్రం స్థిరంగా ఉంటాయి.

ఆధారషడ్జానికి, తారస్థాయి షడ్జం పౌనఃపున్యం రెట్టింపు ఉంటుంది. పంచమం పౌనఃపున్యం ఆధార షడ్జం పౌనఃపున్యానికి **3/2** రెట్లు ఉంటుంది. ఆధార షడ్జం పౌనఃపున్యానికి **4/3** రెట్లు ఉన్న స్వరం శుద్ధ మధ్యమం అవుతుంది. అన్ని శృతుల పౌనఃపున్యాలు, ఆధార షడ్జానికి ఎన్ని రెట్లు ఉంటాయో ఈ క్రింది పట్టికలో ఇచ్చాను చూడండి.

1) షడ్జం
2) ఏకశృతి రిషభం - ఆధార షడ్జానికి **256/243** రెట్లు
3) ద్విశృతి రిషభం - ఆధార షడ్జానికి **16/15** రెట్లు
4) త్రిశృతి రిషభం (శుద్ధ) - ఆధార షడ్జానికి **10/9** రెట్లు
5) చతుశృతి రిషభం - ఆధార షడ్జానికి **9/8** రెట్లు
6) శుద్ధగాంధారం - ఆధార షడ్జానికి **32/27** రెట్లు
7) సాధారణ గాంధారం - ఆధార షడ్జానికి **6/5** రెట్లు
8) అంతర గాంధారం - ఆధార షడ్జానికి **5/4** రెట్లు
9) చ్యుత మధ్యమ గాంధారం - ఆధార షడ్జానికి **81/64** రెట్లు
10) శుద్ధమధ్యమం - ఆధార షడ్జానికి **4/3** రెట్లు
11) తీవ్ర మధ్యమం - ఆధార షడ్జానికి **27/20** రెట్లు
12) ప్రతి మధ్యమం - ఆధార షడ్జానికి **45/32** రెట్లు
13) తీవ్ర ప్రతి మధ్యమం - ఆధార షడ్జానికి **64/45** రెట్లు
14) పంచమం - ఆధార షడ్జానికి **3/2** రెట్లు

15) ఏకశృతి దైవతం - ఆధార షడ్జానికి **128/81** రెట్లు

16) ద్విశృతి (శుద్ధ)దైవతం - ఆధార షడ్జానికి **8/5** రెట్లు

17) త్రిశృతి దైవతం - ఆధార షడ్జానికి **5/3** రెట్లు

18) చతుశ్శృతి దైవతం - ఆధార షడ్జానికి **27/16** రెట్లు

19) శుద్ధ నిషాదం - ఆధార షడ్జానికి **16/9** రెట్లు

20) కైశికి నిషాదం - ఆధార షడ్జానికి **9/5** రెట్లు

21) కాకలి నిషాదం - ఆధార షడ్జానికి **15/8** రెట్లు

22) చ్యుత షడ్జనిషాదం - ఆధార షడ్జానికి **243/128** రెట్లు

## తార షడ్జం - ఆధార షడ్జం పౌనః పున్యానికి రెట్టింపు

ఈ పట్టికను బట్టి, ఆధార షడ్జానికి మిగిలిన శృతులు ఎన్ని రెట్లు ఉంటాయో తెలుస్తుంది. దీనిని బట్టి మనం శృతుల పౌనఃపున్యాల్ని లెక్కగట్టుకోవచ్చు ఎలా అంటే ఉదాహరణకి ఆధారషడ్జంగా **240** పౌనః పున్యం ఉన్న ధ్వనిని తీసుకొన్నాం అనుకొందాం. అప్పుడు దానికి పంచమం ఎన్ని రెట్లుంటుంది? **3/2** రెట్లు కదా! అంటే 240 x 3/2=360 ఉంటుంది. అలాగే చతుశ్శృతి రిషభం పౌనఃపున్యం లెక్కకడదాం. షడ్జానికి చతుశ్శృతి రిషభం ఎన్ని రెట్లుంటుంది? **9/8** రెట్లు కదా! అంటే 240 x 9/8=270 అవుతుంది. **270** పౌనః పున్యం కల ధ్వని, చతుశ్శృతి రిషభం అన్నమాట. ఇలాగే అన్ని శృతుల పౌనః పున్యాలను లెక్కకట్టుకోవచ్చు.

## అనునాదం

ఒక వీణలో రెండు తీగల్ని ఒకే పౌనఃపున్యం ఉండేలా సరిచేయాలి. పౌనఃపున్యం ఒకేలా ఉండేలా ఎలా చెయ్యాలని

మీకు సందేహం రావచ్చు. రెండు తీగలపైనా ఒకే స్వరం పలికేలా చేస్తే అవి రెండూ ఒకే పౌనఃపున్యంలో ఉంటాయి. అంటే ఇప్పుడు ఈ రెండుతీగలు పౌనఃపున్యం ఒక్కటే. ఇప్పుడు ఒక తీగను మీటి, దానిని కంపింపచేస్తే, రెండోతీగ, దానంతట అదే కంపిస్తుంది. ఇలా జరగడాన్నే అనునాదం అంటాం. ఈ అనునాదం వల్ల ధ్వని తీవ్రత పెరుగుతుంది. వీణలో గుల్లగా ఉండే ఒక నగం గోళం లాంటి భాగం ఉంటుంది. మనం వీణ వాయించేటప్పుడు, దానిలో గాలి అనునాదం చెందుతుంది. ఇలా అనునాదం చెందడం వల్ల వీణ వాయిస్తుంటే నాదం తీవ్రత బాగా పెరుగుతుంది.

## అనురణాత్మక ధ్వనులు

మనం ఒక స్వరాన్ని పాడినా, వాయించినా, ఆ స్వరంతో పాటు, ఆ స్వరం పౌనః పున్యంకన్నా ఎక్కువ పౌనఃపున్యం ఉన్న కొన్ని స్వరాలు కూడా బహుకొద్దిగ వినిపిస్తూంటాయి. చాలా జాగ్రత్తగా వింటేనే ఈ స్వరాలు వినిపిస్తాయి. వీటినే అనురణాత్మక ధ్వనులు అంటారు. ఉదాహరణకు మధ్యమస్థాయి షడ్జం పాడినా, వాయించినా; దానితో పాటు దానికన్నా రెట్టింపు పౌనఃపున్యం ఉన్న తారస్థాయి షడ్జం, తారస్థాయి పంచమం కూడా బహుకొద్దిగా వినిపిస్తూంటాయి. ఈ తారస్థాయి షడ్జం, పంచమాలను అనురణాత్మక ధ్వనులు అంటాం. ఇలాగే స్వరాలకి అన్నింటికీ అనురణాత్మక ధ్వనులు ఉంటాయి. స్వరాలు అంటే అనురణాత్మక ధ్వనులతో ఉన్న వివిధ రకాల ధ్వనులన్నమాట.

రకరకాల వాద్యాల్ని, ఆ వాద్యాలు చూడకుండా, వాటి నాదాన్ని బట్టి, అవి ఏవాద్యాలో చెప్పేయచ్చునని చెప్పుకొన్నాం గుర్తుందా? రకరకాల వాద్యాలలో కలిగే అనురణాత్మక ధ్వనులలో తేడా ఉంటుంది. ఈ అనురణాత్మక ధ్వనుల వల్ల రకరకాల వాద్యాల నాదంలో తేడా వస్తుంది. అంటే వీణలో ఒకరకమైన అనురణాత్మక ధ్వనులు వస్తే, వైలెన్‌లో ఒక రకమైన అనురణాత్మక ధ్వనులు, వేణువులో మరోరకం అనురణాత్మక ధ్వనులు వస్తాయి. దీనివల్లనే ఆయా వాద్యాల నాదాన్ని బట్టి, అవి ఏవాద్యాలో గుర్తుపట్టగలం. అలాగే కొందరి గొంతుల్లో కొన్ని అనురణాత్మక ధ్వనులు కలిగితే, మరికొందరిలో మరికొన్ని రకాల అనురణాత్మక ధ్వనులు వస్తాయి. ఈ అనురణాత్మక ధ్వనులు వల్ల రకరకాల గొంతుల మధ్య తేడాలు వుంటాయి.

## గమకాలు

స్వరాల పౌనఃపున్యాలు ఇంత అని మనం లెక్కగట్టి చెప్పుకొంటున్నాం. ఈ పౌనఃపున్యాలు ఆ స్వరాలను విడిగా పాడినా, వాయించినా ఉండే పౌనఃపున్యాలు అన్నమాట. అయితే కొన్ని స్వరాలను కలిపి వరుసగా పాడేటప్పుడు ఆ స్వరాల పౌనఃపున్యాలను కొంచెం మార్చి, మరొక స్వరం ఛాయవచ్చేలా పాడుతూంటారు. ఇలా స్వరాల పౌనఃపున్యాల్ని కొద్దిగా మార్పుచేసి ఇంకొక స్వరం ఛాయ వచ్చేలా పాడడాన్నే గమకం అని అంటారు. గమకాలు ఇచ్చేటప్పుడు ఒక స్వరం ప్రధానంగా

వినిపిస్తుంది. ఎలా గమకాలిస్తే వినడానికి బాగుంటుందో ఆరకంగా స్వరాలకి గమకాలు ఇచ్చి పాడతారు లేదా వాయిస్తారు.

గమకాలు చాలా ముఖ్యమైనవి. మన భారతీయ సంగీతంలో కర్ణాటక సంగీతం, హిందుస్థానీ సంగీతం అని రెండు రకాల పద్ధతులు ఉన్నాయని చెప్పుకొన్నాం జ్ఞాపకం ఉందా? ఈ రెండు రకాల పద్ధతుల్లోను ఉపయోగించే గమకాలు వేరుగా ఉంటాయి. అందువల్ల ఈ రెండు పద్ధతుల్లో తేడాలు వచ్చాయి.

మన కర్ణాటక సంగీతానికి గమకాలు చాలా ముఖ్యం. గమకాలతో పాడితేనే పాట అందంగా ఉంటుంది. గమకాలు ఎలా ఇస్తూ స్వరాల్ని పాడాలో, గురువు దగ్గర నేర్చుకోవాలి. సోమనాథుడు అనే ఆయన ఒక సంగీతం పుస్తకం రాశాడు. అందులో ఆయన "గమకాలు లేని సంగీతం, నీరు లేని నదిలాగ, పువ్వులు లేని తీగలాగ, వెన్నెల లేని రాత్రిలా" ఉంటుందన్నాడు.

## గమకాలు - రకాలు

గమకాలు పది రకాలున్నాయని చెబుతారు. సంస్కృతంలో 'దశ' అంటే పది. కాబట్టి వీటిని 'దశ విధ గమకాలు' అంటారు. కొందరు పదిహేను గమకాలున్నాయని చెబుతారు. సోమనాథుడు అనే ఆయన 'పండితారాధ్య చరిత్ర' అనే పుస్తకం రాశాడు. అందులో ఇరవైరెండు రకాల గమకాలున్నాయని చెప్పాడు.

# దశవిధ గమకాలు

1) అరోహణ: ఈ ఆరోహణ అంటే మనం ముందే చెప్పుకొన్నాం. స్వరాల్ని తక్కువ పౌనఃపున్యం నుంచి, ఎక్కువ పౌనఃపున్యం వరకూ పాడడం అని. ఇలా పాడేటప్పుడు, స్వరాల్ని కదిలిస్తూ సరిగమపదనిస అని పాడడం.

2) అవరోహణ: ఆరోహణ అంటే ఎక్కువ పౌనఃపున్యం ఉన్న స్వరాల నుంచి, తక్కువ పౌనఃపున్యం ఉన్న స్వరాలదాకా పాడడం అని మీకు ముందేతెలుసు. 'స ని ద ప మ గ రి స అంటూ స్వరాల్ని కదిలిస్తూ పాడడం అవరోహణ అవుతుంది.

3) ఢాలు: ఒక స్వరాన్ని ఆధారంగా తీసుకొని, దానికన్నా హెచ్చు స్వరాల్ని పాడడం. ఉదాహరణకి స రీ - స గా - స మా - స పా. ఇందులో 'స' ని ఆధారంగా తీసుకొని రీ, గా, మా, పా స్వరాలని స రీ, స గా అంటూ పాడం. ఈ గమకం పేరు ఢాలు.

4) స్ఫురితం: ఒకేస్వరాన్ని రెండుసార్లు పాడితే దానినే జంట అంటారు. ఉదాహరణకి స స , రి రి, గ గ, మ మ ఇవి జంటస్వరాలు. ఇలా జంటస్వరాల్ని పాడినా, వాయించినా కేవలం ఆ స్వరాలనే వాయించరు లేదా పాడరు. 'స స' అనే టప్పుడు 'స' క్రింది స్వరం కూడా వినీ వినపడుకుండా పాడతారు లేదా వాయిస్తారు. 'సనిస' అని అలాగే 'రి రి' అని పాడినప్పుడు, 'రి' క్రిందనున్న స్వరం 'స' కదా! ఆ 'స' కూడా వినిపించేలా 'రిసరి' అని

పాడడం లేదా వాయించడం చేస్తారు. సనిస- రిసరి- గరిగ- మగమ ఇలా ఈ విధమైన గమకాన్నే స్ఫురితం అంటారు.

5) కంపితం: ఒక స్వరాన్ని వణికింపచేయడం ఉదాహరణకి 'ప' అనే స్వరాన్ని పా .... పపపప ఇలా వణికింప చేయడం దీన్ని కంపితం అంటారు.

6) ఆహతము: ఆరోహణలో రెండు స్వరాల్ని పాడేటప్పుడు లేకపోతే వాయించేటప్పుడు, సరి - రిగ - గమ - మప ఇలా కలుపుతూండడం.

7) ప్రత్యాహతము: ఆహత గమకం లాగ, అవరోహణలో పాడడం. సని - నిద - దప - పమ ఇలా

8) త్రిపుచ్ఛం: ఒక స్వరాన్ని మూడు సార్లు పలికించడం ససస - రిరిరి - గగగ ఇలా దీనినే త్రిపుచ్ఛం అంటారు.

9) ఆందోళితం: సరిసపాప - సరిసమామ - సరిసగాగ ఇలా స్వరాల్ని వాయించడం

10) మూర్ఛన: షడ్జంతో మొదలుపెట్టి నిషాదం వరకూపాడి, మళ్ళీ రిషభంతో మొదలుపెట్టి, షడ్జందాకా పాడి-ఈవిధంగా చేయడం. సరిగమపదనీ- రిగమపదనిసా- గమపదనిసరీ ఇలా.

గమకాలు పది అని మనం స్థూలంగా చెప్పుకొన్నాం. మన సంగీతంలో ఈ పదిగమకాలే కాకుండా ఎన్నో రకాలగమకాలు వాడతారు. గమకాలు గురించి మాటల్లో చెప్పడం కష్టం. ఎవరైనా సంగీతవిద్వాంసుడి దగ్గరకు వెళ్ళి స్వరాలకు గమకాలు ఎలా ఇవ్వాలో అడిగి తెలుసుకొంటే బాగా అర్థం అవుతుంది.

# షోడశ స్వరస్థానాలు

మనం శృతులు 22 ఉన్నాయని చెప్పుకొన్నాం. ఈ 22 శృతుల లోంచి 16 శృతుల్ని తీసుకొన్నారు. వీటినే స్వరస్థానాలు అన్నారు. సంస్కృతంలో షోడశ అంటే పదహారు. కనుక ఈ పదహారు స్వరస్థానాల్ని షోడశ స్వరస్థానాలు అని పిలిచారు.

## షోడశస్వరస్థానాలు

1. షడ్జం
2. శుద్ధరిషభం
3. చతుశృతిరిషభం
4. శుద్ధగాంధారం
5. షట్శృతి రిషభం
6. సాధారణ గాంధారం
7. అంతరగాంధారం
8. శుద్ధమధ్యమం
9. ప్రతిమధ్యమం
10. పంచమం
11. శుద్ధదైవతం
12. చతుశృతి దైవతం
13. శుద్ధ నిషాదం
14. షట్శృతి దైవతం
15. కైశికి నిషాదం
16. కాకలి నిషాదం

ఈ షోడశ స్వరస్థానాలను రకరకాలుగా అమర్చడం వల్ల రాగాలు వస్తాయి. రాగాలు ఎలా ఏర్పడతాయో తరువాత అధ్యాయంలో చెప్పుకొందాం.

అయితే మీ అందరికీ ఒక సందేహం వచ్చి ఉండచ్చు. అది ఏమిటంటే - శృతులు ఇరవైరెండు ఉన్నాయి కదా! వీటిలోనుంచి పదహారు శృతుల్ని తీసుకొన్నారు. మరి మిగిలిన

శృతులు మాటేమిటి? ఇవి సంగీతంలో ఉపయోగపడవా? అని అంటే స్థూలంగా పదహారు స్వరస్థానాలని తీసుకొన్నప్పటికీ, ఇరవైరెండు శృతులు కూడా మన సంగీతంలో ఉపయోగపడతాయి. కొన్ని కొన్ని రాగాలలోను, కొన్ని సార్లు స్వరాలకి, గమకాల్ని ఇచ్చేటప్పుడు ఈ ఇరవైరెండు శృతులు వస్తాయి.

షోడశ స్వరస్థానాల పేర్లు రాసేటప్పుడు వాటిని పూర్తిగా రాయకుండా, పొడి అక్షరాలలో రాస్తారు. ఎలా అంటే రిషభం పైన 'శు' అని ఉంటే అది శుద్ధరిషభం అన్నమాట. 'చ' అని ఉంటే అది చతుశృతిరిషభం అని అర్థం.

శు<br>
రి - ఇది శుద్ధరిషభం

చ<br>
రి - ఇది చతుశృతి రిషభం

అలాగే 'రి పైన 'ష' అని ఉంటే - అది షట్‌శృతి రిషభం అన్నమాట

ష<br>
రి - షట్ శృతి రిషభం

అలాగే గాంధారం పైన 'సా' అనిఉంటే అది సాధారణ గాంధారం, 'అం' అనిఉంటే అంతరగాంధారం అని, శు అని ఉంటే శుద్ధగాంధారం అని అర్థం అలాగే మధ్యమం మీద 'శు' అని ఉంటే అది శుద్ధ మధ్యమం అని, 'ప్ర' అనిఉంటే అది ప్రతిమధ్యమం అని, దైవతం మీద 'చ' అని ఉంటే చతుశృతి

ధైవతం అని, 'ష' అనిఉంటే షట్శ్రుతి ధైవతం అని నిషాదం పైన 'శు' అని ఉంటే శుద్ధ నిషాదం అని 'కై' అని ఉంటే కైశిక నిషాదం అని, 'కా' అనిఉంటే కాకలి నిషాదం అనిఅర్థం.

సా
గ — ఇది సాధారణ గాంధారం

అం
గ — ఇది అంతర గాంధారం

శు
గ — ఇది శుద్ధ గాంధారం

శు
మ — ఇది శుద్ధ మధ్యమం

ప్ర
మ — ఇది ప్రతి మధ్యమం

శు
ద — ఇది శుద్ధ ధైవతం

చ
ద — ఇది చతుశ్రృతి ధైవతం

ష
ద — ఇది షట్ శ్రృతి ధైవతం

శు
ని — ఇది శుద్ధ నిషాదం

కై
ని — ఇది కైశిక నిషాదం

కా
ని — ఇది కాకలి నిషాదం

ఉదాహరణకి ఈ ఆరోహణ అవరోహణని చూడండి.

అరోహణ

    శు  అం  శు      శు  కా  .
స  రి  గ  మ  ప  ద  ని  స

అవరోహణ

.  కా  శు      శు  అం  శు
స  ని  ద  ప  మ  గ  రి  స

ఇందులో రిషభంపైన 'శు' అని ఉంది. అంటే అది శుద్ధరిషభం అన్నమాట. 'గ' పైన 'అం' అని ఉంది గమనించారా? అంటే ఇది అంతరగాంధారం అన్నమాట. మధ్యమంపైన 'శు' అని ఉంది కనుక అది శుద్ధమధ్యమం అన్నమాట. అలాగే దైవతం పైన 'శు' అని ఉంది కనుక అది శుద్ధదైవతం, నిషాదం పైని 'కా' ఉంది కనుక అది కాకలి నిషాదం.

షడ్జమం, పంచమాలలో రకాలు లేవు అని చెప్పుకొన్నాం కదా! అందుచేత అవి ఏరకానివో వాటిపైన రాయనవసరం లేదు.



# 3 రాగాలు

సంగీతం స్వరాలతో ఏర్పడిందని, స్వరాలంటే వివిధరకాల పౌనః పున్యాలున్న ధ్వనులని, ఒక స్థాయిలో ఇరవైరెండు శృతులు ఉంటాయని చెప్పుకొన్నాం. ఈ అధ్యాయంలో రాగాలు గురించి చెప్పుకొందాం.

## రాగం - అంటే ఏమిటి?

రాగం అంటే కొన్ని స్వరాల సమూహం. ఈ స్వరాల సమూహాన్ని పాడినప్పుడు మనకు వినడానికి ఎంతో హాయిగా ఉంటుంది. మనం ముందు చెప్పుకొన్న షోడశ స్వరస్థానాల లోంచి, రాగాలు వస్తాయి. ఎలాగంటే ఈ స్వరస్థానాలను వరుసగా పేర్చడం వల్ల రాగాలు ఏర్పడతాయి. వరుసగా పేర్చడమంటే ఏదో ఇష్టం వచ్చినట్లుగా పేర్చుకొంటూ పోడం కాదు. ఏ స్వరం తరువాత ఏ స్వరం పేర్చితే వినడానికి బాగుంటుందో అలా అమర్చాలి. ఇలా స్వరాల్ని అమర్చితే అది రాగం అవుతుంది.

మన భారతీయ సంగీతం, రాగ సంప్రదాయపద్ధతి అని మనం ముందే తెలుసుకొన్నాం గుర్తుందా? మన సంగీతంలో ఇలాంటి రాగాలు ఉండడం వల్లనే మన భారతీయ సంగీతాన్ని రాగసంప్రదాయ పద్ధతి అంటారు. పాశ్చాత్యసంగీతం, స్వరసంప్ర దాయ పద్ధతి అని కూడా మనం తెలుసుకొన్నాం. ఈ

స్వరసంప్రదాయ పద్ధతిలో రాగాలనేవి ఉండవు. పూర్వం ఈ రాగాలనే 'జాతులు' అని పిలిచారు.

మన కర్ణాటక సంగీతంలో ఎన్నో రాగాలు ఉన్నాయి. రాగాలు అనంతాలు అంటారు. అంటే రాగాల సంఖ్యకి - అంతం లేదని అర్థం.

స్వరస్థానాలను వరుసగా పేర్చితే రాగాలు వస్తాయని చెప్పుకొన్నాం కదా! ఎలా రాగాలు ఏర్పడతాయో కొన్ని ఉదాహరణలతో పరిశీలిద్దాం.

షోడశ స్వరస్థానాలలోంచి; షడ్జాన్ని శుద్ధరిషభాన్ని, అంతరగాంధారాన్ని, శుద్ధ మధ్యమం, పంచమం, శుద్ధదైవతం, కాకలి నిషాదం ఈ స్వరస్థానాల్ని తీసుకొని, వీటిని వరుసగా పాడినా, లేదా వాయించినా అది ఒక రాగం అవుతుంది. ఈ రాగం పేరు మాయామాళవగౌళ.

మాయామాళవ గౌళలో వచ్చే స్వరస్థానాలు

షడ్జం - శుద్ధరిషభం - అంతరగాంధారం

శుద్ధమధ్యమం - పంచమం - శుద్ధదైవతం - కాకలినిషాదం

ఇంకొక ఉదాహరణ చూద్దాం. పదహారు స్వరస్థానాల లోంచి, షడ్జం, చతుశ్శృతి రిషభం, సాధారణ గాంధారం, ప్రతి మధ్యమం, పంచమం, శుద్ధదైవతం, కైశికి నిషాదం తీసుకొంటే మరోరాగం ఏర్పడుతుంది. ఈ రాగాన్ని 'షణ్ముఖప్రియ' అంటారు. అంటే ఈ షణ్ముఖప్రియ రాగంలో వచ్చే స్వరస్థానాలు షడ్జం, చతుశ్శృతి రిషభం, ప్రతిమధ్యమం, పంచమం, శుద్ధదైవతం, కైశికి నిషాదం. అంటే ఈ స్వరస్థానాల్ని వరుసగా పాడినా వాయించినా

మన చెవికి ఇంపుగా ఉంటాయన్న మాట - ఈ విధంగా స్వరస్థానాల్ని వినడానికి ఇంపుగా ఉండేలా రకరకాలుగా అమర్చడం వల్ల రాగాలు ఏర్పడతాయి.

పాటలకి వెనుక స్వరాలుంటాయని మనం ముందు చెప్పుకొన్నాం. ప్రతిపాటకి వెనుక ఏదో ఒక రాగానికి సంబంధించిన స్వరస్థానాలు ఉంటాయి. పాట వెనుక ఏరాగానికి సంబంధించిన స్వరస్థానాలు ఉంటే ఆ పాట ఆ రాగంలో ఉందని అంటాం. ఉదాహరణకి మీరు 'ఎందరోమహానుభావులు' అన్న పాట ఎప్పుడైనా విన్నారా? దీన్ని 'త్యాగరాజు' అనే వాగ్గేయకారుడు రచించాడు. ఈ పాట శ్రీరాగంలో ఉంది. అంటే ఈ పాట వెనుక శ్రీరాగానికి సంబంధించిన స్వరస్థానాలు ఉన్నాయన్న మాట. అలాగే 'సామజ వరగమన' అన్నపాట మీ అందరికీ పరిచయమైనదే. ఇది 'హిందోళ' రాగంలోఉంది. అంటే ఈ పాట వెనుక 'హిందోళ' రాగానికి సంబంధించిన స్వరస్థానాలు ఉంటాయి. అన్నమయ్య రచించిన 'కొండలలో నెలకొన్న కోనేటి రాయడు వాడు 'అన్న పాట విన్నారా? ఇది కూడా హిందోళరాగంలోనే ఉంది. అన్నమయ్య రచించిన 'అదివో అల్లదివో శ్రీహరివాసము' అన్నపాట 'మధ్యమావతి' రాగంలో ఉంది. 'వాతాపి గణపతిం భజే' అన్న పాట విన్నారా? ఇది 'హంసధ్వని' అన్న రాగంలో ఉంది. ఇలా ప్రతిపాట వెనుక ఏదో రాగానికి సంబంధిన స్వరాలుంటాయి. అవి ఏరాగానికి సంబంధించిన స్వరాలయితే, ఆ రాగంలో ఆపాట ఉందని అంటాం.

# రాగాల మూర్ఛనలు

కొన్ని స్వరస్థానాలను చెవికి ఇంపుగా ఉండేవిధంగా పేర్చడం వల్ల రాగాలు ఏర్పడతాయని మనం ముందు చెప్పుకొన్నాం. అలాగే ఆరోహణ, అవరోహణ అంటే చెప్పుకొన్నాం. తక్కువ పౌనఃపున్యం ఉన్న స్వరాలనుంచి, ఎక్కువ పౌనః పున్యం ఉన్న స్వరాల వరకూ పాడడాన్ని ఆరోహణ అంటారని, ఎక్కువ పౌనః పున్యం ఉన్న స్వరాల నుంచి, తక్కువ పౌనఃపున్యం ఉన్నస్వరాలవరకూ పాడితే అది అవరోహణ అవుతుందని చెప్పుకొన్నాం. ఆరోహణని, అవరోహణనికలిపి మూర్ఛన అంటారని కూడా తెలుసుకొన్నాం.

రాగాలలో వచ్చే స్వరాలను ఆరోహణ క్రమంలోనూ, అవరోహణ క్రమంలోనూ రాస్తారు. ఇలా రాస్తే దానిని ఆరాగం యొక్క ఆరోహణ అని, అవరోహణ అని అంటారు. రాగం ఆరోహణ. అవరోహణలను కలిపి, రాగంయొక్క మూర్ఛన అంటారు. ఇలా రాగంలో స్వరాల్ని రాసేటప్పుడు అవి ఏరకం స్వరస్థానాలో కూడా వాటిపైన రాస్తారు.

ఉదాహరణకి మాయామాళవగౌళ మూర్ఛన చూద్దాం.

దీనిలో స, రి, గ, మ, ప, ద, ని, స్వరాలు ఏడూవస్తాయి.

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| | | శు | అం | శు | | శు | కా | . |
| ఆరోహణ: | స | రి | గ | మ | ప | ద | ని | స |

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| | . | కా | శు | | శు | అం | శు | |
| అవరోహణ: | స | ని | ద | ప | మ | గ | రి | స |

# రాగానికి ఎన్ని స్వరాల్ని ఉండాలి?

స్వరాల్ని పేర్చితే రాగాలు వస్తాయని మనం చెప్పుకొన్నాం. అయితే ఎన్ని స్వరాలను పేర్చితే రాగం అవుతుంది? రాగానికి కనీసం ఎన్నిస్వరాలు ఉండాలి? కనీసం ఐదు స్వరాలు లేకపోతే అది రాగం కాదని మన పూర్వీకులు చెప్పారు. అయితే రాగాల ఆరోహణ, అవరోహణలలో స్వరాల్ని లెక్కపెట్టేటప్పుడు కొన్ని విషయాలు గుర్తుంచుకోవాలి. ఉదాహరణకి ఒక రాగం ఆరోహణ: స రి గ మ ప ద ని స అవరోహణ: స ని ద ప మ గ రి స అనుకోండి. ఈ రాగానికి ఎన్నిస్వరాలు ఉన్నాయి? ఆరోహణలో ఎనిమిది, అవరోహణలో ఎనిమిది ఉన్నాయనుకొంటు న్నారా? కాదు కాదు. ఆరోహణలోను, అవరోహణలోనూ తారస్థాయి షడ్జం కూడా ఉంది. గమనించారా? ఈ తారస్థాయి షడ్జం వేరే కొత్తస్వరం కాదుకదా! అదికూడా షడ్జమే. ఎటొచ్చీ అది తారస్థాయిలో ఉంది. కనుక దాన్ని వేరే స్వరంగా లెక్కపెట్టరు. తారస్థాయి, మధ్యమస్థాయి షడ్జాలను కలిపి ఒకే స్వరంగా లెక్కిస్తారు. ఇప్పుడు ఈ రాగంలో ఎన్ని స్వరాలు ఉన్నాయో చెప్పండి? ఆరోహణలో ఏడు, అవరోహణలో ఏడు స్వరాలు ఉన్నాయి. కదా! రాగాల ఆరోహణ, అవరోహణల్ని రాసేటప్పుడు తారస్థాయి షడ్జాన్ని కూడా కలిపేరాస్తారు. అలాగే పాడతారు. వాయిస్తారు కూడా. కాని దానిని వేరే స్వరంగా లెక్కపెట్టరు.

'మోహన' అనే రాగం ఉంది. ఈ రాగం

ఆరోహణ: స రి గ ప ద స

అవరోహణ: స ద ప గ రి స

ఈ రాగం ఆరోహణలో ఎన్ని స్వరాలున్నాయి చెప్పండి? ఐదు కదా! అలాగే అవరోహణలోను కూడా ఐదు స్వరాలే ఉన్నాయి.

రాగాలు ఎన్నో ఉన్నాయని చెప్పుకొన్నాం. వీటిలో కొన్ని రాగాలు దేవుడికి మేలుకొలుపులు, సుప్రభాతాలు పాడడానికి బాగుంటాయి. సుప్రభాతాలు, మేలుకొలుపులు అంటే తెలుసా? దేవుడిని నిద్రలోంచి లేపేందుకు పాడేపాటలు. అలాగే కొన్ని రాగాలు వింటే మనకి ఎంతో ఉత్సాహం వస్తుంది. కొన్ని కొన్ని రాగాలు విషాదరాగాలు. ఎవరైనా పెద్దవాళ్ళు చనిపోతే రేడియోలోను, టి.విలోను విషాదరాగాల్ని వినిపిస్తుంటారు. మరికొన్ని రాగాలు జోల పాటలు పాడడానికి బాగుంటాయి. జోలపాట అంటే తెలుసుకదా! చిన్నపిల్లల్ని నిద్రపుచ్చడానికి పాడేపాటలు. కొన్ని రాగాలు పాడితే వర్షం కురుస్తుందని, కొన్ని రాగాలు పాడితే దీపం దానంతట అదే వెలుగుతుందని చెబుతారు.

## రాగాలు - రకాలు

రాగాల ఆరోహణ, అవరోహణని బట్టి వాటిని కొన్ని రకాలుగా చేశారు. ముఖ్యంగా రాగాలు రెండు రకాలు. అవి (1) జనకరాగాలు (2) జన్యరాగాలు

# జనకరాగాలు

ముందుగా జనకరాగాలగురించి చెప్పుకొందాం. జనకరాగాలనే 'మేళకర్త' రాగాలు అని కూడా అంటారు.

జనకరాగాలకి ముఖ్యంగా రెండు లక్షణాలు ఉండాలి. మొదటి లక్షణం ఏమిటంటే జనకరాగాల ఆరోహణ, అవరోహణలోను కూడా సప్తస్వరాలు ఉండాలి.

ఉదాహరణకి చూడండి మనం 'మాయామాళవగౌళ' రాగం, గురించి ముందు చెప్పుకొన్నాం. ఆ రాగం ఆరోహణ, అవరోహణలోను ఏడు స్వరాలు ఉన్నాయి. అందుచేత 'మాయా మాళవగౌళ' మేళకర్త రాగం అన్నమాట. 'మోహన' రాగం ఆరోహణ స రి గ ప ద స అవరోహణ స ద ప గ రి స దీనిలో ఉన్నవి ఐదేస్వరాలు. కనుక ఇది మేళకర్తరాగం కాదు. మరో ఉదాహరణ చూడండి. 'కాంభోజి' అనే రాగం ఉంది. ఈ రాగం ఆరోహణ, అవరోహణ చూడండి.

ఆరోహణ : స రి గ మ ప ద స

అవరోహణ : స ని ద ప మ గ రి స

ఆరోహణలో ఈ రాగానికి ఆరుస్వరాలే ఉన్నాయి. అవరోహణలో మాత్రం ఏడు స్వరాలు ఉన్నాయి. ఆరోహణలో ఏడు స్వరాలు లేవుకాబట్టి ఇదికూడా జనకరాగం కాదు.

జనకరాగాలకి ఉండవలసిన రెండోలక్షణం ఏమిటంటే ఆరోహణలోనూ, అవరోహణలోనూ సప్తస్వరాలు వరుసక్రమంలో

ఉండాలి. వరుసక్రమం అంటే ఏమిటో చూద్దాం. సప్తస్వరాలు ఏవి? స, రి, గ, మ, ప, ద, ని కదా! జనకరాగాలలో ఈ ఏడు స్వరాలు ఈ వరుసలోనే అంటే స, రి, గ, మ, ప, ద, ని అనే వరుసలోనే ఉండాలి. అలా కాకపోతే ఆరాగం జనకరాగం కాదు. ఉదాహరణకి ఈ ఆరోహణని గమనించండి.

ఆరోహణ : స రి గ మ ప మ దా ని స

ఇందులో సప్తస్వరాలు ఉన్నాయి కదా! కాని స, రి, గ, మ, ప, ద, ని అనే వరుసక్రమంలో లేవు. స, రి, గ, మ, ప, వరకూ క్రమంలో ఉండి, తరువాత 'మ' స్వరం వచ్చింది. ఆ తరువాత ద, ని స్వరాలు వచ్చాయి. ఇది మామూలుగా సప్తస్వరాల క్రమం కాదు. మామూలుగా సప్తస్వరాలు స, రి, గ, మ, ప, ద, ని అనే క్రమంలో రావాలి కదా!

జనకరాగాలలో సప్తస్వరాలు స, రి, గ, మ, ప, ద, ని అన్న క్రమంలోనే ఆరోహణ, అవరోహణలో కూడా వస్తాయి. సప్తస్వరాలు, ఆరోహణ, అవరోహణలో ఈ వరుసలోనే వస్తేనే ఆరాగాలు జనకరాగాలు అవుతాయి. ఈ వరుసలో లేకపోతే అవి జనకరాగాలు కావు.

ఇలాంటి జనకరాగాలు 72 ఉన్నాయి. వీటినే 72 మేళకర్తరాగాలు అని అంటారు. ఈ డబ్బైరెండు మేళకర్తరాగాలకి, ఒకొక్కదానికి ఒక నెంబరు ఇచ్చారు. ఉదాహరణకి 'కనకాంగి' అనేరాగం ఒకటవ మేళకర్తరాగం. దాని నెంబరు ఒకటి అన్నమాట. 'రత్నాంగి' అనే రాగం నెంబరు రెండు.

# జనకరాగాలు ఏర్పడే తీరు

మనం ముందు చెప్పుకొన్న షోడశ స్వరస్థానాలనుంచి ఏడేసి స్వరస్థానాల్ని తీసుకొని పేర్చడం వల్ల జనకరాగాలు ఏర్పడతాయి. ఇలా స్వరస్థానాల్ని పేర్చేటప్పుడు, ఏ స్వరస్థానం తరువాత, ఏ స్వరస్థానాన్ని పేర్చితే వినడానికి ఇంపుగా ఉంటుందో ఆ విధంగా స్వరస్థానాలను పేర్చాలి. ఇలా పేర్చేటప్పుడు షడ్జం, ఆతరువాత రిషభంలో ఒక రకం రిషభాన్ని; గాంధారంలో ఒకరకం గాంధారాన్ని మధ్యమంలో ఒక రకం మధ్యమాన్ని; పంచమాన్ని, దైవతంలో ఒక రకం దైవతాన్ని; నిషాదంలో ఒక రకం - నిషాదాన్ని తీసుకొంటారు. ఉదాహరణకి షోడశ స్వరస్థానాలలోంచి షడ్జం, శుద్ధరిషభం, శుద్ధగాంధారం, శుద్ధమధ్యమం, పంచమం, శుద్ధదైవతం, శుద్ధనిషాదం తీసుకొంటే అది ఒకటవ మేళకర్తరాగం - 'కనకాంగి' అవుతుంది. అలాగే షడ్జం, చతుశ్శృతి రిషభం, సాధారణ గాంధారము, ప్రతిమధ్యమం, పంచమం, శుద్ధదైవతం, కైశికినిషాదం ఈ స్వరస్థానాలతో ఏర్పడిన రాగం 'షణ్ముఖప్రియ' అనే 56వ మేళకర్త రాగం అవుతుంది.

ఇలా షోడశస్వరస్థానాల నుంచి 72 మేళకర్తరాగాలు ఏర్పడతాయి. ఈ 72 మేళకర్త రాగాల్లోను, ఆరేసి రాగాలను కలిపి ఒక 'చక్రం' అని అంటారు. అంటే 72 మేళకర్త రాగాల్ని, ఒకొక్కదానిలో 6 రాగాలు చొప్పున 12 చక్రాలలో ఉంచారు. 12 x 6 = 72

# 12 చక్రాలు

| | |
|---|---|
| 1. ఇందు | 7. ఋషి |
| 2. నేత్ర | 8. వసు |
| 3. అగ్ని | 9. బ్రహ్మ |
| 4. వేద | 10. దిశి |
| 5. బాణ | 11. రుద్ర |
| 6. ఋతు | 12. ఆదిత్య. |

'ఇందు' చక్రంలో 1వ మేళకర్త నుంచి 6వ మేళకర్త వరకు

'నేత్ర' చక్రంలో 7వ మేళకర్త నుంచి 12వ మేళకర్త వరకు

'అగ్ని' చక్రంలో 13వ మేళకర్త నుంచి 18వ మేళకర్త వరకు

'వేద' చక్రంలో 19వ మేళకర్త నుంచి 24వ మేళకర్త వరకు

'బాణ' చక్రంలో 25వ మేళకర్త నుంచి 30వ మేళకర్త వరకు

'ఋతు' చక్రంలో 31వ మేళకర్త నుంచి 36వ మేళకర్త వరకు

'ఋషి' చక్రంలో 37వ మేళకర్త నుంచి 42వ మేళకర్త వరకు

'వసు' చక్రంలో 43వ మేళకర్త నుంచి 48వ మేళకర్త వరకు

'బ్రహ్మ' చక్రంలో 49వ మేళకర్త నుండి 54వ మేళకర్త వరకు

'దిశి' చక్రంలో 55వ మేళకర్త నుంచి 60వ మేళకర్త వరకు

'రుద్ర' చక్రంలో 61వ మేళకర్త నుంచి 66వ మేళకర్త వరకు

'ఆదిత్య' చక్రంలో 67వ మేళకర్త నుంచి 72వ మేళకర్త వరకు

# జనకరాగాలలో రకాలు

జనక రాగాలు 72 అని చెప్పుకొన్నాం. ఈ జనకరాగాల్ని 2 రకాలుగా చెయ్యొచ్చు. 1వ మేళకర్త నుంచి 36 వరకు ఒక రకం. 37వ మేళకర్తనుంచి, 72వ మేళకర్తవరకు ఒకరకం. 1నుంచి 36 వ మేళకర్త వరకూ అన్ని రాగాలలోను వచ్చేమధ్యమం శుద్ధమధ్యమం అందుచేత 1 నుంచి 36 మేళకర్త వరకు ఉన్న రాగాల్ని శుద్ధమధ్యమరాగాలు అంటారు. 37 వ మేళకర్త నుంచి, 72వ మేళకర్త వరకు ఉన్న ఈ ముప్పై ఆరు మేళకర్తరాగాల్లోను ప్రతిమధ్యమం వస్తుంది. అందుచేత 37 నుంచి 72 వరకు ఉన్న రాగాల్ని ప్రతిమధ్యమరాగాలు అంటారు. అంటే 72 మేళకర్త రాగాలలోను 36 శుద్ధమధ్యమ రాగాలు, 36 ప్రతిమధ్యమ రాగాలు మొత్తం మేళకర్త రాగాలు 72.

ఒక శుద్ధమధ్యమ రాగాన్ని తీసుకొని దానిలో మధ్యమాన్ని మార్చి ప్రతిమధ్యమంతో పాడామనుకోండి అది ప్రతిమధ్యమ రాగం అయిపోతుంది. అలాగే ఒక ప్రతిమధ్యమ రాగం తీసుకొని, దానిలో శుద్ధమధ్యమం ఉంచి పాడితే, అది శుద్ధమధ్యమ రాగం అయిపోతుంది. అంటే శుద్ధమధ్యమ రాగాలు, ప్రతిమధ్యమ రాగాలస్వరాలలో రి, గ, ద, ని స్వరస్థానాలు ఒక్కటే. కేవలం మధ్యమం లోనే తేడా ఉందన్నమాట.

ఉదాహరణకి ఒకటవ మేళకర్త 'కనగాంగి' అని చెప్పుకొన్నాం కదా! దీని ఆరోహణ, అవరోహణచూద్దాం.

శు శు శు శు శు .
ఆ: స రి గ మ ప ద ని స

. శు శు శు శు శు
అ: స ని ద ప మ గ రి స

ఈ 'కనకాంగి' రాగంలో ఉన్న శుద్ధమధ్యమాన్ని మార్చి, ప్రతిమధ్యమం ఉంచితే, అది 37 వ మేళకర్త రాగం అయిన 'సాలగం' అవుతుంది.

37వ మేళకర్త సాలగం ఆరోహణ అవరోహణం చూడండి

శు శు ప్ర శు శు .
ఆ: స రి గ మ ప ద ని స

. శు శు ప్ర శు శు
అ: స ని ద ప మ గ రి స

కనకాంగి, సాలగం ఈ రెండు రాగాల ఆరోహణ, అవరోహణల్ని గమనించారా? రెండింటిలోను రి, గ, ద, ని స్వరస్థానాలు ఒక్కటే.. ఒక్క మధ్యమంలోనే తేడా ఉంది. అలాగే రెండోమేళకర్త 'రత్నాంగి' ఇది శుద్ధమధ్యమరాగం. దీనిలో శుద్ధ మధ్యమం బదులు ప్రతిమధ్యమం ఉంచి పాడితే అది 38 వ మేళకర్త 'జలార్ణవము' అనేరాగం అవుతుంది. అలాగే 3వ మేళకర్త 'గానమూర్తి' లో శుద్ధమధ్యమాన్ని మార్చి, ప్రతిమధ్యమం ఉంచి పాడితే అది 39వ మేళకర్త ఝాలవరాళి అవుతుంది. ఇదేవిధంగా 4వ మేళకర్తకి 40వ మేళకర్తకి ఒక్క మధ్యమంలోనే తేడా. రి, గ, ద, ని స్వరాలు ఒక్కటే. రి, గ, ద, ని స్వరాలు ఒకటిగా ఉండి; మధ్యమంలోనే తేడా ఉన్న రాగాల జంటల్ని క్రింద ఇచ్చానుచూడండి.

1కి — 37కి

2కి — 38కి

3కి — 39కి

4కి — 40కి

5కి — 41కి

6కి — 42కి

7కి — 43కి

8కి — 44కి

9కి — 45కి

10కి — 46కి

11కి — 47కి

12కి — 48కి

13కి — 49కి

14కి — 50కి

15కి — 51కి

16కి — 52కి

17కి — 53కి

18కి — 54కి

19కి — 55కి

20కి — 56కి

21కి — 57కి

22కి — 58కి

23కి — 59కి

24కి — 60కి

25కి — 61కి

26కి — 62కి

27కి — 63కి

28కి — 64కి

29కి — 65కి

30కి — 66కి

31కి — 67కి

32కి — 68కి

33కి — 69కి

34కి — 70కి

35కి — 71కి

36కి — 72కి

ఈ జంటలకి రి, గ, ద, ని స్వరాలు ఒకటే ఉంటాయి. ఒక్క మధ్యమ స్వరంలోనే తేడా ఉంటుంది. 72 మేళకర్తరాగాల్ని పట్టికలో ఇచ్చాను. ఆ పట్టిక చూస్తే ఈ విషయం మీకు బాగా అర్థం అవుతుంది.

# 72 మేళకర్తల పట్టిక

| చక్రములు | మేళకర్తల సంఖ్య | శుద్ధమధ్యమ రాగాలు | రి | గ | ద | ని | మేళకర్తల సంఖ్య | ప్రతిమధ్యమ రాగాలు | చక్రములు |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 ఇందు | 1 | కనకాంగి | శు | శు | శు | శు | 37 | సాలగం | 7 ఋషి |
| | 2 | రత్నాంగి | శు | శు | శు | కై | 38 | జలార్ణవం | |
| | 3 | గానమూర్తి | శు | శు | శు | కా | 39 | ఝాలవరాళి | |
| | 4 | వనస్పతి | శు | శు | చ | కై | 40 | నవనీతం | |
| | 5 | మానవతి | శు | శు | చ | కా | 41 | పావని | |
| | 6 | తానరూపి | శు | శు | ష | కా | 42 | రఘుప్రియ | |
| 2 నేత్ర | 7 | సేనాపతి | శు | సా | శు | శు | 43 | గవాంబోధి | 8 వసు |
| | 8 | హనుమతోడి | శు | సా | శు | కై | 44 | భవప్రియ | |
| | 9 | ధేనుక | శు | సా | శు | కా | 45 | శుభపంతువరాళి | |
| | 10 | నాటకప్రియ | శు | సా | చ | కై | 46 | షడ్విధమార్గిణి | |
| | 11 | కోకిల ప్రియ | శు | సా | చ | కా | 47 | సువర్ణాంగి | |
| | 12 | రూపవతి | శు | సా | ష | కా | 48 | దివ్యమణి | |
| 3 అగ్ని | 13 | గాయకప్రియ | శు | అం | శు | శు | 49 | ధవళాంబరి | 9 బ్రహ్మ |
| | 14 | వకుళాభరణం | శు | అం | శు | కై | 50 | నామనారాయణి | |
| | 15 | మాయామాళవగౌళ | శు | అం | శు | కా | 51 | కామవర్ధిని | |
| | 16 | చక్రవాకం | శు | అం | చ | కై | 52 | రామప్రియ | |
| | 17 | సూర్యకాంతం | శు | అం | చ | కా | 53 | గమనశ్రమ | |
| | 18 | హాటకాంబరి | శు | అం | ష | కా | 54 | విశ్వంభరి | |

| చక్రములు | మేళకర్తల సంఖ్య | శుద్ధమధ్యమ రాగాలు | రి | గ | ద | ని | మేళకర్తల సంఖ్య | ప్రతిమధ్యమ రాగాలు | చక్రములు |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 4 వేద | 19 | ఝుంకారధ్వని | చ | సా | శు | శు | 55 | శ్యామలాంగి | 10 దిశి |
| | 20 | నఠభైరవి | చ | సా | శు | కై | 56 | షణ్ముఖప్రియ | |
| | 21 | కీరవాణి | చ | సా | శు | కా | 57 | సిహేంద్ర మధ్యమము | |
| | 22 | ఖరహర ప్రియ | చ | సా | చ | కై | 58 | హేమవతి | |
| | 23 | గౌరీమనోహరి | చ | సా | చ | కా | 59 | ధర్మవతి | |
| | 24 | వరుణప్రియ | చ | సా | ష | కా | 60 | నీతిమతి | |
| 5 బాణ | 25 | మారరంజని | చ | అం | శు | శు | 61 | కాంతామణి | 11 రుద్ర |
| | 26 | చారుకేశి | చ | అం | శు | కై | 62 | రిషభప్రియ | |
| | 27 | సరసాంగి | చ | అం | శు | కా | 63 | లతాంగి | |
| | 28 | హరికాంభోజి | చ | అం | చ | కై | 64 | వాచస్పతి | |
| | 29 | ధీరశంకరాభరణం | చ | అం | చ | కా | 65 | మేచకల్యాణి | |
| | 30 | నాగానందిని | చ | అం | ష | కా | 66 | చిత్రాంబరి | |
| 6 ఋతు | 31 | యాగప్రియ | ష | అం | శు | శు | 67 | సుచరిత్ర | 12 ఆదిత్య |
| | 32 | రాగవర్ధిని | ష | అం | శు | కై | 68 | జ్యోతిస్వరూపిణి | |
| | 33 | గాంగేయ భూషిణి | ష | అం | శు | కా | 69 | ధాతువర్ధని | |
| | 34 | వాగధీశ్వరి | ష | అం | చ | కై | 70 | నాసికా భూషణి | |
| | 35 | శూలిని | ష | అం | చ | కా | 71 | కోసలము | |
| | 36 | చలనాట | ష | అం | ష | కా | 72 | రసికప్రియ | |

# జన్యరాగాలు

72 మేళకర్త రాగాల నుంచి అనేక రాగాలు పుడతాయి. ఇలా మేళకర్తల నుంచి పుట్టిన రాగాలనే జన్యరాగాలు అంటారు. ఒకొక్క మేళకర్తనుంచి ఎన్నో జన్యరాగాలు పుడతాయి. మేళకర్తలు రాగాలు పుట్టడానికి ఆధారం అవుతాయి. అందుచేత మేళకర్తరాగాలనే జనక రాగాలు అంటారు.

# జన్యరాగాలు పుట్టే విధానం

మేళకర్తల నుంచి జన్యరాగాలు ఎలాపుడతాయో మనం చెప్పుకొందాం. మేళకర్తల ఆరోహణ, అవరోహణల్లో సప్తస్వరాలు ఉంటాయని చెప్పుకొన్నాం కదా! ఈ మేళకర్తల నుంచి కొన్ని స్వరాల్ని తీసివేస్తే కొత్తరాగాలు వస్తాయి. ఉదాహరణకి మాయామాళవగౌళ అనే 15వ మేళకర్త రాగం ఉంది. ఈ రాగం ఆరోహణ, అవరోహణ చూద్దాం.

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| | | శు | అం | శు | | శు | కా | . |
| ఆరో : | స | రి | గ | మ | ప | ద | ని | స |
| | | కా | శు | | శు | అం | శు | |
| అవ : | స | ని | ద | ప | మ | గ | రి | స |

ఈ రాగంలోంచి కొత్తరాగం ఎలావస్తుందో చూద్దాం. దీని ఆరోహణలో ఉన్న గాంధారాన్ని, నిషాదాన్ని వదిలెయ్యాలి, అవరోహణలో నిషాదాన్ని మాత్రమే వదిలెయ్యాలి.

ఇప్పుడు వచ్చిన ఆరోహణ అవరోహణ చూద్దాం.

శు శు శు .
ఆ: స రి మ ప ద స

శు శు అం శు
అ: స ద ప మ గ రి స

ఇప్పుడు ఒక కొత్త ఆరోహణ, అవరోహణ వచ్చింది. అంటే కొత్తరాగం ఏర్పడింది. ఈ రాగం పేరు 'మలహరి' ఈ 'మలహరి' రాగంలో వచ్చే స్వరస్థానాల్ని, స్వరాలపైన రాశాను చూశారా? ఈ స్వరస్థానాలు 'మాయామాళవగౌళ' లో వచ్చే స్వరస్థానాలే. 'మలహరి' రాగం 'మాయామాళవగౌళ' లోంచి పుట్టిందని అంటారు.

ఈ విధంగా మేళకర్త రాగాలలోంచి కొన్ని స్వరాల్ని వదిలివేయడం వల్ల కొత్తరాగాలు వస్తాయి. ఇలా స్వరాలు వదిలివేయడాన్నే, వర్జించడం అని కూడా అంటారు. మేళకర్తల లోంచి, స్వరాలను వదిలివేయడం వల్ల అంటే వర్జించడం వల్ల కొత్తరాగాలు వస్తాయి. ఇలా వర్జించడం వల్ల వచ్చే జన్యరాగాల్ని 'వర్జ్యరాగాలు' అంటారు.

మేళకర్తల నుంచి కొత్తరాగాలు మరో విధంగా కూడా పుడతాయి. ఎలా అంటే - మేళకర్త రాగంలో ఉన్న స్వరస్థానాల్ని వరుసక్రమంలో వెళ్ళనివ్వకుండా ఆ వరుసని మార్చినా కూడా కొత్తరాగాలు పుడతాయి. వరుసక్రమం అంటే ముందు చెప్పుకొన్నాం గుర్తుందా? స, రి, గ, మ, ప, ద, ని అనే వరుసలోనే సప్తస్వరాలు రావాలి. అలా కాకుండా ఈ క్రమం తప్పితే దానినే వక్రగతి అంటాం. వక్రగతి అంటే సప్తస్వరాలు ముందువెనుకలుగా

రావడం. జనకరాగాల్లోని సప్తస్వరాల్ని ఇలా వక్రం చేసినా కూడా కొత్తరాగాలు వస్తాయి. ఇలా వచ్చిన రాగాలను వక్రరాగాలు అంటారు. వక్రరాగాలు ఎలావస్తాయో పరిశీలిద్దాం. హరికాంభోజి అని ఒక రాగం ఉంది. ఇది **28**వ మేళకర్త. ఈ రాగం ఆరోహణ, అవరోహణల్ని చూద్దాం.

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| | | చ | అం | శు | | చ | కై | . |
| ఆరో: | స | రి | గ | మ | ప | ద | ని | స |
| | . | కై | చ | | శు | అం | చ | |
| ఆవ: | స | ని | ద | ప | మ | గ | రి | స |

ఇప్పుడు ఈ రాగంలో వచ్చే సప్తస్వరాల్ని వక్రంచేద్దాం.

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | చ | అం | శు | | శు | చ | కై | . | |
| ఆరో: | స | రి | గ | మ | ప | మ | దా | ని | స | |
| | . | కై | చ | | శు | అం | శు | చ | అం | చ |
| ఆవ: | స | నీ | ద | ప | మ | గ | మ | కీ | గ | రి |

ఈ స్వరస్థానాలు హరికాంభోజిలో వచ్చేవే గమనించారా? కాని హరికాంభోజిలో స, రి, గ, మ, ప, ద, ని అనే క్రమంలో సప్తస్వరాలు ఉన్నాయి. ఈ కొత్త ఆరోహణ, అవరోహణల్లో సప్తస్వరాలు వక్రగతిలో ఉన్నాయి. ఇలా హరికాంభోజిలో స్వరాల్ని వక్రం చేయడం వల్ల ఓ కొత్తరాగం వచ్చిందన్నమాట. ఈ కొత్తరాగం పేరు 'శహన'. ఈ వక్రరాగంకి ఇంకోలక్షణం కూడా ఉంది. గమనించారా? ఆరోహణలోను, అవరోహణలోను కూడా సప్తస్వరాలు వక్రగతిలో ఉన్నాయి.

కొన్ని వక్రరాగాల్లో స్వరాలు, ఆరోహణలోనే వక్రగతిలో ఉంటాయి. మరికొన్నింటిలో అవరోహణలోనే వక్రగతిలో

ఉంటాయి. ఇంకొన్ని రాగాలలో, ఆరోహణలోను, అవరోహణ లోనూ కూడ స్వరాలు వక్రగతిలో ఉంటాయి.

## వర్జ్యరాగాలలో రకాలు

మేళకర్త రాగాలలోంచి కొన్ని స్వరాల్ని వదిలేస్తే వర్జ్యరాగాలు ఏర్పడతాయని మనం ముందే చెప్పుకొన్నాం. ఈ వర్జ్యరాగాలలో మళ్ళీరకాలున్నాయి. వాటిని గురించి చెప్పుకొందాం.

ప్రతిమేళకర్తలోనూ స్వరాలు ఏడు ఉంటాయికదా! ఈ ఏడు స్వరాలలోంచి ఒక్కస్వరాన్ని వదిలేస్తే ఇంక ఎన్ని స్వరాలు ఉంటాయి? ఆరుకదా! 'కాంభోజి' అనే రాగం ఆరోహణ, అవరోహణని చూడండి.

ఆరోహణ: స రి గ మ ప ద స

అవరోహణ: స ని ద ప మ గ రి స

ఈ రాగం ఆరోహణలో ఎన్నిస్వరాలున్నాయి. ఆరు కదా! ఆరోహణలో సప్తస్వరాలలోని నిషాదాన్నివదిలేశాం. అందుచేత ఆరోహణలో స్వరాలు ఆరే ఉన్నాయి. అవరోహణలోమాత్రం సప్తస్వరాలు అన్నీ ఉన్నాయి. చూశారా? ఆరు స్వరాలు ఉంటే దానిని 'షాడవ' అంటారు. షట్ అంటే ఆరు. ఏడుస్వరాలూ ఉండే దానిని సంపూర్ణం అంటారు. సంపూర్ణం అంటే పూర్తిగా స్వరాలు ఏడూ ఉన్నాయని అర్థం అన్నమాట. ఇప్పుడు 'కాంభోజి' రాగంలో ఆరోహణలో ఆరుస్వరాలు; అవరోహణలో ఏడు స్వరాలు ఉన్నాయి కనుక కాంభోజిని షాడవ సంపూర్ణ రాగం

అంటారు. ఇలా ఆరోహణల ఆరుస్వరాలు, అవరోహణలో ఏడు స్వరాలున్న ఏరాగాలనైనా 'షాడవ - సంపూర్ణ' రాగాలని పిలుస్తారు.

కొన్ని వర్జ్యరాగాలలో ఆరోహణలో సప్తస్వరాలు ఉంటాయి. అవరోహణలో మాత్రం ఆరుస్వరాలే ఉంటాయి. అంటే మనం ముందు చెప్పుకున్న 'షాడవ - సంపూర్ణ' రాగాలకి ఇవి సరిగ్గావ్యతిరేకం అన్నమాట. ఇలా ఆరోహణలో ఏడుస్వరా లుండి, అవరోహణలో ఆరుస్వరాలున్న రాగాలను 'సంపూర్ణ - షాడవరాగాలు' అంటారు. 17 వ మేళకర్త 'సూర్యకాంతం' అనేరాగం. దీనిలోంచి పుట్టిన రాగం 'భైరవం' ఈ భైరవం 'సంపూర్ణ - షాడవరాగం'. భైరవం ఆరోహణ - అవరోహణ చూడండి.

ఆరో : స రి గ మ ప ద ని స

అవరో: స ద ప మ గ రి స

చూశారా! ఆరోహణలో సప్తస్వరాలున్నాయి. అవరోహణలో మాత్రం నిషాదాన్ని వదిలేశాం. అందువల్ల అవరోహణలో ఆరుస్వరాలే ఉన్నాయి.

మరికొన్ని వర్జ్యరాగాలలో ఆరోహణ లో ఐదు స్వరాలుంటాయి. అవరోహణలో మాత్రం సప్తస్వరాలు అన్నీ ఉంటాయి. ఐదు స్వరాలుంటే దానిని ఔడవ అంటారు. ఏడుస్వరాలుంటే దానిని సంపూర్ణం అంటారని మీకు ముందే చెప్పాను. ఇలా ఆరోహణలో ఐదుస్వరాలు, అవరోహణలో ఏడుస్వరాలున్న రాగాలను, 'ఔడవ - సంపూర్ణ' రాగాలు అంటారు.

15వ మేళకర్త మాయా మాళవగౌళ అనేరాగం ఉంది. ఈ రాగంలోంచి 'సావేరి' అనే రాగం పుడుతుంది. ఈ సావేరి ఆరోహణ, అవరోహణని గమనించండి.

## సావేరి

ఆరో: స రి మ ప ద స

అవ: స ని ద ప మ గ రి స

చూశారా? ఆరోహణలో 5 స్వరాలు, అవరోహణలో ఏడుస్వరాలు ఉన్నాయి. కనుక ఇది 'ఔడవ - సంపూర్ణ' రాగం.

కొన్ని రాగాల ఆరోహణలో ఏడుస్వరాలు ఉంటాయి. అవరోహణలో ఐదు స్వరాలే ఉంటాయి. మరి ఇలాంటి రాగాలను ఏమంటారో మీరే చెప్పండి. వీటిని 'సంపూర్ణ - ఔడవరాగాలు' అంటారు. 20వ మేళకర్త 'నఠభైరవి'. ఈ 'నఠభైరవి' జన్యరాగం 'సారమతి' ఈ సారమతి 'సంపూర్ణ - ఔడవ రాగం. దీని ఆరోహణ, అవరోహణని చూడండి.

## సారమతి

ఆరో: స రి గ మ ప ద ని స

అవ: స ని ద స మ గ స

ఇంకోరకం వర్జ్యరాగాలను 'షాడవ - షాడవ రాగాలు అంటారు. అంటే వీటిలో స్వరాలు ఎన్ని ఉంటాయి? ఆరోహణలోనూ, అవరోహణలోనూ కూడా స్వరాలు ఆరే ఉంటాయి.

22వ మేళకర్త 'ఖరహరప్రియ' అనే రాగంలోంచి పుట్టిన 'శ్రీరంజని' అనే రాగం 'షాడవ - షాడవ' రకానికి చెందుతుంది. శ్రీరంజని ఆరోహణ, అవరోహణని చూద్దాం.

శ్రీరంజని

ఆరో: స రి గ మ ద ని స

అవ: స ని ద మ గ రి స

వర్జ్యరాగాలలో మరొకటి 'ఔడవ - షాడవ' రకం. 'ఔడవ - షాడవ' రకం రాగాలు అంటే మీకు అర్థం అయ్యిందనుకొంటాను. ఆరోహణలో ఐదు స్వరాలుంటాయి. అవరోహణలో ఆరుస్వరాలు ఉంటాయి. దీనికి ఉదాహరణ 'మాయామాళవగౌళ' అనే 15వ మేళకర్తనుంచి పుట్టిన 'మలహరి' రాగం. దీని ఆరోహణ, అవరోహణ గమనించండి.

ఆరో: స రి మ ప ద స

అవ: స ద ప మ గ రి స

'షాడవ - ఔడవ' అని వర్జ్యరాగాలలో మరో రకం ఉన్నాయి. ఆరోహణలో ఆరు స్వరాలు, అవరోహణలో ఐదు స్వరాలు ఉండే రాగాలన్నమాట. ఈ రకం రాగాలకి 28వ మేళకర్త హరి కాంభోజి జన్యరాగం అయిన 'బహుదారి' ఉదాహరణ. 'బహుదారి' ఆరోహణ, అవరోహణ పరిశీలించండి. ఈ విషయం మీకే తెలుస్తుంది.

ఆరో: స గ మ ప ద ని స

అవ: స ని ప మ గ స

ఇప్పుడు నేను 'మోహన' అనే రాగం ఆరోహణ,

అవరోహణ ఇస్తాను. దాన్ని బాగా గమనించండి. అది ఏరకానికి చెందిన వర్జ్యరాగమో మీరే చెప్పాలి.

మోహన

ఆరో: స రి గ ప ద స

అవ: స ద ప గ రి స

దీని ఆరోహణ, అవరోహణల్లో ఐదు స్వరాలు ఉన్నాయి. ఐదు స్వరాలుండే దాన్ని ఔడవం అంటారని ముందు చెప్పుకొన్నాం. ఆరోహణలోనూ, అవరోహణలోనూ ఐదు స్వరాలు ఉన్నాయి. కనుక ఇది 'ఔడవ - ఔడవ రాగం.

ఇలా వర్జ్యరాగాలలో ఎన్నో రకాలు ఉన్నాయి.

## వక్రరాగాలలో రకాలు

సప్తస్వరాలు స, రి, గ, మ, ప, ద, ని అనే వరుసలో లేకుండా ఉన్న రాగాల్ని వక్ర రాగాలంటారని ముందు చెప్పుకొన్నాం. ఈ వక్ర రాగాల్లో కూడా రకాలున్నాయి.

'శహన' అనే వక్ర రాగం ఉంది. దీని ఆరోహణలోను, అవరోహణలోను కూడా సప్తస్వరాలు వక్రగతిలో ఉన్నాయని ముందు చెప్పుకొన్నా కదా! ఇలా ఆరోహణలోను, అవరోహణ లోనూ సప్తస్వరాలు వక్రగతిలో ఉండే ఇలాంటి రాగాల్ని ఉభయ వక్రరాగాలు అంటారు.

మరికొన్ని వక్ర రాగాలలో ఆరోహణలోనే స్వరాలు వక్ర గతిలో ఉంటాయి. అవరోహణలో సప్తస్వరాలు మామూలు

క్రమంలోనే ఉంటాయి. దీనికి ఉదాహరణ 'ఆనందభైరవి' అనే రాగం. దీని ఆరోహణ, అవరోహణల్ని పరిశీలించండి.

## ఆనందభైరవి

ఆరో: స గ రి గ మ ప ద ప స

అవ: స ని ద ప మ గ రి స

చూశారా? ఆరోహణలోనే స్వరాలు వక్రగతిలో ఉన్నాయి. అవరోహణలో మాత్రం స్వరాలు మామూలు సప్తస్వరాల క్రమంలోనే ఉన్నాయి. ఇంకొన్ని వర్జ్యరాగాలలో అవరోహణలోనే స్వరాలు వక్రగతిలో ఉంటాయి. ఆరోహణలో మాత్రం సప్తస్వరాలు మామూలుగానే ఉంటాయి. ఇలాంటి రాగాలకి ఉదాహరణ 'శ్రీరాగం'. దీని ఆరోహణని పరిశీలిస్తే ఈ విషయం మీకు తెలుస్తుంది.

## శ్రీరాగం

ఆరో: స రి మ ప ని స

అవ: స ని ప మ రి గ రి స

ఇలా వక్రరాగాలలో 1) ఆరోహణలో వక్రంగా ఉండేవి; 2) అవరోహణలో వక్రంగా ఉండేవి; 3) ఆరోహణ, అవరోహణలో కూడా వక్రంగా ఉండేవి అని మూడు రకాలున్నాయి.

# ఉపాంగ రాగాలు-భాషాంగ రాగాలు

జన్యరాగాలు ఎలాఏర్పడతాయని చెప్పుకొన్నాం? జనకరాగాలు లేదా మేళకర్త రాగాలలోంచి కొన్నిస్వరాల్ని వదిలేసినా, లేదా స్వరాల్ని వక్రగతిలోకి మార్చినా జన్యరాగాలు పుడతాయని చెప్పుకొన్నాం. ఇలా మేళకర్తలనుంచి పుట్టిన జన్యరాగాలకి ఉండే స్వరస్థానాలు ఏమి ఉంటాయని చెప్పుకొన్నాం? ఆ రాగం ఏమేళకర్తనుంచి పుట్టిందో, ఆమేళకర్త స్వరస్థానాలే జన్యరాగానికి కూడా వస్తాయి అని చెప్పుకొన్నాంకదా!

అయితే కొన్ని జన్యరాగాలలో అవి ఏరాగం నుంచి పుట్టాయో, ఆరాగం స్వరస్థానాలే కాకుండా వేరే రకం స్వరస్థానాలు కూడా వస్తూంటాయి. ఉదాహరణకి - 'బిలహరి' అనే రాగం ఉంది. ఇది 'ధీర శంకరాభరణం' అనే రాగం జన్యం. అంటే ధీరశంకరాభరణం అనే మేళకర్త రాగంనుంచి పుట్టిందన్నమాట. ధీరశంకరాభరణంలో వచ్చే స్వరస్థానాలు షడ్జం, చతుశ్రుతి రిషభం, అంతర గాంధారం, శుద్ధమధ్యమం, చతుశ్రుతి దైవతం కాకలి నిషాదం. 'బిలహరి' రాగంలో కూడా, ధీర శంకరాభరణంలో వచ్చే రకం 'స్వరస్థానాలే వస్తాయి. అయితే 'బిలహరి'లో అప్పుడప్పుడు కైశికి నిషాదం కూడా వస్తుంది. మరి ఈ కైశికి నిషాదం, ధీరశంకరాభరణంలో వస్తోందా? లేదు కదా! ధీరశంకరాభణంలో కైశికి నిషాదం వస్తోంది. 'బిలహరి' జనకరాగం అయిన ధీరశంకరాభరణంలో లేని కాకలి నిషాదం కూడా బిలహరి రాగంలో వస్తుంది. ఈ విధంగా జనకరాగంలో లేని స్వరస్థానాలు, జన్యరాగం లో వస్తే అలావచ్చే

స్వరస్థానాల్నిని 'అన్యస్వరాలు' అంటారు. అంటే బిలహరిలో వచ్చే 'కైశికి నిషాదం' అన్యస్వరం అన్నమాట. ఈ విధంగా అన్యస్వరాలు కనుక రాగాలలో వస్తే, అలాంటి రాగాల్ని భాషాంగ రాగాలు అంటారు. 'బిలహరి' భాషాంగ రాగం అన్నమాట.

ఇలాగే 'కాంభోజి' అని మరోరాగం ఉంది. ఇది 'హరికాంభోజి' జన్యం. హరికాంభోజిలో వచ్చే స్వరస్థానాలు షడ్జం, చతుశ్శృతి రిషభం, అంతర గాంధారం, శుద్ధమధ్యమం, చతుశ్శృతి దైవతం, కైశికి నిషాదం వస్తాయి. కాంభోజి రాగంలో కూడా ఇవే రకం స్వరస్థానాలు వస్తాయి. కాని అప్పుడప్పుడు కాకలినిషాదం కూడా వస్తుంది. ఈ కాకలి నిషాదం హరికాంభోజి రాగంలో లేదుకదా। కాంభోజిలో వస్తోంది. అంటే ఇది కూడా అన్యస్వరం అన్నమాట. కాంభోజిలో కూడా అన్యస్వరం వస్తోంది కనుక ఇది కూడా భాషాంగ రాగమే.

'సారంగ', 'ఖమాస్' 'భైరవి' మొదలైన రాగాలు భాషాంగరాగాలు.

అన్యస్వరం రాకుండా, కేవలం ఆ జన్యరాగం, ఏ మేళకర్తనుంచి పుట్టిందో, ఆ మేళకర్త స్వరస్థానాలే వస్తే, అలాంటి రాగాల్ని ఉపాంగరాగాలు అంటాం. ఇలా అన్యస్వరానికి చోటు ఇవ్వని రాగాలే చాలా ఎక్కువ. 'మోహన' అనే రాగం ఉంది. ఇది హరికాంభోజి జన్యం. దీనిలో అన్నీ హరికాంభోజిలో వచ్చేస్వరస్థానాలే వస్తాయి. అన్యస్వరాలు రావు. కనుక ఇది ఉపాంగరాగం.

శ్రీరంజని, హిందోళ, హంసధ్వని, బహుదారి ఇలా ఉపాంగ

రాగాలు ఎన్నెన్నో ఉన్నాయి. పూర్వం జన్యరాగాలన్నీ ఉపాంగరాగాలుగానే ఉండేవి. అంటే వాటిలో అన్యస్వరాలు వచ్చేవికావు. రానురాను కొన్ని జన్యరాగాలలోకి అన్యస్వరాలని చేర్చితే అవి వినడానికి ఇంకా బాగున్నాయని సంగీత శాస్త్రవేత్తలు గమనించారు. అందువల్ల కొన్ని ఉపాంగరాగాలు భాషాంగ రాగాలుగా మారిపోయాయి. ఇలా జన్యరాగాలలో ఎన్నో రకాలు ఉన్నాయి.

## జనకరాగం నుంచి వచ్చే జన్యరాగాలు ఎన్ని ?

జనక రాగాల నుంచి, జన్యరాగాలు అనేకం పుడతాయని చెప్పుకొన్నాం కదా! ఒక జనకరాగం నుంచి ఎన్ని జన్యరాగాలు పుట్టవచ్చునో చూద్దాం.

| | |
|---|---|
| షాడవ సంపూర్ణ రాగాలు | **6** |
| సంపూర్ణ షాడవ రాగాలు | **6** |
| ఔడవ సంపూర్ణ రాగాలు | **15** |
| సంపూర్ణ ఔడవ రాగాలు | **15** |
| షాడవ షాడవ రాగాలు | **36** |
| ఔడవ షాడవ రాగాలు | **90** |
| షాడవ ఔడవ రాగాలు | **90** |
| ఔడవ ఔడవ | **225** |
| మొత్తం | **483** |

అంటే మొత్తం ఒక మేళకర్తనుంచి **483** రాగాలు పుట్టవచ్చు. ఇలా **72** మేళకర్తలనుంచి 72 x 483 = 34,847 అంటే ఒక మేళకర్త రాగం నుంచి **34,847** వర్జ్యరాగాలు పుట్టడానికి అవకాశం ఉంది. అయితే మేళకర్తలనుంచి ఏర్పడే వక్రరాగాలు మనం లెక్కించలేదు. ఒక మేళకర్తనుంచి వక్రరాగాలు ఎన్నెన్నో పుట్టవచ్చు. అలాగే ఒక మేళకర్తనుంచి భాషాంగరాగాలు కూడా ఎన్నో ఏర్పడడానికి వీలుంది. అందుచేతనే రాగాలు అనంతాలు అన్నారు.

ఒక్క విషయం మీరంతా గుర్తుంచుకోవాలి. రాగం అంటే కేవలం ఈ ఆరోహణ, అవరోహణేకాదు. ఆరోహణ, అవరోహణ అన్నది ఆ రాగానికి ఒక ఆధారం. వాగ్గేయ కారులు ఆ ఆధారంతో రాగానికి ఒక స్వరూపాన్ని ఇస్తారు. అంటే - ఆ రాగంలో ఉపయోగించాల్సిన గమకాలు ఏమిటి? ఏ ఏ స్వరాల్ని తరుచుగా పాడితే ఆ రాగం వినడానికి బాగుంటుంది? ఇలాంటి విషయాల్ని దృష్టిలో ఉంచుకొని, ఆరాగానికి ఒక పూర్తి ఆకారాన్ని తీర్చిదిద్దుతారు. ఆ రాగంలో పాటల్ని రచిస్తారు. అప్పుడే ఆ ఆరోహణ, అవరోహణ ఒక పరిపూర్ణమైన రాగం అనిపించు కొంటుంది. ఇంకోలా చెప్పాలంటే ఆరోహణ అవరోహణ అన్నది రాగం యొక్క అస్థిపంజరం లాంటిది అయితే, వాగ్గేయ కారులు ఆ అస్థిపంజరానికి రక్తమాంసాల్ని కూర్చి, పైన చర్మం తొడిగి దానికొక స్పష్టమైన ఆకారాన్ని ఇస్తారు.

# ఒక పాట ఏరాగంలో ఉందో ఎలా తెలుస్తుంది?

ప్రతీపాటవెనుక స్వరాలు ఉంటాయని, ఆ స్వరాలు ఏదో ఒక రాగానివి అయిఉంటాయని, ఆస్వరాలు ఏరాగానివో, ఆ పాట, ఆరాగంలో ఉందని అంటారని మనం ముందు తెలుసుకొన్నాం. జ్ఞాపకం ఉందా? అయితే ఒక పాట ఏరాగంలో ఉందో మనకు ఎలా తెలుస్తుంది? అని మీ అందరికీ సందేహం వచ్చి ఉండవచ్చు కదా! బాగా సంగీతం వచ్చిన వాళ్ళు పాటవిని, ఆ పాటవెనుక ఏ ఏ స్వరాలు వస్తున్నాయి. సప్తస్వరాలు అన్నీవస్తున్నాయా? లేదా ఆరు స్వరాలే వస్తున్నాయా? ఐదు వస్తున్నాయా? ఆరోహణలో ఎన్ని వస్తున్నాయి? అవరోహణలో ఎన్ని వస్తున్నాయి? ఏరకం స్వరస్థానాలు వస్తున్నాయి? రిషభం ఏరకంది? శుద్ధరిషభమా, చతుశ్రుతి రిషభమా? అలాగే గాంధారం ఏ రకంది? సాధారణ గాంధారమా? అంతరగాంధారమా? ఇలా అన్ని విషయాల్ని జాగ్రత్తగా పరిశీలించి, ఆ పాట ఏరాగంలో ఉందో చెబుతారు. చాలామంది శ్రోతలకు సంగీతం రాదు. వాళ్ళు పాటవెనుకనున్న స్వరస్థానాల్ని, స్వరాల్ని గుర్తుపట్టలేరు. కాని వాళ్ళు కూడా చాలా రాగాల్ని గుర్తుపట్టగలరు. ఎలా తెలుసా? రాగాల్ని చాలా సార్లు వింటూండడం వల్ల ఏదైనా ఒక పాట వినగానే ఆ పాట ఫలానారాగంలో ఉందని చెప్పేయగలరు. అయితే ఖచ్చితంగా రాగాల్ని గుర్తుపట్టాలంటే సంగీతం నేర్చుకొంటేనే గుర్తుపట్టగలరు.

# రాగాలు - వాటి లక్షణాలు

రాగాలకి కొన్ని లక్షణాలుంటాయి. ఆ రాగంలో ఏఏస్వరాలకి గమకాలు ఇవ్వాలి? ఎలాంటి గమకాలిస్తే ఆరాగం బాగుంటుంది? ఆరాగంలో పాటల్ని ఏస్వరంతో ప్రారంభించాలి? ఆరాగంలో ఎన్ని స్వరాలు వస్తాయి? అవి ఏరకానికి చెందిన స్వరస్థానాలు? ఆ రాగంలో అన్యస్వరాలు వస్తాయా? ఏ ఏ అన్యస్వరాలు వస్తాయి? ఆ రాగంలో ఏ ఏ స్వరాల్ని మాటిమాటికి పాడితే ఆరాగంవినడానికి బాగుంటుంది? ఇలాంటి వాటినే ఆ రాగంయొక్క లక్షణాలు అంటాం.

మనం ఇప్పుడు అనంతంగా ఉన్న రాగాలలోంచి కొన్ని రాగాల లక్షణాల్ని గురించి, ఆ రాగంలో వాగ్గేయకారులు రాసిన కీర్తనల్ని, సినిమా పాటలు ఏమేమి ఆ రాగంలో ఉన్నాయి మొదలైన విశేషాల్ని మనం తెలుసుకొందాం.

## 1. మాయా మాళవగౌళ

మనం ముందు 'మాయామాళవగౌళ' రాగం గురించి చెప్పుకొందాం. సంగీతం నేర్చుకొనే విద్యార్థులకి మొదటి పాఠం ఈ రాగంతోనే చెబుతారు. అందుకనే ఈ రాగాన్ని 'ఆదిరాగం' అంటారు. 'ఆది' అండే మొదలన్నమాట. సంగీత పాఠం ఈ రాగంలో మొదలు అవుతుంది. కనుక దీనిని ఆదిరాగం అంటారు. ఇది 15 వ మేళకర్తరాగం. దీని ఆరోహణ, అవరోహణ చూద్దాం.

| | శు | అం | శు | | శు | కా | . |
|---|---|---|---|---|---|---|---|
| ఆరో: స | రి | గ | మ | ప | ద | ని | స |

| | . | కా | శు | | శు | అం | శు |
|---|---|---|---|---|---|---|---|
| ఆవ: | స | ని | ద | ప | మ | గ | రి | స |

ఈ రాగంలో షడ్జం, శుద్ధరిషభం, అంతరగాంధారం, శుద్ధమధ్యమం, పంచమం, శుద్ధధైవతం, కాకలినిషాదం వస్తాయి.

ఈ రాగం భక్తి, శాంత, కరుణ రసప్రధానమైనది.

ఈ రాగంలో త్యాగరాజు ''తులసీదళములచే సంతోషముగా పూజింతు'' అనే కీర్తన 'విదులకు మ్రొక్కెద' అన్న కీర్తన రాశారు. ఈ రాగంలో 'మాయాతీత స్వరూపిణి' అన్న కీర్తన బాగా ప్రచారంలో ఉంది. దీనిని పొన్నయ్యాపిళ్ళై అనే వాగ్గేయకారుడు రచించాడు.

సినిమాల్లో ఈ రాగంలో ఉన్న పాటలు కొన్ని చెప్పుకొందాం. త్యాగరాజురాసిన 'తులసీదళములచే' అన్న కీర్తన రుద్రవీణ సినిమాలోఉంది. 'లవకుశ' సినిమాలో 'ఏనిమిషానికి ఏమి జరుగునో' అన్న పాట కూడా ఈ రాగంలోదే.

హిందుస్థానీ సంగీతంలో 'మాయామాళవగౌళ' రాగం లాంటి రాగం ఉంది. ఆ రాగాన్ని భైరవ్ లేదా భైరవ్ థాట్ అంటారు.

## 2. కల్యాణి

కల్యాణి రాగం 65వ మేళకర్త. దీన్నే 'మేచకల్యాణి' అంటారు. అయితే 'కల్యాణి' అన్న పేరే బాగా ప్రచారంలో ఉంది. కల్యాణి రాగం చాలా ప్రచారంలో ఉన్నరాగం. మంచి

శుభప్రదమైన రాగం. ఈ రాగం ఆరోహణ, అవరోహణని చెప్పుకొందాం.

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| | | చ. | అం. | ప్ర | | చ. | కా. | . |
| ఆరో: | స | రి | గ | మ | ప | ద | ని | స |
| | . | కా | చ. | | ప్ర. | అం. | చ. | |
| అవ: | స | ని | ద | ప | మ | గ | రి | స |

షడ్జం, చతుశ్శృతిరిషభం, అంతరగాంధారం, ప్రతిమధ్యమం, పంచమం, చతుశ్శృతి దైవతం, కాకలి నిషాదం ఈ రాగంలో వచ్చే స్వరాలు. ఈ రాగంలోని అన్ని స్వరాలకి గమకాలు ఇచ్చి పాడితే ఈ రాగం చాలా బాగుంటుంది. కల్యాణి రాగానికి చాలా జన్యరాగాలున్నాయి.

చాలా మంది వాగ్గేయకారులు ఈ రాగంలో రచనలు చేశారు. త్యాగయ్య రాసిన 'నిధిచాల సుఖమా' అన్న కీర్తన, 'వాసుదేవయని వెడలిన' అన్న కీర్తన ఈ రాగంలో చాలా ప్రచారంలో ఉన్నాయి. ముత్తుస్వామి దీక్షితార్ అనే వాగ్గేయ కారుడు, ఈ రాగంలో 'కమలాంబాంభజరే' అనే కీర్తన, 'భజరే చిత్త బాలాంబికాం' అన్న కీర్తన రాశారు. సినిమాల్లో, ఈ రాగంలో ఉన్న పాటలు ఎన్నో ఉన్నాయి. 'నర్తన శాల' చిత్రంలో 'సలలితరాగ సుధారస సారం' అనే పాట, 'శ్రీమద్విరాట పర్వం సినిమాలో పాడనా వాణి కల్యాణిగా' అన్న పాట కల్యాణి రాగంలోవే.

## 3. శంకరాభరణం

ఈ రాగంపేరు చదవగానే మీకు శ్రీ కె.విశ్వనాథ్ తీసిన 'శంకరాభరణం' సినిమా గుర్తు వచ్చి ఉండాలి. 'శంకరాభరణం' **29**వ మేళకర్త రాగం. దీనినే 'ధీర శంకరాభరణం' అని కూడా పిలుస్తారు. చాలా ప్రచారంలో ఉన్న రాగం. ఈ రాగానికి చాలా జన్యరాగాలు ఉన్నాయి. అంటే ఈ రాగం నుంచి ఎన్నో రాగాలు పుట్టాయన్నమాట. దీనిలో వచ్చే స్వరాలు, స్వరస్థానాల్ని చూద్దాం.

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| | | చ | అం | శు | | చ | కా | . |
| ఆరో: | స | రి | గ | మ | ప | ద | ని | స |
| | . | కా | చ. | | శు. | అం. | చ. | |
| ఆవ: | స | ని | ద | ప | మ | గ | రి | స |

షడ్జం, చతుశ్శృతి రిషభం, అంతరగాంధారం, శుద్ధమధ్యమం, పంచమం, చతుశ్శృతి దైవతం, కాకలి నిషాదం ఈ రాగంలో వచ్చే స్వరాలు.

మీకు ఒక విషయం చెప్పాను గుర్తుందా? **29**వ మేళకర్తకి, **65** మేళకర్తకి రి,గ,ద,ని స్వరస్థానాలు ఒకటేనని, ఒక్క మధ్యమంలోనే తేడా ఉంటుందని. **29** మేళకర్త శంకరాభరణానికి, **65** మేళకర్త కల్యాణికి ఒక్క మధ్యమంలోనే తేడా. కళ్యాణిలో ప్రతిమధ్యమం, శంకరాభరణంలో శుద్ధ మధ్యమం వస్తాయి.

శంకరాభరణంలో చాలా కీర్తనలు ఉన్నాయి. త్యాగయ్య 'ఎందుకు పెద్దలవలె బుద్ధినీయవు' 'స్వరరాగసుధ', 'మనసు

స్వాధీనమైన' లాంటి కీర్తనలు రచించాడు. ముత్తుస్వామి దీక్షితార్ 'అక్షయలింగవిభో' అనే కీర్తన, శ్యామశాస్త్రి ఈ రాగంలో 'సరోజదళనేత్రి' అనే కీర్తన ఈ రాగంలో రచించాడు.

'శంకరాభరణం' సినిమాలో 'ఓంకార నాదానుసంధానమౌ గానమే' అన్న పాట ఈ రాగంలోదే. అలాగే ఇటీవల బాగా ప్రచారం పొందిన 'చిన్ని చిన్ని ఆశ' (రోజా సినిమా) పాట కూడా ఈ శంకరాభరణ రాగంలోదే.

హిందుస్థానీ సంగీతంలో ఈ రాగాన్ని 'బిలావల్' అంటారు.

## 4. ఖరహరప్రియ

22వ మేళకర్త ఈ 'ఖరహరప్రియ'. ఇది చాలా ప్రాచీన రాగం. దీని ఆరోహణ, అవరోహణని చూద్దాం.

| | | చ. | సా. | శు. | | చ. | కై | . |
|---|---|---|---|---|---|---|---|---|
| ఆరో: | స | రి | గ | మ | ప | ద | ని | స |

| | . | కై | చ. | | శు. | సా. | చ. | |
|---|---|---|---|---|---|---|---|---|
| అవ: | స | ని | ద | ప | మ | గ | రి | స |

దీనిలో వచ్చే స్వరస్థానాలు, షడ్జం, చతుశ్రృతి రిషభం, సాధారణ గాంధారం, శుద్ధమధ్యమం, పంచమం, చతుశ్రృతి దైవతం, కైశికి నిషాదం. పూర్వం ఈ రాగాన్ని 'హరప్రియ' అనేవారు. త్యాగరాజ స్వామి అనే వాగ్గేయకారుడు ఈ రాగాన్ని బాగా ప్రచారంలోకి తెచ్చాడు. 'చక్కని రాజమార్గములుండగ', 'ప్రక్కల నిలబడి', 'రామ నీ సమానమెవరు' ఇలా చాలా కృతుల్ని త్యాగరాజు ఈ రాగంలో రచించాడు.

'వరుడు కావాలి' సినిమాలో శ్రీమతి భానుమతి 'ప్రక్కల నిలబడి, కీర్తనను పాడి, బాగా ప్రచారంలోకి తెచ్చారు. 'సంగీతలక్ష్మి' సినిమాలో 'పాటకు పల్లవి ప్రాణం' అనే పాట, 'మిస్సమ్మ' సినిమాలో 'బాలనురా మదనా' అనేపాట ఈ రాగంలోవే. 'స్వాతి కిరణం' సినిమాలో 'సంగీత సాహిత్య సమలంకృతే' అనేపాట కూడా ఖరహరప్రియ రాగంలోదే. అన్నమయ్య రచించిన 'ఒకపరికొకపరి' అన్న కీర్తనని శ్రీ నేదునూరి కృష్ణమూర్తి ఖరహరప్రియ రాగంలోనే స్వరపరచారు. ఈ కీర్తన చాలా ప్రచారంలో ఉంది.

హిందుస్థానీ సంగీతంలో 'ఖరహరప్రియ' రాగాన్నే 'కాఫి' అంటారు. చాలా దేశాల సంగీతాలలో ఈ ఖరహరప్రియ లాంటి రాగాలు ఉన్నాయి.

## 5. కాంభోజి

కాంభోజి జన్యరాగం. ఇది 28వ మేళకర్త హరికాంభోజి నుంచి పుట్టింది. ఇది 'షాడవ - సంపూర్ణ' రాగం. అంటే ఆరోహణలో ఆరుస్వరాలు, అవరోహణలో ఏడు స్వరాలు ఉంటాయన్నమాట. ఆరోహణలో నిషాదం ఉండదు. దీని ఆరోహణ, అవరోహణ చూద్దాం.

| | | చ. | అం. | శు. | | చ | . |
|---|---|---|---|---|---|---|---|
| ఆరో : | స | రి | గ | మ | ప | ద | స |

| | | కై. | చ. | | శు. | అం. | చ. | |
|---|---|---|---|---|---|---|---|---|
| అవ : | స | ని | ద | ప | మ | గ | రి | స |

షడ్జం, చతుశృతి రిషభం, అంతరగాంధారం, శుద్ధమధ్యమం,

పంచమం, చతుశ్శృతి దైవతం వస్తాయి. అవరోహణలో కైశిక నిషాదం వస్తుంది.

కాంభోజి 'భాషాంగరాగం' అని ముందే చెప్పుకొన్నాం. అంటే దీనిలో అన్యస్వరం వస్తుంది. దీనిలో వచ్చే అన్యస్వరం 'కాకలి నిషాదం'. త్యాగయ్య ఈ రాగంలో 'మా జానకి చెట్టబట్టగా' అనే కీర్తన, 'ఓరంగశాయి' అనే కీర్తన రాశారు. దీక్షితార్ 'శ్రీ సుబ్రహ్మణ్యాయ' అన్న కీర్తన ఈ రాగంలో రచించారు. 'సీతాకల్యాణం' సినిమాలో 'త్యాగయ్య రాసిన 'మా జానకి చెట్టబట్టగ' కీర్తనని ఉపయోగించారు. 'మహాకవి కాళిదాసు' సినిమాలో 'రసికరాజ మణిరాజిత సభలో' అనే పాట ఈ రాగంలోదే. హిందుస్థానీ సంగీతంలో ఈ 'కాంభోజి' రాగాన్ని 'ఝింఝోటి' అంటారు. శంకరాభరణం సినిమాలో 'రాగం-తానం-పల్లవి' అన్నపాటలో 'కైలాస శిఖరాన కాంభోజి రాగాన' అన్న చరణం కాంభోజి రాగంలోనే ఉంది.

## 6. చారుకేశి

వినడానికి చాలా హాయిగా ఉండే రాగం ఈ చారుకేశి. ఇది 26వ మేళకర్త. దీని ఆరోహణ

| | | చ. | అం. | శు. | | శు. | కై. | |
|---|---|---|---|---|---|---|---|---|
| ఆరో: | స | రి | గ | మ | ప | ద | ని | స |
| | | కై. | శు. | | శు. | అం. | చ. | |
| అవ: | స | ని | ద | ప | మ | గ | రి | స |

ఈ రాగంలో చతుశ్శృతి రిషభం, అంతర గాంధారం, శుద్ధమధ్యమం, శుద్ధ దైవతం, కైశిక నిషాదం వస్తాయి. షడ్జం, పంచమం ఎలాగూ వస్తాయి.

చారుకేశి లాంటి రాగం హిందుస్థానీ సంగీతంలో లేదు. మన కర్ణాటక సంగీతంలోంచి ఈ రాగాన్ని వాళ్ళు తీసుకొన్నారు.

త్యాగయ్య 'ఆడమోడిగలదా' అన్న కీర్తన ఈ రాగంలో రాశారు. స్వాతి తిరునాళ్ అనే వాగ్గేయకారుడు 'కృపయా పాలయ' అనే కీర్తనను రాశారు.

'వంశవృక్షం' అనే సినిమాలో 'వంశీకృష్ణ' అన్నపాట ఈ రాగంలోదే.

## 7. ఆనందభైరవి

ఆనందభైరవి రాగం వినడానికి ఎంతో బాగుంటుంది. చిన్నపిల్లల్ని నిద్రపుచ్చుతూ పాడేలాలి పాటలు, పెళ్ళిళ్ళలో పాడే పెళ్ళిపాటలు ఈ రాగంలోనే సాధారణంగా ఉంటాయి. 20వ మేళకర్త 'నఠభైరవి' లోంచి పుట్టిన రాగం, ఈ ఆనందభైరవి.

| | | సా | చ | సా | శు | | చ | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| ఆరో: | స | గ | రి | గ | మ | ప | ద | ప | స |

| | | కై. | చ. | | శు | సా | చ | |
|---|---|---|---|---|---|---|---|---|
| అవ: | స | ని | ద | ప | మ | గ | రి | స |

దీనిలో షడ్జం, పంచమాలతో పాటు చతుశ్శృతి రిషభం, సాధారణ గాంధారం, శుద్ధమధ్యమం చతుశ్శృతి దైవతం, కైశికి నిషాదం వస్తాయి. ఆరోహణలో సప్తస్వరాలు వక్రగతిలో ఉన్నాయి

గమనించారా? కనుక ఇది వక్రరాగం. అలాగే ఇది భాషాంగ రాగం కూడాను. అంటే అన్యస్వరాలు వస్తాయన్నమాట. నఠభైరవి రాగంలోలేని శుద్ధధైవతం, అంతరగాంధారం, కాకలి నిషాదం కూడా వస్తాయి.

'శ్యామశాస్త్రి' అనే వాగ్గేయకారుడికి ఈ రాగం అంటే చాలా ఇష్టం. ఈ రాగంలో ఆయన చాలాకీర్తనలు రాశారు. 'ఓ జగదంబ', 'మరివేరెగతి ఎవ్వరమ్మ' కీర్తనలు రాశారు. దీక్షితార్ అనే వాగ్గేయ కారులు ఈ రాగంలో 'త్యాగరాజ యోగవైభవం' అన్న కీర్తన రాశారు. మీరంతా 'పలుకే బంగారమాయనా కోదండపాణి' అన్న కీర్తన వినే ఉంటారు. ఇది ఆనందభైరవి రాగంలో ఉంది. దీన్ని రచించినది రామదాను.

సినిమాల్లో ఈ రాగంలో ఉన్న పాటలు చాలా ఉన్నాయి. 'జమిందారు' సినిమాలో 'కస్తూరి రంగరంగా' అన్నపాట, 'అందాలరాముడు' చిత్రంలో 'పలుకే బంగారమాయనా' అన్నపాట, 'ఆనందభైరవి' సినిమాలో 'విరిసిన మురళికి పిలిచిన రవళికి' అన్నపాట ఈ ఆనందభైరవి రాగంలోవే.

## 8. బిలహరి

మన కర్ణాటక సంగీతంలో చాలా ప్రచారంలో ఉన్న రాగం ఈ బిలహరి. ఈ రాగంలో పద్యాలు, శ్లోకాలు పాడినా బాగుంటాయి. ఈ రాగం 29వ మేళకర్త. ధీరశంకరాభరణ జన్యం. ఇది ఔడవ - సంపూర్ణ రాగం. అంటే ఆరోహణలో ఐదు స్వరాలు, అవరోహణలో ఏడు వస్తాయి.

| | | చ. | అం. | | చ. | . | | |
|---|---|---|---|---|---|---|---|---|
| ఆరో: | స | రి | గ | ప | ద | స | | |
| | . | కా. | చ. | | శు. | అం. | చ. | |
| ఆవ: | స | ని | ద | ప | మ | గ | రి | స |

షడ్జం, పంచమాలు కాకుండా ఈ రాగంలో చతుశ్శృతి రిషభం, అంతర గాంధారం, శుద్ధమధ్యమం, చతుశ్శృతి దైవతం, కాకలి నిషాదం వస్తాయి. బిలహరి భాషాంగ రాగం. దీనిలో కైశికి నిషాదం కూడా అప్పుడప్పుడు అన్యస్వరంగా వస్తుంది. ఈ రాగంలో త్యాగయ్య రచించిన 'దొరుకునా ఇటువంటి సేవ', 'కనుగొంటిని శ్రీరాముని' కీర్తనలు బాగా ప్రచారంలో ఉన్నాయి. పట్నం సుబ్రహ్మణ్యయ్యర్ ఈ రాగంలో 'పరిదానమిచ్చితే పాలింతువేమో' అన్న కీర్తన రాశారు. ఇది కూడా చాలా ప్రచారంలో ఉంది.

బిలహరి రాగం చనిపోయిన వాళ్ళను బ్రతికిస్తుందంటారు. త్యాగయ్య 'నాజీవధార' అనే కీర్తన ఈ రాగంలో రాసి, పాడితే చనిపోయిన ఓ వ్యక్తి తిరిగి బ్రతికాడు. 'బాపు' తీసిన 'త్యాగయ్య' సినిమా చూశారా? అందులో 'కనుగొంటిని శ్రీరాముని', 'నా జీవధార' ఈ రెండు కీర్తనల్ని ఉపయోగించారు. 'ఈనాటి ఈ బంధమేనాటిదో' అనే సినిమాలో 'ఎవరునేర్పేరమ్మ ఈ కొమ్మకు' అన్నపాట, 'రుద్రవీణ' సినిమాలో 'నీతోనె ఆగేనా సంగీతము బిలహరి' అనే పాట ఈ బిలహరి రాగంలోవే.

## 9. మోహన

బిలహరి రాగానికి దగ్గరగా ఉండేరాగం మోహన. ఇది కూడా బాగా ప్రచారంలో ఉన్నరాగం. 28వ మేళకర్త 'హరికాంభోజి' నుంచి పుట్టింది ఈ రాగం. ఇది ఔడవ రాగం. అంటే జ్ఞాపకం ఉందికదా! ఆరోహణలోనూ, అవరోహణలోను కూడా ఐదు స్వరాలు ఉంటాయి.

|  |  | చ | అం |  | చ. | . |  |
|---|---|---|---|---|---|---|---|
| ఆరో: | స | రి | గ | ప | ద | స |  |
|  | . | చ |  |  | అం | అం. |  |
| అవ: | స | ద | ప | ప | గ | రి | స |

షడ్జం, చతుశ్శృతి రిషభం, అంతరగాంధారం, పంచమం, చతుశ్శృతి దైవతం వస్తాయి. హిందుస్థానీ సంగీతంలో ఈ మోహన రాగాన్ని 'భూప్' అంటారు. ఇది చాలా ప్రాచీన రాగం. అన్ని జాతుల సంగీతాలలోనూ మోహన రాగం కనిపిస్తుంది.

త్యాగయ్య ఈ రాగంలో 'భవనుత నా హృదయమున రమింపుము', 'ననుపాలింప నడచివచ్చితివో' 'ఎవరురా నిన్ను వినా గతిమాకు' లాంటి ఎన్నో కీర్తనలు రాశాడు. 'పాహిమాం పార్వతీ' అన్న కీర్తనను ఈ రాగంలో 'ముత్తుస్వామి దీక్షితార్' రచించారు. సినిమాల్లో ఈ రాగాన్ని ఎక్కువగా వాడతారు. 'నను పాలింపగ నడచి వచ్చితివా' (బుద్ధిమంతుడు) 'ఘనాఘన సుందరా కరుణా రసమందిరా' (భక్తతుకారాం) పాటలు ఈ రాగంలోవే.

## 10. షణ్ముఖప్రియ

సంగీత కచేరీని, సాధారణంగా వినాయకుడిపైన రచించిన కీర్తనతో మొదలు పెడతారు. 'సిద్ధివినాయకం అనిశం' అనే వినాయక ప్రార్థనతో కచేరీని తరుచు విద్వాంసులు మొదలు పెడుతూ ఉంటారు. ఈ కీర్తనని ముత్తుస్వామి దీక్షితార్ రచించారు. ఇది షణ్ముఖప్రియ రాగంలో ఉంది.

షణ్ముఖప్రియ **56**వ మేళకర్త రాగం.

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| | | చ | సా | ప్ర | | శు | కై | |
| ఆరో: | స | రి | గ | మ | ప | ద | ని | స |

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| | . | కై | శు | | ప్ర | సా | చ | |
| అవ: | స | ని | ద | ప | మ | గ | రి | స |

దీనిలో వచ్చేస్వర స్థానాలు షడ్జం, చతుశ్శృతి రిషభం, సాధారణ గాంధారం, ప్రతిమధ్యమం, పంచమం, శుద్ధదైవతం, కైశికి నిషాదం.

త్యాగయ్య ఈ రాగంలో ఎక్కువ కీర్తనలు రచించినట్టు కనబడదు. 'వద్దనే వారు' అనే ఒక కీర్తన రచించారు. ఈ రాగంలో బాగా ప్రచారంలో ఉన్న కీర్తన 'మరివేరె దిక్కెవరయ్యా రామ' అన్నది. దీనిని పట్నం సుబ్రహ్మణ్యయ్యార్ అనే వాగ్గేయకారుడు రచించాడు.

'పాండురంగ మహాత్యం'లో 'ఏ పాదము' అన్నపాట, 'రహస్యం' సినిమాలో 'నాజన్మంబు ధన్యమయ్యెను' పద్యాలు ఈరాగంలోవే.

## 11. అఠాణా

అఠాణా 29వ మేళకర్త. ధీరశంకరాభరణం జన్యం. ఈ రాగంలో కీర్తనలే కాకుండా పద్యాలు, శ్లోకాలు పాడినా బాగుంటాయి. దీని ఆరోహణ అవరోహణల్ని చాలా రకాలుగా చెబుతారు.

1) ఆరో: స రి మ ప ని స   అవ: స ని దా ప మ గా రి స

2) ఆరో: స రి మ ప ద ని స   అవ: స ని ద ప మ గ రి స

3) ఆరో: స రి మ ప ని ప స ని స   అవ: స ని ద ప మ గ రి

ఈ రాగంలో షడ్జం, పంచమాలతోపాటు చతుశ్శృతి రిషభం, అంతర గాంధారం, శుద్ధమధ్యమం, చతుశ్శృతి దైవతం, కాకలినిషాదం వస్తాయి. అంతేకాదు వీటితోపాటు కైశికి నిషాదం, సాధారణ గాంధారం కూడా అన్యస్వరాలుగా వస్తూంటాయి.

త్యాగయ్య ఈ రాగంలో 'ఏలనీదయ రాదు', 'నారద గానలోల' 'అనుపమగుణాంబుధి', 'చెడేబుద్ధిమానురా' మొదలైన కీర్తనలు రాశాడు. సినిమాల్లో 'జోహారు శిఖిపింఛ మౌళీ' (శ్రీకృష్ణ పాండవీయం) అన్నపాట ఈ రాగంలోదే. 'ఏలనీదయరాదు' అన్న కీర్తనను 'సాగర సంగమం' సినిమాలో ఉపయోగించారు.

## 12. హంసధ్వని

కీ.శే. ఘంటసాల గానం చేసిన 'వాతాపిగణపతింభజే' అన్న కీర్తనని మీరంతా వినే ఉంటారు. ఈ కీర్తన హంసధ్వని రాగంలో ఉంది. ఇది ముత్తుస్వామి దీక్షితార్ రచన.

హంసధ్వని 29వ మేళకర్త 'ధీర శంకరాభరణ' జన్యం.

ఇది ఔడవ - ఔడవ రాగం. అంటే ఆరోహణలోనూ, అవరోహణ లోనూ ఐదే స్వరాలు వస్తాయి.

చ అం కా .
ఆరో: స రి గ ప ని స

. కా అం చ
అవ: స ని ప గ రి స

షడ్జం, చతుశృతి రిషభం, అంతర గాంధారం, పంచమం, కాకలి నిషాదం ఈ రాగంలో వచ్చే స్వరాలు.

త్యాగయ్య ఈ రాగంలో 'రఘునాయకా నీపాదయుగో', 'శ్రీ రఘుకులమందు బుట్టి' అన్న కీర్తనల్ని రచించాడు.

'శ్రీరఘురాం జయరఘురాం' (శాంతి నివాసం) అన్నపాట ఈ రాగంలోదే. రుద్రవీణ సినిమాలో కూడా ఈ రాగంలో ఒక పాట ఉంది. అది 'కదలిరాద తనేవసంతం' అనేపాట.

## 13. సామ

సామ రాగాన్నే 'శ్యామ' అని కూడా అంటారు. ఇది **29**వ మేళకర్త. ధీరశంకరాభరణ జన్యం. ఈ రాగం **28**వ మేళకర్త హరికాంభోజి నుంచి పుట్టిందని కూడా కొందరంటారు.

చ. శు. చ. .
ఆరో: స రి మ ప ద స

. చ. శు. అం. చ.
అవ: స ద ప మ గ రి స

షడ్జం, చతుశృతి రిషభం, శుద్ధమధ్యమం, పంచమం, చతుశృతి దైవతం వస్తాయి. అవరోహణలో అంతర గాంధారం వస్తుంది.

'శాంతము లేక సౌఖ్యము లేదు' అన్న త్యాగరాజు కీర్తన విన్నారా? ఈ సామ రాగంలోదే అది. శ్రీమతి భానుమతి ఈ కీర్తనని ఒక సినిమాలో పాడి, బాగా ప్రచారంలోకి తెచ్చారు. 'అన్నపూర్ణే విశాలాక్షి' అన్న ముత్తుస్వామి దీక్షితార్ కీర్తన కూడా ఈ రాగంలోదే. సదాశివ బ్రహ్మేంద్ర స్వామి 'మానస సంచరరే బ్రహ్మణి' అన్న కీర్తన రచించారు. ఇది 'సామ' రాగంలోదే. ఈ కీర్తనని 'శంకరాభరణం' సినిమాలో ఉపయోగించారు. పోతన సినిమాలో 'సర్వమంగళ నామరామ' అన్నపాట ఈ రాగంలోదే.

## 14. ఖమాస్

'బ్రోచేవారెవరురా' అన్న కీర్తన మీ అందరికీ బాగా పరిచయం ఉండి ఉంటుంది. 'శంకరాభరణం' సినిమాలో ఈ కీర్తనని ఉపయోగించారు. ఇది 'ఖమాస్' రాగంలో ఉంది. ఈ కీర్తనని 'మైసూర్ వాసుదేవాచార్య' రచించారు.

ఖమాస్ రాగం హిందుస్థానీ సంగీతం నుంచి మన కర్ణాటక సంగీతంలోకి వచ్చింది. ఈ రాగం వినడానికి చాలా బాగుంటుంది. ఇది 28వ మేళకర్త 'హరికాంభోజి' జన్యం.

|  |  | శు. | అం. | శు. |  | చ. | కై |  |
|---|---|---|---|---|---|---|---|---|
| ఆరో: | స | మ | గ | మ | ప | ద | ని | స |

|  | . | కై. | చ. |  | శు. | అం. | చ. |  |
|---|---|---|---|---|---|---|---|---|
| అవ: | స | ని | ద | ప | మ | గ | రి | స |

షడ్జం, చతుశ్శృతి రిషభం, అంతర గాంధారం, శుద్ధమధ్యమం,

పంచమం, చతుశ్రుతి దైవతం, కైశికి నిషాదం ఈ రాగంలో వచ్చే స్వరస్థానాలు. ఖమాస్ భాషాంగ రాగం. దీనిలో అప్పుడప్పుడు కాకలి నిషాధం కూడా అన్యస్వరంగా వస్తుంది.

త్యాగయ్య ఈ రాగంలో చాలా కీర్తనల్ని రచించాడు. 'సుజన జీవనా', 'సీతాపతే' కీర్తనలు ఈ రాగంలో త్యాగయ్య రచించినవి. ముత్తుస్వామి దీక్షితార్ ఈ రాగంలో 'సంతాన గోపాలకృష్ణం' అనే కీర్తన రచించారు.

హిందుస్థానీలో ఈ రాగాన్ని 'ఖమాస్‌థాట్' అంటారు.

## 15. శుద్ధ ధన్యాసి

శుద్ధ ధన్యాసి 22వ మేళకర్త 'ఖరహర ప్రియ జన్యరాగం. దీనినే 'ఉదయ రవిచంద్రిక' అని కూడా అంటున్నారు.

|  |  | సా. | శు. |  | కై. | . |
|---|---|---|---|---|---|---|
| ఆరో: | స | గ | మ | ప | ని | స |

|  | కై. |  |  | శు. | సా. |  |
|---|---|---|---|---|---|---|
| అవ: | స | ని | ప | మ | గ | స |

ఈ రాగంలో షడ్జం, సాధారణ గాంధారం, శుద్ధమధ్యమం, పంచమం, కైశిక నిషాదం వస్తాయి.

త్యాగయ్య ఈ రాగంలో 'ఎంత నేర్చినా ఎంత జూచినా' అన్న కీర్తన, ముత్తుస్వామి దీక్షితార్ 'శ్రీపార్థసారధి' అన్న కీర్తన రచించారు. అయితే ముత్తయ్య భాగవతార్ రచించిన 'హిమగిరి తనయే' అన్న కీర్తన ఈ రాగంలో బాగా ప్రచారంలో ఉంది.

సినిమాల్లో తరుచు ఈ రాగాన్ని వాడతారు. త్యాగయ్య

'ఎంత నేర్చినా' కీర్తనని కొంచెం మార్చి, 'జానకి రాముడు' సినిమాలో ఉపయోగించారు. 'మనసు తెలిపే మౌనగీతం' (స్వాతిముత్యం), 'గోవెమ్మ చేతిలో గోరుముద్ద' (ప్రేమించు పెళ్ళాడు) మొదలైన ఎన్నో సినిమా పాటలు ఈ రాగంలోవే.

అన్నమయ్య కీర్తన 'భావములోన బాహ్యమునందున' ఈ రాగంలోదే. దీన్ని స్వరపరిచింది శ్రీ నేదునూరి కృష్ణమూర్తి.

## 16. కల్యాణ వసంత

**21**వ మేళకర్త కీరవాణి జన్యం ఈ కల్యాణ వసంత రాగం. దీనిలో కీర్తనలు తక్కువగా ఉన్నాయి. త్యాగరాజు రచించిన 'నాదలోలుడై', 'కనులు తాకని పరకాంతల' అనే కీర్తనలు ఈ రాగంలోవే. భక్తి, విషాదం, కరుణ ఈ రాగంలో వినిపిస్తాయి.

సా శు. శు కా
ఆరో: స గ మ ద ని స

కా శు శు. సా. చ.
అవ: స ని ద ప మ గ రి స

ఈ రాగంలో షడ్జం, పంచమాలతో పాటు చతుశ్శృతి రిషభం, సాధారణ గాంధారం, శుద్ధమధ్యమం, శుద్ధదైవతం, కాకలి నిషాదం వస్తాయి. ఇది ఔడవ - సంపూర్ణ రాగం గమనించారా?

సినిమాల్లో ఈ రాగాన్ని బాగా ఉపయోగిస్తారు. 'మాధవా నను లాలించవా', 'దయగనవే ప్రియగౌరి' లాంటి సినిమా పాటలు ఈ రాగంలోవే.

## 17. సావేరి

15వ మేళకర్త 'మాయామాళవగౌళ' జన్యం ఈ సావేరి. విషాదాన్ని ప్రతిబింబించే రాగం ఇది.

శు. శు. శు శు. .
ఆరో: స రి మ మ ప ద స

. కా శు. శు. అం. శు.
అవ: స ని ద ప మ గ రి స

షడ్జం, పంచమాలతో పాటు ఈ రాగంలో శుద్ధరిషభం, అంతర గాంధారం, శుద్ధమధ్యమం, శుద్ధదైవతం, కాకలి నిషాదం వస్తాయి.

త్యాగరాజ స్వామి ఈ రాగంలో ఇరవైకి పైగా కీర్తనలు రాశారు. 'రామబాణత్రాణ', 'తులసి జగజ్జనని' కీర్తనలు ఈయన రాసినవే. దీక్షితార్ ఈ రాగంలో 'శ్రీ రాజగోపాల అన్న కీర్తన రాశారు. శ్యామశాస్త్రి రచించిన 'శంకరి శంకురు', 'దురుసుగా కృపజూసి' కీర్తనలు ఈ రాగంలోవే.

సినిమాల్లో ఈ రాగం అప్పుడప్పుడు మాత్రమే వినిపిస్తుంది. దేవదాసు సినిమాలో 'కల ఇదని నిజ మిదనీ' ఈ రాగంలోదే. అబ్దుల్ కరీమ్ ఖాన్ అనే హిందుస్థానీ సంగీత విద్వాంసుడు ఈ రాగాన్ని ఉత్తర భారతదేశంలో ప్రచారం చేశారు.

## 18. హరికాంభోజి

కర్ణాటక సంగీతంలో ఉన్న ప్రాచీన రాగాల్లో ఇది ఒకటి. హరికాంభోజిని పోలిన రాగాలు పాశ్చాత్య సంగీతంలోను,

అరేబియన్ సంగీతంలోనూ కూడా ఉన్నాయి. హరికాంభోజి సంపూర్ణ రాగం. ఇది 28వ మేళకర్త.

| | | చ. | అం. | శు. | | చ | కై | . |
|---|---|---|---|---|---|---|---|---|
| ఆరో: | స | రి | గ | మ | ప | ద | ని | స |

| | . | కై | చ. | | శు. | అం. | చ. | |
|---|---|---|---|---|---|---|---|---|
| అవ: | స | ని | ద | ప | మ | గ | రి | స |

ఈ రాగంలో షడ్జం, పంచమంతో పాటు చతుశ్శృతి రిషభం, అంతర గాంధారం, శుద్ధ మధ్యమం, చతుశ్శృతి దైవతం, కైశికి నిషాదం వస్తాయి. త్యాగయ్య ఈ రాగంలో 'దినమణివంశ', 'ఎంతరాని', 'రామ నన్ను బ్రోవరా', 'ఉండేది రాముడొకడు' లాంటి కీర్తనలు ఎన్నో రాశాడు.

ఈ రాగం కన్నా దీని జన్యరాగాలు ఎక్కువ ప్రచారంలో ఉన్నాయి. కాంభోజి, బహుదారి, మోహన, సురటి లాంటి ఎన్నో ప్రసిద్ధ రాగాలు దీని నుంచి పుట్టినవే.

'ఏ తల్లిపాడేను జోల' (కాలం మారింది) 'దీపాలు వెలిగే పరదాలు తొలిగే' లాంటి సినిమా పాటలు ఈ రాగంలో ఉన్నాయి.

## 19. కేదారగౌళ

'వేణుగానలోలునిగన వేయికన్నులు కావలెనా' అన్న త్యాగరాజ కీర్తన ఎప్పుడైనా విన్నారా? ఇది కేదారగౌళ రాగంలోదే. 28వ మేళకర్త హరికాంభోజి జన్యం ఈ రాగం.

| | | చ | శు | | కై | . | | |
|---|---|---|---|---|---|---|---|---|
| ఆరో: | స | రి | మ | ప | ని | స | | |

| | | కై | చ. | | శు. | అం. | చ. | |
|---|---|---|---|---|---|---|---|---|
| అవ: | స | ని | ద | ప | మ | గ | రి | స |

షడ్జం, పంచమాలతో పాటు దీనిలో చతుశ్శృతి రిషభం, అంతరగాంధారం, శుద్ధమధ్యమం, చతుశ్శృతి దైవతం, కైశికి నిషాదం వస్తాయి. ఇది 'ఔడవ-సంపూర్ణ' రాగం. శ్లోకాలు, పద్యాలు పాడడానికి ఈ రాగం చాలా బాగుంటుంది.

రామ్నాడ్ శ్రీనివాసయ్యంగార్ రచించిన 'నరగునపాలింప' అన్న కీర్తన ఈ రాగంలోదే. ఇది చాలా ప్రచారంలో ఉంది.

## 20. తోడి

తోడి చాలా ప్రచారంలో ఉన్న రాగాలలో ఒకటి. దీనినే హనుమత్తోడి అని కూడా అంటారు. అయితే సాధారణంగా తోడి అనే అంటారు. ఇది ఉత్తర భారతదేశం నుంచి, మన కర్ణాటక సంగీతంలోకి వచ్చిన రాగం. తోడి 8వ మేళకర్త రాగం.

| | | శు | సా | శు | | శు | కై | . |
|---|---|---|---|---|---|---|---|---|
| ఆరో: | స | రి | గ | మ | ప | ద | ని | స |

| | | కై | శు | | శు | సా | శు | |
|---|---|---|---|---|---|---|---|---|
| అవ: | స | ని | ద | ప | మ | గ | రి | స |

ఈ రాగంలో షడ్జం, శుద్ధరిషభం, సాధారణ గాంధారం, శుద్ధ మధ్యమం, పంచమం, శుద్ధ దైవతం, కైశికి నిషాదం వస్తాయి. తోడి మంచి గమనిక యుక్తంగా అంటే మంచి గమకాలతో పాడాల్సిన రాగం.

త్యాగయ్య ఈ రాగంలో చాలా కీర్తనలు రచించాడు. 'ఆరగింపవే పాలారగింపవే', 'కద్దను వారికి కద్దు కద్దని', 'నీవంటి దైవము' ఇలా ఎన్నో కీర్తనలు త్యాగయ్య రచించాడు. ముత్తుస్వామి దీక్షితార్ 'శ్రీకృష్ణం భజమానస' అనే కీర్తన రచించాడు.

## 21. భైరవి

భైరవి 20వ మేళకర్త నఠభైరవి జన్యం. ఇది భాషాంగరాగం. దీనిలో నఠభైరవిలో రాని స్వరం చతుశ్శృతి దైవతం వస్తుంది.

భైరవి ఆరోహణలో షడ్జం, చతుశ్శృతి రిషభం, సాధారణ గాంధారం, శుద్ధమధ్యమం, పంచమం, శుద్ధ దైవతం, కైశిక నిషాదం వస్తాయి. అవరోహణలో మాత్రం శుద్ధ దైవతం రాదు. చతుశ్శృతిదైవతం వస్తుంది.

| | | చ | సా | శు. | | చ. | కై | . |
|---|---|---|---|---|---|---|---|---|
| ఆరో: | స | రి | గ | మ | ప | ద | ని | స |

| | . | కై | శు | | శు | సా | చ. | |
|---|---|---|---|---|---|---|---|---|
| ఆవ: | స | ని | ద | ప | మ | గ | రి | స |

ఈ రాగంలో త్యాగయ్య 'తనయుని బ్రోవ', 'ఏనాటినోము ఫలమో' 'ఉపచారము చేసేవారు' అనే కీర్తనలు రచించాడు. శ్రీ నేదునూరి కృష్ణమూర్తి భైరవి రాగంలో రెండు అన్నమయ్య కీర్తనల్ని స్వరపరిచారు. 'అలమేలు మంగనీవభినయ', 'ఎవ్వారి భాగ్యంబెట్లున్నదో' అనేవి.

## 22. శుద్ధ సావేరి

శుద్ధ సావేరిని హిందుస్థానీ సంగీత విద్వాంసులు తీసుకొని, ఉత్తర భారతదేశంలో ప్రచారం చేశారు. హిందుస్థానీలో ఈ రాగాన్ని 'దుర్గ' అంటారు. దీని మూర్ఛన.

|  |  | చ | శు |  | చ | . |
|---|---|---|---|---|---|---|
| ఆరో : | స | రి | మ | ప | ద | స |
|  | . | చ |  | శు. | చ. |  |
| ఆవ : | స | ద | ప | మ | రి | స |

ఇది 29వ మేళకర్త, ధీర శంకరాభరణ జన్యం. ఇది ఔడవ - ఔడవ రాగం. షడ్జం, చతుశృతి రిషభం, శుద్ధ మధ్యమం, పంచమం, చతుశృతి దైవతం దీనిలో వచ్చే స్వరస్థానాలు.

త్యాగయ్య ఈ రాగంలో 'దరిని తెలుసుకొంటి' అన్న కీర్తన రచించారు. ఇది బాగా ప్రచారంలో ఉంది. 'శ్రీవటుకనాథ' అన్న కీర్తన ముత్తుస్వామి దీక్షితార్ రచించాడు.

'బృందావనమిది అందరిది' (మిస్సమ్మ), 'పాడనా తెలుగుపాట' (అమెరికా అమ్మాయి) 'నిన్నలేని అందమేదో' (పూజాఫలం) ఈ సినిమా పాటలు ఈ రాగంలోవి.

## 23. కీరవాణి

వినేవాళ్ళను బాగా ఆకట్టుకొనే రాగం కీరవాణి. ఈ కీరవాణి రాగం హిందుస్థానీ సంగీతంలో కూడా ఉంది. ఇది 21వ మేళకర్త రాగం.

చ సా శు శు కా .

ఆరో: స రి గ మ ప ద ని స

. కా శు శు సా చ.

ఆవ: స ని ద ప మ గ రి స

దీనిలో షడ్జం, చతుశ్శ్రుతి రిషభం, సాధారణ గాంధారం, శుద్ధమధ్యమం, పంచమం, శుద్ధ దైవతం, కాకలి నిషాదం వస్తాయి.

ఈ రాగంలో త్యాగయ్య 'కలిగి ఉండేకదా' అన్న కీర్తన రచించాడు. 'అంబవాణినన్నాదరింపవే' అన్న కీర్తన ఈ రాగంలో చాలా ప్రచారంలో ఉంది. దీనిని ముత్తయ్య భాగవతార్ రచించాడు. ఈ రాగంలో పట్నం సుబ్రహ్మణ్యయ్యార్ 'వరములొసగి' అనే కీర్తన రాశారు.

ఎన్నో సినిమా పాటలు ఈ రాగంలో ఉన్నాయి. 'వినుడు వినుడు రామాయణగాథ' (లవకుశ) 'గజ్జెఘల్లుమంటుంటే' (సిరిసిరిమువ్వ), 'తాళికట్టు శుభవేళ' (అంతులేనికథ) ఇలా ఎన్నో పాటలు ఈ రాగంలో ఉన్నాయి.

## 24. హిందోళ

సినిమాల్లో 'సామజ వరగమన' అన్న త్యాగరాజ కీర్తనని మీరంతా వినే ఉంటారు. ఈ కీర్తన హిందోళ రాగంలో ఉంది. హిందోళ 20వ మేళకర్త నఠభైరవి జన్యం.

సా శు. శు కై .

ఆరో: స గ మ ద ని స

. కై. శు. శు. సా.

ఆవ: స ని ద మ గ స

ఇది 'ఔడవ - ఔడవ' రాగం. దీనిలో షడ్జం, సాధారణ గాంధారం, శుద్ధ మధ్యమం, శుద్ధ దైవతం, కైశికి నిషాదం వస్తాయి.

త్యాగయ్య ఈ హిందోళలో 'సామజ వరగమన' అన్న కీర్తనే కాకుండా, 'మనసులోని మర్మమును తెలుసుకో' అన్న కీర్తనకూడా రచించాడు. ముత్తుస్వామి దీక్షితార్ 'నీరజాక్షి కామాక్షి' అన్న కీర్తన, 'గోవర్ధ గిరీశం' అన్న కీర్తన ఈ హిందోళలో రచించారు. ఈ రాగంలో సినిమాపాటలు చాలా కనిపిస్తాయి. 'మోహన రూపా గోపాల', 'పగలే వెన్నెలా జగమే ఊయల' అన్న పాటలు ఈ రాగంలోవే. అన్నట్టు బాగా ప్రచారంలో ఉన్న అన్నమయ్య కీర్తన 'కొండలలో నెలకొన్న కోనేటి రాయడు వాడు' అన్నది కూడా ఈ రాగంలోదే.

## 25. అమృత వర్షిణి

అమృతవర్షిణి రాగం పాడితే వర్షం కురుస్తుందని అంటారు. ముత్తుస్వామి దీక్షితార్ ఈ రాగం పాడి, కుండపోతగా వర్షం కురిసేలా చేశాడు. అమృతవర్షిణి 66వ మేళకర్త చిత్రాంబరి జన్యం. ఇందులో వచ్చే స్వరాలు ఐదు. ఇది ఔడవ - ఔడవ రాగం.

| | | అం | ప్ర | | కా | . |
|---|---|---|---|---|---|---|
| ఆరో: | స | గ | మ | ప | ని | స |
| | | కా. | | ప్ర. | అం. | |
| అవ: | స | ని | ప | మ | గ | స |

దీనిలో షడ్జం, అంతరగాంధారం, ప్రతిమధ్యమం, పంచమం, కాకలి నిషాదం వస్తాయి. 'ఆనందామృత కర్షిణీ' అన్న దీక్షితార్ కీర్తన, ముత్తయ్య భాగవతార్ రచించిన 'సుధామయేసుధానిధే'

అన్న కీర్తన ఈ రాగంలో చాలా ప్రచారంలో ఉన్నాయి. 'స్వాతి కిరణం' సినిమాలో 'ఆనతి నీయరా' అన్న పాట ఈ రాగంలోదే.

## 26. శహన

శహన రాగం పాడితే కరుణ, విషాదం మనకు వినిపిస్తాయి. ఇది 28వ మేళకర్త హరికాంభోజి జన్యం.

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | చ | అం | శు | | శు | చ | కా | . | |
| ఆరో: | స | రి | గ | మ | ప | మ | దా | ని | స | |
| | . | కై | చ | | శు | అం | శు | చ | అం | చ |
| ఆవ: | స | ని | ద | ప | మ | గ | మ | రీ | గ | రి |

శహన వక్ర రాగం. ఆరోహణలోను, అవరోహణలోను వక్రంగా ఉంటుంది. దీనిలో షడ్జం, చతుశ్శృతి రిషభం, అంతర గాంధారం, శుద్ధమధ్యమం, పంచమం, చతుశ్శృతి దైవతం, కైశికి నిషాదం వస్తాయి. ఈ రాగంలో బాగా ప్రచారంలో ఉన్న కీర్తన 'వందనము రఘునందన' దీనిని త్యాగయ్య రాశాడు. శహనలో త్యాగయ్య 'గిరిపై నెలకొన్న', 'ఈ వసుధ నీవంటి దైవము', 'ఏమానతిచ్చేవో' కీర్తనలు రచించాడు.

సినిమాల్లో ఈ రాగం ఇదివరకు తరుచు వినిపించేది. 'ఊరికే కొలను నీరు ఉలికి ఉలికి పడుతోంది' (సంపూర్ణ రామాయణం) 'ఆకాశపందిరిలో నీకు నాకు పెళ్ళంట' (శ్రీ రాజేశ్వరీ విలాస్ కాఫీక్లబ్) అన్న సినిమా పాటలు ఈ రాగంలోవే.

## 27. లలిత

'లలిత ప్రియ కమలం విరిసినదీ' అన్న రుద్రవీణ సినిమా పాట మీరంతా వినే ఉంటారు. ఇది 'లలిత' రాగంలోది. ఈ రాగం 15వ మేళకర్త 'మాయామాళవగౌళ' జన్యం. దీనిలో షడ్జం, శుద్ధరిషభం, అంతరగాంధారం, శుద్ధమధ్యమం, శుద్ధదైవతం, కాకలి నిషాదం వస్తాయి.

| | | శు | అం | శు | శు | కా | |
|---|---|---|---|---|---|---|---|
| ఆరో: | స | రి | గ | మ | ద | ని | స |
| | . | కా | శు | శు | అం | శు | |
| ఆవ: | స | ని | ద | మ | గ | రి | స |

ఈ రాగంలో ముత్తుస్వామి దీక్షితార్ రచించిన 'హిరణ్మయీం లక్ష్మీం' అన్న కీర్తన, శ్యామశాస్త్రి రచించిన 'నన్నుబ్రోవు లలితా' అన్న కీర్తన బాగా ప్రచారంలో ఉన్నాయి.

## 28. హంసా నంది

'హంసానంది' హిందుస్థానీ రాగం. అంటే ఉత్తర భారత సంగీతంలో బాగా ప్రచారంలో ఉన్న రాగం అన్నమాట. ముత్తయ్యా భాగవతార్ అనే వాగ్గేయ కారుడు ఈ రాగంలో 'నీదు మహిమ పొగడ' అనే కీర్తన రచించి మన కర్ణాటక సంగీతంలోకి ఈ రాగాన్ని తెచ్చాడు. 'పాహిగజ్జనని' అనే స్వాతి తిరునాళ్ రచన, 'పావన గురుపవన పురాధీశ' అన్న కీర్తన ఈ రాగంలోవే.

హంసానంది 53వ మేళకర్త 'గమనశ్రమ' రాగంలోంచి పుట్టింది. ఇది షాడవ - షాడవ రాగం. ఆరోహణలోనూ,

అవరోహణలోనూ ఆరు స్వరాలు వస్తాయి.

| | | శు | అం | ప్ర | చ. | కా. | . | |
|---|---|---|---|---|---|---|---|---|
| ఆరో: | స | రి | గ | మ | ద | ని | స | |
| | . | కా | చ | ప్ర | అం. | శు | | |
| అవ: | స | ని | ద | మ | గ | రి | | స |

షడ్జం, శుద్ధరిషభం, అంతర గాంధారం, ప్రతిమధ్యమం, చతుశ్శృతి దైవతం, కాకలి నిషాదం ఈ రాగంలో వచ్చే స్వరస్థానాలు.

సాగరసంగమం సినిమాలో 'వేదం అణువణువున' అన్నపాట హంసానంది రాగంలోదే.

## 29. రేవతి

కరుణ, భక్తి రసాలను స్ఫురింపచేసే రాగం ఈ రేవతి. కర్ణాటక సంగీతంలోను, హిందుస్థానీ సంగీతంలోను కూడా రేవతి రాగం బాగా ప్రచారంలో ఉంది. హిందుస్థానీ సంగీతంలో దీనిని బైరాగి అంటారు.

| | | శు | శు | | కై | . |
|---|---|---|---|---|---|---|
| ఆరో: | స | రి | మ | ప | ని | స |
| | | కై | | శు | శు | |
| అవ: | స | ని | ప | మ | రి | స |

దీనిలో షడ్జం శుద్ధరిషభం, శుద్ధమధ్యమం, పంచమం కైశికి నిషాదం వస్తాయి. రేవతిరాగం 16వ మేళకర్త 'చక్రవాకం' జన్యం అని కొందరు, 2వ మేళకర్త 'రత్నాంగి' జన్యం అని కొందరు అంటారు. ''నానాటి బ్రతుకు నాటకము' అన్న అన్నమయ్య కీర్తన ఈ

రాగంలోదే. 'మహాదేవ శివ శంభో' అన్న కీర్తన కూడా రేవతి రాగంలో ఉంది.

'ఏతీగపూవునో ఏ కొమ్మ తీవెనో' (మరోచరిత్ర) 'ఝుమ్మంది నాదం సై అంది పాదం' (సిరిసిరిమువ్వ), 'మానసవీణ మధుగీతం' (పంతులమ్మ) ఈ సినిమా పాటల్ని ఈ రాగం ఆధారంగా స్వరపరిచారు.

## 30. కానడ

కానడ కూడా సావేరి లాగే కరుణ రస ప్రధానమైన రాగం. ఇది 22వ మేళకర్త 'ఖరహర ప్రియ' లోంచి పుట్టింది. ఈ రాగం ఆరోహణ, అవరోహణల్ని చాలా రకాలుగా చెబుతారు.

**1.** ఆరో: స రి గ మ ద ని స

అ: స ని ద ప మ గ మ రి స

**2.** ఆరో: స రి గ మ ద ని స

అవ: స ని ప మ ప ద ని ద ప మ గ మ రి స

**3.** ఆరో: స రి గ మ ప మ ద ని స

అవ: స ని ప మ ప ద ని ద ప మ గ మ రి స

**4.** ఆ: స రి గ మ ద ని స

అ: స ని స ద ప మ ప గ మ రి స

ఈ రాగంలో వచ్చే స్వరస్థానాలు షడ్జం, చతుశ్శృతి రిషభం, సాధారణ గాంధారం, శుద్ధ మధ్యమం, పంచమం, చతుశ్శృతి దైవతం, కైశిక నిషాదం.

త్యాగయ్య 'శ్రీనారద', 'సుఖి ఎవ్వరో' అన్న కీర్తనలు

రచించారు. స్వాతి తిరునాళ్ రచించిన 'మామవ సదా జననీ' అన్న కీర్తన బాగా ప్రచారంలో ఉంది.

సినిమాల్లో ఈ రాగాన్ని తరుచు వాడేవారు. 'పంపుతున్నామమ్మ నిన్ను పసుపుకుంకుమతో' (సతీసావిత్రి) అనే సినిమాపాట ఈ రాగంలోదే.

## 31. సింహేంద్రమధ్యమం

57వ మేళకర్త ఈ సింహేంద్ర మధ్యమం.

| | | చ | సా | ప్ర. | | శు | కా | . |
|---|---|---|---|---|---|---|---|---|
| ఆరో: | స | రి | గ | మ | ప | ద | ని | స |
| | . | కా. | శు. | | ప్ర. | సా. | చ. | |
| అవ: | స | ని | ద | ప | మ | గ | రి | స |

దీనిలో షడ్జం, చతుశ్శృతి రిషభం, సాధారణ గాంధారం, ప్రతిమధ్యమం, పంచమం, శుద్ధ దైవతం కాకలి నిషాదం వస్తాయి. త్యాగయ్య రచించిన 'నీదు చరణములే', దీక్షితార్ రచించిన 'కామాక్షి కామకోటి పీఠ వాసిని', శ్రీ కె.వి. శ్రీనివాసయ్యంగార్ రచించిన 'నతజన' అన్న కీర్తనలు ఈ రాగంలో బాగా ప్రచారంలో ఉన్నాయి.

సినిమాల్లో తరుచు ఈ రాగాన్ని వాడతారు. 'లవకుశ' లో 'చిన్ని పాపలు మీరు' అన్న పద్యం ఈ రాగంలోదే.

## 32. సింధుభైరవి

'సింధుభైరవి' అనే సినిమా వచ్చింది మీకు తెలుసా? టి.వి.లో తరుచు జాతీయ సమైక్యత కోసం ప్రసారం చేసే 'మిలేసుర్

మేరా తుమ్‌హారా' అన్న పాట ఈ రాగంలోదే. హిందుస్థానీ, కర్ణాటక సంగీతాలు రెండింటిలోనూ బాగా ప్రచారంలో ఉన్న రాగం ఇది. తోడి రాగానికి దగ్గరగా ఉండే రాగం. కర్ణాటక సంగీతంలో పురందర దాసు ఈ రాగంలో ఎక్కువ రచనలు చేశాడు. ఈయన రచించిన 'వెంకటాచల నిలయం' బాగా ప్రచారంలో ఉంది.

సింహాచలము మహాపుణ్యక్షేత్రము' (సింహాచల క్షేత్రమహత్యం) అన్నపాట ఈ రాగంలోదే. ఇంకా 'భలే భలే అందాలు సృష్టించావు' (భక్తతుకారాం), 'జగదభిరామ రఘుకులసోమ', 'జగమేమాయ' (దేవదాసు) ఇలా ఈ రాగంలో ఎన్నెన్నో పాటలున్నాయి.

సింధుభైరవి ఆరోహణ: స రి గ మ ద ని స

అవరోహణ: స ని ద ప మ గ రి స

శుద్ధరిషభం, చతుశ్రృతిరిషభం, సాధారణగాంధారం, శుద్ధమధ్యమం, శుద్ధదైవతం దీనిలో వస్తాయి. అంతేకాదు ఈ రాగంలో అన్నిస్వర స్థానాలు వాడేస్వేచ్ఛఉంది.

## 33. హంసనాదం

ఇది 60వ మేళకర్త 'నీతిమతి' జన్యం.

చ ప్ర. కా.
ఆరో: స రి మ ప ని స

కా. ప్ర. చ.
అవ: స ని ప మ రి స

షడ్జం, చతుశ్శ్రృతి రిషభం, ప్రతిమధ్యమం, పంచమం, కాకలి

నిషాదం ఈ రాగంలో వచ్చే స్వరస్థానాలు. ఈ రాగంలో ఇది వరకు షట్ శృతి దైవతం కూడా ఉండేది. అయితే ప్రస్తుతం షట్ శృతి దైవతాన్ని వదిలేసే పాడుతున్నారు.

ఈ రాగంలో ఎక్కువ కీర్తనలు మనకి కనిపించవు. త్యాగయ్య రాసిన 'ఐంతురీతి కొలువు' అన్న కీర్తన ఈ రాగంలో బాగా ప్రచారంలో ఉంది.

## 34. బేగడ

'మీగడ' లా ఉండే రాగం బేగడ అంటారు. ఇది 29వ మేళకర్త ధీర శంకరాభరణ జన్యం.

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | | అం | చ | అం | శు | | చ | | |
| ఆరో: | స | గ | రి | గ | మ | ప | ద | ప | స |
| | . | కా | చ | | శు | అం | చ | | |
| అవ: | స | నీ | ద | ప | మా | గ | రి | స | |

షడ్జం, చతుశ్శృతి రిషభం, అంతరగాంధారం, శుద్ధమధ్యమం, పంచమం, చతుశ్శృతి దైవతం, కాకలి నిషాదం ఈ రాగంలో వస్తాయి.

'తన వారితనము లేదా', 'నా దోపాసన' అన్న త్యాగరాజ కీర్తనలు ఈ రాగంలోవే. 'అనుదినమును గావుమయ్య' (రామ్నాడ్ శ్రీనివాసయ్యంగార్) 'వల్లభనాయకస్య' కీర్తనలు కూడా ఈ రాగంలోవే.

## ఘనరాగాలు

ఘనరాగాలు అంటే గొప్పరాగాలు అని అర్థం. ఈ రాగాలు మంచి గంభీరంగా ఉంటాయి. యుద్ధంలో గొప్ప వీరుడిలా ఉంటాయి

ఈ రాగాలు. పూర్వం పది రాగాల్ని ఘనరాగాలని చెప్పారు. ప్రస్తుతం నాట, గౌళ, వరాళి, ఆరభి, శ్రీరాగం ఈ ఐదు రాగాలు బాగా వాడుకలో ఉన్నాయి. త్యాగయ్య ఈ ఐదు రాగాలలోనూ పెద్ద కీర్తనలు వ్రాశారు. వీటినే ఘనరాగ పంచరత్న కీర్తనలు అంటారు. ఇప్పుడు ఈ ఐదు రాగాలు గురించి చెప్పుకొందాం.

## 35. నాట

త్యాగయ్య నాట రాగంలో రచించినది 'జగదానంద కారకా' అన్న పంచరత్నం. నాట 36వ మేళకర్త చలనాట జన్యం. 'ఆది నాట అంత్య సురటి' అంటూంటారు. దీని అర్థం కచేరీని నాట రాగంతో మొదలు పెట్టి, సురటి రాగంతో ముగించాలని. ప్రస్తుతం మన కచేరీలలో ఈ సంప్రదాయాన్ని అంతగా పాటించడం లేదనుకోండి. నాట ఆరోహణ, అవరోహణలను చాలా రకాలుగా చెబుతున్నారు.

ఆరో: స రి గ మ ప ద ని స
అవ: స ని ప మ రి స

ఆరో: స రి గ మ ప ద ని ప ని స
అవ: స ని ప మ రి స

ఆరో: స రి గ మ ప ద ని స
అవ: స ని ప మ గ రి స

షడ్జం, షట్ శృతి రిషభం, అంతర గాంధారం, శుద్ధ మధ్యమం, షట్ శృతి దైవతం, కాకలి నిషాదం ఈ రాగంలో వస్తాయి.

త్యాగయ్య ఈ రాగంలో రచించిన పంచ రత్న కీర్తన జగదానందకారకా, అనేది.

ముత్తుస్వామి దీక్షితులు ఈ రాగంలో 'మహాగణపతిం', 'స్వామినాథ పరిపాలయా సుమాం' కీర్తనలు రచించారు. 'మహాగణపతిం కీర్తనను 'సింధుభైరవి' సినిమాలో ఉపయోగించారు.

## 36. వరాళి

39వ మేళకర్త 'ఝాలవరాళి' అనే రాగం నుంచి వరాళి పుట్టింది. ఇది ఆరోహణలో వక్రం. కరుణ, భక్తి రసాలకు వీలైన రాగం ఇది.

ఆరో : స గ రి గ మ ప ద ని స

అరో : స ని ద ప మ గ రి స

దీని ఆరోహణలో 'సగరిగ' అని ఉన్నప్పటికీ 'సరిగ' అని కూడా వస్తూంటుంది. దీనిలో షడ్జం, శుద్ధరిషభం, శుద్ధగాంధారం, ప్రతిమధ్యమం, శుద్ధ దైవతం, కాకలి నిషాదం వస్తాయి.

హిందుస్థానీ సంగీతంలో ఇలాంటి రాగంలేదు. వరాళిలో బాగా ప్రచారంలో ఉన్న రచన త్యాగయ్య పంచరత్న కీర్తన 'కన కన రుచిరా' ఇంకా 'ఏటి జన్మమిదిహా' అన్న కీర్తన ఈ రాగంలోదే. దీక్షితార్ రచించిన 'మామవ మీనాక్షి' అన్నది ఈ రాగంలో ఉంది.

వరాళిలో సినిమా పాటలు పెద్దగా ఉన్నట్టు కనపడవు.

## 37. గౌళ

15వ మేళకర్త 'మాయామాళవగౌళ' జన్యం ఈ 'గౌళ'. దీని మూర్ఛన చాలా రకాలుగా చెబుతారు.

ఆష్ట: స రి గ మ రి మ ప ని స

అరో: స ని ప మ గ మ రి స

ఆరో: స రి మ ప ని స

అవ: స ని ప మ గ మ రి స

ఇందులో షడ్జం, శుద్ధ రిషభం, అంతర గాంధారం, శుద్ధ మధ్యమం, పంచమం కాకలి నిషాదం వస్తాయి.

త్యాగయ్య రచించిన 'దుడుకుగలనన్నే దొరకొడుకుబ్రోచు రా' అన్నది బాగా ప్రచారంలో ఉంది.

'శ్రీమహాగణపతి రవతుమాం' అన్న దీక్షితార్ కీర్తన, 'మైసూర్ వాసుదేవాచార్య 'ప్రణమామ్యహం శ్రీ గౌరీసుతం' అన్న కీర్తన ఈ రాగంలోవే.

సినిమా పాటలు 'గౌళ'లో ఎక్కువగా కనిపించవు.

## 38. ఆరభి

'ఆరభి' మన కర్ణాటక సంగీతం నుంచి హిందుస్థానీలోకి చేరింది. 'సామ' రాగానికి దగ్గరగా ఉండే రాగం ఈ ఆరభి. 29వ మేళకర్త ధీరశంకరాభరణ జన్యం. దీని ఆరోహణలో గాంధారం, నిషాదం ఉండవు. అవరోహణలో అన్ని స్వరాలు ఉంటాయి.

ఆరో: స రి మ ప ద స

అవ: స ని ద ప మ గ రి స

షడ్జం, పంచమాలతో బాటు దీనిలో చతుశ్శృతి రిషభం, అంతరగాంధారం, శుద్ధమధ్యమం, చతుశ్శృతి దైవతం, కాకలి నిషాదం వస్తాయి. అవరోహణలో నిషాదం ఉన్నా కూడా దానిని వదిలివేసే పాడుతూంటారు. ఆరభి రాగాన్ని దురితంగా అంటే స్పీడుగానే పాడాలి. లేకపోతే ఇది 'దేవగాంధారి' రాగంలా వినిపిస్తుంది.

'సామ, దేవగాంధారి, శుద్ధ సావేరి' రాగాలు ఆరభికి దగ్గరగా ఉండే రాగాలు.

ఆరభిలో త్యాగయ్య 'సాధించనే ఓ మనసా' అన్న పంచరత్న కీర్తన, 'చూతామురారే' మొదలైన కీర్తనలు రాశారు. దీక్షితార్ రచించిన 'శ్రీ సరస్వతీ నమోస్తుతే' అన్న కీర్తన కూడా బాగా ప్రచారంలో ఉంది.

'నమోనారసింహ' (భక్తప్రహ్లాద) 'పచ్చబొట్టు చెరిగిపోదులే' (పవిత్ర బంధం) మొదలలైన సినిమా పాటలు ఈ రాగంలోవే. త్యాగయ్య పంచరత్న కీర్తన 'సాధించెనే ఓ మనసా' ను కొంతమార్చి, 'సీతారామయ్యగారి మనుమరాలు' సినిమాలో ఉపయోగించారు.

## 39. శ్రీరాగం

'ఎందరో మహానుభావులు' అన్న త్యాగయ్య కీర్తనను వినని వారు ఉండరు. ఇది శ్రీరాగంలో ఉంది. శ్రీరాగం 22వ మేళకర్త ఖరహరప్రియ జన్యం.

చ శు కై.
ఆరో: స రి మ ప ని స

. కై. శు చ సా చ.
అవ: స ని ప మ రి గ రి స

షడ్జం, పంచమాలతోపాటు చతుశ్శృతి రిషభం, సాధారణ గాంధారం, శుద్ధ మధ్యమం, కైశికి నిషాదం వస్తాయి.

ప్రస్తుతం ఈ రాగాన్నే అవరోహణలో చతుశ్శృతి దైవతం కూడా ఉపయోగించి పాడుతున్నారు.

ఆరో: స రి మ ప ని స

అరో: స ని ప ద ని ప మ రి గా రి స

శ్రీ రాగం భక్తి, శృంగార రసాలకు వీలైన రాగం. వినేవాళ్ళకు చాలా హాయిని కలిగిస్తుంది. 'శ్రీ వరలక్ష్మి నమస్తుభ్యం' అన్న దీక్షితార్ కీర్తన, 'కరుణ జూడు నినునమ్మినవాడుగదా' అన్న శ్యామశాస్త్రి కీర్తన శ్రీరాగంలోవే.

## 40. మధ్యమావతి

సాధారణంగా సంగీత కచేరీలన్నీ మధ్యమావతి రాగంలో ముగుస్తాయి. అలాగే మనం రాగాల్ని గురించి చెప్పుకోడం కూడా మధ్య మావతి రాగంతోనే ముగిద్దాం.

మధ్యమావతి కూడా శ్రీరాగంలాగే 22వ మేళకర్త 'ఖరహరప్రియ' జన్యం. శ్రీరాగానికి దగ్గరగా ఉండే రాగం ఇది. ఔడవ - ఔడవ రాగం. ఆరోహణలోను, అవరోహణలోను ఐదు స్వరాలుంటాయి.

చ శు కై. .
ఆరో: స రి మ ప ని స

. కై. శు. చ.
అవ: స ని ప మ రి స

త్యాగయ్య ఈ రాగంలో 'అడిగిసుఖములు', 'రామకథా సుధా', 'వినాయకునివలెను', 'అలక లల్లాడగ' మొదలైన ఎన్నో కీర్తనలు రచించాడు. శ్యామశాస్త్రి 'పాలించు కామాక్షి' అన్న కీర్తన బాగా ప్రచారంలో ఉంది.

'స్వాతి ముత్యం' సినిమాలో 'సువ్వీసువ్వీ సువ్వాలమ్మా' అన్న పాట ఈ రాగంలోదే.

రాగాలు ఎన్నో ఉన్నాయి. మనం కొన్ని రాగాలు గురించి కొద్దికొద్దిగా చెప్పుకొన్నాం. అలాగే ఆ రాగాలలో ఉన్న కొన్ని కీర్తనల్ని, సినిమా పాటల్ని మీకు చెప్పాను. మీరు ఏదైనా కీర్తనకాని, సినిమాపాట కాని వింటున్నారనుకోండి. ఆ పాట మనం చెప్పుకొన్న రాగాలలో ఉంటే, అది ఏ రాగంలో ఉందో ఒక్కసారి జ్ఞాపకం చేసుకోండి. ఉదాహరణకి 'కొండలలో నెలకొన్న కోనేటి రాయడువాడు' అనే అన్నమయ్య కీర్తన వింటున్నారు అనుకోండి. ఇది ఏ రాగంలో ఉంది? 'హిందోళ' అని మనం చెప్పుకొన్నాం కదా! ఈ కీర్తన హిందోళ రాగంలో ఉంది - అని ఒక్కసారి గుర్తుతెచ్చుకోండి. రాగం పేరు గుర్తుతెచ్చుకొన్నాక ఆ పాట శ్రద్ధగా వినండి. అలా వింటే ఆ రాగం మీ మనసుకి

బాగా హత్తుకొంటుంది. అలా ఆ రాగం మీ మనసుకి హత్తుకొంటే ఆ రాగంలో మనం చెప్పుకోని కీర్తనల్ని, పాటల్ని విన్నా మీరు వెంటనే ఈ పాట ఫలానా రాగంలో ఉంది అని గుర్తు పట్టగలుగుతారు.

'మోహన' రాగంలో ఉన్న కీర్తనల్ని బాగా విన్నారంటే, ఆ రాగంలో ఉన్న మనం చెప్పుకోని కీర్తనల్ని, పాటల్ని కూడా మీరు గుర్తుపట్టగలరు. ఇలా ఏ రాగమైనా ఆ రాగాన్ని బాగా విని, దానితో బాగా పరిచయం ఏర్పరచుకొంటే ఆ రాగం ఎవరు పాడినా, వాయించినా మీరు గుర్తు పట్టగల్గుతారు.

మీ ఊళ్ళో సంగీత సభ ఉందా? ఉంటే కచేరీలకి వెళ్ళి వినండి. ఆ కచేరీలో మీరు విన్న కీర్తనలు ఏ రాగంలో ఉన్నాయో సంగీతం వచ్చిన వాళ్ళను అడిగి తెలుసుకోండి. ఆ కీర్తన, రాగం పేరు, దాన్ని రచించిన వాగ్గేయకారుడి పేరు ఒక పుస్తకంలో రాసుకోండి. రేడియోలో రోజూ సంగీతం వస్తూంటుంది. కీర్తనలు ఏ రాగంలో ఉన్నాయో రేడియోలో చెబుతారు. అది విని ఆ కీర్తన, రాగం, రచించిన వాగ్గేయకారుడి పేరు మీ పుస్తకంలో రాసుకోండి. ఆ కీర్తనల్ని బాగా వినండి. ఇలా చేస్తే ఎన్నెన్నో రాగాలతో మీకు పరిచయం ఏర్పడుతుంది. అలా వినగా వినగా రాగాల్ని స్వంతంగా గుర్తుపట్టగలిగే శక్తి మీకు వస్తుంది. సరేనా? అయితే మరి రాగాల్ని గుర్తించే ప్రయత్నం ఈ రోజునుంచే ప్రారంభించండి.

# 4 తాళం

మీరు టి.వి.లోకాని, సంగీతకచేరీలోకాని ఎవరైనా పాడు తుంటే చూశారా? పాటపాడుతూ ఉంటారు. పాటతో పాటు, పాటకి తగినట్టుగా చేతిని కూడా కదుపుతూ ఉంటారు. పాటకి తగినట్లు చేతినికదపడాన్నే తాళం అంటారు. అస్సలు సంగీతం రాని వాళ్ళుకూడా, పాట వింటుంటే, వాళ్ళకి తెలియకుండానే తమ చేతిని కదుపుతూ తాళం వేస్తూంటారు. ఎప్పుడైనా గమనించారా?

## తాళం అంటే ఏమిటి?

స్కూటర్లు, కార్లు వీటి వేగాన్ని దేనితో కొలుస్తారు? స్కూటర్లకి, కార్లకి 'స్పీడో మీటరు' అనే మీటరు ఉంటుంది. కారులేదా స్కూటరు ఎంత వేగంగా వెడుతోందో ఈ మీటరుని చూసి తెలుసుకోవచ్చు. అలాగే పాట వేగాన్ని కొలవడానికి ఏర్పాటు చేసిందే ఈ తాళం. పాటని కొలవడం ఏమిటి అని మీకు సందేహం వచ్చి ఉండవచ్చు. పాటని కొలవడం అంటే ఏమిటో తెలుసుకొందాం పాటల్లో అక్షరాలు ఒక క్రమపద్ధతిలో ఉంటాయి. మామూలు మాటల్లో అలా ఉండవు. క్రమపద్ధతి అంటే నియమిత కాలంలో, నియమిత అక్షరాన్ని పాడతాం లేదా వాయిస్తాం.

ఉదాహరణకి మన జాతీయ గీతం 'జనగణమన' తీసుకొందాం.

జనగణ | మనఅధి | నాయక | జయహే |

భారత | భాగ్యవి | ధాతా

ఈ పాటకి కొన్ని అక్షరాలు తరువాత ఎలాగీతలు గీశానో చూడండి. ప్రతీనాలుగు అక్షరాలు తరువాత గీతలు గీశాను చూడండి. అయతే మీకు ఓ అనుమానం రావచ్చు 'జనగణ' ఇవి ఎన్ని అక్షరాలు? నాలుగు కదా! అయితే 'నాయక' ఇవి ఎన్ని అక్షరాలు? మూడు అక్షరాలు అనుకొంటున్నారా? కాదు. ఇవికూడా నాలుగే ... ఎలా అంటే 'న' కి మనం దీర్ఘం ఇచ్చాం కదా! అంటే 'న' ఒక అక్షరం, దీర్ఘం ఇంకో అక్షరం ఇప్పుడు ఎన్ని అక్షరాలు అయ్యాయి? రెండు కదా! అందుచేత 'నాయక' అన్నవి కూడా నాలుగు అక్షరాలే. అంటే దీర్ఘంతో ఉన్న అక్షరాలను రెండు అక్షరాలుగా తీసుకోవాలి అన్నమాట. సున్నతో ఉన్న అక్షరాన్ని కూడా రెండు అక్షరాలుగానే లెక్కించాలి.

పంజా | బసింధు | గుజరా | తమరా | ఠా

ఇందులో 'ప'కు సున్న ఉంది కదా! అందుచేత దానిని రెండు అక్షరాలుగా లెక్కపెడతాం.

ఇలా పాటని అంతా మనం నాలుగు అక్షరాలుగా విడదీయవచ్చు. మిగిలిన పాటను అంతా మీరు నాలుగు అక్షరాలు చొప్పున విడదీయండి.

మనం మొదటి నాలుగు అక్షరాలు పాడడానికి ఎంత కాలం తీసుకొన్నామో, తరువాత నాలుగు అక్షరాలకీ, ఆ తరువాత

నాలుగు అక్షరాలకి కూడా అంతే కాలం తీసుకొంటాం. మొదటి నాలుగు అక్షరాలకి ఒక సెకను పట్టిందనుకోండి, తరువాత మళ్ళీ నాల్గుఅక్షరాలకి ఒక సెకనే పడుతుంది. అంటే ప్రతీ ఒక సెకనుకి నాలుగు అక్షరాలే వస్తాయి. అంటే ఒక నియమిత కాలంలో నియమిత అక్షరాలు వస్తున్నట్లే కదా!. ఈ విధంగా, పాటల్లో అక్షరాలు క్రమ పద్ధతిలో ఉండడంచేతనే, పాటవింటుంటే మనం అప్రయత్నంగా చేతులు కదుపుతూ తాళం వేస్తాం. పాటలో ఉన్న అక్షరాల్ని చూపించడానికి తాళం వేస్తాం. 'జనగణమన'లో నాలుగు అక్షరాలను చూపించడానికి ఒక చిటిక వేశాం అనుకోండి. అంటే ఒక చిటికను నాలుగు, మరో చిటికకు నాలుగు ఇలా చూపించాలి. అంటే ఒక చిటికను నాలుగు అక్షరాలు చొప్పున పాటను కొలుస్తున్నట్లేగా? అవునా?

ఇలా పాటలో అక్షరాలను సూచించడానికి చిటికలు వేయడమో; కుడిచేతితో, కుడితొడమీద దెబ్బలు వేయడమో చేస్తుంటారు. చిటికెలు వేయడం, దెబ్బవేయడం ఇటువంటి వాటిని క్రియలు అంటారు. క్రియలు చాలా ఉన్నాయి. చేతితో దెబ్బవేయడం ఒక క్రియ. అలాగే దెబ్బవేసిన చేతిని తిరగవేయడం ఒకక్రియ. అదే విధంగా అక్షరాలను సూచించడానికి వేళ్ళను వేయడం కూడా క్రియలే. ఇలాంటి కొన్ని క్రియలు కలిస్తే ఒక 'అంగం' ఏర్పడుతుంది. కొన్ని అంగాలు కలిస్తే ఒక 'తాళం' ఏర్పడుతుంది. పాటలకి తాళం ఉండదు. పాటలకి కేవలం చిటికలో, చేతితో దెబ్బవేస్తేనోచాలు. అంటే పాటల్ని ఒక క్రియతో కొలుస్తారన్నమాట. అయితే కీర్తనలకి అలాకాదు. కొన్ని అంగాలను కలిపి తాళాల్ని

రూపొందించి, ఈ తాళాలతో కీర్తనల వేగాన్ని కొలుస్తారు.

తాళాన్ని కుడి చేతితో, కుడితొడపైన వేస్తారు. మన కర్ణాటక సంగీతంలో కనిపించే తాళాలు మరి ఏ సంగీతంలో కనిపించవు. ఎన్నెన్నో రకాల తాళాలు మన కర్ణాటక సంగీతంలో ఉన్నాయి.

## 'తాళము' అన్న శబ్దం ఎలాపుట్టింది?

కొన్ని క్రియలు కలిస్తే 'అంగాలు' ఏర్పడతాయని, కొన్ని అంగాలు కలిస్తే తాళం ఏర్పడుతుందని చెప్పుకొన్నాం. అసలు 'తాళము' అన్న శబ్దం ఎలా ఏర్పడిందో తెలుసుకొందాం.

శివుడు చేసే నృత్యాన్ని 'తాండవం' అంటారు. పార్వతి చేసే నృత్యాన్ని 'లాస్యం' అన్నారు. తాండవంలో 'తా'ను, 'లాస్యాం'లో 'లా' తీసుకొని తాలము అని పిలిచారు. ఈ 'తాలము' అన్నదే క్రమంగా 'తాళము' అయ్యింది.

## క్రియలు - రకాలు

క్రియలు ఎన్ని రకాలున్నాయో చూద్దాం. చిటికెలు వేయడం; కుడిచేతితో ఎడమచేతిమీద గట్టిగా దెబ్బ వేయడం. కుడి చేతితో కుడితొడపైన దెబ్బవేయడం, కుడిచేతిని బోర్లించి కుడితొడపైన దెబ్బవేయడం, వేళ్లు వేయడం ఇవన్నీ కూడా క్రియలే.

వేళ్ళని వేయడం కూడా క్రియే అని చెప్పుకొన్నాం కదా! వేళ్ళని ఎలా వెయ్యాలి? వేళ్ళువేసేటప్పుడు చిటికెన వేలుతో మొదలు

పెట్టాలి. ఆ తరువాత ఉంగరం వేలు, మధ్యవేలు, చూపుడు వేలు బొటనవేలు ఆతరువాత మళ్ళీ చిటికెనవేలు ఇలా అవసరాన్ని బట్టి కావలసిన వేళ్ళు వేస్తూంటారు. వేళ్ళని వేసేటప్పుడు ఎప్పుడూ చిటికెన వేలుతోనే మొదలు పెట్టాలి.

## అంగాలు - రకాలు

క్రియలు కొన్ని కలిస్తే ఒక అంగం ఏర్పడుతుంది. అంగాలు చాలా రకాలున్నాయి. అయితే ప్రస్తుతం మూడు రకాల అంగాలే వాడుకలో ఉన్నాయి. అవి ఏమిటంటే 1 లఘువు 2 ధృతం 3 అనుధృతం. ఈ అంగాలు గురించి తెలుసుకొందాం.

అనుధృతం అంటే ఒక దెబ్బవేయడం. కుడిచేతితో, కుడితొడమీద ఒక దెబ్బవేయడం అనుధృతం అవుతుంది. లేదాకుడిచేతితో ఎడమచేతిపైన దెబ్బవేయడం కూడా అనుధృతం అవుతుంది. అంటే అనుధృతంకి ఒకటే క్రియ ఉంది అన్నమాట.

లెక్కల్లో మనం కూడికకి '+' తీసివేతకు '—' సమానం అని రాయడాని '=' గుర్తులు ఉపయోగిస్తాం కదా! అంగాలను సూచించేందుకు కూడా గుర్తులు వాడతారు.

U అనుధృతానికి గుర్తు

ధృతం గురించి తెలుసుకొందాం. ధృతం అంటే కుడిచేతితో, కుడితొడపైన దెబ్బవేసి; మళ్ళీ ఆచేతిని, వెనక్కి తిప్పి, తొడపైన ఇంకొకదెబ్బవేయడం. అంటే అరచెయ్యిపైకి కనిపించేలా ఉంచి,

దెబ్బవేయడం అన్నమాట. చేతితో తొడపైన దెబ్బవేయడం ఒక క్రియ, అరచెయ్యి పైకి కనిపించేలా ఉంచి దెబ్బవేయడం ఇంకొక క్రియ. ధృతానికి రెండుక్రియలు ఉన్నాయన్నమాట. అరచేతిని పైకి కనిపించేలా ఉంచి దెబ్బవేయడాన్నే 'ఉసి' అంటారు. ఒక దెబ్బ, ఒక ఉసి కలిసి ఒక ధృతం అవుతుంది.

ధృతానికి గుర్తు O (సున్న)

లఘువు అంటే ఒక దెబ్బవేసి, వేళ్ళు వేయడం. వేళ్ళు వేసేటప్పుడు చిటికెన వ్రేలుతో మొదలు పెట్టాలని తెలుసుకొన్నాం. గుర్తుందా?

లఘువుకు గుర్తు | (ఒక నిలువుగీత)

అనుధృతానికి ఒక క్రియ ఉంటుందని, ధృతానికి రెండు క్రియలు ఉంటాయని చెప్పుకొన్నాం. అయితే ఒక లఘువుకు ఎన్ని క్రియలు ఉంటాయి? కొన్ని లఘువులకి మూడు క్రియలు, కొన్నింటికి నాలుగు క్రియలు, మరికొన్నింటికి ఐదు క్రియలు, ఏడు క్రియలు, తొమ్మిది క్రియలు ఉంటాయి.

మూడు క్రియలున్న లఘువు ఎలా వెయ్యాలో చూద్దాం. కుడి చేతితో, కుడి తొడపైన దెబ్బవేసి, ముందు చిటికెనవేలు, తరువాత ఉంగరం వేలు వేయాలి. వేళ్ళు వేయడం అంటే ఏమిటి? అని మీకు సందేహం వచ్చి ఉండాలి. కుడి చేతితో కుడి తొడపైన ఒక దెబ్బవేసి, ఆ చేతిని పైకి ఎత్తకుండా అలాగే ఉంచి, చిటికెన వేలుతో చిన్నదెబ్బ, ఆ తరువాత ఉంగరం వేలు (అనామిక వేలు) తో మరో చిన్నదెబ్బవేయాలి. వేళ్ళతో తొడపైన ఇలా చిన్న దెబ్బలు వేయడాన్నే వేళ్ళువేయడం అంటాం. ఇప్పుడు

ఈ లఘువుకి ఎన్ని క్రియలో చూడండి. ఒక దెబ్బ, రెండు వేళ్ళువేశాం. అంటే మొత్తం మూడు క్రియలు. ఇలా మూడు క్రియలున్న ఈ లఘువునే 'త్రిశ్రజాతి లఘువు' అంటారు.

నాలుగు క్రియలు ఉన్న లఘువును 'చతురశ్రజాతి లఘువు' అంటారు. ఇది ఎలా వెయ్యాలో చూద్దాం. కుడిచేతితో కుడితొడపైన దెబ్బవేసి, ఆ చేతిని పైకి ఎత్తకుండా అలాగే ఉంచి, చిటికెన వేలుతో ఒక చిన్న దెబ్బ, ఉంగరం వేలితో ఒక చిన్నదెబ్బ, ఆ తరువాత మధ్యవేలుతో ఒక చిన్న దెబ్బవేయాలి. అంటే ఒక దెబ్బ, మూడు వేళ్ళువేశాం. మొత్తం ఈ లఘువుకి ఇప్పుడు ఎన్ని క్రియలు? నాలుగు క్రియలుకదా.

ఐదు క్రియలు ఉన్న లఘువునే ఖండ జాతి లఘువంటారు. దీన్ని వేయడం ఎలాగో తెలుసుకొందాం. కుడి చేతితో, కుడితొడపైన ఒక దెబ్బవేయాలి. ఆ చేతిని అలాగే ఉంచి, చిటికెన వేలుతో ఒక చిన్న దెబ్బ, ఉంగరం వేలుతో ఒక చిన్న దెబ్బ, మధ్యవేలుతో ఒకదెబ్బ చూపుడు వేలితో చిన్నదెబ్బవేయాలి. అంటే ఇప్పుడు ఒక దెబ్బ, నాలుగు వేళ్ళు వేశాం. మొత్తం ఐదు క్రియలు అయ్యాయి కదా! ఈ లఘువునే ఖండజాతి లఘువుఅంటారు.

తొమ్మిది క్రియలు ఉన్న లఘువును సంకీర్ణజాతి లఘువు అంటారు. ఇది ఎలా వెయ్యాలో చూద్దాం. కుడిచేతితో కుడితొడపైన ఒక దెబ్బ వేస్తారు. తరువాత చిటికెనవేలుతో, తరువాత ఉంగరం వేలుతో, ఆ తరువాత మధ్యవేలుతో, తరువాత చూపుడువేలుతో, బొటన వ్రేలుతో చిన్నదెబ్బలు తొడపైన వేసి, తిరిగి చిటికెన వేలుతోను, ఉంగరం వేలుతోను, మధ్యవేలుతోను తొడపైన చిన్న

దెబ్బలువేస్తే, సంకీర్ణ జాతి లఘువు పూర్తి అవుతుంది. అంటే మొత్తం ఎన్ని క్రియలు అయ్యాయి? ఒక దెబ్బ, ఎనిమిది వేళ్ళువేశాం. మొత్తం తొమ్మిది క్రియలు అయ్యాయి కదా!

ఏడు క్రియలున్న లఘువును ఎలా వెయ్యాలో తెలుసుకొందాం. కుడిచేతితో కుడితొడపైన దెబ్బవేసి, ఆ చేతిని అలాగే ఉంచి ముందు చిటికెనవేలు తోను, ఆతరువాత ఉంగరం వేలుతో, మధ్యవేలుతో, చూపుడు వేలుతో, బొటన వేలుతో, తిరిగి చిటికెన వేలుతో, చిన్న చిన్న దెబ్బలు వేయాలి. ఇలా వేస్తే ఇప్పుడు ఎన్ని క్రియలు వచ్చాయి? మొత్తం ఏడుకదా! ఈ విధంగా ఏడు క్రియలున్న లఘువునే మిశ్రజాతి లఘువు అంటారు.

లఘువులో 1 త్రిశ్రజాతి 2. మిశ్రజాతి 3. ఖండజాతి 4. సంకీర్ణజాతి అనే 5 చతురస్ర జాతి 5ఐదుజాతి లఘువులు ఉన్నాయి.

## తాళాలు

క్రియలు కొన్నికలిస్తే అంగం ఏర్పడుతుందని కొన్ని అంగాలు కలిస్తే 'తాళం' అవుతుందని మనం ముందు చెప్పుకొన్నాం. తాళాలు ఎన్నెన్నో రకాలు ఉన్నాయి. పూర్వం 108 తాళాలున్నాయని చెప్పారు. ఈ 108 తాళాలు మనం చెప్పుకొన్న లఘువు, ధృతం, అనుధృతమే కాకుండా ఇంకా ఇతర అంగాలతోఏర్పడ్డాయి. ప్రస్తుతం ఈ 108 తాళాలు అమల్లో లేవు. ప్రస్తుతం ఏడు ముఖ్యమైన తాళాల్ని మన సంగీతంలో

వాడుతున్నారు. సంస్కృతంలో సప్త అంటే ఏడు. ఈ ఏడుతాళాలనే సప్తతాళాలు అంటారు.

## సప్తతాళాలు

**1.** ధ్రువతాళం **2.** మఠ్యతాళం **3.** రూపకతాళం **4.** ఝంపెతాళం **5.** త్రిపుటతాళం **6.** అటతాళం **7.** ఏకతాళం

సప్తతాళాలలో ఒకొక్క తాళంనుంచి ఐదు తాళాలు పుడతాయి. అంటే 7 x 5 = 35 రకాల తాళాలు సప్తతాళాలనుంచి ఏర్పడతాయి. ఈ **35** తాళాలని మన సంగీతంలో ప్రస్తుతం ఎక్కువగా వాడుతున్నారు.

మనం ఒక్కొక్కతాళం గురించి, దానినుంచి పుట్టే తాళాలు గురించి చెప్పుకొందాం.

**1.** ధ్రువతాళం: ఒక లఘువు, ఒక ధృతం, మళ్ళీ రెండు లఘువులు కలిస్తే ధ్రువతాళం అవుతుంది. లఘువుకి నిలుగీత గుర్తు అని, ధృతానికి సున్నగుర్తు అని మనం ముందుచెప్పుకొన్నాం గుర్తుందా? ఈ ధ్రువతాళాన్ని గుర్తులతోచూపిస్తే I O I I ఇలా ఉంటుంది.

ఈ తాళం ఎలా వెయ్యాలో చూద్దాం. ఈ తాళం ఎలా వెయ్యాలో తెలుసుకొనేముందు - ఒకసారి లఘువు ఎలా వెయ్యాలో, ధృతం ఎలా వెయ్యాలో గుర్తుతెచ్చుకోండి. ఏం - గుర్తు తెచ్చుకొన్నారా? ఈ ధ్రువతాళంకి ముందు ఒక లఘువువేసి, ఆ తరువాత ధృతం వేసి, ఆ తరువాత రెండు లఘువులు

వేయాలి. అయితే లఘువుల్లో ఐదు రకాలు ఉన్నాయని చెప్పుకొన్నాం కదా! మరి ధృవతాళంలోవేసే లఘువులు ఏ జాతి లఘువులు వెయ్యాలి? ఉదాహరణకి ధృవతాళంలో వచ్చే లఘువులు అన్నీ త్రిశ్రజాతి లఘువులే వేశాం అనుకోండి. అప్పుడు ఆ ధృవతాళాన్ని త్రిశ్రజాతి ధృవతాళం అంటాం. ఈ త్రిశ్రజాతి ధృవతాళం ఎలా వెయ్యాలో చూద్దాం. ముందు దెబ్బవేసి, మూడు వేళ్ళువేస్తాం. అక్కడికి త్రిశ్రజాతి లఘువుపూర్తి అయ్యింది. ఇప్పుడు దెబ్బవేసి, ఉసివేస్తాం. అంటే ఒక ధృతం పూర్తిఅయ్యింది. తరువాత రెండు త్రిశ్రజాతి లఘువులు వెయ్యాలి. ఈ ధృవతాళానికి మొత్తం ఎన్నిక్రియలు వచ్చాయో లెక్కించండి. 3 + 2 + 3 + 3 = 11 క్రియలు కదా!

ధృవతాళంలో ఉన్న అన్ని లఘువులు చతురశ్రజాతివే వేస్తే అప్పుడు అది చతురశ్ర జాతిధృవతాళం అవుతుంది. అదే విధంగా లఘువులు అన్నీ ఖండజాతివి వేస్తే అది ఖండజాతి ధృవతాళం; మిశ్రజాతివి వేస్తే అది మిశ్రజాతి ధృవతాళం; సంకీర్ణ జాతి లఘువులు వేస్తే అది సంకీర్ణ జాతి ధృవతాళం అవుతుంది.

ధృవతాళం నుంచి వచ్చిన తాళాలు ఇవి -

1. తిశ్రజాతి ధృవతాళం
2. చతురశ్ర జాతి ధృవతాళం
3. ఖండజాతి ధృవతాళం
4. మిశ్రజాతి ధృవతాళం

5. సంకీర్ణ జాతి ధృవతాళం

అంటే ధృవతాళంలో లఘువుల్ని మార్చడం వల్ల 5 రకాల తాళాలు వస్తున్నాయి.

**2)** మఠ్య తాళం: లఘువు వేసి, ఆ తరువాత ఒక ధృతం వేసి మళ్ళీ ఒక లఘువు వేస్తే అది మఠ్య తాళం అవుతుంది. దీనిని గుర్తులతో సూచిస్తే IOI అవుతుంది. లఘువులు జాతులు మారిస్తే, ధృవతాళంలో ఎలా ఐదు తాళాలు వచ్చాయో, మఠ్యతాళంలో కూడా వస్తాయి. అంటే - ఈ మఠ్య తాళంలో ఉన్న లఘువుల్ని త్రిశ్రజాతి లఘువులు వేస్తే అది త్రిశ్రజాతి మఠ్యతాళం, చతురశ్రజాతి లఘువులు వేస్తే అది చతురశ్రజాతి మఠ్యతాళం, ఖండజాతి లఘువులు వేస్తే అది ఖండజాతి మఠ్యతాళం, సంకీర్ణ జాతి లఘువులు వేస్తే అది సంకీర్ణజాతి మఠ్యతాళం, మిశ్రజాతి లఘువులు వేస్తే అది మిశ్రజాతి మఠ్యతాళం అవుతాయి.

మఠ్యతాళం నుంచి వచ్చిన తాళాలు

1. త్రిశ్రజాతి మఠ్యతాళం
2. చతురశ్రజాతి మఠ్యతాళం
3. సంకీర్ణజాతి మఠ్యతాళం
4. ఖండజాతి మఠ్యతాళం
5. మిశ్రజాతి మఠ్యతాళం

**3)** రూపకతాళం: ఒక ధృతం, ఒక లఘువు కలిస్తే రూపకతాళం ఏర్పడుతుంది. గుర్తులతో ఈ తాళం చూపిస్తే OI అవుతుంది. ఈ రూపక తాళంలో లఘువుల జాతుల్ని మార్చితే ఐదు తాళాలు వస్తాయి. అంటే లఘువుల్ని త్రిశ్రజాతి, చతురశ్రజాతి,

ఖండజాతి, మిశ్రజాతి, సంకీర్ణజాతి ఇలా మార్చితే 5 రకాల తాళాలు వస్తాయి. రూపక తాళం నుంచి వచ్చే తాళాలు

1. త్రిశ్రజాతి రూపకతాళం
2. చతురస్రజాతి రూపకతాళం
3. ఖండజాతి రూపకతాళం
4. సంకీర్ణజాతి రూపకతాళం
5. మిశ్రజాతి రూపకతాళం

చతురస్రజాతి రూపకతాళంకి ఎన్ని క్రియలుంటాయి? లఘువు చతురస్ర జాతిది. అంటే నాలుగు క్రియలు ధృతం రెండు క్రియలు. మొత్తం చతురస్ర జాతి రూపకతాళానికి 4 + 2 = 6 క్రియలు కదా! ఈ చతురస్రజాతి రూపకతాళాన్ని ధృతం, లఘువుతో చూపించకుండా వేరే రకంగాకూడా చూపిస్తారు. రెండు దెబ్బలు, ఒక ఉసి; తరువాత రెండు దెబ్బలు, ఇలా 3 + 3 క్రియలు రూపంగా కూడా ఈ చతురస్రజాతి రూపకతాళాన్ని చూపిస్తూ ఉంటారు.

4) ఝంపె తాళం: ఇప్పటి దాకా మనం చెప్పుకొన్న ఏ తాళంలోనూ రాని అంగం, ఈ ఝంపె తాళంలో వస్తుంది. అది అనుధృతం. అనుధృతం అంటే జ్ఞాపకం ఉందా? ఒక దెబ్బని కుడిచేతితో కుడితొడమీద వెయ్యాలి. ఝంపె తాళంలో వచ్చే అంగాలు ఒక లఘువు, తరువాత అనుధృతం, ఒక ధృతం. దీనిని గుర్తుల రూపంలో చూపిస్తే IUO అవుతుంది.

మిగిలిన తాళాల లాగే ఈ ఝంపె తాళంలో లఘువుల జాతుల్ని మార్చితే 5 రకాల తాళాలు వస్తాయి.

అవి: 1. త్రిశ్రజాతి ఝంపెతాళం

2. చతురశ్రజాతి ఝంపెతాళం

3. ఖండజాతి ఝంపెతాళం

4. మిశ్రజాతి ఝంపెతాళం

5. సంకీర్ణజాతి ఝంపెతాళం

**5. త్రిపుటతాళం:** ఒక లఘువు, రెండు ధృతాలు కలిస్తే అది త్రిపుటతాళం అవుతుంది. దీనిని గుర్తుల్లో చూపిస్తే 100 త్రిపుట తాళంలో లఘువు జాతులు మార్చితే కూడా ఐదు రకాల తాళాలు వస్తాయి.

అవి: 1. త్రిశ్రజాతి త్రిపుటతాళం

2. చతురశ్రజాతి త్రిపుటతాళం

3. ఖండజాతి త్రిపుటతాళం

4. సంకీర్ణజాతి త్రిపుటతాళం

5. మిశ్రజాతి త్రిపుటతాళం

ఈ 5 తాళాల్లో చతురశ్రజాతి త్రిపుటతాళాన్ని 'ఆదితాళం' అని కూడా పిలుస్తారు. ఈ 'ఆదితాళం' బాగా ప్రచారంలో ఉంది. ఎన్నో కీర్తనలు ఈ ఆదితాళంలోనే ఉన్నాయి. ఆదితాళాన్ని ఎలా వెయ్యాలో చూద్దాం. ఆదితాళానికి ఒక చతురశ్రజాతి లఘువు, రెండు ధృతాలు ఉంటాయి. చతురశ్రజాతి లఘువు ఎలా వేస్తాం?

కుడిచేతితో కుడి తొడమీద దెబ్బవేసి, ఆ చేతిని అలాగే ఉంచి, చిటికెన వేలుతో ఒక చిన్న దెబ్బ, ఉంగరం వేలుతో చిన్నదెబ్బ, ఆ తరువాత మధ్యవేలుతో ఒక దెబ్బ వేస్తే చతురస్రజాతి లఘువు పూర్తి అవుతుంది. ఆ తరువాత ఒక దెబ్బ, ఉసి వేస్తే ఒక ధృతం అవుతుంది. మళ్ళీ ఒక దెబ్బ, ఉసి వేస్తే ఇంకొక ధృతం పూర్తి అవుతుంది. దీనితో ఆదితాళం కూడా పూర్తి అవుతుంది. ఆదితాళానికి లఘువు నాలుగు క్రియలు, ధృతం రెండు, మళ్ళీ ఇంకోధృతం రెండు క్రియలు మొత్తం ఆదితాళానికి ఎనిమిది క్రియలు.

**6. అటతాళం:** అటతాళానికి అంగాలు రెండు లఘువులు, రెండు ధృతాలు. దీన్ని గుర్తులో IIOO అని చూచిస్తాం. ఈ తాళంలో లఘువుల జాతుల్ని మార్చితే **5** తాళాలు వస్తాయి.

అవి: **1.** త్రిశ్రజాతి అటతాళం

**2.** చతురస్రజాతి అటతాళం

**3.** మిశ్రజాతి అటతాళం

**4.** ఖండజాతి అటతాళం

**5.** సంకీర్ణజాతి అటతాళం

**7. ఏకతాళం:** ఇది చాలా సరళమైన తాళం. ఒకే ఒక్క అంగం ఉంటుంది ఈ ఏకతాళానికి. అందుకనే ఈ తాళాన్ని ఏకతాళం అన్నారు. దీని గుర్తు I అండే దీనికి ఉన్న ఒక్క అంగము ఏమిటి? ఒక లఘువు అన్నమాట.

ఏక తాళంలో ఉన్న ఈ లఘువు జాతులు మార్చితే

(1) త్రిశ్రజాతి ఏకతాళం,

(2) చతురశ్రజాతి ఏకతాళం,

(3) మిశ్రజాతి ఏకతాళం,

(4) ఖండజాతి ఏకతాళం,

(5) సంకీర్ణజాతి ఏకతాళం వస్తాయి.

## చాపుతాళం

మనం సప్త తాళాల్ని, వాటినుంచి వచ్చే తాళాల్ని గురించి చెప్పుకొన్నాం. ఈ **35** తాళాలలోకి రాని తాళాలు చాపుతాళాలు అని ఒకరకం తాళాలు ఉన్నాయి. వీటికి అంగాలు లేవు. ఒక ఘాత, ఒక ఉసి వస్తాయి. ఇందులో మళ్ళీ నాలుగు రకాల చాపుతాళాలు ఉన్నాయి. వాటి గురించి తెలుసుకొందాం.

1. మిశ్రచాపు: ఒక ఘాత, ఒక ఉసి వేస్తారు. ఘాతకు మూడు అక్షరాలు, ఉసికి నాలుగు అక్షరాలు చొప్పున పాడతారు. అంటే మొత్తం ఏడు అక్షరాలు.
2. ఖండచాపు: రెండు అక్షరాల కాలం ఉన్న ఒక దెబ్బ, మూడు అక్షరాల కాలం ఉన్న మరో దెబ్బ దీని అంగాలు. అంటే మొత్తం ఐదు అక్షరాల కాలం.
3. త్రిశ్రచాపు: ఒక అక్షరకాలం ఉన్న ఒక దెబ్బ రెండు అక్షరాల కాలం ఉన్న మరో దెబ్బ ఈ త్రిశ్రచాపు అంగాలు.

4. సంకీర్ణచాపు: నాలుగు అక్షరాలున్న ఒక దెబ్బ ఐదు అక్షరాలున్న మరోఘాత దీని అంగాలు. మొత్తం తొమ్మిది అక్షరాలు.

ఏ రకం చాపుతాళమో చెప్పకుండా 'చాపుతాళం' అంటే అది మిశ్రచాపు అని అర్థం.

ప్రతీ కీర్తనకూడా ఏదో ఒక తాళంలో ఉంటుంది. సాధారణంగా మనం చెప్పుకొన్న తాళాల్లో ఎక్కువగా ఆదితాళం, రూపకతాళం, త్రిపుటతాళం, మిశ్రచాపు, ఖండచాపు తాళాలు వాడతారు. అంటే ఈ తాళాల్లో ఎక్కువ కీర్తనలు ఉంటాయన్నమాట.

## కీర్తనకి తాళం వేయడం ఎలాగ?

ఎవరైనా కీర్తన పాడుతున్నారనుకోండి. మనం తాళం ఎలా వెయ్యాలి? ఉదాహరణకి 'వాతాపిగణపతింభజే' అన్న కీర్తన ఉంది. ఇది ఆదితాళంలో ఉంది. ఆదితాళం ఎలావేస్తాం? ఒక లఘువు (ఇది చతురశ్రజాతిది) రెండు ధృతాలు వెయ్యాలి అని చెప్పుకొన్నాం. ఇలా వేస్తే తాళం పూర్తి అయిపోతుంది. మరి తాళం పూర్తి అయిపోయినా పాట ఇంకా ఉంటుంది. అప్పుడు ఏం చెయ్యాలి మరి? మళ్ళీ లఘువు, ధృతం, ధృతం వెయ్యాలి. ఇలా పాట అంతా అయిపోయే దాకా లఘువు, ధృతం, ధృతం, మళ్ళీ లఘువు, ధృతం, ధృతం ఇలా వేస్తూండాలి. అంటే ఆదితాళంకి

ఉన్న అంగాలు; లఘువు, ధృతం, ధృతం - ఇవే పాట అయ్యేంతవరకూ తిరుగుతూ ఉంటాయి. ఇలా మళ్ళీ మళ్ళీ ఇవే అంగాలు తిరగడాన్ని ఆవృత్తం చెందడం అంటారు. ఇందులో మళ్ళీ మళ్ళీ వచ్చేవి ఏమిటి? ఒక లఘువు, ధృతం, ధృతం కదా! దీని ఆదితాళం యొక్క ఆవృత్తం అంటారు. అంటే ఆదితాళం యొక్క ఒక ఆవృత్తానికి ఒక లఘువు, ఒక ధృతం, మళ్ళీ ఒక ధృతం ఉంటాయన్నమాట.

ప్రతీ తాళానికి అంగాలుంటాయని మనం తెలుసుకొన్నాం. తాళాన్ని వేయడానికి; వాటి అంగాలను వేశాక, తిరిగి మనం మొదలు పెట్టిన అంగాలతోనే తాళాన్ని తిరిగి వేస్తూంటాం.

ఇంకొక ఉదాహరణ చూద్దాం. మత్యతాళంకి ఉన్న అంగాలేవి? లఘువు, ధృతం, లఘువు కదా! ముందు లఘువు వేసి, తరువాత ధృతం వేసి, మళ్ళీ లఘువు వేస్తాం. మళ్ళీ లఘువు వేసి, ధృతం వేసి తిరిగి లఘువు వేస్తాం. ఇలా పాట పూర్తి అయ్యేదాకా వేస్తూంటాం. ఈ మత్యతాళంలో ఆవృత్తం అయ్యే అంగాలు లఘువు, ధృతం, లఘువును. కనుక లఘువు, ధృతం, లఘువుని మత్యతాళం యొక్క ఒక ఆవృత్తం అంటారు.

ఇలాగే ప్రతీ తాళంకి ఉన్న అంగాలు మళ్ళీ మళ్ళీ తిరుగుతూ, పాట పూర్తి అయ్యేదాకా వస్తూంటాయి.

పాడేవాళ్ళు ఇలా కీర్తన పూర్తి అయ్యేదాకా తాళం వేస్తూంటారు. అలాగే శ్రోతలు కూడా కచేరీలలో తాళం

వేస్తూంటారు. అయితే వీణ, వైలిన్ మొదలైన వాద్యాలు వాయించేవాళ్ళకి తాళం వెయ్యడం ఎలా వీలుపడుతుంది? రెండు చేతులతోనూ, వాద్యాన్ని వాయిస్తూంటారు కదా! అందుచేత వాళ్ళకి చేతితో తాళం వేయడం వీలుపడదు. కొందరు పాదంతో తాళం వేస్తుంటారు. వాద్యాలు వాయించేవాళ్ళకు ఎదురుగా ఒకళ్ళు కూర్చొని తాళం వేయాలి. అలా వేస్తుంటే ఆ తాళం చూసి, వాయిస్తూంటారు. వీణకి తాళపుతీగలు అనే తీగలు ఉంటాయి. ఈ తీగల్ని మీటి తాళంలో ఉన్న క్రియల్ని చూపెడతారు. అంటే తాళంలోని ప్రతీ క్రియకు ఒకసారి ఈ తాళపు తీగల్ని మీటుతూ ఉంటారు అన్నమాట.

## లయ

తాళాలు కొన్ని క్రియలతో ఏర్పడతాయి అని చెప్పుకొన్నాం. తాళాన్ని వేసేటప్పుడు చాలా జాగ్రత్తగా వేయాలి. ఒక క్రియకు, మరొక క్రియకు మధ్య టైమ్ మారిపోకూడదు. అంటే ఒక క్రియ వేశాక, మళ్ళీ ఒక సెకనుకి మరో క్రియ వేశామనుకోండి, ఇప్పుడు ఈ రెండు క్రియల మధ్యకాలం ఎంత పట్టింది? ఒక సెకను కదా! ఇలాగే అన్ని క్రియల మధ్య ఒక సెకను కాలాన్నే పాటిస్తూ క్రియలు వేయాలి. అంతేకాని క్రియల మధ్య, పట్టేకాలం

మారిపోకూడదు. క్రియల మధ్య పట్టే కాలాన్నే 'లయ' అంటారు. తాళం వేసేటప్పుడు, క్రియల మధ్య కాలం సరిగ్గా పాటించకపోతే 'లయ' తప్పింది అంటారు.

మనం తాళాన్ని ముందు కొంత వేగంతో వేశామనుకోండి, ఆ తరువాత తాళాన్ని ముందుకన్నా ఎక్కువ వేగంతో వేశామనుకోండి. (తాళం వేగంగా వేస్తే పాట కూడా వేగంగానే పాడాలి) తాళం వేగంగా వేసినప్పుడు క్రియల మధ్యకాలం ముందుకన్నా తగ్గుతుంది. పాట వేగం పెరుగుతుంది. అంటే లయ పెరిగింది అంటాం. దీనినే 'ధృత లయ' అంటారు. క్రియల మధ్యకాలం బాగా ఎక్కువ తీసుకొంటుంటే అప్పుడు తాళం నెమ్మదిగా నడుస్తుంది. తాళంతో పాటు, పాటకూడా నెమ్మదిగానే నడుస్తుంది. దీనినే 'విలంబిత లయ' అంటాం. లయ అంత నెమ్మదిగాను కాక, మరీ వేగంగాను కాక మధ్యరకంగా ఉంటే దానిని మధ్యలయ అంటారు.

## క్రియకు వచ్చే అక్షరాలు

మన జాతీయ గీతంలో ఒక క్రియకు నాలుగు అక్షరాలు రావడం మనం చూశాం. సంగీతంలో ఒక్కొక్కసారి క్రియకు ఒక అక్షరం, రెండు అక్షరాలు; నాలుగు అక్షరాలు, ఎనిమిది, పదహారు, ముప్పదిరెండు చొప్పున వస్తూంటాయి.

## క్రియకువచ్చే అక్షరాల్ని పెంచడంఎలా?

స, రి, గ, మ, ప, ద, ని, స.

ఈ ఎనిమిది స్వరాలు ఉన్నాయనుకోండి. వీటిని ఆదితాళంలో పాడాలనుకోండి. ఆది తాళం ఎలా వెయ్యాలో గుర్తుందా? ఒక చతురస్ర జాతి లఘువు, రెండు ధృతాలు వెయ్యాలి. ఆది తాళానికి ఎనిమిది క్రియలు ఉన్నాయని చెప్పుకొన్నాం కదా! స, రి, గ, మ, ప, ద, ని, స. ఈ ఎనిమిది అక్షరాలను క్రియకు ఒకటి చొప్పున పాడచ్చు.

| దెబ్బ | చిటికెన వేలు | ఉంగరం వేలు | మధ్య వేలు | దెబ్బ | ఉసి | దెబ్బ | ఉసి |
|---|---|---|---|---|---|---|---|
| స | రి | గ | మ | ప | ద | ని | స |

ఇప్పుడు క్రియకు రెండు అక్షరాల చొప్పున పాడాలంటే ఎలాగ? ముందు పాడిన స్వరాలను వేగంగా పాడాలి. తాళం మాత్రం ముందు ఎంత వేగంగా వేశామో అంతే వేగంగా వేయాలి. అంతే లయను పెంచకూడదు. పాటను మాత్రం వేగంగా పాడాలి. ఈ విధంగా తాళాన్ని ముందు వేసిన వేగంతోనే వేస్తూ, పాటను మాత్రం కొంచెం స్పీడుగా పాడి, క్రియకు రెండు అక్షరాలు వచ్చేలా చేస్తాం.

| దెబ్బ | చిటికెన వేలు | ఉంగరం వేలు | మధ్య వేలు | దెబ్బ | ఉసి | దెబ్బ | ఉసి |
|---|---|---|---|---|---|---|---|
| సరి | గమ | పద | నిస | సని | దప | మగ | రిస |

ఇప్పుడు చూడండి క్రియకు రెండు అక్షరాల చొప్పున ఒక ఆవృత్తానికి పదహారు అక్షరాలు వచ్చాయి.

ఇలా తాళాన్ని స్పీడుగా వెయ్యకుండా, పాటను మాత్రం వేగంగా పాడుతూ; క్రియకు నాలుగు, ఎనిమిది, పదహారు ఇలా అక్షరాలను పెంచవచ్చును.

మనం క్రియకు రెండు అక్షరాలు చొప్పున పాడుతున్నాం అనుకొందాం. ఇప్పుడు క్రియకు వచ్చే అక్షరాలను రెట్టింపు చేద్దాం. అంటే ఇప్పుడు క్రియకు ఎన్ని వస్తాయి? నాలుగు కదా! మనం ముందు పాడిన దాన్ని మొదటికాలం అంటాం. నాలుగు అక్షరాలు చొప్పున పాడితే దానిని రెండవ కాలం అంటాం. అలాగే నాలుగు అక్షరాలను రెట్టింపు చేస్తే ఎనిమిది కదా! క్రియకి ఎనిమిది చొప్పున పాడితే దానిని మూడవ కాలం అంటాం. ఈ విధంగా మనం ముందు పాడిన కాలాన్ని మొదటికాలం అంటాం. ఆ తరువాత క్రియకి ఉన్న అక్షరాలని రెట్టింపు చేస్తే అది రెండోకాలం. ఇప్పుడు రెండో కాలంలో ఉన్న అక్షరాలని మళ్ళీ రెట్టింపు చేస్తే అది మూడోకాలం అని అంటారు.

## జాగా

సాధారణంగా కీర్తన పాడడంతో పాటు తాళాన్ని కూడా ఒకేసారి ప్రారంభిస్తాం. కొన్నిసార్లు తాళం ప్రారంభించి, కొన్ని

అక్షరాలు కాలం అయ్యాక అప్పుడు పాట ప్రారంభిస్తాం అంటే ముందు తాళం వేసి, కొంతకాలం అయ్యాక అప్పుడు పాట ప్రారంభిస్తాం మనం తాళం ప్రారంభించాక కొంతసేపు పాడకుండా తాళం ఒక్కటే వేశాం కదా! పాటపాడితే కనుక ఆ ఖాళీలో ఎన్నో కొన్ని అక్షరాలు వస్తాయి. అలా ఎన్ని అక్షరాలని వదిలి వేశామో దానినే జాగా అంటారు. కొన్నిసార్లు రెండు అక్షరాలను వదిలేస్తే దానిని రెండు అక్షరాల జాగా అంటారు. కొన్నిసార్లు మూడు అక్షరాలు వదిలేస్తారు. దానినే మూడు అక్షరాల జాగా అంటారు. చాలా కీర్తనల్లో ఇలా జాగా ఉంటుంది.

## గతులు

సాధారణంగా సంగీతం పాడేటప్పుడు క్రియకు ఒకటి లేదా రెండు లేదా ఎనిమిది, పదహారు, ముప్పదిరెండు ఇలా అక్షరాలు పెరుగుతాయి. అంటే ప్రతీసారి కూడా అక్షరాలు రెట్టింపు అవుతాయి. ఇలా కాకుండా ఒక్కొక్కసారి క్రియకి మూడు అక్షరాలు వస్తాయి. ఇలా క్రియకి మూడు అక్షరాలు వస్తే దాన్ని 'త్రిశ్రగతి' అంటారు. త్రిశ్రగతిలో అక్షరాలు మూడు, లేదా దానికి రెట్టింపు అంటే ఆరు, మళ్ళీ దానికి రెట్టింపు అంటే పన్నెండు ఇలా పెరుగుతాయి.

కొన్నిసార్లు క్రియకు ఐదు అక్షరాల చొప్పున వస్తూంటాయి. ఇలా ఐదు అక్షరాల చొప్పున వచ్చేగతిని ఖండగతి అంటాం. ఖండగతిలో ఐదు లేదా పది ఇలా అక్షరాలు వస్తాయి.

ఇలాగ మిశ్రగతిలో క్రియకు ఏడు అక్షరాలు లేదా దానికి రెట్టింపు పదునాలుగు అక్షరాలు వస్తాయి. సంకీర్ణగతిలో క్రియకు తొమ్మిది అక్షరాలు వస్తాయి.

## తాళం తప్పడం

తాళం వేసేటప్పుడు, క్రియల మధ్య కాలం సరిగా పాటించాలి. దీనినే లయ అంటారని చెప్పుకొన్నాం. క్రియల మధ్య కాలం సరిగా పాటించకపోతే లయ తప్పింది అంటాం.

అలాగే తాళం యొక్క కొన్ని క్రియలు వేయడం మరచిపోయినా, ప్రతీ క్రియకు రావలసిన అక్షరాలు రాకుండా ఎక్కువ, తక్కువ ఐనా తాళం తప్పింది అంటారు. ఇలాంటి దోషాలు రాకుండా తాళం వేయాలి.

మనం 40 రాగాల గురించి చెప్పుకొన్నాం. ఆ రాగాలలో ఉన్న కొన్ని కీర్తనలు, కూడా తెలుసుకొన్నాం. అయితే కీర్తనలు ఏ తాళంలో ఉన్నాయో మనం అప్పుడు తెలుసుకోలేదు. ఇప్పుడు మనం కొన్ని కీర్తనలు ఏ తాళంలో ఉన్నాయో తెలుసుకొందాం.

| కీర్తన | రాగం | తాళం |
|---|---|---|
| 1. తులసీదళములచే సంతోషముగా పూజింతు | మాయామాళవ గౌళ | రూపకతాళం (చతురస్ర జాతి) |
| 2. విదులకు మ్రొక్కెద | " | ఆదితాళం |
| 3. మాయాతీత స్వరూపిణి | " | రూపకతాళం |
| 4. నిధిచాలసుఖమా | కల్యాణి | మిశ్రచాపు |
| 5. వాసుదేవయని వెడలిన | " | ఆదితాళం |
| 6. కమలాంబాం భజరే | " | ఆదితాళం |
| 7. భజరేచిత్త బాలాంబికా | " | మిశ్రచాపు |
| 8. ఎందుకు పెద్దలవలె బుద్ధినీయవు | శంకరాభరణం | ఆదితాళం |
| 9. స్వరరాగ సుధ రసయుత భక్తి | " | ఆదితాళం |
| 10. మనసు స్వాధీనమైన | " | మిశ్రచాపు |
| 11. చక్కని రాజమార్గము | ఖరహరప్రియ | ఆదితాళం |
| 12. పక్కల నిలబడి | " | మిశ్రచాపు |
| 13. రామనీ సమానమెవరు | " | రూపకతాళం (చతురస్రజాతి) |
| 14. మా జానకి చెట్టబట్టగ | కాంభోజి | ఆదితాళం |
| 15. ఓరంగశాయి | " | " |
| 16. శ్రీ సుబ్రహ్మణ్యాయ | " | " |
| 17. అడమోడిగలదా | చారుకేశి | " |
| 18. కృపయాపాలయ శౌరే | " | మిశ్రచాపు |
| 19. మరవేరే గతి ఎవ్వరమ్మ | ఆనందభైరవి | " |

| | | | |
|---|---|---|---|
| 20. | ఓ జగదంబ | ఆనందభైరవి | ఆదితాళం |
| 21. | 'పలుకే బంగారమాయరా' | ,, | ,, |
| 22. | 'త్యాగరాజయోగవైభవం | ,, | రూపకతాళం |
| 23. | 'దొరకునా ఇటువంటిసేవ' | బిలహరి | ఆదితాళం |
| 24. | కనుగొంటిని శ్రీరాముని | ,, | ,, |
| 25. | పరిదాన మిచ్చితే | ,, | ఖండచాపు |
| 26. | నా జీవధార | ,, | ఆదితాళం |
| 27. | భవనుత | మోహన | ఆదితాళం |
| 28. | ననుపాలింప | ,, | ఆదితాళం |
| 29. | పాహిమాం పార్వతీ | ,, | రూపకతాళం |
| 30. | మరువేరె దిక్కెవ్వరయ్యారామ | షణ్ముఖప్రియ | ఆదితాళం |
| 31. | సిద్ధివినాయకం | షణ్ముఖప్రియ | రూపకం |
| 32. | ఏల నీదయరాదు | అఠాణా | ఆదితాళం |
| 33. | నారదగానలోల | అఠాణా | రూపకతాళం |
| 34. | రఘునాయకా | హంసధ్వని | ఆదితాళం |
| 35. | శ్రీ రఘుకులమందుబుట్టి | హంసధ్వని | ఆదితాళం |
| 36. | అన్నపూర్ణే విశాలాక్షి | సామ | ఆదితాళం |
| 37. | శాంతములేక | సామ | ఆదితాళం |
| 38. | బ్రోచేవారెవరురా | ఖమాస్ | ఆదితాళం |
| 39. | సంతాన గోపాలకృష్ణం | ఖమాస్ | రూపకతాళం |
| 40. | ఎంతనేర్చినా | శుద్ధధన్యాసి | ఆదితాళం |
| 41. | భావములోనబాహ్యము నందున | శుద్ధధన్యాసి | ఆదితాళం |

| | | |
|---|---|---|
| **42.** హిమగిరి తనయే | శుద్ధధన్యాసి | ఆదితాళం |
| **43.** నాదలోలుడై | కల్యాణ వసంత | రూపకం |
| **44.** రామబాణ త్రాణ | సావేరి | ఆదితాళం |
| **45.** తులసి జగజ్జనని | సావేరి | ఆదితాళం |
| **46.** ఉండేది రాముడొకడు | హరికాంభోజి | రూపకతాళం |
| **47.** దినమణి వంశ | హరికాంభోజి | ఆదితాళం |
| **48.** వేణుగానలోలునిగన | కేదారగౌళ | రూపకం |
| **49.** ఆరగింపవే | తోడి | రూపకం |
| **50.** కద్దను వారికి | తోడి | రూపకం |

మీ ఊళ్ళో సంగీత కచేరీలు జరగుతుంటే వాటికి వెళ్ళండి. విద్వాంసులు పాడుతూ తాళం వేస్తుంటే అది ఏ తాళమో గమనించండి. మీరు కూడా అలా వేయడానికి ప్రయత్నించండి. ఆ తాళం గురించి మీకు తెలియకపోతే తెలిసిన వారిని అడిగి ఆ తాళం గురించి తెలుసుకోండి. ఆ కీర్తన ఏ తాళంలో ఉందో ఒక పుస్తకంలో రాసుకోండి. రేడియోలో సంగీతం వస్తుంది. కీర్తన ఏ రాగంలో ఉందో, ఏ తాళంలో ఉందో కూడా చెబుతారు. మీరు ఆ కీర్తన, తాళం, రాగం ఒక పుస్తకంలో రాయండి. కీర్తనతో పాటు మీరు కూడా తాళం వెయ్యడానికి ప్రయత్నించండి.

లయ తప్పకుండా తాళం వెయ్యాలంటే చాలా సాధన కావాలి. ఆదితాళం వేయడం ఎలా సాధన చెయ్యాలో చూద్దాం. ఆదితాళంలో ఎనిమిది క్రియలు ఉన్నాయి కదా! ఒక్కొక్క క్రియకు ఒక్కొక్క అంటె చొప్పున లెక్క పెట్టడం మొదలు

పెట్టి; ఒకటి నుంచి ఎనిమిది వరకు అంకెల్ని లయబద్ధంగా అంటూ తాళం, వేయడం సాధన చేయండి. ఇలా అన్ని తాళాలను సాధన చెయ్యండి. సాధన చేయగాలయ తప్పకుండా తాళం వెయ్యడం మీకు అలవాటు అవుతుంది.

## పాటల్ని రాసే పద్ధతి

నేర్చుకొన్న పాటల్ని ఒక్కొక్కసారి మరచి పోతూంటాం. అలా మరచి పోకుండా ఉండాలంటే ఆ పాటల్ని పుస్తకంలో రాసి ఉంచితే, మర్చిపోయినప్పుడు మళ్ళీ అది చూసి పాడుకోవచ్చు. అయితే పాటల్ని స్వరంతో సహా రాస్తేనే మనం మరచిపోయినప్పుడు తిరిగి దాన్ని చూసి పాడుకోడానికి వీలుపడుతుంది. ఇలా స్వరంతో సహా, వాగ్గేయకారులు రాసిన పాటల్ని రాయడాన్నే 'నొటేషన్' అంటారు. బాగా సంగీతం వచ్చిన వాళ్ళు ఆ నొటేషన్ చూసి ఆ కీర్తన పాడగలుగుతారు.

ఇలా పాటల్ని స్వరంతో రాయడానికి కొన్ని నియమాలు ఉన్నాయి. అవి చెప్పుకొందాం.

1. ఏదైనా ఒక స్వరం పైన చుక్క పెడితే అది తారస్థాయికి చెంది స్వరం అని గుర్తు. స్వరం క్రింద చుక్క ఉంటే అది మంద్రస్థాయికి చెందినది అని గుర్తు. ఏ చుక్కా లేక పోతే అది మద్యమస్థాయికి చెందినది అని గుర్తు.

స̇ —— తారస్థాయి

స̣ —— మంద్రస్థాయి

స —— మధ్యమస్థాయి

2. స్వరం క్రింద ఏ అక్షరం రాస్తే, ఆ అక్షరాన్ని, ఆ స్వరం బదులుగా పాడాలి.

ఉదాహరణకి: గగ పాపా దప సాసా
వర వీణ మృదు పాణీ

'గ' అనే స్వరం క్రింద 'వ' అక్షరం రాశాం. అంటే 'గ' బదులు 'వ'ని పాడాలి. అలాగే రెండో 'గ' క్రింద 'ర' ఉంది. అంటే 'గ' స్వరం బదులు 'ర' పాడాలి.

ఇంకో ఉదాహరణ చూడండి.

మప దన నరి రిన దప మప
శ్రీ- గణ నాథ సింధు రా- వర్ణ

ఈ ఉదాహరణలో 'మ' స్వరం క్రింద 'శ్రీ' ఉంది. 'ప' కింద ఏమీ రాయలేదు. కేవలం డేష్ పెట్టాం. ఈ డేష్ బదులు ఏమి పాడాలి? 'ప' స్వరం బదులు 'శ్రీ' అక్షరాన్ని పొడిగించి పాడతాం.

మ ప అని ఈ విధంగా పాడతారు.
శ్రీ ఇ

అయితే రాసేటప్పుడు 'ఇ' ని రాయకుండా డేష్ పెట్టి వదిలేస్తాం.

అలాగే 'ద ప' స్వరాల క్రింద రాసిన సాహిత్యపు అక్షరాలని చూద్దాం. 'ద' క్రింద ఏమి రాశాం? 'రా' కదా. అంటే 'ద' బదులు 'ర' పాడాలి. 'ప' కి బదులు రాకి ఉన్న దీర్ఘాన్ని పొడిగించి

'ద ప' ఈ విధంగా పాడతారు.
రా అ

అయితే రాసేటప్పుడు 'అ'ని రాయరు. డేష్ పెడతారు.

3. కొన్ని క్రియలు కలిసి ఒక అంగం ఏర్పడుతుందని, కొన్ని అంగాలు కలిస్తే తాళం అవుతుందని తెలుసుకొన్నాం కదా! పాటల్ని రాసేటప్పుడు తాళం యొక్క ప్రతీ అంగం పూర్తి అయ్యాక ఒక నిలువుగీత పెట్టాలి. ఒక ఆవృత్తం పూర్తి అయ్యాక 2 నిలువు గీతలు పెడతారు.

ఉదహారణకి చతురస్ర జాతి రూపక తాళంలో ఉన్న ఒక పాటను చూద్దాం. రూపకతాళం అంటే గుర్తుందా? ఒక ధృతం, ఒక లఘువు వస్తాయి. ఈ లఘువు చతురస్రజాతిది. అంటే ఈ రూపకతాళానికి లఘువు 4 క్రియలు, ధృతం 2 క్రియలు మొత్తం ఆరు క్రియలు. ధృతం పూర్తి అయ్యాక ఒక నిలువుగీత, లఘువు పూర్తి అయ్యాక రెండు నిలువుగీతలు పెట్టాలి. క్రియకు ఒక అక్షరం చొప్పున వచ్చే కొన్ని స్వరాలను ఉదాహరణగా ఇచ్చాను చూడండి.

మ ప | ద స స రి || రి స | ద ప మ ప ||

'మప' ఈ రెండు స్వరాలతో ధృతం పూర్తి అయ్యింది. కనుక ఒక నిలువుగీత పెట్టాం. అలాగే 'ద స స రి' తో లఘువు పూర్తి అయ్యింది. ఆవృత్తం కూడా పూర్తి అయిపోయింది. కనుక రెండు నిలువుగీతలు పెట్టాం చూశారా? ఇప్పుడు 'రి స' తో మళ్ళీ కొత్త ఆవృత్తం మొదలయ్యింది.

ఇలాగే తాళాలు అన్నింటికీ ప్రతీ అంగం తరువాత ఒక నిలువుగీత, ఆవృత్తం పూర్తి అయ్యాక రెండు నిలువుగీతలు పెట్టాలి.

4. మనం షోడశ స్వరస్థానాల గురించి చెప్పుకొన్నాం. స్వరాలపైన అవి ఏరకం స్వరస్థానాలో రాయాలని చెప్పుకొన్నాం గుర్తుందా.

5. పాడేటప్పుడు ఒక్కొక్కసారి స్వరాలని ఒక అక్షరం కాలం కన్నా ఎక్కువసేపు ఆపుతూంటారు. అలా ఎన్ని అక్షరాలు ఆపుతున్నారో పాటని రాసేటప్పుడు చూపించాలి. అలా చూపించడానికి స్వరానికి దీర్ఘం పెట్టడమో, స్వరం ప్రక్కన కామాలు పెట్టడమో, చుక్కలు పెట్టడమో చేస్తారు.

ఉదాహరణ:

స — ఇది ఒక అక్షరమే

సా — ఇది రెండు అక్షరాలు

సా, — ఇది మూడు అక్షరాలు

(సా = **2**, కామా = **1**, మొత్తం = **3**)

సా; — ఇది నాలుగు అక్షరాలు

(సా = **2**, చుక్క = **1**, కామా = **1**, మొత్తం = **4**)

సా;, — సా = **2**, చుక్క = **1**, కామాలు = **2**, మొత్తం = **5**.

సా;; — ఇది ఆరు అక్షరాలు కదా!

కీర్తనల్లో ఒకొక్కసారి స్వరాలను స్పీడుగా పాడుతూంటారు. అలా స్పీడుగా పాడాలని గుర్తుగా వాటి క్రింద అడ్డుగీత గీస్తారు.

ఉదా: <u>పమపా</u> ఈ స్వరాల క్రింద గీత ఉందికదా! గీత లేకపోతే ఇవి నాలుగు అక్షరాలు. గీత పెట్టడం చేత వీటిని స్పీడుగా పాడి **2** అక్షరాల కాలంలో వీటిని ఇముడ్చుతాం.

స్వరాల క్రింద **2** గీతలుంటే ఇంకా స్పీడుగా పాడాలి. డబుల్ పై కాలం అని దీనిని అంటారు.

<u>పమపా</u> ఈ పమపా అన్న నాలుగు అక్షరాలకి క్రింద

రెండు అడ్డగీతలు ఉన్నాయికదా! కనుక ఈ 4 అక్షరాలు 1 అక్షరం కాలం పడుతుంది.

ఉదాహరణ :

మప దానిద పమగరి గరిసా
1 + 1 + 2 + 4 = 8

7. గమకాలు గురించి చెప్పుకొన్నాం గుర్తుందా. గమకాలకు కూడా కొన్ని గుర్తులు ఉంటాయి. పాటల్ని రాసినప్పుడు గమకాల గుర్తుల్ని కూడా పెడతారు.

8. కొన్ని రాగాలల్లో అన్యస్వరాలు వస్తాయని చెప్పుకొన్నాం. అన్య స్వరంపైన X గుర్తును ఉంచుతారు.

పాటల్ని స్వరంతో రాయడానికి మనం పైన చెప్పుకొన్న నియమాలన్నీ పాటించాలి.

గురువు అవసరం లేకుండా, సంగీతాన్ని ఈ 'నొటేషన్' చూసి నేర్చుకోవచ్చా? అని మీకు సందేహం వచ్చిందా? అలా నేర్చుకోలేము. ఎందుకోచూద్దాం. ఒక స్వరం ఫలానా రకానిది అని నొటేషన్‌లో రాసి ఉంటుంది. మరి ఆ స్వరాన్ని ఎలా పాడాలో పుస్తకంలో రాయడం సాధ్యపడదుకదా! అందుచేత సంగీతం గురువు ద్వారానే నేర్చుకోవాలి. అలాగే స్వరాలకి గమకాలు ఇవ్వాలని కూడా చెప్పుకొన్నాం. గమకాలకి గుర్తులు పెట్టి రాయగలం కాని, ఆ గమకం ఎలా పాడాలో పుస్తకంలో రాయలేం కదా! అందుచేత సంగీతం గురువుదగ్గరే నేర్చుకోవాలి.

అయితే ఈ నొటేషన్ ఎందుకు? అని మీకు సందేహం రావచ్చు. నొటేషన్ వల్ల లాభాలు ఏమిటి? అండే - సంగీతంలో

ఒక స్థాయికి వచ్చిన వాళ్ళు ఈ నొటేషన్ చూసి కీర్తనల్ని పాడగలుగుతారు. అంటే వాళ్ళకి ఆ స్వరాలని ఎలాపాడాలో, గమకాలు ఎలా ఇవ్వాలో తెలుస్తుంది కాబట్టి, సంగీతంలో ఒక స్థాయికి వచ్చిన వాళ్ళు నొటేషన్ చూసి కొత్త కీర్తనలు నేర్చుకోవచ్చు. విద్యార్థులు నొటేషన్ దగ్గర పెట్టుకొని, గురువు చెబుతూంటే ఆ కీర్తనని నేర్చుకొంటే సులువుగా వస్తుంది.

కీర్తనల్ని నొటేషన్‌తో రాసి, వాటిని ప్రచురిస్తే ముందుతరాల వారికి ఆ కీర్తనలు అందుతాయి.

## సంగీత రచనలు

పాడడానికి వీలుగా ఉండే పాటల లాంటి వాటిని వాగ్గేయకారులు రచిస్తారని మనం చెప్పుకొన్నాం. వాగ్గేయకారులు రాసిన వాటిని కీర్తనలు, కృతులు, జావళీలు, పదాలు, తరంగాలు అని రకరకాల పేర్లతో పిలుస్తారని కూడా ముందు తెలుసుకొన్నాం. ఇలా పాడుకోడానికి వీలుగా ఉండే పాటలు లాంటి వాటినే 'సంగీత రచనలు' అంటారు. అంటే కీర్తనలు, కృతులు, తరంగాలు, అష్టపదులు, జావళీలు పదాలు ఇవన్నీ సంగీత రచనలన్నమాట. మామూలు పాటలకన్నా సంగీత రచనలు కొంత వేరుగా ఉంటాయి. పాటలంత సరళంగా ఉండవు. సంగీత రచనల్లో చాలా రకాలున్నాయి. ఒక్కొక్క రచనకి కొన్ని నిర్దిష్టమైన లక్షణాలు ఉంటాయి. సంగీతరచనల్ని మనం ముఖ్యంగా రెండు రకాలుగా చెయ్యొచ్చు.

1. కేవలం నేర్చుకోడానికే పనికి వచ్చేవి.

2. కచేరీలలో పాడడానికి పనికి వచ్చేవి.

1. కేవలం నేర్చుకోడానికి మాత్రమే పనికి వచ్చేవి:

కొన్ని సంగీత రచనలు కేవలం నేర్చుకోడానికి మాత్రమే పనికి వస్తాయి. వీటిని కచేరీలలో పాడరన్నమాట. సంగీతం నేర్చుకొనే విద్యార్థులు వీటిని నేర్చుకొంటారు. ముందుగా ఈ సంగీత రచనల్ని గురించి చెప్పుకొందాం. సరళీ స్వరాలు, జంట స్వరాలు, అలంకారాలు, గీతాలు, స్వర జతులు ఇవి కేవలం నేర్చుకోడానికి పనికి వచ్చే సంగీత రచనలు.

1. సరళీ స్వరాలు: సరళం అంటే సులభం. సరళీ స్వరాలు అంటే చాలా సులభంగా ఉండే రచనలు అన్నమాట. ఈ సరళీ స్వరాలతోనే విద్యార్థులకు సంగీతం నేర్పడం మొదలు పెడతారు. ఇవి 'మాయామాళవగౌళ' రాగంలో, ఆదితాళంలో ఉంటాయి. సంగీతం నేర్చుకొనే విద్యార్థులకు ఈ సరళీ స్వరాలు నేర్పడం వల్ల స్వరస్థానాలు పలకడం, తాళం వేయడం కొంచెం కొంచెం అలవాటు అవుతుంది.

ఈ సరళీ స్వరాలు కేవలం స్వరాలే. స్వరాలే పాడతారు. అంతేకాని, ఈ స్వరాలకి బదులుగా పాడడానికి ఎలాంటి అక్షరాలు ఉండవు. (ఈ అక్షరాలనే సాహిత్యం అంటారు). అంటే సరళీ స్వరాలకి సాహిత్యం ఉండదన్నమాట.

సరళీ స్వరాలు పదో, పదిహేనో విద్యార్థులకు నేర్పుతారు. కొన్ని సరళీ స్వరాలు చూడండి.

1. సరిగమ | పద | నిస || సనిదప | మగ | రిస ||

2. సరిగమ | సరి | గమ || సరిగమ | పద | నిస ||
సనిదప | సని | దప || సనిదప | మగ | రిస ||

2. జంట స్వరాలు: జంట అంటే రెండు కదా! జంట స్వరాలు అంటే రెండు స్వరాలు. ఒకే స్వరాన్ని రెండుసార్లు పాడతారు. సస రిరి గగ ఇలాగన్నమాట. ఈ జంట స్వరాలు కూడా ఆదితాళంలో, మాయామాళవగౌళ రాగంలో ఉంటాయి. జంట స్వరాలు కూడా కేవలం స్వరాలే. వీటికి కూడా సాహిత్యం ఉండదు. కేవలం స్వరాలనే పాడతారు.

ఒక జంట స్వరం గమనించండి:

సస రిరి | గగ | మమ || పప దద | నిని | సస ||
సస నిని | దద | పప || మమ గగ | రిరి | సస ||

జంట స్వరాలు, సరళీ స్వరాలు కూడా క్రియకు ఒక అక్షరం చొప్పున పాడతారు లేదా వాయిస్తారు. అయితే ఈ స్వరాలను స్పీడుగా పాడి క్రియకి 2, లేదా 4, 8 ఇలా పెంచవచ్చునని ముందు మనం తెలుసుకొన్నాం. విద్యార్థులచేత అక్షరాలు 2, 4 కు పెంచి పాడడం సాధన చేయిస్తారు.

3. అలంకారాలు: సరళీలు, జంటలు నేర్చుకొన్నాక విద్యార్థులు అలంకారాలు నేర్చుకొంటారు. అలంకారాలు కూడా మాయామాళవ గౌళ రాగంలోనే ఉన్నాయి. అలంకారాలు నేర్చుకోవడం వల్ల రకరకాల తాళాలు విద్యార్థులకు అర్థం అవుతాయి. సప్తతాళాలు గురించి ముందు తెలుసుకొన్నాం కదా! ఈ 7 తాళాలలోను అలంకారాలు నేర్పుతారు. అందువల్ల ఈ సప్తతాళాల్ని ఎలా వెయ్యాలో విద్యార్థులకు బాగా అర్థం అవుతుంది. అలంకారాలకి

కూడా సాహిత్యం ఉండదు. కేవలం స్వరాలే పాడతారు. చతురస్రజాతి ధృవతాళంలో ఉన్న ఒక అలంకారం చూద్దాం. చతురస్రజాతి ధృవతాళం అంటే గుర్తుందా? లఘువు, ధృతం, లఘువు, లఘువు దీని అంగాలు. లఘువులు చతురస్రజాతిలో ఉండాలి.

## అలంకారం

చతురస్రజాతి ధృవతాళం :

| I | O | I | I |
|---|---|---|---|
| సరిగమ I | గరి I | సరిగరి I | సరిగమ II |
| రిగమప I | మగ I | రిగమగ I | రిగమప II |
| గమపద I | పమ I | గమపమ I | గమపద II |
| మపదని I | దప I | మపదప I | మపదని II |
| పదనిస I | నిద I | పదనిద I | పదనిస II |
| సనిదప I | దని I | సనిదని I | సనిదప II |
| నిదపమ I | పద I | నిదపద I | నిదపమ II |
| దపమగ I | మప I | దపమప I | దపమగ II |
| పమగరి I | గమ I | పమగమ I | పమగరి II |
| మగరిస I | రిగ I | మగరిగ I | మగరిస II |

చూశారా? ఇలా ఉంటాయి అలంకారాలు. ఇంకా చతురస్రజాతి మఠ్యతాళం, చతురస్రజాతి ఏకతాళం, ఈ విధంగా **35** రకాల తాళాలలోనూ అలకారాలు ఉంటాయి. వీటిని విద్యార్థులు నేర్చుకొంటే **35** తాళాలతో పరిచయం ఏర్పడి వాటిని ఖచ్చితంగా వెయ్యడం అలవాటు అవుతుంది.

4) గీతాలు: అలంకారాలు తరువాత విద్యార్థులు గీతాల్ని నేర్చుకొంటారు. గీతాలు వినడానికి చాలా బాగుంటాయి. సరళీ స్వరాలు, జంటస్వరాలు అలంకారాలు లాగా కాకుండా వీటికి సాహిత్యం, కూడా ఉంటుంది. గీతాల్ని పాడేటప్పుడు స్వరం సాహిత్యం కూడా పాడుతూ ఉంటారు.

సాధారణంగా పాటల్ని పల్లవి, అనుపల్లవి, చరణాలు అని 3 భాగాలు చేస్తారు. కొన్నింటిలో పల్లవి, చరణాలే ఉంటాయి. అనుపల్లవి ఉండదు. చరణాలు; పాటల్లో 2, 3, 4, 5 ఇలా ఉంటాయి.

చెప్పదలచుకొన్న విషయాన్ని సూక్ష్మంగా పల్లవిలో చెప్పి, ఆ తరువాత చరణాలలో ఆ విషయాన్ని పెంచి చెబుతారు.

ఈ కీర్తన చూడండి. ఇందులో పల్లవి, అనుపల్లవి, చరణాలు గమనించండి.

పల్లవి: గంధము పూయరుగా - పన్నీరు ॥ గంధం ॥

అనుపల్లవి: అందమైన యదునందనుపై
కుందరదన లిర వొందగ పరిమళ ॥ గంధం ॥

చరణం: 1) తిలకము దిద్దరుగా కస్తూరి తిలకము దిద్దరుగా
కలకలమను ముఖ కళగని సొక్కుచు పలుకుల నమృత వొసొలికే
స్వామికి ॥ గంధం ॥

2) చేలము కట్టరుగా - బంగరు చేలముకట్టరుగా మాలిమితో
గోపాలబాలులతో
నాలమేపిన విశాల నయనునికి ॥ గంధం ॥

ఈ కీర్తన గమనించారా? కీర్తనలో ముందు భాగం 'గంధము

పుయ్యారుగా పన్నీరు' అన్నదికదా! ఈ వాక్యాన్నే పల్లవి అంటాం. పల్లవి ఒక లైన్ ఉందికదా! ఈ పల్లవికి రెట్టింపు పొడవుతో అంటే రెండు లైన్‌లతో ఉన్న భాగాన్ని అనుపల్లవి అంటారు. అంటే 'అందమైన యదునందునుపై కుందరదనలిరి వొందగ పరిమళో' అన్నది అనుపల్లవి అన్నమాట. అనుపల్లవి తరువాత చరణాలు ఉంటాయి. మనం పైన చెప్పుకొన్న పాటలో ఇంకా రెండు చరణాలు ఉన్నాయి. మీకు రెండే ఉదాహరణకు ఇచ్చాను. చరణాలు అనుపల్లవికన్నా ఎక్కువలైన్‌లతో ఉన్నాయి చూడండి.

పాటని పాడేటప్పుడు లేదా వాయించేటప్పుడు ముందు పల్లవి పాడి, ఆ తరువాత అనుపల్లవి పాడతారు. అను పల్లవి తరువాత మళ్ళీ పల్లవి పాడతారు. ఆ తరువాత ఒకటవ చరణం పాడి, తిరిగి పల్లవి పాడతారు. తరువాత రెండో చరణం, పల్లవి, ఆతరువాత మూడోచరణం, పల్లవి ఇలా పాటలో చరణాలు అయ్యేదాకా పాడతారు. అనుపల్లవి తరువాతం గంధం అని రాశాను చూడండి. అంటే పల్లవి అయిన గంధము పుయ్యారుగా పాడాలి అని సూచన అన్నమాట. అలాగే ప్రతీచరణం తరువాత 'గంధం' అని రాశాను గమనించారా?

ఇంతకూ పాటకి పల్లవి, అనుపల్లవి, చరణాలుంటాయనే విషయం మీకు ఎందుకు చెప్పానంటే ఈ గీతాలో పల్లవి, అనుపల్లవి, చరణాలు అన్నవిభజన ఉండదు. అంతా కలసి కొన్ని లైన్స్‌గా ఉంటుంది.

అలంకారాలు, జంటస్వరాలు, సరళీస్వరాలు మాయామాళవ గౌళ రాగంలో నే ఉంటాయని చెప్పుకొన్నాం. అయితే ఈ గీతాలు అలాకాదు. వివిధ రాగాల్లో ఉంటాయి. వివిధ తాళాలలో కూడా ఉంటాయి. విద్యార్థులు గీతాల్ని నేర్చుకోవడం వల్ల వాళ్ళకు రాగం యొక్క స్వరూపం, దాని లక్షణాలు అర్థం అవుతాయి.

అలాగే స్వరానికి తగినట్టు సాహిత్యం ఎలా పాడాలో కూడా అలవాటు అవుతుంది.

గీతాలు సాధారణంగా 2రకాలు. అవి 1) సాధారణ గీతాలు 2) లక్షణ గీతాలు.

సాధారణ గీతాలగురించి చెప్పుకొందాం. సాధారణ గీతాలలో కూడా పల్లవి, అనుపల్లవి, చరణాలు అనే విభజన ఉండదు. దీనిలో ఉండే సాహిత్యం దేవుణ్ని ప్రార్థించేటట్టుగానో, లేకపోతే దేవుడి గొప్పతనాన్ని వర్ణించేదిగానో ఉంటుంది. పురందరదాసుఅనే వాగ్గేయకారుడు గీతాలను రచించారు. ఇవి కన్నడ భాషలో ఉన్నాయి. వినాయకుడు, ఈశ్వరుడు, విష్ణుమూర్తి ఈ దేవుళ్ళ గొప్పదనాన్ని వర్ణిస్తూ ఈయన గీతాలు రాశారు. ఈయన రాసి గీతాలనే పిళ్ళారి గీతాలు అంటారు. ఇవి 'మలహరి' రాగంలో ఉన్నాయి.

ఘనరాగాలు అంటే చెప్పుకొన్నాం కదా! ఈ ఘనరాగాలలో ఉన్న గీతాలనే ఘనరాగ గీతాలు అంటారు.

గీతాలు ఇంకా భైరవి, ఆనందభైరవి, కల్యాణి, కాంభోజి, మోహన రాగాలలో కూడా ఉన్నాయి. ఒక పిళ్ళారి గీతాన్ని ఉదాహరణగా మీకు ఇస్తాను చూడండి. ఈ పిళ్ళారి గీతం 'మలహరి' రాగంలో ఉంది. ఈ మలహరి 15వ మేళకర్త మాయామాళవ గౌళనుంచి పుట్టింది. ఇది ఔడవ - షాడవరాగం. ఈ గీతం త్రిపుట తాళంలో ఉంది. ఈ త్రిపుటతాళం త్రిశ్రజాతి త్రిపుట తాళం అన్నమాట. ఈ గీతాన్ని గమనించండి. త్రిపుటతాళం ఎలావెయ్యాలో గుర్తుందా? ఒక లఘువు, రెండు ధృతాలు వస్తాయి. గీతాలని క్రియకు ఒక అక్షరం చొప్పున పాడతారు.

## మలహరి రాగం - త్రిపుటతాళం

| | | శు | శు | | శు | ̇ |
|---|---|---|---|---|---|---|
| ఆ: | స | రి | మ | ప | ద | స |

| | | శు | | శు | అం | శు | |
|---|---|---|---|---|---|---|---|
| అ: | స | ద | ప | మ | గ | రి | స |

| I | | O | | O | |
|---|---|---|---|---|---|
| దసస | \| | దప | \| | మప | \|\| |
| శెరయ | \| | నీ- | \| | రసు | \|\| |
| దదప | \| | మమ | \| | పా | \|\| |
| శెరగె | \| | జ- | \| | ళీ | \|\| |
| దదస | \| | దప | \| | మప | \|\| |
| వరవ | \| | పడె | \| | దవ | \|\| |
| దదప | \| | మగ | \| | రిస | \|\| |
| రం-తి | \| | కా- | \| | 'నిరో | \|\| |
| సరిరి | \| | సరి | \| | సరి | \|\| |
| హరియ | \| | కరు | \| | ణద | \|\| |
| దదప | \| | మగ | \| | రిస | \|\| |
| శా-ద | \| | ఖా- | \| | గ్యవ | \|\| |
| దపద | \| | సా | \| | దప | \|\| |
| హరిస | \| | మా | \| | ర్పణ | \|\| |
| దదప | \| | మగ | \| | రిస | \|\| |
| మ-డి | \| | బ్రతి | \| | శెరో | \|\| |

| I | O | O | |
|---|---|---|---|

2

| దనన | దప | మప | ‖ |
|---|---|---|---|
| శ్రీ-పు | రం- | దర | ‖ |
| దదప | మమ | పా | ‖ |
| విఠల | రా | యా | ‖ |
| దదన | దప | మప | ‖ |
| చరణ | కమ | లవ | ‖ |
| దదప | మగ | రిస | ‖ |
| నొ-డి | ఖతు | కిరొ | ‖ |
| సరిరి | సరి | సరి | ‖ |
| హరియ | కరు | ణద | ‖ |
| దదప | మగ | రిస | ‖ |
| శ-ద | ఖా- | గ్యవ | ‖ |
| దపద | సా | దప | ‖ |
| హరిస | మా | ర్పణ | ‖ |
| దదప | మగ | రిస | ‖ |
| మ-డి | ఖతి | కెరొ | ‖ |

ఇప్పుడు లక్షణ గీతాలు గురించి చెప్పుకొందాం. వీటికి కూడా పల్లవి, అనుపల్లవి, చరణాలు అన్న భేదం ఉండదు. అయితే సాహిత్యంలో సాధారణ గీతాలకు, వీటికి తేడా ఉంటుంది. సాధారణ గీతాల్లో సాహిత్యం ఎలా ఉంటుందని చెప్పుకొన్నాం? దేవతల గొప్పదనాన్ని పొగిడేదిగానో, వాళ్లను ప్రార్థిస్తూనో

ఉంటుందని చెప్పుకొన్నాం కదా! ఈ లక్షణ గీతాల్లో సాహిత్యం అలా ఉండదు. రాగాల లక్షణాలను చెప్పేదిగా ఈ లక్షణ గీతం ఉంటుంది. ఆ గీతం ఏరాగంలోఉందో, ఆరాగం యొక్క లక్షణాలే ఆ గీతం యొక్క సాహిత్యం. ఆరాగం జనక రాగామా? జన్యరాగమా? ఏఏ స్వరస్థానాలు ఆరాగంలో వస్తాయి? ఆరాగంలో ఏమైనా అన్యస్వరాలు వస్తాయా? ఇలా రాగలక్షణా లన్నీ ఆ గీతంలో పొందు పరచబడిఉంటాయి. పూర్వం అచ్చుయంత్రాలు ఉండేవి కాదుకదా! అప్పుడు ఈ లక్షణ గీతాలు ఎంతగానో ఉపయోగ పడేవి. గురువులు, శిష్యులకి ఈ లక్షణ గీతాల్ని నేర్పేవారు. అలా నేర్పడం వల్ల, ఆరాగలక్షణాల్ని తెలుసుకోవడానికి ఈ గీతాలు ఉపయోగపడేవి. ఎప్పుడైనాన ఆరాగం లక్షణాలు తెలుసుకోవాలనుకొంటే ఆరాగానికి సంబంధించిన గీతాన్ని ఓ సారి నెమరు వేసుకోనేవారు. అయితే ఇప్పుడు అచ్చుయంత్రాలు వచ్చాయికదా! రాగలక్షణాల్ని పుస్తకాలుగారాసి, వాటిని ముద్రించి భద్రపరుస్తున్నారు. రాగలక్షణాలను తెలుసుకోవాలంటే వాటిని చూస్తే చాలు . అందుచేత ఇప్పుడు ఈ లక్షణ గీతాల ప్రాముఖ్యం తగ్గిపోయింది. వెంకటముఖి, గోవింద దీక్షితార్, పైడాల గురుమూర్తి శాస్త్రి ఈలక్షణ గీతాల్ని రాశారు.

ఇప్పటికీ హిందుస్థానీ సంగీతంలో ఇలాంటి లక్షణ గీతాలకి ప్రాధాన్యత ఉందట.

## స్వరజతులు

గీతాలు తరువాత విద్యార్థులు స్వరజతుల్ని నేర్చుకొంటారు. స్వరజతుల్లో పల్లవి, అను పల్లవి, చరణం అని 3 భాగాలు

ఉంటాయి. కొన్నింటిలో అనుపల్లవి ఉండక పోవచ్చును. స్వరజతిని పాడేటప్పుడు క్రియకి 2 అక్షరాలు లేదా 4 అక్షరాలు లేదా ఒక అక్షరం చొప్పున పాడతారు. స్వరజతులకు సాహిత్యం కూడా ఉంటుంది. స్వరం పాడి , తరువాత, సాహిత్యం కూడా పాడతారు. స్వరజతులకు రెండు, మూడు, లేకుండే నాలుగు చరణాలు ఉంటాయి. చిన్నికృష్ణదాసు, శోభనాద్రి, శ్యామశాస్త్రి స్వరజతుల్ని రచించారు. ఖమాస్ రాగంలో ఉన్న 'సాంబశివాయనవే' 'బిలహరి' రాగంలో ఉన్న 'రారవేణుగోపబాల' బాగా ప్రచారంలో ఉన్న స్వరజతులు. 'సాంబశివాయనవే' అన్నది ఆదితాళంలో ఉంది. దీనిని చిన్ని కృష్ణదాస రచించాడు. దీనికి పల్లవి, అనుపల్లవి, 5 చరణాలు ఉన్నాయి. రారవేణుగోపబాల' అన్న స్వరజతికూడా ఆదితాళం లోనే ఉంది. దీనికి కూడా పల్లవి, అను పల్లవి, 5 చరణాలు ఉన్నాయి.

శ్యామశాస్త్రి స్వరజతులు చాలా క్లిష్టంగా ఉంటాయి. వీటిని నేర్చుకొండే విద్యార్థులకు ఆరాగం స్వరూపం బాగా అర్థం అవుతుంది. శ్యామశాస్త్రి స్వరజతుల్ని అప్పుడప్పుడు కచేరీలలో పాడతారు.

కచేరీలలో పాడేందుకు పనికి వచ్చేరచనలు :

మనం ఇంతవరకూ కేవలం నేర్చుకోడానికే పనికొచ్చే సంగీత రచనలు గురించి తెలునుకొన్నాం. ఇప్పుడు కచేరీలలో పాడేందుకు పనికి వచ్చేరచనల్ని గురించి చెప్పుకొందాం.

కచేరీల్లో పాడడానికి వీలైన సంగీత రచనలు వర్ణాలు, కీర్తనలు కృతులు, తరంగాలు, అష్టపదులు, జావళీలు, తిల్లానాలు, పదాలు

మొదలైనవి. అందే ఈ రచనల్ని ముందు నేర్చుకొని, బాగా సాధన చేసి ఆతరువాత వాటిని కచేరీల్లో పాడడమో, వాయించడమో చేస్తారు. వీటిని గురించి వివరంగా చెప్పుకొందాం.

## వర్ణం

సంగీతం నేర్చుకొనే విద్యార్థులకి వర్ణాలు చాలా ముఖ్యమైనవి. వర్ణాలు ఎన్ని వీలైతే అన్నీ విద్యార్థులు నేర్చుకొందే మంచిది. వర్ణాలు నేర్చుకోవడం వల్ల రాగాల గురించి బాగా అర్థం అవుతుంది. వర్ణాలు ఎక్కువగా నేర్చుకొందే, ఇతర సంగీత రచనల్ని సులభంగా నేర్చుకోవచ్చు. వర్ణాలను రాయడం కష్టం. అందుకే వర్ణాలు 200 మించి దొరకవు. వర్ణాలలో సాహిత్యం చాలా తక్కువగా ఉంటుంది. దాని ప్రాధాన్యతకూడా తక్కువే. కచేరీని సాధారణంగా వర్ణంతో ప్రారంభిస్తారు.

వర్ణాన్ని 2 భాగాలుగా చేస్తారు. (1) పూర్వాంగం (2) ఉత్తరాంగం. పూర్వాంగంలో చరణం తరువాత 4, 5 చరణ స్వరాలు అనేవి ఉంటాయి.

వర్ణాలని పాడేటప్పుడు, పల్లవి, అనుపల్లవి, ముక్తాయి స్వరం పాడి తరువాత పల్లవితో ఆపుతారు. ఆ తరువాత చరణం పాడి, చరణ స్వరాలు పాడతారు. మళ్ళీ చరణంలో ఆపుతారు.

వర్ణాలలో రెండురకాలున్నాయి. అవి
(1) తాన వర్ణాలు (2) పదవర్ణాలు.

## తానవర్ణాలు

తానవర్ణాలలో పల్లవి, అనుపల్లవి, చరణం వీటికే సాహిత్యం

ఉంటుంది. ముక్తాయి స్వరానికీ, చరణ స్వరాలకీ సాహిత్యం ఉండదు. కేవలం ఆ స్వరాలనే పాడేస్తారు. కాంభోజి, మోహన, భైరవి, తోడి, సారంగ, హంసధ్వని ఇలా చాలా రాగాలలో వర్ణాలున్నాయి. వర్ణాలు సాధారణంగా ఆది తాళంలోనే ఉంటాయి. కొన్ని ఖండజాతి అట తాళంలో కూడా ఉంటాయి.

తానవర్ణాల్ని పచ్చిమిరియం ఆది అప్పయ్యా, వీణకుప్పయ్యర్, శ్యామశాస్త్రి, మానాంబుచావడి వెంకట సుబ్బయ్యర్, అయ్యాసామి, తిరువత్తియూర్ త్యాగయ్యర్ లాంటి వాగ్గేయకారులు రచించారు. సాధారణంగా తాన వర్ణాల్ని క్రియకి నాలుగు అక్షరాలు చొప్పున పాడాలి లేదా వాయించాలి.

## పదవర్ణాలు

పదవర్ణాలనే చౌక వర్ణాలు అంటారు. చౌకం అంటే నెమ్మదిగా అని అర్థం. అంటే ఈ వర్ణాల్ని నెమ్మదిగా పాడాలన్నమాట. ఇవి నృత్యం చేయడానికి వీలుగా ఉంటాయి. అంటే ఈ వర్ణాలలో ఉన్న సాహిత్యానికి తగినట్లుగా నృత్యం చేస్తారు. పదవర్ణాలలో ముక్తాయి స్వరం, చరణం, చరణ స్వరాలు. అన్నింటికీ సాహిత్యం ఉంటుంది.

గోవిందసామయ్యా, కూన సామయ్యా, రామస్వామి దీక్షితులు, వడివేలు మొదలైన వాగ్గేయకారులు పదవర్ణాల్ని రచించారు.

కచేరీ ప్రారంభంలో వర్ణం పాడతారు. కచేరీకి వెళ్ళినప్పుడు వర్ణం పాడుతుంటే అది ఏవర్ణమో సంగీతం వచ్చినవాళ్ళను అడిగి తెలుసుకోండి. రేడియోలో సంగీత కచేరీలు వస్తాయి. అప్పుడు

కూడా కొన్ని సార్లు వర్ణం పాడతారు. ఫలానా రాగంలో ఉన్న వర్ణం మీరు వినబోతున్నారని రేడియోలో ముందు చెబుతారు. బాగా వర్ణాల్ని వినండి.

## కృతులు - కీర్తనలు

సంగీత కచేరీలలో ఎక్కువగా కృతుల్ని, కీర్తనల్ని పాడతారు లేదా వాయిస్తారు. ప్రస్తుతం, కృతులన్నా కీర్తనలన్నా ఒకటిగానే అందరూ అనుకొంటున్నారు. కానీ కృతులకు, కీర్తనలకు కొన్ని తేడాలున్నాయి.

ముందు మనం కృతుల గురించి చెప్పుకొందాం. కృతులకి పల్లవి, అనుపల్లవి, చరణాలు ఉంటాయి. కృతుల్లో కొన్నింటికి ఒకటే చరణం ఉంటుంది. కొన్నింటిలో 4,5 చరణాలు కూడా ఉంటాయి. కృతులలో సాహిత్యం అంత ముఖ్యం కాదు. సాహిత్యం కొద్దిగా ఉంటుంది. భగవంతుణ్ని పొగుడుతూనో, వేదాంత సంబంధమైన విషయాలో ఇలా చాలా రకాలుగా సాహిత్యం ఉండవచ్చు.

కృతిలో ముఖ్యమైనది 'సంగతి'. సంగతి అంటే ఏమిటో చూద్దాం. ఒక కృతి ఉందను కోండి. ఈ కృతి ఏదో ఒక రాగంలో ఉందను కొందాం. ఆ కృతిలో ఒకలైన్‌ను, ఆరాగంలో కొన్ని స్వరాలతో పాడాం అనుకొందాం. తరువాత అదేలైన్‌ను, అదేరాగంలో స్వరాలను మార్చి పాడతారు. ఇలా ఒకే లైన్‌ను స్వరాలు మార్చిపాడడాన్నే సంగతి అంటారు. ఈ సంగతుల్ని కృతులు రచించేవాళ్ళే రాసి ఉంచుతారు.వాటిని ముందుగా ఇంటిదగ్గర నేర్చుకొని, సాధన చేసి, ఆ తరువాత కృతిని సంగతులతో

కచేరీలలో పాడతారు. కొన్నిసార్లు సంగీత విద్వాంసులుకూడా కృతులలో సంగతుల్ని చేర్చుతూంటారు.

సంగతి అంటే ఒక ఉదాహరణ ఇస్తాను. దానిని గమనించండి. 'భైరవి' రాగంలో 'ఉపచారము చేసేవారున్నారని మరువకురా' అన్న కీర్తన ఉంది. ఈ లైన్ పల్లవి అన్నమాట. ఈ పల్లవిని భైరవి రాగంలోనే రకరకాలుగ స్వరాల్ని మార్చి పాడతారు. ఇలా పాడడాన్నే సంగతులు అంటారు.

ఒకటవ సంగతి

; గ మ   గా ; రీ సా   రీ ; గారీ గా;
  ఉ ర   చా ర ము   చే సే... వా
; రి గ మాపాదాపా మాగమా దపమా గరిసా
   రు - న్నా-ర ని   మ-రు-వ-కు   ర

ఈ సంగతిలో 'గ' అనే స్వరానికి బదులు 'ఉ' అనే అక్షరం; 'మ' స్వరానికి బదులు 'ప' అక్షరం మళ్ళీ 'గ' స్వరం బదులు 'చా' అనే అక్షరం ఇలా పాడతారు. ఇప్పుడు ఈ పల్లవిలో అక్షరాలనే స్వరాల్ని మార్చి పాడితే - ఇంకా సంగతులు వస్తాయి. ఇంకో సంగతి చూడండి.

; గమ గా;రీసా రీ; సరిగరి గా; రిగమప దనిసా
ఉప చారము చే సే.... వా రు,..... న్నా..
సనిదప మగమా దప పమ గరి సని
ర-ని- మ - రు వ - కు రా..

చూశారా! 'ఉపచారము' కు స్వరాలు 'గమగా, రీసా కదా! ఇవి మొదట చెప్పుకొన్న సంగతి లోలాగే ఉన్నాయి.

మారలేదు. 'చే' కి 'రీ' స్వరం ఉంది. అయితే 'సే' అక్షరానికి స్వరాలు మారాయి చూడండి. మొదటి సంగతిలో 'సే'కు 'గారి' స్వరాలు వచ్చాయి ఈ సంగతిలో సరిగరి స్వరాల బదులు 'సే'ను పాడతాం. అలాగే 'రు' అక్షరానికి కూడా మొదటి సంగతి కన్నా స్వరాలు మారాయి గమనించారా?

ఇలా ఒకే అక్షరాలని, స్వరాలు మార్చి వేరు వేరుగా పాడడాన్నే సంగతులు అంటారు. ఈ సంగతుల్ని, కృతులు రచించిన వాగ్గేయకారులు ఏర్పాటు చేస్తారు. సంగతుల్ని ముందుగా నేర్చుకొని తరువాత వాటిని కచేరీలలో పాడతారు. కొన్నిసార్లు విద్వాంసులు కచేరీలు చేసేటప్పుడు అప్పటి కప్పుడు కొన్ని సంగతుల్ని కల్పించి కూడా పాడుతూంటారు. సంగతులవల్ల కృతులు ఎంతో అందంగా ఉంటాయి. కృతి పల్లవిలోను, అనుపల్లవిలోను, చరణంలోను కూడా సంగతులు ఉంటాయి.

త్యాగరాజు, శ్యామశాస్త్రి, ముత్తుస్వామి దీక్షితులు, వీణ కుప్పయ్యర్, పట్నం సుబ్రహ్మణ్యయ్యర్ మొదలైన వాగ్గేయకారులు కృతుల్ని రచించారు.

కొన్ని కృతుల్లో చిట్టస్వరం అనేదికూడా ఉంటుంది. చిట్టస్వరం అంటే 2, 3 ఆవృత్తాల స్వరాలు. కృతి ఏరాగంలో ఉందో ఆరాగంలోనే ఈ చిట్టస్వరం ఉంటుంది. చిట్టస్వరానికి సాహిత్యం ఉండదు. అనుపల్లవి పాడి, చిట్టస్వరం పాడతారు. ఆ తరువాత మళ్ళీ పల్లవి పాడతారు. అలాగే చరణం తరువాత చిట్టస్వరం పాడి, మళ్ళీపల్లవి పాడతారు. కొన్ని చిట్ట స్వరాలికి సాహిత్యంకూడా ఉంటుంది. అలాంటి వాటినే స్వరసాహిత్యం

అని అంటారు. కొన్ని కృతుల్లో మధ్యమకాల సాహిత్యం అనేది ఉంటుంది. మధ్యమ కాల సాహిత్యం అంటే కృతిని పాడే వేగంకన్నా, ఈ మధ్యమకాలసాహిత్యాన్ని ఇంకా వేగంగా పాడాలన్నమాట. ముత్తుస్వామి దీక్షితుల వారి కృతుల్లో మధ్యమకాల సాహిత్యం కనిపిస్తుంది.

## కీర్తన

కీర్తన గురించి తెలుసుకొందాం. కీర్తనలో పల్లవి, చరణాలు ఉంటాయి. కీర్తనకు అనుపల్లవి ఉండదు. కీర్తనలకి సాహిత్యం చాలా ముఖ్యం. చరణాలు ఎక్కువగా ఉంటాయి. సంగతులు, చిట్టస్వరాలు, ఉండవు కీర్తన అన్నది పురాతన రచన అంటే కృతికన్నా ముందుది.

దేవాలయాల్లో కొంతమంది గుంపులుగా చేరి, భజనలు చేస్తూంటారు. మీరు ఎప్పుడైనా చూశారా! ఇలా గుంపులుగా చేరి పాడుకోడానికి వీలుగా ఉండే రచన ఈ కీర్తన రామదాసు, అన్నమయ్యకీర్తనల్ని రాశారు. ఇలా కృతికి, కీర్తనకి కొన్ని భేదాలు ఉన్నాయి.

## పదం

పదాన్ని చాలా నెమ్మదిగా పాడుతూంటారు, పదానికి, పల్లవి, అనుపల్లవి, చరణం అనే మూడు భాగాలు ఉంటాయి. పదానికి సంగీతం, సాహిత్యం కూడా ముఖ్యమైనవే. పదాలలోని సాహిత్యం శృంగారంలా పైకి కనిపించినా లోపలవేదాంతం దాగి ఉంటుంది. క్షేత్రయ్య అనే వాగ్గేయకారుడు ఎన్నో పదాలు

రచించాడు. అలాగే ఘనం సీనయ్యా, గోవిందసామయ్యా, సారంగపాణి కూడా పదాల్ని రచించారు. పదాల్ని పాడడం కష్టం. పదాలు నృత్యం చేయడానికి కూడా చాలా బాగుంటాయి. కచేరీ చివరలో ఇదివరకు ఒక పదం కూడా తప్పకుండా పాడేవారు. అయితే ఈ మధ్య కచేరీలలో పదాలు అప్పుడప్పుడు మాత్రమే వినిపిస్తున్నాయి.

## జావళి

ఇదికూడా పదంలా ఉంటుంది. పల్లవి, అనుపల్లవి, చరణాలు ఉంటాయి. అయితే దీనిని పదంలా కాకుండా వేగంగా పాడతారు. భాష చాలా తేలికగా ఉంటుంది. సాహిత్యం శృంగార సంబంధంగా ఉంటుంది. కచేరీ చివరలో జావళిపాడుతూంటారు. జావళీలకు నృత్యం కూడా చేస్తారు. ధర్మపురి సుబ్బరాయర్, పట్టాభి రామయ్యా, రామ్నాడ్ శ్రీనివాసయ్యంగార్, స్వాతితిరునాళ్ మొదలైన వారు జావళీలు రచించారు.

## అష్టపదులు

**12** వ శతాబ్దంలో జయదేవుడనే వాగ్గేయకారుడు ఉండేవాడు. అయన గీతగోవిందం' అనే గ్రంథం రాశాడు. అందులో పాటలు ఉన్నాయి. ఈ పాటల్నే 'అష్టపదులు' అని పిలిచాడు జయదేవుడు. అష్టపదులకి ఎనిమిది చరణాలు ఉంటాయి (సంస్కృతలో 'అష్ట' అంటే ఎనిమిది) ఈ అష్టపదులు సంస్కృతభాషలో ఉన్నాయి. జయదేవుడి కాలం నాటికి కీర్తనలు లేవు. అష్టపదులకి పల్లవి, అనుపల్లవి, అనే భాగాలుండవు. పల్లవిలాంటి భాగాన్నే ధృవం

అంటారు. జయదేవుడు తరువాత శేఖరేంద్ర సరస్వతి, రామకవి ఇలాంటి అష్టపదులు రాశారు. అప్పుడప్పుడు కచేరీ చివరలో ఒక అష్టపది పాడతారు.

## తరంగాలు

నారాయణ తీర్థులు అనేవాగ్గేయకారుడు 'కృష్ణలీలాతరంగిణి' అన్న గ్రంథం రాశారు. అందులో పాటలకి తరంగాలు అని పేరు. దీనికి పల్లవి, అనుపల్లవి, కొన్ని చరణాలు ఉంటాయి. ఇవి కూడా సంస్కృతంలో ఉన్నాయి. విజయగోపాల స్వామి కూడా ఇలాంటి తరంగాలు రాశారు. కచేరీ చివరలో అప్పుడప్పుడు ఓ తరంగం కూడా పాడతారు. రేడియోలో ప్రొద్దున్నే వచ్చే 'భక్తిరంజని' కార్యక్రమంలో తరుచు తరంగాలు, అష్టపదులు వినిపిస్తూంటాయి.

## తిల్లానా

తిల్లానాను మంచి వేగంగా పాడతారు. ఇవి వింటుంటే మనకు చాలా హుషారు కలుగు తుంది. కచేరీ చివరలో ఒక తిల్లానాని పాడుతూంటారు. తిల్లానాలో సాహిత్యం చాలా తక్కువగా ఉంటుంది. కేవలం జతులే ఉంటాయి. జతులు అంటే ఒక రకమైన శబ్దాలు. మృదంగం అనే వాద్యం ఒకటి ఉంది. ఈ వాద్యం వాయించినప్పుడు కలిగే ధ్వనుల్ని జతులంటారు. అంటే మృదంగం ఒక విధంగా వాయించితే వచ్చేధ్వనిని 'త' అని, మరొక రకంగా వాయిస్తే వచ్చేధ్వనిని 'ధీం' అని అలా పిలుస్తారు. ఇలాంటి ధ్వనులనే జతులంటారు. కొన్ని జతులు

చూడండి. 1. ధిం తనన 2. కిటతోం 3. తరకిటతోం 4. తధింగిణత తిల్లానాలో పల్లవి, అనుపల్లవి, చరణం ఉంటుంది. పల్లవి, అనుపల్లవిలో సాహిత్యం ఉండదు. జతులే పల్లవి, అనుపల్లవిగా కూర్చుతారు. అందే జతులకే స్వరాలను కడతారు. ఆ స్వరాలకు తగినట్లు జతుల్ని పాడతారు. చరణంలో కొద్దిగా సాహిత్యం ఉంటుంది. స్వాతి తిరునాళ్, పల్లవిశేషయ్యా, పొన్నయపిళ్ళై మొదలైన వాగ్గేయకారులు తిల్లానాలు రాశారు. ఈ మధ్య శ్రీ మంగళం పల్లి బాలమురళీకృష్ణ, శ్రీ లాల్గుడి జయరామన్ చక్కని తిల్లానాలు రాశారు.

## రాగమాలికలు

'మాలిక' అందే 'దండ' అన్నమాట రాగమాలిక అందే రాగాలదండ అన్నమాట. అనేకరకాల పువ్వుల్ని గుచ్చి, దండ కట్టినట్టు, చాలా రాగాలతో ఒక పాటని కూర్చితే అది రాగమాలిక అవుతుంది. అందే పాటలో పల్లవి ఒకరాగం, అనుపల్లవి ఇంకోరాగం, చరణాలు ఒకొక్కటి ఒకొక్కరాగం ఇలా రాగాలు మారుతాయి. సాధారణంగా మనం ముందు చెప్పుకొన్న సంగీతరచనల్లో, ఆ రచన అంతా ఒకే రాగంలో ఉంటుంది. కాని ఈ రాగమాలికలో మాత్రం సంగీతరచన వేరు, వేరు రాగాలలో ఉంటుందన్న మాట. తాళం మాత్రం పాట అంతటికి ఒకటే. తాళం మారదు.

కొన్ని తరంగాలు, అష్టపదులు, కొన్ని కీర్తనలు రాగమాలికగా అందే ఒకే పాటని అనేక రాగాలలో పాడుతూంటారు. కొన్ని వర్ణాలు కూడా రాగమాలికలుగా ఉన్నాయి.

ఒక వర్ణంలో తొమ్మిది రాగాలు వస్తాయి. దానిని 'నవరాగమాలిక వర్ణం' అంటారు. ('నవ' అంటే తొమ్మిది) అలాగే ఒక పాట 14 రాగాల్లో ఉంది. దాన్ని 'చతుర్దశర రాగమాలిక' అంటారు. చతుర్దశ అంటే సంస్కృతంలో పధ్నాలుగు. మహావైద్యనాథయ్యర్ అనే వాగ్గేయకారుడు ఉండేవాడు. మనం 72 మేళకర్త రాగాల్ని చెప్పుకొన్నామే - ఆ 72 మేళకర్త రాగాల్లో ఒక పెద్ద రాగమాలికను రచించాడు.

పాట ప్రతిభాగానికి రాగమే కాకుండా, తాళం కూడా మారుతుంటే అలాంటి వాటిని రాగతాళ మాలికలు అంటారు. రామస్వామిదీక్షితర్ 108 రాగతాళ మాలికను రచించాడు.

కచేరీల్లో ఈ రాగమాలికలు కూడా వినిపిస్తూంటాయి.

సంగీతరచనలు ఇంకా చాలా రకాలు ఉన్నాయి. కచేరీల్లో సంగీత విద్వాంసులు పాడేవి, వాయించేవి, వీటిగురించి మాత్రమే ముఖ్యంగా మీకు చెప్పాను. కచేరీలకి వెళ్ళండి. ఆకచేరీలో విద్వాంసులు వర్ణమా, కీర్తనా, జావళీయా, పదమా, ఏది పాడుతున్నారనే విషయం సంగీతం వచ్చిన వాళ్ళను అడిగితెలును కోండి. ఆ సంగీత రచనని, అది ఏరాగంలో ఉందో, ఏతాళంలోఉందో, దానిని రచించిన వాగ్గేయకారుడెవరో కూడా ఒక పుస్తకంలో రాసుకోండి. ఇలా చేస్తే కొద్దిరోజులకి మీకు ఎన్నో కీర్తనలు, కృతులు, వర్ణాలు మొదలైన సంగీత రచనలతో పరిచయం ఏర్పడుతుంది.

# సంగీత వాద్యాలు

మన కర్ణాటక సంగీతంలో ఎన్నో వాద్యాలు ఉన్నాయని మనం ముందే చెప్పుకొన్నాం. సరస్వతీదేవికి వీణ, కృష్ణుడుకి మురళి, అంటే ఇష్టమని కూడా తెలుసుకొన్నాం ఇప్పుడు రకరకాల సంగీత వాద్యాల గురించి వివరంగా తెలుసుకొందాం.

## తంబూరా

ప్రతీ కచేరీకీ తంబూరా చాలా అవసరం. తంబూరా లేకపోతే అసలు కచేరీయే జరగదు. ఈ తంబూరాని పనస కర్రతో చేస్తారు. ఒక బంతిని తీసుకొని, దానిని సగానికి కోయండి. ఇప్పుడు సగభాగం ఎలా ఉంటుంది? ఆ భాగాన్నే అర్థగోళం అంటాం. ఆ అర్థగోళం గుల్లగా, అంటే లోపల ఏమీ లేకుండా ఉంటుంది కదా! తంబూరాకి, ఇలా గుల్లగా, అర్థగోళంలా ఉన్న భాగం ఒకటి ఉంటుంది. ఒక చెక్కని తీసుకొని, దానిని అర్థగోళంలా కోసి, బాగా కోరి, గుల్లగా చేస్తారు. ఈ భాగాన్ని పైన ఇంకొక పలుచని చెక్కతో మూస్తారు. దీనినే 'కుండ' అంటారు. ఒక చెక్కని పొడవుగా, కాలువలాగ చేసి, దానిపైన మరొక చెక్కని అతుకుతారు. దీన్ని దండి అంటారు. దండిని, కుండకు అతుకుతారు. దండికి చివర అటు, ఇటు రెండు బిరడాలు ఉంటాయి. బిరడాలు అంటే సన్నని, పొడవుగా, గుండ్రంగా ఉన్న పుల్లలు. వీటికి తంబూరా తీగల్ని చుడతారు. దండికి చివర ఉన్నచిన్న రంధ్రంలో ఈ బిరడాలని పెడతారు. దండికి పైన రెండు బిరడాలు ఉంటాయి. అంటే తంబూరాకి మొత్తం నాలుగు బిరడాలు ఉంటాయన్న మాట. తంబూరాకి నాలుగుతీగలు ఉంటాయి. ఒకొక్క తీగను, ఒకొక్క బిరడాకు చుడతారు.

కుండకి చివర తీగల్ని కడతారు. కుండమీద చిన్న పీటలాంటి భాగం ఉంటుంది. దానిని పీట అంటారు. తీగల్ని, కుండకి చివర కట్టి, పీట మీదుగా పోనిచ్చి, దండి మీదుగా తెచ్చి, దండికి చివర ఉన్న బిరడాలకి కడతారు. బిరడాల్ని బిగించి,



వదులు చేసి తీగ బిగుతును మార్చవచ్చు. అలాగే పీటక్రింద తీగలకి పెద్ద పెద్ద పూసల్ని తగిలిస్తారు. ఈ పూసల్ని జరిపినా తీగ బిగుతు మారుతుంది. ప్రతీ తీగక్రింద, పీటమీద చిన్న దారం ముక్కలు పెడతారు. వీటి వల్ల తంబూరా నాదం బాగా వస్తుంది. వీటినే 'జీవాళి' అంటారు.

తంబూరా ఎందుకు ఉపయోగపడు తుంది ?

తంబూరా పైన ఎలాంటి సంగీత రచనల్ని వాయించలేము. ఎందుకంటే తంబూరా సంగీత రచనల్ని వాయించడానికి వీలుగా తయారు చేయబడలేదు. మరి తంబూరా ఎందుకు ఉపయోగ పడుతుంది? తంబూరా కేవలం 'శృతి' వాద్యం. శృతి అంటే ఏమిటో చూద్దాం. మనం పాడాలన్నా, వాయించాలన్నా ఆధారంగా ముందు ఒక స్వరాన్ని తీసుకొంటాం

అని చెప్పుకొన్నాం గుర్తుందా? మనం సంగీత రచనల్ని పాడేడప్పుడు, రకరకాల స్వరాల్ని పాడతాం తిరిగి మళ్ళీ ఆధార షడ్జంతో ఆపేస్తూంటాం. మనం తీసుకొన్న ఆధారషడ్జం మనకి గుర్తుండాలంటే, మనకి ఆధార షడ్జం వినిపిస్తూండాలి. ఆధారషడ్జం బట్టి మిగిలిన స్వరాల పౌనః పున్యాలు ఆధారపడతాయికాబట్టి ఆధారషడ్జమం మనకు వినిపిస్తుంటే మిగిలిన స్వరాల పౌనఃపున్యాల్ని ఖచ్చితంగా పాటిస్తూండడానికి వీలుపడుతుంది.

తంబూరాకి నాలుగు తీగలున్నాయి కదా! నాలుగుతీగల్లో ఒక తీగని మంద్రస్థాయి షడ్జంగా సరిచేస్తారు. తంబూరా బిరడాతిప్పితే తీగ బిగుతు మారతుందని చెప్పుకొన్నాం కదా! బిరడాని తిప్పి, బిగుతుమార్చి ఒకతీగను మంద్రస్థాయి షడ్జంగా సరిచేస్తారు. సప్తస్వరాలలో 'ప' కి కూడా రకాలు లేవు అని చెప్పుకొన్నాం. అందుచేత ఒకతీగను మంద్రస్థాయి పంచమంగా చేస్తారు. మిగిలిన రెండుతీగల్ని మధ్యమస్థాయి షడ్జాలుగా సరిచేస్తారు. ఇలా సరిచేసి, మొదటి మంద్రస్థాయి పంచమం, మధ్యమస్థాయి షడ్జాంను, తరువాత మంద్రస్థాయి షడ్జలు, ఈ వరుసలో తీగల్ని మీటుతారు. ఇలా తీగల్ని మీటినప్పుడు వచ్చే నాదాన్నే శృతి అంటారు. తంబురా తీగల్ని ఈ విధంగా సరిచేయడాన్నే శృతిచేయడం అంటారు.

కొన్నిసార్లు మంద్రస్థాయి పంచమం బదులుగా మంద్రస్థాయి శుద్ధమధ్యమంగా తీగని సరిచేస్తూంటారు. ఇలా చేస్తే దానిని మధ్యమశృతి అంటారు.

మగవాళ్ళ శృతి తక్కువగా ఉంటుంది. అంటే వాళ్ళు

తక్కువ పౌనః పున్యం ఉన్న ధ్వనిని ఆదార షడ్జంగా తీసుకొంటారు. ఆడవాళ్ళ శృతి ఎక్కువ ఉంటుంది. అందే ఎక్కువ పౌనః పున్యం ఉన్న ధ్వనిని వాళ్ళు ఆధార షడ్జంగా తీసుకొంటారు.

సంగీత కచేరీ మొదలు అవడానికి ముందు తంబూరాని శృతి చేస్తారు. ఆ తరువాత ఆ శృతి ఆధారంగా పాటలు పాడతారు. వాద్యాల్ని కూడా తంబూరా శృతికే సరి చేస్తారు. ఆ తరువాతనే ఆ వాద్యాలపైన పాటల్ని వాయిస్తారు.

తంబూరాని నిలువుగా ఉంచి, ఒళ్ళో పెట్టుకొంటారు. కుడిచేతితో మీటుతారు. మంద్ర పంచమాన్ని మధ్యవేలుతో మీటుతారు. ఆ తరువాత మధ్యమస్థాయి షడ్జాల్ని, మంద్రషడ్జాన్ని చూపుడు వేలుతో మీటుతారు. కచేరీ మొదలయ్యేన దగ్గరనుంచీ, కచేరీ అయ్యేదాకా తంబూరాని ఇలా మీటూతూనే ఉంటారు.

తంబూరాలో కుండని చెక్కతో కాకుండా, ఆనపకాయను కూడా కుండగా చేస్తారు. ఇలా ఆనపకాయ కుండగా ఉన్న తంబూరాలనే 'మీరజ్ తంబూరా అంటారు. ప్రస్తుతం ఎలక్ట్రానిక్ తంబూరాలు కూడా తయారు చేస్తున్నారు. వీటిని ఎవరూ వాయించనవసరం లేదు. దానంతట అవే కరెంటు, లేదా బ్యాటరీల వల్ల పలుకుతూ ఉంటాయి.

మామూలు తంబూరాలని తంజావూరు, తిరుచ్చి, బొబ్బిలి, నూజివీడు, పిఠాపురం లాంటి ఊళ్ళలో తయారు చేస్తున్నారు. ఎలక్ట్రానిక్ తంబూరాలని బెంగుళూరు, హైదరాబాదులలో తయారుచేస్తున్నారు.

తంబూరా నాదం ఎంతో హాయిగా ఉంటుంది. తంబూరాలో

నాలుగు తీగల్లో, రెండు తీగల్ని మధ్యమస్థాయి షడ్జానికి సరిచేస్తారని చెప్పుకొన్నాం కదా! అంటే ఈ రెండు తీగల పౌనః పున్యం ఒకటే. అందుచేత ఈ రెండింటిలో ఒక తీగ మీటితే రెండోది దానంతట అదే మ్రోగుతుంది. దీనినే అనునాదం అంటాం. అనునాదం వల్ల తంబూరా నాదం బాగా ఎక్కువగా వస్తుంది.

తంబూరాకి ఉన్న కుండ వల్ల నాదం బాగా బిగ్గరగా వస్తుంది. కుండలోని గాలి కూడా కంపిస్తుంది. అందువల్ల తంబూరా నాదం బిగ్గరగా వస్తుంది.

మనం అనురణాత్మక ధ్వనుల్ని గురించి చెప్పుకొన్నాం గుర్తుందా? తంబురా మీటినప్పుడు ఎన్నో అనురణాత్మక ధ్వనులు కలుగుతాయి. అందువల్లే తంబూరా నాదం చాలా హాయిగా ఉంటుంది.

## వీణ



వీణ చాలా పురాతనమైన వాద్యం. మన దేశంలోఎప్పటి నుంచో వీణలు ఉన్నాయి. వీణ మీద మనం రకరకాల సంగీత రచనల్ని అంటే కీర్తనలు, కృతులు, వర్ణాలు ఇలాంటివి అన్నీ వాయించవచ్చు.

వీణ ఎలా ఉంటుందో చూద్దాం. వీణకి కూడా తంబూరాకి ఉన్నట్టుగానే ఒక కుండ ఉంటుంది. ఆకుండ అర్థగోళంలా ఉండి, గుల్లగా ఉంటుంది. వీణని కూడా పనసకర్ర, లేదా బ్లాక్ వుడ్‌తో చేస్తారు. ఈ కుండకి 'దండి' అనే భాగాన్ని అతుకుతారు. ఒక పొడుగాటి. చెక్కని కాలువలా తొలచి కుండకి అతుకుతారు. దండి అంటే ఇదే. దండి గట్టు చాలా సన్నగా ఉంటుంది. ఈ సన్నని గట్టుమీద మైనం పూస్తారు. కాలవకి వంతెన లాగ ఈ గట్టుకి అటు ఇటు సన్నని ఉక్కు లేదా ఇత్తడి ముక్కల్ని అతుకుతారు. వీటినే మెట్లు అంటారు. మెట్లు **24** ఉంటాయి. ఈ మెట్ల మధ్య ఖాళీలు ఉంటాయి.

దండికి చివర 'యాళి' అనే ఒక జంతువు తలను అతుకుతారు. ఈ జంతువుగురించి పురాణాలలో చెప్పారు, 'యాళి'కి దగ్గరగా, దండికి క్రింద ఒక ఆనపకాయను బిగిస్తారు. ఆనపకాయని బాగా ఎండబెట్టి, దానిని గుల్లగా చేసి, దానిని వీణకి బిగిస్తారన్నమాట. దీనినే సొరబుర్ర అంటారు. ఇది వీణకి ఆధారాన్ని ఇవ్వడానికి, నాదాన్ని బిగ్గరగా చేయడానికి పనికి వస్తుంది. యాళికి దగ్గర, దండికి నాలుగు బిరడాలు ఉంటాయి. కుండకి చివర నాలుగు తీగల్నికడతారు. ఈ తీగల్ని కుండమీద ఉన్న చిన్న పీటలాంటి భాగం మీదనుంచి తీసుకొచ్చి, ఆ తీగల్ని మెట్ల మీదుగా పోనిచ్చి, యాళికి దగ్గరగా ఉన్న బిరడాలకు బిగిస్తారు. ఈ నాలుగు తీగలేకాకుండా వీణకి మరోమూడు తీగలు కూడా ఉంటాయి. వీటిని కూడా కుండకే కడతారు. వీటిని పీటకు ప్రక్కనుంచి తీసుకొచ్చి, దండికి ప్రక్కనుంచి పోనిచ్చి, దండికి ఇంచుమించు

చివరన ఉన్న మూడు బిరడాలకి ఈ తీగల్ని బిగిస్తారు. అంటే ఈ మూడు బిరడాలను మెట్ల మీద పోనివ్వరు. దండి ప్రక్కనుంచి పోనిస్తారన్న మాట. ఈ మూడు తీగల్ని తాళం తీగలు అంటారు. తాళంలో క్రియల్ని సూచించేందుకు ఇవి ఉపయోగపడతాయి. అంటే తాళంలో దెబ్బ వచ్చినప్పుడు ఈ తీగల్ని మీటుతూ ఉంటారు. తాళం తీగలకి, మామూలుతీగలకి కూడా, కుండకి బిగించిన చోట పూసలు ఉంటాయి. ఈ పూసలు కదిపి, లేదా బిరడాల్ని బిగించడం, వదులు చేయడం వల్ల తీగ బిగింపును మార్చవచ్చు.

వీణమీద కీర్తనల్ని, కృతుల్ని, పదాలు, జావళీలు, వర్ణాలు, ఇలా అన్నీ వాయించవచ్చు. వీణతో, కచేరీ చేస్తారు. అంటే వీణపైన సంగీతరచనల్ని వాయిస్తే శ్రోతలు వింటూంటారు. విని మెచ్చుకొంటారు. వీణ బాగా నేర్చుకొన్న వాళ్ళనే వీణ విద్వాంసులు లేదా వైణికులు అంటారు.

వీణపైన సంగీత కచేరీ చేయాలంటే ముందు తంబూరాను శృతి చెయ్యాలి. ఆతరువాత వీణను శృతి చేయాలి. వీణను శృతి చేయడం ఎలాగంటే వాయించే తీగల్లో ఒక తీగను మధ్యమస్థాయిన షడ్జానికి, ఒక తీగను మంద్రస్థాయి పంచమానికి, ఇంకోతీగను మంద్రస్థాయి షడ్జానికి సరిచేస్తారు. వీణలో ఉన్న నాలుగో తీగను అనుమంద్రస్థాయి పంచమానికి సరిచేస్తారు. ఈ అనుమంద్రస్థాయి అంటే ఏమిటో మనం చెప్పుకోలేదు. మధ్యమస్థాయి స్వరాలకి, నగం పౌనఃపున్యంతో మధ్యమస్థాయి క్రింద మంద్ర స్థాయిస్వరాలు ఉంటాయని చెప్పుకొన్నాం. ఈ

మంద్రస్థాయి స్వరాల పౌనఃపున్యంలో సగం పౌనఃపున్యం ఉన్న స్వరాలు మంద్ర స్థాయి క్రింద ఉంటాయి. ఈ స్థాయినే అనుమంద్రస్థాయి అంటారు. వీణలో ఉన్న ఒక తీగని ఈ అనుమంద్రస్థాయి పంచమానికి సరిచేస్తారు.

తాళం తీగలు మూడు ఉంటాయని చెప్పుకొన్నాంకదా! ఒక తీగను మధ్యమస్థాయి షడ్జానికి, ఒక తీగను మధ్యమస్థాయి పంచమానికి, మరోతీగను తారస్థాయి షడ్జానికి సరిచేస్తారు.

పైన చెప్పుకొన్న విధంగా వీణ తీగల్ని సరిచేయడాన్నే, వీణను శృతి చేయడం అంటారు. ఇలా శృతి చేశాక సంగీత రచనల్ని వీణపైన వాయిస్తారు. కుడిచేతి చూపుడు, మధ్యవేళ్ళతో తీగల్ని మీటుతారు. తాళం తీగల్ని చిటికెన వేలుతో మీటుతారు. కుడిచేతితో తీగల్ని మీటుతూ, ఎడమచేతిని మెట్ల మధ్య ఉన్న ఖాళీలలో తీగల్ని నొక్కుతారు. ఇలా తీగల్ని నొక్కడం వల్ల కంపించే తీగ పొడవు మారి, రకరకాల స్వరాలు కలుగుతాయి.

వీణ కుండ, సొరబుర్ర వీణ నాదాన్ని బిగ్గరగా చేయడానికి పనికి వస్తాయి. వీణ తీగని కంపింపచేస్తే కుండలో గాలి కూడా కంపించి నాదంబిగ్గరగా వస్తుంది.

వీణల్ని మైసూర్, తంజావూరు, పిఠాపురం, నూజివీడు, బొబ్బిలి మొదలైన చోట్ల తయారు చేస్తారు.

వీణని అడ్డంగా ఉంచి, కుండని కుడి చేతి వైపున ఉంచి, సొరబుర్రను ఎడమతొడపైన పెట్టుకొని వాయిస్తారు. పూర్వం వీణని నిలువుగా పట్టుకొని వాయించేవారు. ఇప్పుడు అంతా అడ్డుగా ఉంచే వాయిస్తున్నారు.



వైలెన్ మనదేశపు వాద్యం కాదు. బ్రిటిష్ వాళ్ళు మనదేశం పాలించేటప్పుడు, వాళ్ళతో పాటు ఈ వైలెన్ కూడా మనదేశం వచ్చింది. మన సంగీతంలోకి చేరింది. వైలెన్ మీద రకరకాల సంగీత రచనల్ని వాయించవచ్చు. ఈ వైలెన్‌ను నేర్చుకొన్న వాళ్ళనే వైలెన్ విద్వాంసులు అంటారు. వైలెన్‌తో కచేరీ చేయ్యచ్చు. అలాగే వైలెన్‌ను గాత్రకచేరీ చేసేవారి ప్రక్కన, వేణువు మొదలైన కచేరీలకు సహకారవాద్యంగా కూడా ఉపయోగించవచ్చును. సహకార వాద్యం అంటే - ఒకళ్ళు పాడుతున్నారు. అనుకోండి, ప్రక్కన వైలెన్ విద్వాంసులు ఒకళ్ళుకూర్చొని, పాడిన పాటని, పాడేవాళ్ళుకూడా వైలెన్‌పైన వాయిస్తారు. ఇలా వాయించడాన్నే సహకరించడం అంటారు. పాడేవాళ్ళు ఎలాపాడితే అలా వాయించడానికి వైలెన్ బాగా ఉపయోగపడుతుంది. అలాగే కేవలం వైలెన్‌తోనే కచేరీ చేయడానికి వీలుపడుతుంది కేవలం వైలిన్‌తోనే

కచేరీ చేయడం అంటే ఏమిటంటే పాడేవాళ్ళతో కూడా కాకుండా, ఒక్క వైలెన్ పైనే సంగీత రచనల్ని వాయించి, కచేరీ చెయ్యడం. ఇలాంటి కచేరీని 'వైలెన్‌సోలో' కచేరీ అంటారు.

వీణకన్నా వైలెన్ చిన్నదిగా ఉంటుంది. పైగా దీని నాదం పెద్దది. వైలెన్‌ని ఎక్కడికైనా సులువుగా తీసికెళ్ళచ్చు.

వైలెన్‌కు గుల్లగా ఉన్న ఒక పెట్టెలాంటి భాగం ఉంటుంది. ఈ పెట్టె చివరి భాగం  ఈ విధంగా వంపుతిరిగి ఉంటుంది. ఇలా వంపుతిరిగిన భాగం మీద కొంత వెడల్పు, పొడవు ఉన్న చెక్కని అతుకుతారు. దీనినే 'ఫింగర్ బోర్డు' అంటారు. ఈ ఫింగర్ బోర్డుకి పైన, పెట్టెలాంటి భాగానికి అతుకబడి, చిన్న పీటలాంటి భాగం ఉంటుంది. దీనినే బ్రిడ్జి అంటారు. వైలెన్ చివర వంపుతిరిగి ఉన్న భాగం దగ్గర బిరడాలు ఉంటాయి. వైలెన్‌కి నాలుగు తీగలు ఉంటాయి. ఈ నాలుగు తీగల్ని, నాలుగు బిరడాలకి బిగిస్తారు. మరోవైపు ఈ తీగల్ని ఫింగర్‌బోర్డుమీదుగా తీసికెళ్ళి, బ్రిడ్జిమీంచి తీసుకొని వెళ్ళి, పెట్టెలాంటి భాగం చివర బిగిస్తారు. బిరడాలు తిప్పితే తీగల బిగుతు మారుతుంది.

వైలెన్ వాయించడానికి కమాను అనే ఇంకో భాగం ఉంటుంది. ఒక సన్నని పొడవాటి కర్ర, దాన్ని పట్టుకోడానికి పిడిలాంటిది ఉంటుంది. ఈ కర్రకు గుర్రం తోక చివర ఉండే వెంట్రుకలనో లేదా నైలాన్ దారాలతో బిగిస్తారు. దీనినే కమాను అంటారు. ఈ కమాను కుడి చేతితో పట్టుకొని, వైలెన్ తీగల పైన అటు, ఇటు కదుపుతారు. ఇలా చేయడం వల్ల తీగలు కంపించి, ధ్వని వస్తుంది. కమాను, తీగల మీద కదుపుతూ, ఎడమ చేతిని ఫింగర్

బోర్డుపైన ఉంచి, తీగల్ని నొక్కుతారు. ఇలా నొక్కడం వల్ల, కంపించేతీగ పొడవు మారి, రకరకాల స్వరాలు వస్తాయి.

వైలెన్‌కు గుల్లగా ఉండే పెట్టిలాంటి భాగం ఉంటుందని చెప్పుకొన్నాం కదా! వైలెనును వాయిస్తే ఆ గుల్లగా ఉన్న పెట్టెలోగాలి కూడా కంపిస్తుంది. అందుచేత వైలెన్‌నాదం బిగ్గరగ వినిపిస్తుంది.

వైలెన్‌ను వాయించాలంటే ముందు తీగల్ని శృతి చెయ్యాలి. తీగల్లో ఒకదానిని మధ్యమస్థాయి షడ్జానికి, మరోదానిని మధ్యమ స్థాయి పంచమంగాను, ఇంకోతీగను మంద్రస్థాయి పంచమంగాను, ఇంకోదానిని మంద్రస్థాయి షడ్జంగాను చేస్తారు. ఇలా చేయడాన్ని శృతి చేయడం అంటారు. వైలెన్ శృతిచేశాక వైలెన్‌పైన సంగీతరచనల్ని వాయిస్తారు.

వైలెన్‌లను ఎక్కువగా పాశ్చాత్యదేశాలలో తయారుచేస్తారు. మనదేశంలో తయారుచేసిన వైలెన్‌లు అంత నాణ్యమైనవిగా ఉండవు.

## గోటు



గోటు కూడా వీణలాగే ఉంటుంది. అయితే వీణకి ఉన్నట్లు దీనికి మెట్లు ఉండవు. కుడి చేతితో తీగని మీటుతూ ఉంటారు.

ఎడమచేతితో ఒక గుండ్రని కర్ర ముక్కను తీసుకొని, దానిని తీగమీద కదుపుతూ ఉంటారు. ఇలా చేయడం వల్ల కంపించే తీగ పొడవు మారుతుంది. రకరకాల పౌనః పున్యాలున్న ధ్వనులు అంటే స్వరాలు వస్తాయి. గోటునే 'మహానాటక వీణ' అంటారు. గోటు వాద్యాన్ని నేర్చుకోవడం చాలా కష్టం. దీనిని నేర్చుకొన్న విద్వాంసులు కొద్దిమందే ఉన్నారు. గోటుతో వీణలాగే కచేరీలు చేస్తారు. గోటుని వీణలా తొడపైన పెట్టుకోకుండా క్రిందనే ఉంచి వాయిస్తారు.

ఇప్పుడు మనం చెప్పుకొన్న వాద్యాలు అన్నింటికీ తీగలున్నాయి కదా! ఇలా తీగలున్న వాద్యాలనే తంత్రీవాద్యాలు అంటారు. మన కర్ణాటక సంగీతంలో ముఖ్యంగా వాడే తంత్రీవాద్యాలు వీణ, వైలెన్, గోటు. హిందుస్థానీ సంగీతంలో వైలెన్, సితార్, సారంగి, సరోద్, సంతూర్ లాంటి తంత్రీవాద్యాలు న్నాయి.

వైలెన్ మనదేశపు తంత్రవాద్యం కాదని, కాని మనసంగీతం లోకి వచ్చిందని తెలుసుకొన్నాం కదా! అలాగే ఈమధ్య పాశ్చాత్యసంగీతానికి చెందిన కొన్ని తంత్రీవాద్యాల పైన కూడా కర్ణాటక సంగీతాన్ని వాయిస్తున్నారు. గిటార్, మేండొలిన్ ఇవి రెండూ పాశ్చాత్య సంగీతానికి చెందిన వాద్యాలు. అయితే వీటి మీద కూడా కర్ణాటక సంగీతాన్ని వాయిస్తున్నారు. శ్రీయు. శ్రీనివాస్ మొదటి సారిగా మేండొలిన్ పైన కర్ణాటక సంగీతాన్ని వాయించి, ప్రపంచ ఖ్యాతి పొందారు.

# నాగస్వరం



నాగస్వరంను సన్నాయి అని కూడా అంటారు. దక్షిణ భారతదేశంలో బాగా ప్రచారంలో ఉన్న వాద్యం. దేవుడి ఊరేగింపులో, పెళ్ళిళ్ళలోను, పేరంటాలలోను, ఇతర శుభకార్యాల లోను, నాగస్వర మేళాన్ని మీరు చూసే ఉంటారు. అన్ని శుభకార్యాలకి నాగస్వరాన్ని ఉపయోగిస్తారు. కాబట్టి దీనిని 'మంగళ వాద్యం' అంటారు. 'మంగళం' అంటే శుభం అన్నమాట. నాగస్వరాన్ని నోటిలో పెట్టుకొని గాలి ఊదుతూ వాయిస్తారు. నాగస్వరాన్ని గాలి ఊదుతూ వాయిస్తారు కాబట్టి దీనిని గాలివాయిద్యం అంటారు.

నాగస్వరాన్ని, గుండ్రంగా, పొడవుగా, బోలుగా ఉన్న రెండు లేదా రెండు న్నర అడుగుల కర్రతో చేస్తారు. నాగస్వరాన్ని చేయడానికి మద్ది, టేకు లేదా చందనం కర్రని వాడతారు. తమిళనాడులో నారసింగిపేటలో నాగస్వరాన్ని తయారుచేస్తారు. నాగస్వరం పైభాగంలో సన్నగా ఉండి, రానురాను వెడల్పుగా అవుతుంది. అడుగు భాగం గంట ఆకారంలో ఉంటుంది. నాగస్వరం పైన 12 రంధ్రాలు ఉంటాయి. నాగస్వరం పై భాగంలో రెల్లుతో చేసిన ఆకుల్ని ఉంచుతారు. ఈ రెల్లు ఆకులనే పీకఅంటారు. ఈ పీకను నోటిలో ఉంచుకొని, గాలి ఊది, రంధ్రాలను మూసి తెరిచి చేస్తే స్వరాలు పలుకుతాయి.

## వేణువు



వేణువు కూడా గాలి వాయిద్యం. దీనినే మురళి, పిల్లంగోరు అంటారు. ఇంగ్లీషులో దీనినే 'ఫ్లూట్' అంటారు. వేణునాదం ఎంతోహాయిగా వినడానికి చాలా బాగుంటుంది. కృష్ణుడు మురళి ఊదుతుంటే గోపికలు, పశువులు, పక్షులు కూడా ఎంతో ఇష్టంగా వినేవి. కృష్ణుడి బొమ్మలు చూసినప్పుడు, కృష్ణుడి చేతిలో ఉన్నవేణువును కూడా చూసే ఉంటారు.

వేణువును వెదురుతో చేస్తారు. గుండ్రంగా బోలుగా, వంకరలు లేని వెదురు కర్రను వేణువుతయారీకి ఉపయోగిస్తారు. ఈ కర్రను ఒక వైపు మూస్తారు. అలా మూసి ఉన్న చోటుకు దగ్గరగా, ఒక రంధ్రాన్ని చేస్తారు. ఈ రంధ్రంలో గాలి ఊదుతారన్నమాట. ఈ రంధ్రంనుంచి కొంత దూరంలో అదే వరుసలో ఏడు లేక తొమ్మిది రంధ్రాలు చేస్తారు. ఇవి గాలి ఊదే రంధ్రంకన్నా కొంత పెద్దవిగా ఉంటాయి. నాగస్వరాన్ని నోటిలో నిలువుగా పెట్టుకొని వాయిస్తారు. వేణువుని అడ్డుగా పట్టుకొని, గాలి ఊదే రంధ్రంను నోటి దగ్గర పెట్టుకొని, గాలి ఊదుతారు. మూడు ఎడమచేతి వేళ్ళు, నాలుగు కుడిచేతి వేళ్ళను రంధ్రాల మీద కదుపుతూ ఉంటారు. ఈ రంధ్రాలను మూయడం, తెరవడం వల్ల రకరకాల స్వరాలు పలుకుతాయి. రంధ్రాలని ఎక్కువగా మూయడం లేదా తక్కువగా మూయడం వల్ల రకరకాల స్వరాలు

వస్తాయి. వేణువును రక్తచందనం, బంగారం, వెండి, కంచు, ఇనుముతో కూడా చెయ్యచ్చును. కాని, వెదురుతో చేసిన వేణువు నాదమే చాలా బాగుంటుంది.

వేణువు, నాగస్వరంలో స్వరాలు ఎలాపలుకుతారు ?

ఖాళీ సీసాను ఒకటి తీసుకొని, దాని మూతి దగ్గరలో మన మూతిని ఉంచి, గాలి ఊదితే సీసాలోంచి ఈల వినిపిస్తుంది. (అలాగే పెన్నుమూత (కేప్) ను ఊదినా వస్తుంది) దీనికి కారణం మనం గాలి ఊదినప్పుడు సీసాలో గాలి కంపిస్తుంది. అందుకే ధ్వని వస్తుంది. సీసా పెద్దది అయితే ఈల బొంగురుగా, సీసా చిన్నది అయితే కీచుగాను వస్తుంది. కదా!

కంపించే తీగ పొడవును బట్టి పౌనఃపున్యం మారుతుందని, అందువల్ల వివిధ రకాల స్వరాలు పలుకుతాయని చెప్పుకొన్నాం. సీసాను ఊదినప్పుడు వచ్చేధ్వని సీసాలో కంపిస్తున్న గాలి స్తంభం (గాలిస్తంభం అంటే సీసాలో ఉన్నగాలి అన్నమాట) పైన ఆధారపడుతుంది. గాలిస్తంభం పొట్టిగా ఉంటే ధ్వని కీచుగాను, పొడవుగా ఉంటే ధ్వని బొంగురుగాను వస్తుంది.

వేణువులో గాలి ఊదుతూ, రంధ్రాలను మూయడం, తెరవడం చేస్తారని చెప్పుకొన్నాం కదా! ఇలా చేయడం వల్ల, కంపించే గాలిస్తంభం పొడవు మారి వివిధ రకాల పౌనః పున్యాలున్న స్వరాలు వస్తాయి. నాగస్వరంలో కూడా స్వరాలు వేణువులో వచ్చే విధంగానే వస్తాయి. అయితే నాగస్వరంలో, వేళ్లతో రంధ్రాల్ని మూయడమే కాకుండా, నాగస్వరంలోకి ఊదేగాలి ఒత్తిడిని బట్టి కూడా రకరకాల స్వరాలు పలుకుతాయి.

# క్లారినెట్



ఇదికూడా గాలి వాయిద్యమే. మనదేశపు వాద్యం కాదు. కానీ దీనిపైన కూడా కర్ణాటక సంగీతాన్ని పలికిస్తున్నారు. ఈ క్లారినెట్ పైన మొదటి సారిగా కర్ణాటక సంగీతాన్ని వాయించినది శ్రీమహాదేవనట్టువనార్.

క్లారినెట్ కూడా నాగస్వరంలా ఉంటుంది. దీనిని కూడా గాలి ఊది వాయిస్తారు. నాగస్వరంకి ఉన్న రంధ్రాలు పైకి కనిపిస్తాయి. దీనికి అలా కనిపించవు. రంధ్రాలపైన చిన్న చిన్న బొడిపెలు ఉంటాయి. గాలి ఊది, ఈ బొడిపెలను నొక్కితే, గాలి స్తంభం పొడవు మారి, రకరకాలు స్వరాలు పలుకుతాయి. క్లారినెట్‌ను వాయించనప్పుడు, దానిని రెండు భాగాలుగా చేసి దాచుకోవచ్చు. మళ్ళీ అవసరమైతే వాటిని బిగించుకోవచ్చు. నాగస్వరాన్ని ఇలా రెండు భాగాలుగా చేసే వీలులేదు. బ్యాండు మేళంలో ఈ క్లారినెట్‌ను ఉపయోగిస్తూ ఉంటారు. అలాగే క్లారినెట్ మీద రకరకాల సంగీత రచనల్ని వాయించి, కచేరీ చేస్తారు.

హిందుస్థానీ సంగీతంలో కూడా ఇలాంటి గాలి వాద్యాలు చాలా ఉన్నాయి. వేణువును హిందుస్థానీలో కూడా వాడతారు. మన వేణువుకన్నా లావుగా పొడవుగా ఉండే వేణువుల్ని

వాళ్ళువాడతారు. దానినే 'బాంసురి' అంటారు. 'శెహనాయ్' అనే వాయిద్యం శుభకార్యాలలో, ఉత్తరభారతదేశంలో వాడతారు. ఇది మన నాగస్వరాన్ని పోలి ఉంటుంది. నాగస్వరం కన్నా ఇది చిన్నగా ఉంటుంది.

మీరు భజన చేసే బృందాల వాళ్ళదగ్గర, నాటకాలు వేసే వాళ్లదగ్గర హార్మోనియం చూసే ఉంటారు. ఇది కూడా గాలి వాయిద్యమే. దీనిని హిందుస్థానీ సంగీతంలో ఎక్కువగా వాడతారు.

## జలతరంగం

'జలతరంగం' గాలి వాద్యం కాదు, తంత్రీవాద్యం కూడా కాదు. అంటే దీనిని గాలి ఊది వాయించరు. అలాగే దీనికి తీగలు కూడా ఉండవు. మరి ఇది ఎలా ఉంటుంది? వివిధ రకాల సైజుల్లో ఉన్న 18 పింగాణీ కప్పుల్ని తీసుకొంటారు. వీటిని అర్థవృత్తం ఆకారంలో పేర్చు కొంటారు. ఈ కప్పుల్లో నీరు పోస్తారు. కప్పుల్ని రెండు సన్నని వెదురు పుల్లలతో కొడితే ఆకప్పులలోంచి వివిధరకాల స్వరాలు వస్తాయి. పెద్ద సైజులో ఉన్న కప్పుల నుంచి తక్కువ పౌనః పున్యం ఉన్న స్వరాలు, చిన్న సైజులో ఉన్న కప్పులనుంచి ఎక్కువ పౌనః పున్యం ఉన్న స్వరాలు వస్తాయి. ఈ జలతరంగం పైన రకరకాల సంగీత రచనల్ని వాయిస్తారు. జలతరంగంతో సంగీత కచేరీ చేస్తూంటారు. ఇది చాలా పురాతనమైన వాయిద్యం. కొన్ని ప్రాచీన గ్రంథాల్లో జరతరంగం ప్రస్తావన ఉంది. జలతరంగాన్ని చక్కగా వాయించగలిగే విద్వాంసులు చాలా కొద్దిమంది మాత్రమే ఉన్నారు.

ఇంత వరకూ మనం చెప్పుకొన్న వాద్యాల్లో వీణ; వైలెన్, వేణువు, గోటు, సన్నాయి, క్లారినెట్ జలతరంగం వీటి అన్నింటిపైనా సంగీతరచనల్ని వాయించవచ్చు అని చెప్పుకొన్నాం. ఇలా వాయించేటప్పుడు కేవలం స్వరాల్ని వాయించడానికి మాత్రమే వీలు పడుతుంది. సాహిత్యాన్ని వాయించడానికి వీలుపడదు. ఈ వాద్యాలపైన స్వరం వాయించినా సాహిత్యం వాయించినా కూడా స్వరమే వాయిస్తారు. ఇలా సాహిత్యానికి బదులు స్వరమే వాయించినా; స్వరానికి, సాహిత్యానికి ఉన్న తేడా తెలియడానికి, వాద్యాల్ని వాయించేడప్పుడు కొన్ని ప్రత్యేక పద్ధతుల్ని అనుసరిస్తారు.

తంబూరా కేవలం శృతి వాద్యం అని, దానిపైన సంగీతరచనల్ని వాయించలేమని చెప్పుకొన్నాం. అలాగే సంగీతరచ నల్ని వాయించేందుకు ఉపయోగపడని వాద్యాలు ఇంకాకొన్ని ఉన్నాయి. అవి మృదంగం, డోలు, కంజీరా, మోర్సింగ్, ఘటం మొదలైనవి వీటిపైన కూడా సంగీత రచనల్ని వాయించలేము. మరి ఈ వాద్యాలు ఎందుకు ఉపయోగపడతాయి? పాటకి తాళం కూడా ఉంటుందని చెప్పుకొన్నాం కదా! మృదంగం, కంజీరా, ఘటం, మోర్సింగ్, డోలు ఈ వాద్యాలన్నీ తాళానికి అనుగుణంగా వాయిస్తారు. తాళానికి అనుగుణంగా వాయిస్తారు కాబట్టి వీటిని తాళవాద్యాలు అంటారు. ఈ తాళవాద్యాల్ని వాయించి నప్పుడు కలిగే శబ్దాల్ని 'జతులు' అంటారు. ఈ తాళవాద్యాల్ని ఒక రకంగా వాయిస్తే వచ్చేశబ్దాన్ని 'త' అని, మరొక రకంగా వాయిస్తే వచ్చే శబ్దాన్ని 'ధీం' అని, ఇంకొకరకంగా వాయిస్తే

వచ్చే శబ్దాన్ని 'ఝుం' అని ఇలా వివిధ రకాల శబ్దాలకి, వివిధరకాల పేర్లని పెట్టారు. ఈ శబ్దాలనే జతులు అంటారు. ఎవరైనా పాడుతున్నా, వీణ, వైలెన్, మొదలైన వాద్యాల్ని వాయిస్తున్నా ఈ తాళవాద్యాలపైన, తాళానికి అనుగుణంగా ఈ జతుల్ని వరుసగా వాయిస్తూ ఉంటారు. ఇలా పాట లేదా వాద్యాలతో కూడా తాళవాద్యాల్ని వాయిస్తే వినడానికి చాలా బాగుంటుంది. ఇప్పుడు ఈ తాళవాద్యాలు గురించి చెప్పుకొందాం.

## మృదంగం



తాళవాద్యాలన్నింటిలోకీ చాలా ముఖ్యమైనది ఈ మృదం- -గం. ఇది చాలా ప్రాచీన-మైన వాద్యం. గాత్రకచేరీకి, వైలెన్ సోలో కచేరీకి, వీణ, గోటు, మురళి, క్లారినెట్, జలతరంగం, మేండొలిన్, గిటార్ కచేరీలు అన్నింటికీ మృదంగమే ప్రక్కవాయిద్యం. పక్కవాద్యం అంటే కచేరీలు జరిగేటప్పుడు, పాటకి ఉన్న తాళానికి అనుగుణంగా మృదంగాన్ని కూడా వాయిస్తారు. అందుచేత దీనిని ప్రక్కవాద్యం అంటారు.

ఏగిస, లేదా పనస కర్రతో మృదంగం తయారు చేస్తారు. ఒక్క కర్రను లోపల అంతా తొలిచి, గుల్లగా చేస్తారు. దీనిని మృదంగం గుల్ల అంటారు. ఈ గుల్ల అటు, ఇటు తెరిచి ఉంటుంది. గొట్టం అటు, ఇటు ఎలా తెరచుకొని ఉంటుందో అలాగ. ఈ తెరచి ఉన్న రెండు చివరల్ని చర్మంతో చేసిన మూతలతో మూస్తారు. ఈ మూతల్ని గుల్లకు చర్మపుతాళ్ళతో బిగిస్తారు. ఈ చర్మపుతాళ్ళనే 'వారు' అంటారు.

కుడికాలును ముందుకు జరిపి కూర్చొని, ఆ కాలుమీద మృదంగాన్ని పెట్టుకొని వాయిస్తారు. మృదంగాన్ని అడ్డంగా పెట్టుకొని, రెండుచేతులతోనూ చర్మపుమూతలపైన వాయిస్తారు. కుడిచేతితో వాయించే చర్మపు మూత మూడు రకాల పొరలతో చేయబడి ఉంటుంది. ఇనుపకొలిమిలో దొరికే చిట్టెపురాళ్ళు అనే ఓరకం రాళ్ళను పొడిచేసి, అన్నాన్ని కలిపి ఉండగా చేసి దీనిని కుడిచేతితో వాయించే మూతకు అంటిస్తారు. దీనిని కరిణి అంటారు. ఈ కరిణి వల్ల మృదంగ నాదం చాలా బాగావస్తుంది. కరిణి లేకపోతే నాదం అంతబాగా రాదు. ఎడమచేతితో వాయించే చర్మానికి, గోధుమ రవ్వని బాగా నీళ్లతో తడిపి, ఉండలాచేసి దానిని ఎడమ మూత చర్మానికి అతుకుతారు. దీనిని బోణం అంటారు. ఈ బోణాల్ని ప్రతిసారి మృదంగం వాయించేటప్పుడు అతికించి, మళ్ళీ తీసేస్తూ ఉంటారు.

మృదంగం వాయించేప్పుడు ముందు శృతి చేయాలి. తంబూరా శృతిలో ఆధారషడ్జానికి సరిపోయేలా ఈ మృదంగం ధ్వనిని సరిచేస్తారు. ఇలా సరిచేయడాన్నే శృతి చేయడం అంటారు.

శృతిచేయడానికి, కుడి మూతను కట్టిన చర్మం తాళ్ళపైన రాయితో కొడతారు.

మృదంగం వాయించేటప్పుడు వచ్చే రకరకాల శబ్దాల్ని జతులు అంటారు. గాత్రకచేరీకి కాని వైలిన్ సోలో కచేరీకి, వేణువు, జలతరంగం, మేండొలిన్, క్లారినెట్ ఈకచేరీలన్నింటికీ ప్రక్కవాద్యంగా మృదంగాన్ని వాడతారని తెలుసుకొన్నాం. అండే జతుల్ని తాళానికి సరిపోయేలా కూడా వాయిస్తూంటారు.

సంగీత కచేరీలకి ప్రధానంగా వాడే తాళవాద్యం మృదంగం. అయితే మృదంగంతో పాటు ఘటం, కంజీరా, మోర్‌సింగ్ అనే తాళవాద్యాల్ని కూడా వాడతారు. అండే వీటిని మృదంగానికి జతగా ఉపయోగిస్తారన్నమాట. ప్రతీ కచేరీకి - మృదంగం తప్పని సరిగా ఉంటుంది. ఘటం, కంజీరా, మోర్‌సింగ్‌లు కొన్ని కొన్ని కచేరీలలో మృదంగంతో పాటుగా ఉంటాయి. ఈ తాళవాద్యాల్ని గురించి కూడా కొంత చెప్పుకొందాం.

## ఘటం



ఘటం కూడా చాలా పురాతనమైన వాద్యం. ఘటం అంటే సన్నని మూతి ఉన్న సాధారణమైన కుండ. ఈ కుండని ముఖ్యంగా

ఖంక మట్టితో చేస్తారు. ఈ మట్టిలో ఇత్తడి లేదా రాగి రజనుని, ఇనుప రజనుని కూడా కలిపి దానితో ఈ ఘటాన్ని చేస్తారు. ఘటం సైజు శృతిని బట్టి మారిపోతూ ఉంటుంది.

సాధారణంగా ఘటాన్ని ఒళ్ళో పెట్టుకొని వాయిస్తూంటారు. ఘటం మూతి భాగాన్ని పొట్టవైపు పెట్టుకొంటారు. రెండు చేతుల వేళ్ళతో వాయిస్తూంటారు. అలాగే అరచేతిని, గోళ్లను కూడా ఉపయోగించి, రక రకాల శబ్దాలు వచ్చేలా చేస్తారు. ఘటాన్ని వాయించేటప్పుడు రకరకాల స్థానాలలో దాన్ని ఉంచుతూ వాయిస్తారు. ఒకొక్కసారి గాలిలోకి ఘటాన్ని ఎగిరేసి మళ్ళీ పట్టుకొంటూ ఉంటారు కూడా.

## కంజీరా



కంజీరా కూడా చాలా పురాతన వాయిద్యమే. గుండ్రంగా ఉన్న ఒక చెక్క ఫ్రేము ఒకటి ఉంటుంది. దీని వ్యాసం ఎనిమిది, లేదా తొమ్మిది అంగుళాలు ఉంటుంది. ఈ చెక్క ఫ్రేములో నాలుగు, లేదా మూడు అంగుళాలు లోతు ఉంటుంది. ఈ ఫ్రేముకి 'ఉడుము' అనే జంతువు చర్మాన్ని అతుకుతారు. రెండో వైపున

తెరచి ఉంచేస్తారు. ఈ ఫ్రేముకి చిన్న రంధ్రం ఉంటుంది. దానిలో గుండ్రంగా ఉన్న రెండు లోహపు బిళ్ళల్ని ఉంచుతారు.

కంజీరాని ఎడమచేతితో పట్టుకొని, కుడి అరచేతితోను, వేళ్ళతోనూ వాయిస్తారు. ఫ్రేముకి దగ్గరగాను, దూరంగాను వాయించడం వల్ల రకరకాల శబ్దాలు కలుగుతాయి.

## మోర్సింగ్



గుండ్రంగా ఉన్న ఒక ఇనుపరింగు ఒకటి ఉంటుంది. దీనికి పలుచగా ఉన్న ఇనుప రేకుని అతుకుతారు దీనినే 'నాలుక' అంటారు. ఈ నాలుక ఒకవైపున వంపుతిరిగి ఉంటుంది. మరోవైపున ఇనుపరింగుకన్నా ముందుకుతోసుకొచ్చి ఉంటుంది. మోర్సింగ్ను నోటిలో పెట్టుకొని, వాయిస్తారు. వంపుతిరిగి ఉన్న 'నాలిక' భాగాన్ని చూపుడు వేలితో మీటుతారు. నోటిలోపల భాగం వల్ల మోర్సింగ్ నాదం అనునాదం చెందుతుంది. నోటిని పెద్దగా తెరవడం మూయడం వల్ల, ఊపిరి నియంత్రించడం వల్ల రకరకాల శబ్దాలు కలుగుతాయి. దీని నాదం చాలా బాగుంటుంది.

# డోలు



పెళ్ళిళ్ళలో నాగస్వరమేళం ఎప్పుడైనా చూశారా? నాగస్వరానికి ప్రక్కన వాయించే తాళ వాద్యం డోలు. దీనిని మీరు ఎప్పుడైనా చూశారా?

డోలును ఏగిన లేదా పనస కర్రతో చేస్తారు. మృదంగం లాగే 'గుల్లను' తయారుచేస్తారు. ఈ గుల్ల మృదంగం గుల్లకన్నా చిన్నదిగా ఉంటుంది. ఆకారం కూడా వేరుగా ఉంటుంది. ఈ గుల్లని అటు, ఇటు మేకచర్మంతో మూసి, దానిని చర్మపుతాళ్ళతో గుల్లకి బిగిస్తారు. డోలుకి 'కరిణి', 'బోనం' ఉండవు.

కూర్చొని వాయించేటప్పుడు డోలును అడ్డుగా, వడిలో పెట్టుకొని వాయిస్తారు. దేవుడి ఊరేగింపు అవుతోందనుకోండి. అప్పుడు మెడలోదీనిని కట్టుకొని వాయిస్తూంటారు.

కుడిచేతివేళ్ళకి చిన్న చిన్న తొడుగుల్ని తొడుగుకొని, వాటితో డోలు కుడివైపుభాగాన్ని వాయిస్తారు. ఎడమభాగాన్ని చిన్న కర్రతోవాయిస్తారు.

హిందుస్థానీ సంగీతంలో 'తబలా' అనే తాళవాద్యాన్ని వాడతారు.

ఇలా మన సంగీతంలో ఎన్నెన్నో తాళవాద్యాలు ఉన్నాయి.

# సంగీత కచేరీలు

సంగీత కచేరీలు ఎలా ఉంటాయి? కచేరీలో ఎవరెవరు పాల్గొంటారు? కచేరీలలో ఏమేమి పాడతారు మొదలైన విశేషాలు ఇప్పుడు చెప్పుకొందాం.

ఏ కచేరీకైనా తంబూరా శృతి ఉండాలి అని చెప్పుకొన్నాం కదా! అన్ని కచేరీలకీ ముందు తంబూరాని శృతిచేసి, కచేరీ మొదలు అయిన దగ్గరనుంచీ, అయ్యేదాకా ఒకళ్ళు మీటుతూనే ఉంటారు.

గాత్రకచేరీ లో ఎవరెవరు పాల్గొంటారో చూద్దాం. ఒకళ్ళు తంబూరా వాయిస్తుంటారు. గాత్ర విద్వాంసులు పాడుతూ ఉంటారు. మరొకరు వైలెన్ పై వాయిస్తూ, పాడేవాళ్ళకు సహకరిస్తూ ఉంటారు. మరొకళ్ళు మృదంగంతో సహకరిస్తారు. కొన్నిసార్లు మృదంగంతోపాటు, కంజీరా, ఘటం, మోర్సింగ్ లాంటి తాళవాద్యాలు కూడా ఉంటాయి. వైలెన్, మృదంగాలను సహకారవాద్యాలు అంటారు.

కొన్నిసార్లు ఇద్దరు కలిసి గాత్రకచేరీ చేస్తూంటారు. ఇలా ఇద్దరు కలిసి చేసే గాత్రకచేరీని గాత్రయుగళ కచేరీ అంటారు.

వీణకచేరీ ఎలా ఉంటుందంటే ఒకళ్ళు తంబూరా మీటుతూ శృతివేస్తారు. మరొకరు వీణవాయిస్తారు. వీణకి సహకారంగా మరొకళ్ళు మృదంగం వాయిస్తూంటారు. వీణకచేరీలకి సహకారంగా సాధారణంగా వైలెన్ ఉండదు. మృదంగంతో కూడా కొన్నిసార్లు

ఘటం, కంజీరా, మోర్సింగ్ కుడా ఉంటాయి. వైలెన్ కచేరీ ఎలా ఉంటుందంటే తంబురా శృతి ఉంటుంది. ఒకళ్ళు వైలెన్ వాయిస్తూంటే మరొకళ్ళు మృదంగంతో సహకరిస్తారు. కొన్నిసార్లు ఘటం, కంజీరా, మోర్సింగ్ కూడా ఉంటాయి. ఒకళ్ళు వైలెన్ వాయిస్తుంటే , మరొకళ్ళు కూడా సహకరిస్తూ వైలెన్ వాయించడం కూడా కొన్ని కొన్ని కచేరీలలో కనిపిస్తుంది. అలాగే ఇద్దరు కలిసి వైలెన్ కచేరీ చేస్తారు. దానినే వైలెన్ ద్వయం' కచేరీ అంటారు. ఈ వైలెన్ ద్వయం కచేరీకి మృదంగం, ఇతర తాళవాద్యాలు ఉంటాయి.

అలాగే వేణువు, మేండొలిన్, క్లారినెట్ కచేరీలకి కూడా వైలెన్, మృదంగం పక్కవాద్యాలుగా ఉంటాయి. కొన్ని కొన్ని సార్లు కంజీరా, ఘటం, మోర్సింగలాంటి తాళవాద్యాలు కూడా ఉండచ్చు. శృతికి తంబూరా కూడా ఉంటుంది.

నాదస్వరంను పెళ్ళిళ్ళలోను, శుభకార్యాలలోను వాయిస్తారు. అలాగే నాదస్వరంతో కచేరీ కూడా చేస్తారు. నాదస్వరానికి, డోలును ప్రక్కవాద్యంగా వాయిస్తారు. తంబూరా శృతికాకుండా 'హార్మోనియం'ను శృతికి ఉపయోగిస్తారు. నాదస్వరం వాయించే వాళ్ళకు తాళం తెలిసేటుందుకు ఒకళ్ళు తాళం వేస్తూంటారు. ఇలా తాళం వేయడానికి లోహంతో చేసిన రెండు చిన్న పళ్ళెములు లాంటివి ఉంటాయి. వాటితో శబ్దం చేస్తూ తాళాన్ని ఒకళ్ళు వేస్తూంటారు. నాదస్వరంకు వైలెన్ను ప్రక్కవాద్యంగా ఉపయోగించరు. అంటే నాదస్వర కచేరీలో వైలెన్ ఉండదు.

# సంగీత కచేరీలో ఏమిపాడతారు/వాయిస్తారు?

కచేరీని సాధారణంగా 'వర్ణం'తో మొదలు పెడతారు. ఆ తరువాత వినాయక ప్రార్థన అంటే వినాయకుడిపై రచించిన ఓ కృతి పాడతారు. కచేరీ ఏ ఆటంకమూ లేకుండా జరగాలని వినాయకుణ్ణి ప్రార్థిస్తారన్నమాట. ఆ తరువాత కొన్ని కీర్తనల్ని కృతుల్ని పాడతారు. కచేరీ చివరలో తిల్లానా, జావళీ, పదం, అష్టపది, తరంగం, రామదాసుకీర్తనలు, అన్నమయ్య కీర్తనలు వీటిలో ఏవో కొన్ని పాడతారు. కొన్నిసార్లు కచేరీ చివరలో 'శ్లోకం' కూడా పాడతారు. 'శ్లోకం' అంటే తెలుసుగా? రామాయణం, భారతం మొదలైన గ్రంథాల్లో శ్లోకాలు ఉంటాయి. ఇవి సంస్కృతంలో ఉంటాయి. కచేరీ చివరలో ఒక శ్లోకాన్ని తీసుకొని, దానిలో ఒకొక్కలైన్‌ను ఒకొక్కరాగంలో పాడతారు ఇలా పాడడాన్ని రాగ మాలిక అంటారు. కచేరీని 'మంగళం'తో ముగిస్తారు. మంగళం అంటే శుభం అన్నమాట. మీరు వెంకటేశ్వర సుప్రభాతం విన్నారా? చివరలో మంగళం అని శ్లోకాలు చదువుతారు. ఇలాంటి సాహిత్యం ఉన్న ఒక కీర్తనను పాడి కచేరీ ముగిస్తారు.

కచేరీలలో కృతులు, కీర్తనలు, వర్ణాలు, జావళీలు మొదలైనవి పాడతారు అని చెప్పుకొన్నాం కదా! వీటిని ముందుగా పాడేవాళ్ళు, లేదా వాయించేవాళ్ళు బాగా నేర్చుకొని, సాధనచేసి, అప్పుడు

కచేరీలలో పాడడమో, వాయించడమో చేస్తారు. ఇలా పాడే కీర్తనలే కాకుండా, కచేరీలో అప్పటికప్పుడు కల్పించి పాడడమో, వాయించడమో చేయాల్సిన అంశాలు కూడా కొన్ని ఉంటాయి. అప్పటికప్పుడే కల్పించి పాడడం అంటే ఏమిటో చూద్దాం. కొందరిని సొంతంగా ఒక కథ చెప్పండి అని అడిగామనుకోండి. వాళ్ళు అప్పటికప్పుడే కల్పించి ఒక కథ వెంటనే చెప్పేస్తారు. అలాగే కొందరు పద్యాల్ని, గేయాల్ని ఆశువుగా రచించేస్తారు. ఏదైనా ఒక విషయంగురించి పద్యం చెప్పమంటే వాళ్ళు అప్పటికప్పుడే ఓ పద్యాన్ని రచించేస్తారు. దీనినే ఆశువుగా పద్యాల్ని చెప్పడం అంటారు. వీళ్ళకు మంచి ఊహాశక్తి ఉంటుందన్న మాట అందుచేతనే ఊహించి వెంటనే పద్యాలు, గేయాలు, కథలు చెప్పేయగలరు. ఇదేమాదిరిగా సంగీత కచేరీల్లో విద్వాంసులు కూడా అప్పటికప్పుడు కల్పించి పాడాల్సిన అంశాలు కూడా కొన్ని ఉన్నాయి. ఇలా అప్పటికప్పుడు కల్పించి పాడాల్సిన అంశాలనే 'మనోధర్మ సంగీతం' అంటారు. రాగాలాపన, స్వరకల్పన, నెరవు, తానం, పల్లవి ఇవన్నీ మనోధర్మ సంగీతం క్రిందకి వస్తాయి. ఎవరైతే మనోధర్మ సంగీతాన్ని బాగా పాడతారో, వాళ్ళకు మనోధర్మం బాగా ఉంది అంటారు. కచేరీలలో మనోధర్మ సంగీతాన్ని విద్వాంసులు ప్రదర్శిస్తారు. మనోధర్మ సంగీతంలో ఉన్న ఒకొక్క-అంశం గురించి తెలుసు కొందాం.

## రాగాలాపన

మన కర్ణాటక సంగీతంలో ఎన్నెన్నో రాగాలున్నాయని చెప్పుకొన్నాం కదా! ఆ రాగాలలో కృతుల్ని, కీర్తనల్ని

వాగ్గేయకారులు రచిస్తారు అని చెప్పుకొన్నాం. కచేరీల్లో ఏదైనా ఒక కృతి పాడేముందు, ఆ కృతి లేదా కీర్తన ఏరాగంలో ఉందో ఆరాగాన్ని ఆలాపన చేస్తారు. ఆలాపన అంటే ఏమిటో చూద్దాం. రాగాలంటే స్వరాలతో ఏర్పడ్డాయని, రాగాలకి కొన్ని లక్షణాలుంటా యని చెప్పుకొన్నాం. రాగానికి ఉన్న స్వరాల్ని సాహిత్యం లేకుండ 'త,ద,రి,న 'అ' అన్న అక్షరాల్ని ఉపయోగించి, రాగాన్ని పెంచి, ఎక్కువసేపు పాడడాన్ని రాగాలాపన అంటారు. ఇలా రాగాన్ని పాడేటప్పుడు ఆ రాగంలో ఎన్నిస్వరాలు వస్తాయి? అవి ఏరకం స్వరస్థానాలు? అన్యస్వరాలు వస్తాయా? ఏ స్వరానికి ఎలాంటి గమకాల్ని ఇవ్వాలి? ఇలాంటి విషయాలన్నింటినీ దృష్టిలో ఉంచుకొని, రాగానికి ఉన్న లక్షణాలను దాటకుండా అప్పటిక ప్పుడు విద్వాంసులు తమ ఊహాశక్తిని ఉపయోగించి చేసేదే ఈ రాగాలాపన. కచేరీల్లో రెండు, మూడు రాగాలని ఆలాపనచేస్తారు. రాగాన్ని ఆలాపించాలంటే చాలా సాధన కావాలి.

విద్వాంసులు ఊహాశక్తిని ఉపయోగించి, రాగాన్ని ఎన్నో రకాలుగా పెంచవచ్చు. ఇలా పెంచేటప్పుడు మంద్రస్థాయి, మధ్యమ స్థాయి, తారస్థాయిలలో కూడా పాడతారు. రాగాన్ని పాడేటప్పుడు అంతా ఒకే స్పీడుతో కాకుండా ఒక సారి స్పీడుగా, నెమ్మదిగానూ పాడతారు. అలాగే ఒకొక్కసారి కొన్ని స్వరాలలో కొంతసేపునిలు పుతుంటారు. రాగాన్ని ముగించే ముందు స్పీడుగా పాడి తరువాత ముగిస్తారు. రాగానికి తాళం ఉండదు. అందుచేత రాగం పాడేటప్పుడు మృదంగాన్ని వాయించరు. ఎందుకంటే మృదంగం తాళాన్ని బట్టే వాయిస్తారని చెప్పుకొన్నాం కదా! అందుచేత

మృదంగం వాయించరు. వైలెన్‌ను మాత్రం వాయిస్తారు. రాగాన్ని పాడడం అయ్యాక వైలెన్ విద్వాంసులకు అవకాశం ఇస్తారు. అంటే వైలెన్ విద్వాంసులు అదేరాగాన్ని తమ ఊహాశక్తిని ఉపయోగించి వాయించి, తమ విద్యను ప్రదర్శిస్తారు. అలా వైలెన్ వాళ్ళుకూడా రాగాన్ని ఆలపించాక కీర్తన పాడతారు.

రాగాలలో ఉన్న స్వరాల్ని పెంపుచేయడం అంటే ఏమిటో తెలుసుకొందాం. 'మోహన' రాగం తీసుకొంటే - ఆరాగంలో ఐదు స్వరాలు ఉన్నాయి. ఈ ఐదుస్వారాలని ఎలా పెంచవచ్చునో చూద్దాం.

మోహన

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| | | చ | అం | | చ | . |
| ఆరో: | స | రి | గ | ప | ద | స |

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| | . | చ | | అం | చ | |
| అవ: | స | ద | ప | గ | రి | స |

మోహన రాగాలాపన కొంచెం చూద్దాం

| | | | |
|---|---|---|---|
| గపరీసా | సా | సరిగపా | గరిసదపా |
| **తనన..** | **త** | **త....** | **న......** |

| | | | |
|---|---|---|---|
| గరీ | గాదప | రీసా | దగరిగ సరీ రిసస దపా |
| **త..** | **త...** | **తన** | **త... న...........** |

చూశారా? ఇలా పాడేవాళ్ళ ఊహాశక్తిని బట్టిరాగాన్ని పెంపుచేయచ్చు. తాళం ఉంది కనుక, మీకు గొద్దిగా మాత్రమే ఉదాహరణకు ఇచ్చాను.

నాగస్వరం, వీణ అలాగే వేణువు, మాండొలిన్, క్లారినెట్ కచేరీలలో కూడా రాగాలాపన ఉంటుంది. ఈ వాద్యాలపైన రాగాన్ని వాయించాక వైలెన్ విద్వాంసులకు రాగాన్ని వాయించే

దుకు అవకాశం ఇస్తారు. రేడియోలోనో, సంగీతకచేరీలు జరుగుతున్నప్పుడో రాగాలాపనను వినండి.

## స్వరకల్పన

స్వరకల్పన కూడా మనోధర్మ సంగీతంలో ఓ భాగం. అప్పటికప్పుడు కల్పించి పాడతారు. ఈ స్వరకల్పన అంటే అమిటో తెలుసుకొందాం.

స్వరకల్పనను, కీర్తన లేదా కృతి పాడడం పూర్తి అయ్యాక చేస్తారు. కీర్తన లేదా కృతిలో పల్లవినో, అనుపల్లవినో, లేకపోతే చరణంలో ఒకలైన్‌నో తీసుకొని, ఆ లైన్ దగ్గర స్వరకల్పన చేస్తారు.

స్వరకల్పన అంటే రాగంలో వచ్చేస్వరాల్ని రకరకాలుగా అమర్చి పాడడం (లేదా వాయించడం) ఇలా స్వరాల్ని రకరకాలుగా అమర్చడం; పాడేవారి లేదా, వాయించేవారి ఊహాశక్తిపైన ఆధారపడుతుంది.

రాగం అంటే స్వరాల బదులు 'అ', 'త', 'ద', 'రి', 'స' మొదలైన అక్షరాల్ని ఉపయోగించి పాడతారని తెలుసుకొన్నాం. స్వరకల్పనలో అలాకాకుండా కేవలం స్వరాలనే పాడతారు. స్వరకల్పనకి తాళం ఉంటుంది. తాళంలోనే స్వరకల్పనను పాడాలి. స్వరకల్పనకి స్వరకల్పన పాడినా, వాయించినా, మృదంగాన్ని కూడా వాయిస్తూంటారు.

'వాతాపిగణ పతిం భజే' అనే కీర్తన హంసధ్వని రాగంలో ఆదితాళంలో ఉంది. హంసధ్వని రాగం గురించి ముందు చెప్పుకొన్నాం. ఇది ధీరశంకరాభరణ జన్యం దీనిలో వచ్చేస్వరాలు ఐదు.

చ అం కాం.
ఆరో: స రి గ ప ని స

. కా అం చ
అవ: స ని ప గ రి స

'వాతాపిగణ పతిం భజే' అన్న పల్లవిదగ్గర స్వరం వేయాలనుకోండి. 'వాతాపిగణ పతిం భజే' అన్న లైన్‌లో 'వా' అక్షరం 'గ' అనే స్వరంతో పాడాలి. అంటే 'గ' స్వరానికి బదులు 'వా' అనే అక్షరం పాడాలన్నమాట. 'గ' కి ముందు ఉన్న స్వరం ఏమిటి? 'రి' కదా! ప్రతిసారీ మనం స్వరకల్పన చేసి, 'రి'తో ముగించి వాతాపిగణ పతిం భజే' పాడతారు.

'వాతాపిగణపతింభజే' దగ్గర వేసే కొన్ని స్వరాల్ని చూద్దాం.

1) పగరిసరి ॥వాతాపి॥

2) సరిగపనిస సనిపగరి ॥వాతాపి॥

3) గరిసని పగారిసరి ॥వాతాపి॥

4) సరిగ నిసరి పనిస గపని రిగప సరిగ నిసరి ॥వాతాపి॥

ఏలైన్ దగ్గర స్వరకల్పన చేస్తారో, ఆలైన్ లో ముందు అక్షరం ఏ స్వరంతో మొదలయ్యిందో చూసుకొని, ఆ స్వరానికి ముందున్న స్వరంతో ప్రతీ స్వరాన్ని ఆపడం చేస్తారు. పైనమీకు ఇచ్చిన ఉదాహరణ లోని విధంగా.

స్వరకల్పన చేసేటప్పుడు కూడా మంద్ర, మధ్యమ తారస్థాయిల్లో చేస్తారు. ఇలా ఎన్నో స్వరాల్ని కల్పించి పాడచ్చు.

ఒక స్వరం పాడాక వైలెన్ వాళ్ళకు అవకాశం ఇస్తారు. వైలెన్ వాళ్ళు స్వరం వేశాక అప్పుడు మళ్ళీపాడేవాళ్ళు స్వరం వేస్తారు. చివర చాలా ఆవృత్తాలు స్వరం వేసి, స్వరకల్పనను ముగిస్తారు. కచేరీలలో పది నుండి పన్నెండు దాకా సంగీతరచనల్ని

పాడతారు. అయితే అన్ని కీర్తనలకి స్వరం వేయరు. మూడు, నాలుగు కీర్తనలకి స్వరకల్పన చేస్తారు.

కచేరీలు జరిగేటప్పుడు స్వరకల్పనని గమనించండి.

## నెరవు

కృతిలో పల్లవిలోనో, అనుపల్లవిలోనో, చరణంలోనో ఏదో ఒక చిన్న లైన్‌ను తీసుకొంటారు. ఆలైన్ అర్థవంతంగా ఉండాలి. ఈ లైన్‌ను చాలా రకాలుగా స్వరాల్ని మార్చి పాడతారు. అంటే సాహిత్యం మారదుకానీ, స్వరాల్ని మాత్రం మార్చి, పాడతారు. ఇలా స్వరాల్ని మార్చడం కచేరీ జరుతుండేనే, అప్పటికప్పుడే కల్పించి చేస్తారు. ఇలా ఒకలైన్‌ను స్వరాలు మార్చి పాడడాన్నే నెరవు అంటారు.

'ప్రక్కల నిలబడి' అనే త్యాగరాజు కీర్తన ఖరహర్రియ రాగంలో ఆదితాళంలో ఉంది. ఇందులో 'తనువుచే మదన మొనరించు చున్నారా' అన్న లైను ఉంది. దీనికి నెరవు ఎలా చేస్తారో చూద్దాం.

మామూలుగా ఆ లైన్‌ని కీర్తన పాడేటప్పుడు ఈ క్రింద ఇచ్చిన విధంగా పాడతారు.

;;నిదా ;, పా; పా; ॥ మగపమ మరి । రీగాగరిరీ॥
తను । వు చే మం..... ద...న..॥
రి రి గ ।, గ మా, మా;॥ పమపదాప। దసనిదపా; ॥
మొన । రిం...... చు॥ చు......। న్నా..... రా॥
మపదనిదా । పా; పా; ॥
..... తను । వు - చే॥

ఏఏ అక్షరాల్ని ఏఏ స్వరాలతో పాడుతారో బాగా గమనించారా? ఇవే అక్షరాల్ని, చాలా రకాలుగా స్వరాల్ని

మార్చి కచేరీల్లో విద్వాంసులు, వారి కల్పనా శక్తిని బట్టి పాడతారు. ఇలా పాడడాన్నే నెరవు అంటారు. దీనిలో ఇలా నెరవు చెయ్యొచ్చు.

;; దనీ ;, నిదదాదా॥ దా నిసనిద। పదనిదదనీద॥
తను। వు... చే వం..... । ద.....న..॥

దస నిద ;, పా; పా; ॥మగ పమగా। గరిరీర సారిగ॥
మొ - న - । రిం - చును..... । న్నా.....రా..॥

మపదని ॥ తనువుచే॥

2. సనీ।,దా; దా; ॥ ; దనిసని। దసనినిదా; ॥
తను । వు..చే। వం..... । ద.....న..॥
;, దదని । నీ సా సా; ॥ నిరిస సనినీద। నిసనిదపా ; ॥
మొన । రిం.... చు॥ చు.......। న్నా...రా..॥

మపదని తనువుచే।

చూశారా! అవే అక్షరాల్ని స్వరాలుమార్చి ఎలా నెరవు చెయ్యొచ్చునో! ఇంకా ఎన్నో రకాలుగా చెయ్యొచ్చు. మీకు రెండు ఉదాహరణలు మాత్రమే ఇచ్చాను. ఇలా రకరకాలుగా స్వరాల్ని మార్చి పాడి, తిరిగి మళ్ళీమనం మొదట కీర్తనలో ఆ లైన్‌ను ఎలా పాడామో ఆ విధంగా పాడి, ఆపుతారు. నెరవును పాడి లేదా వాయించి తిరిగి వైలెన్ విద్వాంసులకు అవకాశం ఇస్తారు. అప్పుడు వైలెన్ విద్వాంసులు వైలెన్ మీద నెరవును వాయించిన తరువాత మళ్ళీ పాడేవాళ్ళు తిరిగి నెరవు పాడతారు. నెరవుకి తాళం ఉంటుంది. కనుక నెరవు చేసేటప్పుడు మృదంగాన్ని కూడా వాయిస్తారు.

కచేరీలో ప్రధానాంశం, ఉపప్రధానాశం అని ఉంటాయి. కచేరీలలో పన్నెండు నుండి పదమూడు కీర్తనలు పాడినా, ప్రధానాంశం, ఉపప్రధానాంశం అని రెండు కీర్తనలు ఉంటాయి. ఒక రాగాన్ని బాగా ఎక్కువసేపు పాడి, తరువాత కీర్తన పాడి, ఆకీర్తనలోనే నెరవుపాడి, నెరవుపాడినచోటే స్వరకల్పన చేస్తారు. దీనినే ప్రధానాంశం అంటారు. ఇంత ఎక్కువసేపు కాకుండా కొద్దిసేపు రాగాలాపన, నెరవు, స్వరకల్పన చేసే అంశం కూడా ఒకటి కచేరీలలోఉంటుంది. దానినే ఉపప్రధానాంశం అంటారు. ప్రధానాంశం, ఉపప్రధానాశం కాకుండా కచేరీలలో ఇంకా రెండు, మూడు కీర్తనలకి స్వరకల్పన చేస్తారు. కొద్దిసేపురాగం కూడా పాడతారు. రాగం. స్వరకల్పన లేకుండా కేవలం కొన్ని కీర్తనల్ని కూడా పాడతారు. కచేరీలో ముందు ఉపప్రధానాంశం పాడుతారు. కచేరి చివరలో ప్రధానాంశం పాడి, ఆ తరువాత మృదంగ విద్వాంసులకి ఇతర తాళవాద్య విద్వాంసులకి అవకాశం ఇస్తారు. అంటే తాళవాద్య విద్యాంసుల్ని వాయించమంటారు. అప్పుడు ప్రధానాంశంగా పాడిన కీర్తన ఏ తాళంలో ఉందో ఆ తాళంకు తగినట్లుగా మృదంగం ఇతర తాళవాద్యాల్ని వాయిస్తారు. అంటే అప్పుడు పాడే వాళ్ళు పాడరు. వీణ, వైలెన్, మొదలైనవి వాయించేవాళ్ళు వాయించరు. కేవలం ఒక తాళవాద్యాలనే విడిగా వాయిస్తారు. ఇలా తాళవాద్యాలను విడిగా వాయించడాన్నే 'తని ఆవృత్తం' అంటారు. ఈ తని ఆవృత్తం అయ్యాక, అష్టపదులో, తరంగాలో, అన్నమయ్య కీర్తనలో రామదాను కీర్తనలో మొదలైనవి పాడి, మంగళంతో కచేరీ ముగిస్తారు.

# రాగం, తానం, పల్లవి

మనోధర్మ సంగీతంలో రాగం, తానం, పల్లవి ఒకటి. సంగీతం బాగా నేర్చుకొన్నవాళ్ళే ఈ రాగం, తానం, పల్లవిని పాడగలరు.

రాగాలాపన అంటే ముందు చెప్పుకొన్నాం. ఇక్కడ 'రాగం' అంటే రాగాలాపన అన్నమాట. ఒకరాగాన్ని బాగా ఎక్కువ సేపు పాడతారు. అంటే ఆలాపనచేస్తారు. తరువాత ఆ రాగంలోనే 'తానం' పాడతారు. రాగాలాపన చేసినట్టుగానే తానాన్ని పాడతారు. అయితే రాగానికి లయ ఉండదు. తానానికి లయ ఉంటుంది. రాగాలాపనను 'త, ద, రి, న' అనే అక్షరాలతో పాడతారని చెప్పుకున్నాం కదా! తానాన్ని 'అనంత' అన్న పదాన్ని చాలాసార్లు అంటూ, రాగాన్ని, లయబద్ధంగా పాడుతుంటే ఆదే 'తానం' అవుతుంది.

'తానం' పాడినా, వాయించినా సాధారణంగా మృదంగం వాయించరు. కాని కొన్ని కొన్ని సార్లు మృదంగాన్ని తానంతో కూడా వాయిస్తూంటారు.

పల్లవి అంటే ఏమిటో చెప్పుకొందాం. అర్థవంతమైన ఒక లైన్‌ను తీసుకొని, రాగం, తానం పాడిన రాగంలోనే నెరవు చేసినట్లుగా, రకరకాలుగా పాడతారు. పల్లవిని కొంచెం క్లిష్టమైన తాళంలో పాడతారు. గతిభేదం కూడ ఉంటుంది. ఇలా ఈ లైన్‌ను నెరవు పాడినట్లు పాడడాన్నే పల్లవి అంటారు. పల్లవి పాడాక స్వరకల్పన చేస్తారు. రాగం, తానం పల్లవి ప్రతీది

పాడాక, వైలెన్ వాయించేవాళ్ళకు కూడా అవకాశం ఇస్తారు. పల్లవి పాడాక స్వరకల్పన చేస్తారని చెప్పుకొన్నాం కదా! ఈ స్వరకల్పనని, మనం తీసుకొన్న రాగంలోనే కాకుండా ఇంకా ఇతర రాగాలలో కూడా చేస్తూండడం కద్దు. దీనిని రాగమాలికలో స్వరకల్పన అంటారు. స్వరకల్పన అయ్యాక తాళవాద్యం విద్వాంసులకి వాయించేందుకు అవకాశం ఇస్తారు. కచేరీల్లో, ప్రధానాంశం పాడాక ఈ రాగం, తానం పల్లవిని పాడతారు. పూర్వం ప్రతీకచేరీలోను రాగం, తానం, పల్లవి తప్పకుండా పాడేవారు. ఇప్పుడు రాగం, తానం, పల్లవి అంతగా కచేరీల్లో వినపడడం లేదు.

రాగం, తానం, పల్లవి పాడాలంటే మంచి మనోధర్మం ఉండాలి. రాగం, తానం, పల్లవి అంతా గంట, గంటన్నర సేపు సాగుతుంది. ఇంతసేపు ఒకే రాగాన్ని పాడగలగడం మంచి మనోధర్మం, కల్పనాశక్తి లేకపోతే జరిగే పనికాదు.

రాగం, తానం, పల్లవిలు శంకరాభరణం , తోడి, కల్యాణి, భైరవి, ఖరహరప్రియ, షణ్ముఖ ప్రియ లాంటి రాగాలలో ఎక్కువగా పాడతారు.

గాత్రకచేరీ, వైలెన్‌సోలో, వేణువు, వీణ, మాండొలిన్ కచేరీలు ఏవైనా కావచ్చు, అన్ని కచేరీలలోను రాగాలాపన, స్వరకల్పన, నెరవు, రాగం, తానం, పల్లవి ఉంటాయి.

కచేరీల గురించి మీకు చెప్పాను. కచేరీలకు వెళ్ళివి ఇంకా ఎన్నో విశేషాలు తెలుసుకొండి. కచేరీలను విని ఆనందించండి.

## పూర్వపు కచేరీలు

పూర్వం సంగీత కచేరీలు ఐదు, ఆరు గంటలసేపు జరిగేవి. ప్రస్తుతం కేవలం రెండున్నర గంటలకన్నా ఎక్కువ సేపు జరగడంలేదు. పూర్వం శ్రోతలు కూడా ఓపికగా చాలా సేపు కూర్చొని వినేవారు. మైకులు ఉండేవికాదు. అందువల్ల పాడేవాళ్ళు హెచ్చు శృతిలో పాడుతూ ఉండేవారు. శ్రోతలు, మైకులు లేని కారణంగా ఎక్కడ ఏ ముక్క వినపడకుండా పోతుందోనని చాలా శ్రద్ధగా వినేవారు. కచేరీని ప్రారంభించడం వర్ణంతోనే చేసేవారు. సుప్రసిద్ధమైన రాగాలలో కీర్తనల్ని, కృతుల్ని పాడేవారు. ఈ కృతుల్లో ప్రతిమధ్యమరాగ కృతులు రెండు అయినా ఉండేవి. ప్రతికచేరీలోనూ రాగం, తానం, పల్లవి తప్పకుండా పాడేవారు. రెండుగంటల కచేరీ అనంతరం రాగం, తానం, పల్లవి పాడేవారు. ఈ రాగం, తానం, పల్లవి సుమారు రెండు గంటల సేపు సాగేది తరువాత పదాలు, జావళీ, తిల్లానా, రాగమాలిక, శ్లోకము పాడేవారు. ఇవి అరగంట, ముప్పాతిక గంట సేపు ఉండేవి.

పూర్వం కచేరీ జరుగుతున్నప్పుడు మధ్యలో ఎవరైనా, ఫలానా తాళంలో ఫలానారాగంలో, ఫలానా లైన్‌ను పల్లవిగా తీసుకొని పాడమని అడిగితే కచేగి చేసే విద్వాంసులు అప్పటికప్పుడు రాగం, తానం, పల్లవి పాడేసేవారు.

పూర్వపు కచేరీలు ఇలా ఉండేవి. ప్రస్తుతం రెండు, రెండున్నర గంటల సేపు మాత్రమే కచేరీలు జరుగుతున్నాయి. రాగం, తానం,

పల్లవి అప్పుడప్పుడు మాత్రమే కచేరీలలో వినిపిస్తోంది. రాగమాలికలో శ్లోకం, పదాలు, అష్టపదులు, తరంగాలు కూడా అప్పుడప్పుడే, కచేరీలలో వినిపిస్తున్నాయి.

## సంగీతం ఎలా నేర్చుకోవాలి?

సంగీతం ఎలా నేర్చుకోవాలో చూద్దాం. చక్కని గొంతు ఉంటే వాళ్ళు పాడడం నేర్చుకోవడంమంచిది. అలాలేని వాళ్ళు వైలెనో, వీణో, మరేదైనా వాద్యమో నేర్చుకొంటే, దానిలో ప్రావీణ్యాం సంపాదించగలరు. గాత్రం (అంటే పాడడం) నేర్చుకొంటే వాద్యాల్ని సులభంగా నేర్చుకోవచ్చు. అందుచేతనే వాద్యాల్ని నేర్చుకొనేవాళ్ళు కూడా, కొద్దోగొప్పో పాడడం కూడా నేర్చుకొంటారు.

పాడడం ఎలా నేర్చుకొంటారో చూద్దాం. ముందు సరళీస్వరాలు, జంటస్వరాలు, అలంకారాలు, తరువాత గీతాలు, స్వరజతులు, ఆతరువాత వర్ణాలు చివరన కీర్తనలు నేర్చుకొంటారు. అయితే మనోధర్మ సంగీతం ఎలా వస్తుంది? కొన్ని కీర్తనలు నేర్చుకొన్న తరువాత స్వర కల్పన చేయడం అలవాటు అవుతుంది. అలాగే రాగాలాపన రావాలంటే విద్వాంసులు పాడిన రాగాల్ని బాగా వినాలి. అలా విని ఆ రాగాల్ని వంటబట్టించుకొని, సాధనచేస్తే మంచివిధంగా రాగాలాపన చేసే శక్తి వస్తుంది. రాగాలాపన, స్వరకల్పన బాగా రావడానికి వర్ణాలు చాలా తోడ్పడతాయి. వర్ణాలని బాగా సాధన చేస్తే రాగాలాపన, స్వరకల్పన పట్టుబడతాయి. రాగజ్ఞాన, తాళజ్ఞానం బాగాఉన్నప్పుడే నెరవు చేసే శక్తి వస్తుంది. నెరవు, రాగాలాపన, స్వరకల్పన,

బాగా వచ్చేస్తే, పల్లవి, తానం పాడడం విద్యార్థులకు అలవడుతుంది. వీణ, ఫైలెన్, వేణువు, నాగస్వరం, మేండొలిన్ లాంటి వాద్యాలు నేర్చుకోవాలన్నా కూడా గాత్రం పాడేవాళ్ళు ఎలా సంగీతాన్ని నేర్చుకొంటారో అలాగే నేర్చుకొంటారు అంటే వాళ్ళుకూడా సరళీస్వరాలు, జంట స్వరాలు, అలంకారాలు ఇలా అన్నీ ఆయావాద్యాలపైన వాయించడం నేర్చుకొంటారు.

తాళవాద్యాలున్నాయికదా! వీటిపైన సరళీస్వరాలు, జంట స్వరాలు మొదలైనవి పలకవు అని తెలుసుకొన్నాం. వీటిపైన విద్యార్థులకు జతులు వాయించడం నేర్పుతారు. ఈ జతుల్ని కొన్నింటిని 'పాలవరుసలు' మొదలైన వరుసలుగా పేర్చుతారు. ఇలాంటి వరుసల్ని తాళవాద్యాన్ని నేర్చుకొనే విద్యార్థులు నేర్చుకొంటారు. ఇలా అన్నితాళాలలోనూ వరుసలు నేర్చుకొని, ఆ తరువాత పాడేవాళ్ళకూడానో, వాద్యాల కూడానో వాయిస్తూ సాధన చేస్తే అప్పుడు తాళవాద్యాలన్ని బాగా వాయించే నేర్పు వస్తుంది.

కొన్ని కీర్తనలు గురువుదగ్గర నేర్చుకొన్నాక విద్యార్థులకి స్వరజ్ఞానం అలవడుతుంది. స్వరజ్ఞానం అంటే ముందు చెప్పుకొన్నాం. పాట వెనుక ఉన్న స్వరాల్ని చెప్పగలిగే శక్తి అన్నమాట. ఇలా స్వరజ్ఞానం విద్యార్థులకి బాగావస్తే, విద్యార్థులే గురువు సహాయం అవసరం లేకుండా సొంతంగా నోటేషన్ చూసి, లేదా కీర్తనల్నివిని దానికి స్వరాల్ని రాసుకొని కొత్తకీర్తనల్ని పాఠం చెయ్యగలుగుతారు. సంగీతం బాగా వచ్చిన విద్వాంసులు కూడా రోజూ సంగీతం సాధన చేస్తారు. కొత్త కీర్తనల్ని పాఠం చేస్తూంటారు. సంగీతానికి నిరంతర సాధన అవసరం.

# 6. వాగ్గేయకారుల చరిత్రలు

పాటల్ని సొంతంగా రాసి, వాటికి స్వరాల్ని కూడా కూర్చగలిగిన వాళ్ళనే వాగ్గేయకారులంటారని మనం ముందు తెలుసుకున్నాం. ఇలాంటి వాగ్గేయకారులు ఎందరో, మన కర్ణాటక సంగీతానికి సేవచేశారు. ఈ వాగ్గేయకారులందరికీ సంగీతం, కవిత్వం కూడా బాగా వచ్చును. అలాగే వాగ్గేయకారులంతా భక్తులే. చాలామంది వాగ్గేయకారులు సంగీతంతో మోక్షాన్ని పొందారు. కొందరు వాగ్గేయకారుల జీవిత చరిత్రలు ఈ అధ్యాయంలో తెలుసుకొందాం.

# 1. జయదేవుడు



జయదేవుడు క్రీ.శ. 1098లో జన్మించాడు. ఈయన స్వగ్రామం 'తిందుబిల్వం'. ఈ తిందుబిల్వం ఒరిస్సాలో, పూరీ జగన్నాధంకు దగ్గరగా ఉంది. ఈయన తల్లిదండ్రులు రామాదేవి, భోజదేవులు. వీరు సంతానంకోసం జగన్నాధ స్వామిని పూజించగా, ఆ స్వామి దయవల్ల జయదేవుడు వీళ్ళకు పుట్టాడు. జయదేవుడు

చిన్నతనంలోనే సంగీతం, సంస్కృతం బాగా నేర్చుకొన్నాడు. ఈయన గురువు గోవర్ధనాచార్యులు. జయదేవుడు తల్లిదండ్రులు మరణించాక, పూరిలో ఉండసాగాడు. జగన్నాథస్వామి పైన ఎన్నో పాటలు రాశాడు. జయదేవుడు రచించినది 'గీత గోవిందం' అనే గ్రంథం. ఇది కృష్ణుడు, రాధల ప్రణయగాథ. జయదేవుడు గొప్ప కృష్ణభక్తుడు. అందుకే రాధాకృష్ణుల కథను గ్రంథంగా రాశాడు. ఈ గ్రంథంలో **78** శ్లోకాలున్నాయి. పాడుకొందుకు వీలైన పాటలలాంటివి **24** ఉన్నాయి. ఒక్కొక్కపాటకి ఎనిమిదేసి చరణాలుంటాయి. సంస్కృతంలో 'అష్ట' అంటే ఎనిమిది. ఎనిమిది చరణాలున్నాయి కనుక వీటిని అష్టపదులు అని అంటారు.

జయదేవుని భార్య పేరు పద్మావతి. దేవశర్మ అనే బ్రాహ్మణుడి కూతురు పద్మావతి. ఈ దేవశర్మకి కలలో దేవుడు కనిపించి, పద్మావతిని జయదేవునికి ఇచ్చి వివాహం చెయ్యమని ఆదేశించాడు. ఆ ఆదేశం ప్రకారం పద్మావతిని జయదేవుడికి ఇచ్చి పెండ్లి చేశాడు దేవశర్మ. పద్మావతికి నృత్యం బాగావచ్చు. జయదేవుడు అష్టపదుల్ని పాడుతుంటే, పద్మావతి నృత్యం చేస్తూండేది.

జయదేవుడి అష్టపదులు ఆ కాలంలో బాగా ప్రచారంలో ఉండేవి. జయదేవుడికి రాజసన్మానాలు కూడా లభించాయి. క్రీ.శ. **1116** ప్రాంతంలో బెంగాలులో నవద్వీపంకు రాజైన లక్ష్మణసేనుడి ఆస్థానంలో జయదేవుడు ఉండేవాడని తెలుస్తోంది.

జయదేవుడు **19**వ అష్టపదిని రచిస్తూ అందులో ఒక పంక్తి

నచ్చక రాసింది కొట్టేసి, స్నానానికి వెళ్ళాడు. అయితే కొద్దిసేపు తరువాత తిరిగి వచ్చి చూస్తే తాను కొట్టివేసిన పంక్తే మళ్ళీ రాసి ఉండడం చూసి ఆశ్చర్యపోయాడు. తిరిగి ఎవరు రాశారో జయదేవుడికి అర్థం కాలేదు. పద్మావతిని అడిగాడు. 'మీరేకదా వచ్చి రాశారు' అంది. ఈ మాటలు విన్న జయదేవుడు మరింత ఆశ్చర్యపోయాడు. అది రాసింది సాక్షాత్తూ శ్రీకృష్ణుడే అని గ్రహించాడు. పద్మావతికి శ్రీకృష్ణుడి దర్శనం అయ్యింది కనుక ఈ అష్టపదిని దర్శన అష్టపది అని అంటారు.

సంగీతరచనల్లో (అంటే కీర్తనలు, కృతులు, జావళీలు, పదాలు, తిల్లానాలు మొదలైనవి) ఆ రచనను రచించిన వారి పేరు కూడా వస్తుంది. అంటే కృతులు, కీర్తనల్లో ఆ కృతిని రచించిన వారి పేరు కూడా ఉంటుందన్నమాట. ఒక్కొక్కసారి వాగ్గేయకారుడి పేరు కాకుండా; ఆ వాగ్గేయకారుడికి ఇష్టమైన దేవత, లేదా దేవుడిపేరో ఆ కీర్తనలో వస్తుంది. దీనినే 'ముద్ర' అంటారు. ఒక్కొక్క వాగ్గేయకారుడికి ఒక్కొక్క 'ముద్ర' ఉంటుంది. ఆ వాగ్గేయకారుడు రచించిన అన్ని సంగీతరచనల్లోను ఆ ముద్ర వస్తుంది. ముద్రను బట్టి ఇది ఫలనా వాగ్గేయకారుడి రచన అని మనం చెప్పేయవచ్చును. జయదేవుడు తన పేరునే ముద్రగా వాడాడు. జయదేవుడు రాసిన ప్రతీ అష్టపదిలోను 'జయదేవ' అనే ముద్ర వస్తుంది.

జయదేవుడు అష్టపదుల్ని ఎలా పాడేవాడో మనకు తెలియదు.

అప్పుడు వాడిన రాగాలు కూడా ఇప్పుడు ప్రచారంలో లేవు - 'నొటేషన్' రాయడం పూర్వం మనదేశంలో లేదు. అందుచేత అష్టపదుల సాహిత్యం దొరికింది కానీ, వాటిని ఎలా పాడాలో తెలుసుకొనేందుకు మనకి స్వరం లభించలేదు. ప్రస్తుతం విద్వాంసులు తమకి తోచిన రాగాల్లో స్వరాలు కట్టి అష్టపదుల్ని పాడుతున్నారు. కచేరీ చివరిలో అష్టపదుల్ని పాడుతూంటారు. భజనల్లో, నాట్య ప్రదర్శనలో కూడా అష్టపదులు వినిపిస్తూంటాయి. 12, 13 శతాబ్దాల నుంచి అష్టపదులు మనదేశం అంతా బాగా ప్రచారంలో ఉన్నాయి. పూరీలో జగన్నాథ స్వామి పూజ చేసేటప్పుడు ఇప్పటికీ అష్టపదుల్ని పాడుతూంటారు. జయదేవుడి అష్టపదుల్లో 'హరిరిహముగ్ధవధూనికరే', 'సావిరహేతవదీనా రాధా' అనేవి బాగా ప్రచారంలో ఉన్నాయి. వీటిని సినిమాలలో కూడా ఉపయోగించారు. 'భక్తజయదేవ' అనే చిత్రం కూడా పూర్వం వచ్చింది.

జయదేవుడికి పూర్వం పాడుకొందుకు వీలైన రచనలు ఉండేవో, లేవో మనకు తెలియదు. మనకు దొరికినంతవరకూ, రాగాలు తాళాలలో ఖచ్చితంగా రాయబడి, పాడుకొనేందుకు వీలైన మొదటి రచనలు జయదేవుడి అష్టపదులే.

క్రీ.శ. 1153లో జయదేవుడు మరణించాడు.

## 2. అన్నమయ్య

తెలుగులో మొదటి గ్రంథం మహాభారతం కదా! దాని రచన ప్రారంభించినాడు నన్నయ్య. అందుకే నన్నయ్యను ఆదికవి అంటారని మీకు తెలుసు. మరి తొలిసారిగా తెలుగులో పాటల్ని రాసింది ఎవరో తెలుసా? అన్నమయ్య. జయదేవుడి అష్టపదులు సంస్కృతంలో ఉన్నాయని, అవే తొలిపాటలని తెలుసుకొన్నాం. మరి తెలుగులో తొలిసారి పాటల్ని రాసిన అన్నమయ్య గురించి కూడా చెప్పుకొందాం.

ప్రతీ తల్లీ తన పిల్లాడిని ఉయ్యాలలో ఉంచి, 'జో అచ్యుతానంద జోజోముకుంద' అంటూ లాలి పాడుతుంది. ఈ లాలిపాటను రచించినది అన్నమయ్య అని చాలా మందికి తెలియదు.

అన్నమయ్య ఊరు కడప జిల్లాలో ఉన్న తాళ్ళపాక. తల్లిదండ్రులు లక్కమాంబ, నారాయణసూరులు. లక్కమాంబ వెంకటేశ్వరస్వామి భక్తురాలు. వెంకటేశ్వరస్వామి దయవల్ల ఆ దంపతులకు క్రీ.శ. 1408లో అన్నమయ్య పుట్టాడు. తల్లి, అన్నమయ్యకు చిన్నతనం నుంచే వెంకటేశ్వర స్వామిపైన భక్తిని రంగరించి పోసింది. ఐదేళ్ళకే అన్నమయ్యకు ఉపనయనం జరిగింది. అన్ని విద్యల్లోను అండే సంగీతం, సాహిత్యంలో మంచి ప్రావీణ్యత

సంపాదించాడు. ఎనిమిదేళ్ళ అన్నమయ్య ఒకసారి ఇంట్లో పెద్దవాళ్ళు గడ్డికోయమంటే కొడవలి పుచ్చుకొని, గడ్డికోస్తుంటే వేలు తెగింది. వెంటనే 'హరి హరీ' అంటూ భగవంతుణ్ణి తలచుకొన్నాడు. తిరుపతి వెళుతున్న కొందరు యాత్రికులు కనపడ్డారు. వాళ్ళతో కలిసి 'తిరుపతి' బయలుదేరి వెళ్ళిపోయాడు. తిరుమల కొండ ఎక్కసాగేడు. మోకాళ్ళ పర్వతం దగ్గరకి వచ్చేసరికి అలసట, ఆకలి కలిగాయి. ఒకచోట అలాగే పడి నిద్రపోయాడు. 'అలమేలుమంగ' ప్రసాదం తీసుకొచ్చి, అన్నమయ్య ఆకలి తీర్చింది. అలమేలు మంగను చూసి ఆనందంతో ఒక శతకం రాశాడు అన్నమయ్య. (శతకం అంటే వంద పద్యాలు)

అన్నమయ్య కొండపైకి చేరాడు. తీరా గుడి దగ్గరకు వచ్చేసరికి గుడి తలుపులు మూసి ఉన్నాయి. అప్పుడు ఒక శతకాన్ని వెంకటేశ్వర స్వామిపైన రచించే సరికి, తాళాలు ఊడిపోయాయి. తలుపులు వాటంతట అవే తెరచుకొన్నాయి. అన్నమయ్య మహిమకు అందరూ ఆశ్చర్యపోయారు. కన్నులారా శ్రీనివాసుడి దర్శనం చేసుకొని, అన్నమయ్య వెంకటేశ్వరస్వామి ఆదేశం మేరకు తిరిగి తాళ్ళపాక చేరాడు. తిరుమలమ్మ, అక్కలమ్మ అనే ఇద్దరితో పెండ్లి జరిగింది. వెంకటేశ్వర స్వామిపై ఎన్నో కీర్తనలు రచిస్తూ కాలం గడుపుతున్నాడు అన్నమయ్య.

టంగుటూరును పాలిస్తున్న సాళువనరసింహరాయలు అన్నమయ్య గొప్పదనాన్ని విన్నాడు. అన్నమయ్యను తన

ఆస్థానానికి రప్పించుకొని, అన్నమయ్యా రచించిన కీర్తనలు విన్నాడు. తనపైన కూడా అలాంటి కీర్తనలు రచించమని కోరాడు. 'భగవంతుణ్ని పొగిడిన నా నోటితో నిన్ను కీర్తించను' అని అన్నాడు. అందుకు రాజు కోపగించి, సంకెళ్ళు వేసి అన్నమయ్యాను చెరసాలలో వేయించాడు. అప్పుడు అన్నమయ్యా 'ఆకటి వేళల అలపైన వేళల' అన్న కీర్తన రచించి పాడేసరికి సంకెళ్ళు వాటంతట అవే తెగిపోయాయి. ఆ విషయం భటుల ద్వారా విన్న రాజు అన్నమయ్యా సామాన్యుడు కాదని తెలుసుకొని, క్షమించమని అన్నమయ్యాను వేడుకొని, విడుదల చేశాడు.

అన్నమయ్యా 32 వేల కీర్తనల్ని రాశాడు. ఇవి ఆధ్యాత్మిక సంకీర్తనలు, శృంగార సంకీర్తనలు అని 2 రకాలు. అన్నమయ్యా తరువాత వారు వాటిని రాగిరేకులపైన రాసి భద్రపరిచారు. మనకి ఇప్పుడు దొరికిన కీర్తనలు మాత్రం చాలా తక్కువే. కీర్తనలతోపాటు కొన్ని శతకాలు, గ్రంథాలు కూడా రాశాడు. అన్నమయ్యా కీర్తనల్ని తిరుమల తిరుపతి దేవస్థానం వారు ప్రచురించారు. అన్నమయ్యా కీర్తనల్ని వెలుగులోకి తెచ్చింది, శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు, శ్రీ రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారు. అన్నమయ్యా కీర్తనల సాహిత్యం దొరికింది. వాటికి స్వరాలు దొరకలేదు. అందుచేత వాటిని అన్నమయ్యా ఎలా పాడేవారో మనకి తెలియదు. రాగిరేకుల్లో ఉన్న రాగాలు కూడా ఇప్పుడు వాడుకలో లేవు. అందుచేత స్వరాల్ని కూర్చి విద్వాంసులు

పాడుతున్నారు. శ్రీ నేదునూరి కృష్ణమూర్తి గారు స్వరపరిచిన అన్నమయ్య కీర్తనలు ఎంతో ప్రచారంలో ఉన్నాయి. తిరుమల తిరుపతి దేవస్థానం వారు 'అన్నమాచార్య ప్రోజెక్టు'ను స్థాపించారు. అన్నమయ్య కీర్తనల్ని ప్రచారం చేస్తున్నారు.

'కొండలలో నెలకొన్న కోనేటి రాయడువాడు', 'బ్రహ్మకడిగిన పాదము', 'అదివో అల్లదివో శ్రీహరివాసము', 'ముద్దుగారే యశోద', 'తందనాన ఆహి', 'నానాటి బతుకు నాటకము', 'పలుకు తేనెల తల్లి పవళించెను', 'భావములోన బాహ్యమునందును', 'శ్రీమన్నారాయణ', 'ఏమకో చిగురుటధరమున' లాంటి ఎన్నెన్నో అన్నమయ్య కృతులు చాలా ప్రచారంలో ఉన్నాయి.

కచేరీ చివరిలో అన్నమయ్య కీర్తనలు పాడతారు. అన్నమయ్య ముద్ర 'వెంకటేశ', 'శ్రీ వెంకటేశ', 'తిరువెంకటేశ' ఇలా తనకి ఇష్టదైవమైన వెంకటేశ్వరస్వామి పేరునే ముద్రగా వాడాడు. తెలుగులో, సంస్కృతంలో కూడా కీర్తనలు రాశాడు. అన్నమయ్యకు 'పదకవితా పితామహుడు' అనే బిరుదు ఉంది. అన్నమయ్య క్రీ.శ. **1503**లో వెంకటేశ్వరునిలో ఐక్యం అయ్యాడు.

# 3. పురందరదాసు



బళ్ళారి జిల్లాలో హంపికి దగ్గరగా పురందరగఢ అనే ఓ గ్రామం ఉంది. ఆవూళ్ళో వరదప్ప నాయకుడు అనే ఒక రత్నాల వ్యాపారి ఉండేవాడు. ఆయన భార్య కమలాంబ. వాళ్ళకు క్రీ.శ. **1484** సంవత్సరంలో ఒక అబ్బాయి పుట్టాడు. ఆ అబ్బాయికి

'శ్రీనివాసు' అని పేరుపెట్టారు. 'శీనప్పా' అని ముద్దుగా పిలుచుకొంటూ ఉండేవారు. ఈ 'శీనప్పే' వాగ్గేయకారుడైన పురందరదాసు. తండ్రిచేసే రత్నాల వ్యాపారానికి సహకరిస్తూ పురందరదాసు పెరిగి పెద్దవాడయ్యాడు. సంస్కృతం, కన్నడం భాషల్లోను, సంగీతంలోను మంచి ప్రావీణ్యం గణించాడు. తల్లిదండ్రులు మరణించాక, రత్నాల వ్యాపారం చేసి బాగా డబ్బు సంపాదించాడు. కోటీశ్వరుడు అయ్యాడు. ఇంత డబ్బు సంపాదించినా, ఎవరికీ పైసా కూడా దానం చేసేవాడు కాదు.

ఒకనాడు ఒక పేద బ్రాహ్మణుడు పురందరదాసు దగ్గరకు వచ్చి, 'నాకొడుకు ఉపనయనం చేసుకోడానికి ధనం సాయం చెయ్యమని' అడిగాడు. పురందరదాసు, ఆ బ్రాహ్మణుడిని 'రేపురా' అని పంపేశాడు. ఆ బ్రాహ్మణుడు మళ్ళీ మరునాడు వచ్చాడు. 'మళ్ళీరేపురా' అని పంపేశాడు. ఇలా చాలా రోజులు డబ్బులు ఇవ్వకుండా తిప్పుతుండే, ఆ బ్రాహ్మణుడికి విసుగు అనిపించి, పురందరదాసు భార్య సరస్వతీబాయి దగ్గరకు వెళ్ళి సహాయం చెయ్యమని అడిగాడు. సర్వతీబాయికి దేవుండే ఎంతోభక్తి, దానగుణం కూడా ఎక్కువే. అందుచేత వెంటనే తన ముక్కుకి ఉన్న ముక్కుపుడకను తీసి ఇచ్చి, దీన్ని అమ్మి వచ్చిన డబ్బుతో ఒడుగు చెయ్యమని చెప్పింది. ఆ బ్రాహ్మణుడు ఆ ముక్కుపుడకను తీసుకొని, పురందరదాసు దగ్గరకే అమ్మడానికి వెళ్ళాడు. ఆ ముక్కుపుడకను చూసి పురందరదాసు వెంటనే, అది తన భార్యది అని గుర్తుపట్టాడు. వెంటనే ఒక సేవకుణ్ని ఇంటికి పంపి, ముక్కుపుడక పట్టుకొని రమ్మన్నాడు. ఆ సేవకుడు ఇంటికి

వచ్చి, ముక్కుపుడక అడిగేసరికి సరస్వతీ బాయి కంగారు పడింది. ఆ ముక్కుపుడక సేవకుడికి ఇచ్చి పంపకపోతే తన భర్త తనను హింసిస్తాడు. అందుచేత మరణించడమే మంచిది అనుకొంది. ఒక పాత్రలో విషం తీసుకొని తాగబోయింది. ఇంతలో ఆ విషం ఉన్న గిన్నెలో ముక్కుపుడక కనిపించింది. సరస్వతీబాయి ఎంతో ఆనందించి, ఆ ముక్కుపుడకను సేవకుడికి ఇచ్చి పంపింది. ఆ ముక్కుపుడకను చూసి, పురందరదాసు ఆశ్చర్యపోయాడు. వెంటనే ఇంటికి వెళ్ళి భార్యను అడిగే సరికి జరిగిన విషయం అంతా చెప్పింది. ఆ విషయం విన్న పురందరదాసుకి జ్ఞానోదయం అయ్యింది. వెంటనే ఆ బ్రాహ్మణుడి కోసం వెదికాడు. ఆ బ్రాహ్మణుడు ఎక్కడా కనిపించలేదు. ఆ బ్రాహ్మణుడు సాక్షాత్తూ 'పుండరీక విఠలుడే' అని గ్రహించాడు. ఈ సంఘటన పురందరదాసు జీవితాన్నే మార్చివేసింది. తను సంపాదించిన ధనం అంతా పేదలకి దానం చేశాడు. 'పుండరీక విఠలుడి భక్తుడిగా మారిపోయాడు. కీర్తనలు రచించడం ప్రారంభించాడు.

పురందరదాసు 'వ్యాసరాయలు' అనే ఆయన శిష్యుడు. పురందరదాసుకి ఆ పేరు పెట్టింది ఈయనే. పురందరదాసు దేశంలో ఉన్న చాలా దేవాలయాల్ని సందర్శించాడు. పురందరదాసు భక్తికి మెచ్చి, ఎన్నోసార్లు పుండరీక విఠలుడు దర్శనం ఇచ్చాడు.

పురందరదాసు రచనలు ఎక్కువ కన్నడ భాషలో ఉన్నాయి. ఈయన రచనల్ని 'దాసర పదగళు' అనికాని, దేవనామాలు అనికాని అంటూంటారు. ఈయన రచనల్లో మంచి ఉపమానాలు, చక్కని ఉదాహరణలు ఉంటాయి. **4,75,000** రచనల్ని చేశాడు.

ద్విజావంతి, శ్యామకల్యాణి, మాధవిలాంటి అపురూపరాగాల్లో కూడా కీర్తనలు రచించాడు.

పురందరదాసు మాయా మాళవగౌళ రాగంలో సరళీస్వరాలు, జంటస్వరాలు, అలంకారాలు రచించాడు. అలాగే పిళ్ళారి గీతాల్ని కూడా రచించాడు. ఇవి సంగీతం నేర్చుకొనే విద్యార్థులకు ఎంతో ఉపయోగపడుతున్నాయి. అందుచేత పురందరదాసుని 'ఆది గురువు' అని, (ఆది, అంటే మొదటి అన్నమాట) 'కర్ణాటక సంగీత పితామహుడు' అని అంటారు. పురందరదాసు, అన్నమయ్య ఒకే కాలంలో ఉన్నారు. పురందరదాసు తిరుపతి వచ్చి, అన్నమయ్యను కలుసుకొన్నాడు కూడా. తిరుపతి వెంకటేశ్వరుడి పైన కూడా కీర్తనలు రాశాడు. అందులో 'వెంకటాచల నిలయం' అన్న కీర్తన బాగా ప్రచారంలో ఉంది. వినాయకుడి పై రాసిన 'గజవదన బేడువే' అన్న కీర్తన కూడా బాగా ప్రచారంలో ఉంది. కచేరీ చివర అప్పుడప్పుడు పురందరదాసు కీర్తనలు వినపడుతూంటాయి. శంకరాభరణం రాగంలో ఉన్న 'జోజో శ్రీకృష్ణ' అనే జోలపాట కన్నడ తల్లులు నిత్యం తమ పిల్లల్ని నిద్రపుచ్చేందుకు పాడుతూంటారు. ముఖారి రాగంలో శారదా స్తోత్రం, మధ్యమావతి రాగంలో లక్ష్మీస్తోత్రం చాలా ప్రసిద్ధి చెందాయి.

పురందరదాసు చనిపోయేముందు సన్యాసం తీసుకొన్నాడు. **2 - 1 - 1564**లో శ్రీకృష్ణుడిలో కలసిపోయాడు. పురందరదాసు హంపిలో ఒక మండపంలో ఉండేవాడు. ఆ మండపాన్నే పురందర మండపం అని పిలుస్తున్నారు.

# 4. నారాయణ తీర్థులు

నారాయణ తీర్థులు గురించి పెద్దగా వివరాలు తెలియవు. ఈయన క్రీ.శ. 1780 ప్రాంతంలో మంగళగిరి సమీపంలో ఉన్న 'కాజ' అనే ఊళ్ళో పుట్టాడు. సంస్కృతం, తెలుగు, సంగీతం చిన్నతనంలోనే బాగా నేర్చుకొన్నాడు. ఒకసారి అత్తవారింటికి వెళ్ళడానికి కృష్ణానది ఈదసాగాడు. ఆ కృష్ణానదిలో కొట్టుకొని పోతుండే మనస్సులో సన్యాసం తీసుకొన్నాడు. అలా తీసుకొన్నాక ఒడ్డుకు వచ్చి చేరాడు. ఈ విషయాన్ని భార్యకు చెప్పాడు. నిజంగానే సన్యాసం తీసుకొన్నాడు. శివరామానంద తీర్థులుకి శిష్యుడు అయ్యాడు. దేశాటన చేశాడు. నారాయణ తీర్థులు అన్న పేరు ఈయనకు సన్యాసం తీసుకొన్నాక వచ్చింది. అంతకుముందు ఈయన పేరు తల్లావర్ఝుల గోవిందశాస్త్రి.

నారాయణ తీర్థులకి కడుపునొప్పి ఉండేదట. యాత్రలు చేస్తూ, తమిళనాడులో తంజావూరు జిల్లాలో 'నడుక్కావేరి' అనే ఊరిలో ఒక వినాయకుడి గుడిలో నిద్రపోయాడు తీర్థ. రాత్రి కలలో దేవుడు కనిపించాడు. "నీకు రేపు ఉదయం రెండు వరాహాలు (పందులు) కనిపిస్తాయి. వాటితో కూడా వెళ్ళు. అవి ఎక్కడికి వెళ్ళి ఆగుతాయో అక్కడే నీ కడుపునొప్పి తగ్గిపోతుంది" అని చెప్పాడు. మరునాడు ఉదయం 2 వరాహాలు నారాయణ తీర్థకు కనిపించాయి. ఆ పందుల కూడా వెళ్ళసాగాడు. అవి భూపతి రాజపురం అనేచోట, కడుంగాల్ అనే కాలువలోకి దూకి ఈదుకొంటూ - గట్టున ఉన్న వేంకట రమణస్వామి గుడికి

కొంత దూరంలోకి వెళ్ళి అక్కడ అదృశ్యం అయిపోయాయి. వాటితో కూడా అక్కడకి వెళ్ళిన తీర్థుల వారికి కడుపునొప్పి తగ్గిపోయింది. తీర్థుల వారు అక్కడే నివాసం ఉండాలని నిశ్చయించుకొన్నారు. అక్కడ లక్ష్మీ, నారాయణుల గుడి కట్టించారు. ఆ ప్రదేశమే 'వరాహూరొ' అని పేరుగాంచింది.

నారాయణ తీర్థులు రచించినది 'కృష్ణలీలాతరంగిణి' అనే ఒక నాటకం. ఇది సంస్కృతంలో ఉంది. ఇందులో ఉన్న పాటల్నే 'తరంగాలు' అంటారు. ఈ తరంగాలకి పల్లవి, అనుపల్లవి, చరణం ఉంటాయి. ఈ నాటకంలో కృష్ణుడు, రుక్మిణుల కథలున్నాయి.

తరంగాల్లో బాగా ప్రచారం ఉన్నవి 'ఏహిమోహందేహి', 'కలయ యశోదే', 'కృష్ణం కలయసఖి', 'గోవింద ఘటయా', 'గోవిందమిహ గోపికానంద', 'శరణం భవకరుణాలయ' మొదలైనవి. తరంగాల్ని అప్పుడప్పుడు కచేరీల్లో పాడుతూంటారు. భజనల్లో ఇది వరకు తరంగాలు ఎక్కువగా వినపడేవి. రేడియోలో ఉదయం పూటవచ్చే 'భక్తిరంజని' కార్యక్రమంలో తరంగాలు అప్పుడప్పుడు వినిపిస్తాయి. తరంగాలకి అనుగుణంగా నృత్యంకూడా చేస్తారు.

నారాయణ తీర్థులు చాలాకాలం, వరాహూరులో ఉండి పోయి, 'కృష్ణలీలాతరంగిణి'ని అక్కడే పూర్తి చేశారు. ఎందరికో తరంగాలు నేర్పారు. చివరికి ఆవూళ్ళోనే సిద్ధిపొందారు. ఆయన సమాధి ఇప్పటికీ వరాహూరులో ఉంది. అక్కడ 20 ఎకరాల స్థలాన్ని సేకరించి పుణ్యక్షేత్రంగా దానిని చూస్తున్నారు. సమాధికి నిత్యం అభిషేకాలు నిర్వహిస్తున్నారు. తీర్థులవారి ఆరాధనోత్సవాలు నిర్వహిస్తున్నారు.

# 5. రామదాసు



పూర్వం భజనల్లో ఎక్కువగా 'ఇక్ష్వాకుకులతిలక ఇకనైనా పలుకవే', 'ఏ తీరుగ నను దయజూచెదవో', 'పలుకే బంగారమాయెనా' లాంటి రామదాసు కీర్తనలు ఎక్కువగా వినిపిస్తూ ఉండేవి. పూర్వం సంగీతం రాని పామరులకు కూడా రామదాసు కీర్తనలతో పరిచయం ఉండేది. రామదాసుకు ఉన్నంతపేరు మరే

వాగ్గేయకారుడికి లేదు. ఖమ్మం జిల్లా 'నేలకొండపల్లి' అనే ఊళ్ళో కామమ్మ, లింగన్న అనే భార్యాభర్తలు ఉండేవారు. వాళ్ళ ఇంటి పేరు కంచెర్ల వారు. వాళ్ళకి పుత్రసంతానంలేదు. సంతానం కోసం భగవంతుణ్ని ప్రార్థిస్తే క్రీ.శ. 1620 ప్రాంతంలో వాళ్ళకు ఒక మగ పిల్లవాడు పుట్టాడు. ఆ అబ్బాయికి గోపన్న అని పేరుపెట్టారు. ఈ గోపన్నే తరువాత 'రామదాసు' అని పేరుగాంచాడు. రామదాసుకు చిన్నతనంలోనే ఒడుగు చేశారు. రఘునాథ భట్టాచార్యులు అనే గురువు దగ్గర చదువుకొన్నాడు. సంగీతం, సంస్కృతం, తెలుగు భాషల్ని బాగా నేర్చుకొన్నాడు. చిన్నప్పటినుంచీ రామదాసుకి రాముడంటే ఎంతో భక్తి ఉండేది. రామదాసుకి కమలమ్మతో పెండ్లి జరిగింది. పెండ్లి జరిగిన కొద్ది రోజులకే తల్లిదండ్రులు మరణించారు.

కబీరు, రామదాసుకి తారకమంత్రం (అంటే రామమంత్రం అన్నమాట) ఉపదేశించాడని అంటారు. తారకమంత్రం ఉపదేశం పొందాక గోపన్న 'తారకమంత్రము కోరిన దొరికెను' అనే ఒక కీర్తన రాశాడు.

గోల్కొండ తానీషా దగ్గర అక్కన్న, మాదన్న అని ఇద్దరు మంత్రులు ఉండేవారు. వాళ్ళు రామదాసుకి మేనమామలు అవుతారు. వాళ్ళ సహాయంతో భద్రాచలం తాలూకాకి తాసిల్దార్‌గా ఉద్యోగం సంపాదించుకొన్నాడు గోపన్న. తన బాధ్యతలు సక్రమంగా నిర్వర్తిస్తూ పై అధికారుల మెప్పు పొందాడు. ఉద్యోగంలో ఉన్నా శ్రీరాముడిపైన భక్తి వదలలేదు. బ్రాహ్మణులకి సంతర్పణ చేసేవాడు. ఒకసారి సంతర్పణ జరుగుతోంది. అన్నాన్ని

ఒక పెద్ద గొయ్యిలో గంజి వార్చారు. ఆ గంజి ఉన్న గొయ్యిలో రామదాసు కొడుకు పొరపాటున జారిపడి మరణించాడు. అప్పుడే అంతా భోజనాలకి కూర్చొంటున్నారు. కమలమ్మ కొడుకు మరణించిన విషయం ఎవరికీ చెప్పలేదు. ఈ విషయం తెలిస్తే భోజనాలు పాడైపోతాయి అని. భోజనాలు పూర్తి అయ్యాక రామదాసుకి ఈ విషయం చెప్పింది. రామదాసు, చనిపోయిన తన పిల్లవాడిని, భద్రాద్రిరాముల వారిముందు ఉంచి, 'ఎంత పనిచేసితివిరామా' అనే నాదనామ క్రియరాగంలో కీర్తన పాడేసరికి, చనిపోయిన కొడుకు తిరిగి బ్రతికాడు. అప్పటి నుంచీ గోపన్నను అందరూ రామదాసు అని పిలవడం మొదలు పెట్టారు.

రామదాసు శిస్తు తాలూకు 6 లక్షల వరహాల సొమ్ముతో భద్రాచలంలో రాముల వారికి గుడి కట్టించాడు. సీతా, రామ, లక్ష్మణులకు నగలు చేయించాడు రామదాసు. శిస్తు పంపకపోవడంతో తానీషాకు కోపం వచ్చింది. రామదాసుకు జైలు శిక్ష విధించాడు. రామదాసును జైలులో బంధించి, భటులు ఎన్నో విధాలుగా బాధించారు. జైలులో బాధల్ని తట్టుకోలేక 'గరుడగమన రారా నన్ను కరుణ నేలుకోరా' అంటూ కీర్తనల్ని రచించాడు. 'ఓ సీతాదేవీ, నన్ను కాపాడమని నువ్వు కాస్త రాముడితో చెప్పు' అని అర్థం వచ్చేలా 'నను బ్రోవమని చెప్పవే' అన్న కీర్తన రాశాడు. 'ఎవడబ్బసొమ్మని కులుకుతు తిరిగేవు రామచంద్ర' అని రాముణ్ణి తిట్టి, మళ్ళీ 'దెబ్బల కోర్వక అబ్బా తిట్టితినయ్యా రామచంద్రా' అని మళ్ళీ బాధపడ్డాడు.

జైలులో 12 ఏళ్ళు బాధలు పడ్డాడు రామదాసు. రామ,

లక్ష్మణులు వచ్చి తానీషాకు సొమ్ము చెల్లించి, రామదాసుని జైలునుంచి విడిపించారు. రామదాసుని తానీషా ఎంతో గౌరవించాడు. రామదాసు తిరిగి భద్రాచలం చేరాడు. తానీషా ప్రతీ ఏడూ శ్రీరామనవమి నాడు జరిగే రామ కల్యాణానికి ఎన్నెన్నో బహుమతుల్ని పంపేవాడు. ఇదే సంప్రదాయాన్ని ఈ నాటికీ మన రాష్ట్రప్రభుత్వం పాటిస్తోంది.

రామదాసు ఎన్నెన్నో కీర్తనలు రచించి, ఆ రాముడిలో ఐక్యం అయ్యాడు.

రామదాసు కీర్తనలు **130, 140** దాకా మనకి దొరికాయి. రామదాసు కీర్తనలు ఆహిరి, వరాళి, ధన్యాసి, సౌరాష్ట్ర, కల్యాణి, యదుకుల కాంభోజి, యమునా కల్యాణి, కాఫి, కమాను ఇలాంటి రాగాలలో ఉన్నాయి. రామదాసు కీర్తనలు ఎంతో భక్తి పూర్వకంగా ఉంటాయి. ఈ కీర్తనల్లో సంగీతంకన్నా సాహిత్యం, భక్తికే ప్రాముఖ్యత ఎక్కువ. రామదాసు ముద్ర 'రామదాసు'. ఈయన ప్రతీ కీర్తనలోను ఈ ముద్ర వస్తుంది.

రామదాసు కీర్తనల్లో 'పలుకే బంగారమాయెనా' అన్న 'ఆనందభైరవి' రాగకీర్తన, వరాళిలో 'అంతారామమయం ఈ జగమంతారామమయం' అన్న కీర్తన, నాద నామక్రియలో 'ఏ తీరుగ నను దయజూచెదవో' అన్న కీర్తన, కాంభోజిలో 'ఏమయ్యరామ', 'ఇక్ష్వాకు కులతిలక' అన్న కీర్తనలు, కల్యాణిలో 'ననుబ్రోవమని చెప్పవే అన్నవి బాగా ప్రచారంలో ఉన్నాయి.

గతంలో 'భక్తరామదాసు' అనే సినిమా కూడా వచ్చింది.

# 6. క్షేత్రయ్య



**1595 - 1660** మధ్యకాలంలో జీవించిన వాగ్గేయకారుడు క్షేత్రయ్య. అసలు పేరు వరదయ్య. ఇంటిపేరు 'మొవ్వ' కృష్ణాజిల్లాలో ఉన్న 'మొవ్వ' అనే ఊళ్ళో పుట్టాడు. ఆవూళ్ళో ఉన్న వేణుగోపాలస్వామి గుడిచాలా ప్రఖ్యాతి చెందింది.

ఆ రోజుల్లో పాటలను పదాలు అనేవారు. అందే కీర్తన

అన్నా, పదం అన్నా ఒకటిగానే చూసేవారు. అయితే ప్రస్తుతం శృంగార సంబంధమైన సాహిత్యం ఉండి, నెమ్మదిగా పాడే పాటలనే 'పదాలు' అంటున్నారు. పదాలలో సాహిత్యం పైకి శృంగారంలా ఉన్నా, భక్తి అంతర్లీనంగా ఉంటుంది. ఈ పదాలకి, నృత్యం చేయవచ్చు. క్షేత్రయ్య రాసినవి ఇలాంటి పదాలే. పదాలకి పల్లవి, అనుపల్లవి, చరణాలు ఉంటాయి. అన్నమయ్య రాసిన శృంగార సంకీర్తనలు క్షేత్రయ్యకు ఆదర్శం అయ్యాయి.

చిన్నప్పటి నుంచీ క్షేత్రయ్యకు సంగీతం అంటే చాలా ఇష్టం. కూచిపూడిలో ఒక గురువుదగ్గర నాట్యం నేర్చుకొన్నాడు. 'మోహనాంగి' అనే దేవదాసితో స్నేహం ఉండేది. ఆమె ప్రోత్సాహంతో ఆవూరిలో ఉన్న మువ్వగోపాలుడిపైన పదాలు రచించాడు. 'శ్రీపతి సుతుబారికి' అన్న ఆనందభైరవి రాగపదం ఈయన రాసిన మొదటి పదం. క్షేత్రయ్య ముద్ర 'మువ్వగోపాల'. క్షేత్రయ్య పదాలకి మోహనాంగి నృత్యం చేస్తూండేది. ఇలా కొంత కాలం గడిచింది.

క్షేత్రయ్య యాత్రలు చేశాడు. బెల్లంకొండలో 'అలిగితివెందు కో' అన్న పదం రచించాడు. భద్రాచలంలో రాముణ్ని దర్శించాడు. అప్పుడు రామదాసు తహసీల్దార్‌గా ఉన్నాడు. రామదాసు, క్షేత్రయ్యను ఎంతో ఆదరించాడు. శ్రీశైలం, పాలగిరి, ఇనగబారు, తిరుపతి, తిరుమల, శ్రీరంగం ఇలా ఎన్నో క్షేత్రాలు తిరిగాడు క్షేత్రయ్య. ఇలా క్షేత్రాలు తిరగడం వల్లనే వరదయ్యకు 'క్షేత్రయ్య'

అనే పేరు వచ్చింది. తను వెళ్ళిన ప్రతీ క్షేత్రంలోనూ ఉన్న దేవతలపైన పదాల్ని రచించాడు. మధుర, తిరుమలేంద్రుడు, అచ్యుత విజయరాఘవుడు, గోల్కొండ పాదుషా ఇలా ఎందరెందరో రాజుల దగ్గర పదాల్ని వినిపించి, ఆ రాజులచేత సన్మానాలు అందుకొన్నాడు. క్షేత్రయ్య పదాలు, ఆయన కాలంలోనే దక్షిణ భారతదేశం అంతా బాగా ప్రచారం పొందాయి.

క్షేత్రయ్య రాజసన్మానాలు అందుకొని, క్షేత్రాలన్నీ తిరిగి, ఎన్నెన్నో పదాలు రచించి 'మొవ్వ' చేరుకొని అక్కడే మరణించాడు.

క్షేత్రయ్య పదాన్ని నెమ్మదిగా పాడతారు. దీనికి సంగతులు కూడా ఉంటాయి. పదాలలో సంగీతానికి, సాహిత్యానికి కూడా సమాన ప్రాముఖ్యత ఉంటుంది. నృత్యం చేయడానికి ఈ పదాలు బాగుంటాయి. క్షేత్రయ్య సినిమా వచ్చింది. మీరు చూశారా? క్షేత్రయ్య యదుకుల కాంభోజి, కాంభోజి, మోహన, బిలహరి, అఠాణా, కాపీ, సావేరి, సారంగ, శ్రీ, ధన్యాసి, సురటి, నాదనామక్రియ, బేగడ, ఆనందభైరవి, తోడి, మధ్యమావతి ఇలాంటి రాగాల్ని నలభై దాకా వాడాడు. కాంభోజిలోనే ఎక్కువ పదాలు రాశాడు. త్రిపుట, ఆది, అట, ఝంపె, రూపకం, మిశ్ర ఏక, మఠ్య తాళాలు వాడాడు. త్రిపుటతాళంలోనే ఎక్కువ పదాల్ని రచించాడు క్షేత్రయ్య.

# 7. త్యాగరాజు



వాగ్గేయకారులందరికన్నా త్యాగయ్యకి ఎంతో విశిష్టతఉంది. త్యాగరాజు గొప్ప వాగ్గేయకారుడే కాకుండా రామభక్తుడు. సంగీతంతో మోక్షాన్ని పొందాడు. క్రీ.శ. **1767**లో తమిళనాడులో 'తిరువారూరు' అనే ఊళ్ళో పుట్టాడు. త్యాగరాజు, తెలుగుబ్రాహ్మణుడు తమిళనాడులో పుట్టిపెరిగాడు. తమిళనాడులోఉన్నా త్యాగయ్యకృతులు తెలుగులోనే ఉన్నాయి.

త్యాగయ్య ఇంటిపేరు కాకర్లవారు. త్యాగయ్య పూర్వీకులు కర్నూలు జిల్లాలో ఉన్న కాకర్లలో ఉండేవారు. వీరు క్రీ.శ. 1600 ప్రాంతంలో తమిళనాడుకు వలస వెళ్ళిపోయారు. ఈ వంశం వారంతా మంచి పండితులు. ప్రజలకి పురాణాలని, వేదాలని చెబుతూ వుండేవారు. త్యాగయ్య ముత్తాత పంచనద బ్రహ్మం. ఈయన తమిళనాడులో తంజావూరు జిల్లాలోని తిరువారూరులో ఉండేవాడు. ఆ ఊరిలో వెలసిన ఈశ్వరుడిపేరు త్యాగరాజేశ్వరుడు.

పంచనద బ్రహ్మంకు సదాశివ బ్రహ్మం, సదానంద బ్రహ్మం, సచ్చిదానంద బ్రహ్మం, బాలబ్రహ్మం, గిరిరాజ బ్రహ్మం అని ఐదుగురు కొడుకులు ఉండేవారు. వీరిలో ఇద్దరు యోగులు అయిపోయారు. గిరిరాజ బ్రహ్మం, గిరిరాజ కవి అని పేరుపొందాడు. ఈయన ఎన్నో సంగీతనాటకాలు, గేయాలు రచించాడు. ఈ గిరిరాజకవి మనుమడే త్యాగయ్య.

గిరిరాజకవికి రామబ్రహ్మం అనే కొడుకు ఉండేవాడు. ఆయన భార్య సీతమ్మ. వీళ్ళకి జపేశం, రామనాథం అని ఇద్దరు కొడుకులు పుట్టారు. రామనాథం చిన్న తనంలోనే మరణించాడు. జపేశుడు అల్లరి చిల్లరిగా తిరుగుతూ ఉండేవాడు. మంచి బుద్ధి గలిగిన కొడుకుని ప్రసాదించమని త్యాగరాజేశ్వరుడు (అక్కడ్ ఉన్న శివుడు)ని ప్రార్థించారు - సీతమ్మ, రామబ్రహ్మం దంపతులు. ఆ త్యాగరాజేశ్వరుడి వరప్రసాదంగా 1767లో ఒక కొడుకు పుట్టాడు. ఆ కొడుకుకి త్యాగరాజు అని పేరు పెట్టుకొన్నారు.

చిన్నతనం నుంచీ త్యాగయ్యకు సంగీతం అంటే ఎంతో ఇష్టంగా ఉండేది. రాముడంటే భక్తి ఉండేది. త్యాగయ్య

చిన్నతనంలోనే రామబ్రహ్మం తన కాపురాన్ని 'తిరువారూరు' నుంచి 'తిరువైయారు'కు మార్చాడు. ఆ వూరిలో తిరుమంజనం వీధిలో ఉన్న స్వంత ఇంటిలో రామబ్రహ్మం ఉండసాగాడు.

త్యాగయ్య చిన్నతనంలోనే సంస్కృతం, తెలుగు బాగా నేర్చుకొన్నాడు. తల్లి త్యాగయ్యకు జయదేవుడి అష్టపదులు, పురందరదాసు కీర్తనలు, రామదాసు కీర్తనలు నేర్పింది. వాటిని తనకున్న చక్కని గొంతుతో రోజూ పాడుతూండేవాడు. త్యాగయ్య చిన్నతనంలోనే కీర్తనల్ని రచించడం ప్రారంభించాడు. 'నమోనమో రాఘవాయ' అన్న దేశిక తోడి రాగంలో త్యాగయ్య తొలి రచన చేశాడు.

భగవంతుణ్ని లేపడానికి ఉదయాన్నే మేలుకొలుపు పాడడం, స్నానం సమయంలో నలుగు పాటలు, ఆస్థానంలో కొలువుతీర్చి ఉన్నప్పుడు కొలువు అని, భోజనాల వేళ ఆరగించమంటూ, (భోజనం తినమంటూ) రాత్రిళ్ళు నిద్రపో అంటూ ఇలా భగవంతుడికి పాటలు పాడుతూ భగవంతుడికి సేవచేయడాన్ని సంకీర్తన సేవ అంటారు. ఈ సంకీర్తన సేవలో పాడే పాటల్ని ఉత్సవ సంప్రదాయ కీర్తనలు అంటారు. ఇలా కీర్తనలతో భగవంతుణ్ని సేవించుకొనే సంప్రదాయం అన్నమయ్యతో మొదలయ్యింది. దీనినే సంకీర్తన సేవ అంటారు. త్యాగయ్య ముందు ఇలాంటి ఉత్సవ సంప్రదాయ కీర్తనలే రాశాడు. ఈ కీర్తనలు సుద్దతో గోడపైన రాసుకొనేవాడు. వాటిని రామబ్రహ్మం తాటి ఆకులపైన రాసి జాగ్రత్త చేసేవాడు.

త్యాగయ్య రోజూ 'అందణాళ్‌కురుచ్చి' అనే ప్రాంతంలో

ఉన్న పూలతోట నుంచి రోజూ పూలుకోసుకొని వచ్చి తండ్రిగారి పూజకు అందించేవాడు. త్యాగయ్య పూలతోట నుంచి ఇంటికి వచ్చేదారిలో 'శొంఠి వెంకటరమణయ్య' అనే గొప్ప సంగీత విద్వాంసుడు ఉండేవాడు. ఆయన తన శిష్యులకు సంగీతం నేర్పుతుంటే త్యాగయ్య ఎంతో ఆసక్తితో వినేవాడు. ఈ విషయం రామబ్రహ్మంకు తెలిసింది. త్యాగయ్యను సంగీతం నేర్చుకొనేందుకు, వెంకట రమణయ్యగారి దగ్గరకు పంపాడు. ఒక్క సంవత్సరంలోనే త్యాగయ్య సంగీతం అంతా నేర్చుకొన్నాడు. త్యాగయ్య మేనమామ వీణ కాళహస్తయ్య. ఈయన మంచి వీణ విద్వాంసుడు. త్యాగయ్య ఈయన దగ్గర వీణ కూడా నేర్చుకొన్నాడు. ఆయన దగ్గర ఉన్న సంగీత గ్రంథాలన్నీ చదివాడు.

నారదముని ప్రత్యక్షమై 'నారదీయం', 'స్వరార్ణవం' అనే రెండు సంగీత గ్రంథాల్ని త్యాగయ్యకు ఇచ్చాడు. ఆ గ్రంథాలు చదివాక త్యాగయ్యకు సంగీతంలో ఉన్న సందేహాలన్నీ తీరిపోయాయి. త్యాగయ్యకు 18వ ఏట రామకృష్ణానందులు అనే ఓ స్వామీజీ రామ మంత్రాన్ని ఉపదేశించారు. దాన్ని శ్రద్ధగా ధ్యానం చేసేవాడు త్యాగయ్య. 18వ ఏటనే త్యాగయ్యకు 'పార్వతి'తో వివాహం జరిగింది. త్యాగయ్య అన్న జపేశ్వుడు చెడ్డవాడుగా ఊరిలో పేరుతెచ్చుకొన్నాడు. త్యాగయ్య ఇరవైయ్యో ఏట తండ్రి మరణించాడు. త్యాగయ్య భార్య కూడా మరణించింది. పెద్దలు త్యాగయ్యను మళ్ళీ పెళ్ళి చేసుకోమన్నారు. పార్వతి చెల్లెలు కమలాంబను పెళ్ళి చేసుకొన్నాడు. త్యాగయ్య 36వ ఏట తల్లి మరణించింది.

త్యాగయ్య అన్న జపేశం తాగయ్య చేత ఏదైనా ఉద్యోగం చేయిద్దాం అనుకొన్నాడు. కాని త్యాగయ్య అందుకు ఒప్పుకోలేదు. ఉంఛవృత్తిని స్వీకరించాడు. ఉంఛవృత్తి అంటే తంబూరా, జోలె తీసుకొని పాటలు పాడుతూ ఊరంతా తిరగడం, ఊరివాళ్ళు ఇచ్చిన సరుకులతో కాపురం చేయడం. త్యాగయ్య తన శిష్యులతో కలిసి ఉంఛవృత్తిని చేస్తూండేవాడు. త్యాగయ్య అన్నకు ఇది నచ్చలేదు. ఆస్తిని వాటాకు వేయించాడు. త్యాగయ్యకు తల్లీ తండ్రీ పూజించుకొన్న సీతారామ లక్ష్మణ భరత శత్రుఘ్నుల, ఆంజనేయుల విగ్రహాలు త్యాగయ్య వాటకు వచ్చాయి. ఎంతో సంతోషంగా ఆ విగ్రహాలను పూజించుకొంటూ ఉండేవాడు.

జపేశం, త్యాగయ్యను భక్తి మార్గం నుంచి మరల్చాలి అనుకొని, త్యాగయ్య పూజించుకొనే విగ్రహాలు దొంగతనంగా తీసికెళ్ళి, కావేరీ నదిలో పారేశాడు. త్యాగయ్య ఆ విగ్రహాలకోసం ఎంతో బాధపడ్డాడు. 'ఎందుదాగినాడో' అనే కృతి రచించాడు. కొన్నాళ్ళ తరువాత రాముడే కలలో కనిపించి, కావేరీ నదిలో ఫలానచోట విగ్రహాలు దొరుకుతాయని చెప్పాడు. అక్కడకు వెళ్ళి చూస్తే విగ్రహాలు దొరికాయి. ఆ విగ్రహాలు చూడగానే త్యాగయ్య ఎంతో సంతోషించాడు. 'కనుగొంటిని శ్రీరాముని' అనే బిలహరి రాగంలో కీర్తన రాశాడు. అసావేరి రాగంలో 'రారా మాఇంటిదాకా' అనే కీర్తన అప్పటి కప్పుడు రచించి పాడి, విగ్రహాలను ఇంటికి తీసుకొచ్చాడు.

ఒకసారి తిరువైయారులో పెద్దలంతా సమావేశంమై, త్యాగయ్యను తన సొంత కీర్తనలు పాడమని అడిగారు. ఆ

సభలో త్యాగయ్య గురువుగారు కూడా ఉన్నారు. ఆ సభలో త్యాగరాజు 'దొరుకునా ఇటువంటి సేవ' అన్న బిలహరి రాగ కీర్తన చాలా గొప్పగా పాడాడు. త్యాగయ్య గానానికి ఆ సభలో విద్వాంసులంతా ఎంతగానో ఆనందించి, త్యాగయ్యను ఎంతో మెచ్చుకొన్నారు. త్యాగయ్య గురువుగారు త్యాగయ్యను 'దొరుకునా ఇటువంటి శిష్యుడు' అని పొగిడి, తనకు మహారాజులు ఇచ్చిన బహుమానాలను త్యాగయ్యకు ఇచ్చి సన్మానించారు.

త్యాగయ్య ప్రతిభ శరభోజి మహారాజు చెవిని పడింది. అంత గొప్ప వాగ్గేయకారుడి రచనలు వినాలని కోరుకొన్నాడు. కొంతమంది ఉద్యోగుల్ని త్యాగయ్య దగ్గరకి పంపించాడు. వాళ్ళు ఎంతో ధనాన్ని తీసుకొనివచ్చి త్యాగయ్యకి ఇవ్వబోయారు. 'నిధిచాల సుఖమా రాముని సన్నిధి సేవ సుఖమా' అని కల్యాణి రాగంలో ఒక కీర్తన పాడి ఆ డబ్బును తిప్పి పంపేశాడు. రాజుగారి ఆహ్వానాన్ని తిరస్కరించాడు. ఈ విషయం శరభోజికి చెప్పారు ఉద్యోగులు. త్యాగరాజును ఎలాగైనా తీసుకొని రమ్మని భటుల్ని పంపాడు మహారాజు. ఆ భటులు అలా వెళ్ళేసరికి మహారాజుకు కడుపు నొప్పి వచ్చింది. ఎన్ని మందులు వాడినా తగ్గలేదు. భటుల్ని వెనక్కి పిలిపించేసరికి ఆ నొప్పి దానంతట అదే తగ్గిపోయింది. ఆ తరువాత శరభోజి, తిరువైయూరు వచ్చి త్యాగయ్య స్నేహం సంపాదించుకొని, త్యాగయ్యపాట విని ఆనందించాడు.

త్యాగయ్య రామమంత్రాన్ని జపించేవాడని మనం ముందు చెప్పుకొన్నాం. 38 ఏళ్ళ త్యాగయ్యకు వచ్చేసరికి రామ మంత్రాన్ని

16 కోట్లసార్లు జపించడం పూర్తి అయ్యింది. అలా పూర్తి అయిన వెంటనే త్యాగయ్యకు శ్రీరాముడి దర్శనం అయ్యింది. అప్పుడు త్యాగయ్య 'బాలకనకమయచేల' అనే అఠాణా రాగంలో కీర్తన రచించాడు.

త్యాగయ్య ఇల్లు ఓ గురుకులంలా ఉండేది. త్యాగయ్య దగ్గర సంగీతం, జ్యోతిషం నేర్చుకోడానికి ఎందరో శిష్యులు వచ్చేవారు. త్యాగయ్య, తన జీవితంలో జరిగే సంఘటనలకి స్పందించి కృతులు రాసేవాడు. లోకంలో ఉన్న అవినీతి, చెడు ఆచారాలపైన కోపంతో, వాటిని నిరశిస్తూ కృతులు రాశాడు. త్యాగయ్య నోటిలోంచి కృతులు వెలువడుతుండే ఒక శిష్యుడు పల్లవిని, మరోశిష్యుడు అనుపల్లవిని, ఇంకొకడు చరణాన్ని అప్పటికప్పుడు స్వరాన్ని, సాహిత్యాన్ని పలకపైన బలపంతో రాసుకొని, కావేరీ నది ఒడ్డున శిష్యులంతా కలిసి కూర్చొని, కృతిని మొత్తం నేర్చుకొనేవారు. తిరిగి త్యాగయ్య దగ్గరకు వచ్చి కీర్తన లేదా కృతిని ఒప్పగించేవారు. త్యాగయ్యకు శిష్యులు ఎక్కువమంది ఉండడంవల్ల త్యాగయ్య కీర్తనలు బాగా ప్రచారం పొందాయి.

త్యాగయ్యకి సీతాలక్ష్మి అని ఒక్కతే కూతురు ఉండేది. ఆమెను కుప్పుసామయ్య అనే అతనికి ఇచ్చి పెండ్లిచేశాడు. ఆ పెండ్లికి శిష్యులు ఎన్నెన్నో కానుకలు ఇచ్చారు. పల్లవి ఎల్లయ్య అనే శిష్యుడు తాను చిత్రించిన కోదండరామస్వామి పటాన్ని ఇచ్చాడు. అది చూసి త్యాగయ్య మురిసిపోయి 'నను పాలింపగ నడచి వచ్చితివో' అన్న మోహన రాగకృతిని రచించాడు.

త్యాగయ్య ఇంటిలో భజన గోష్ఠులు జరిగేవి. ఎందరో విద్వాంసులు వచ్చి, ఆ భజన గోష్ఠిలో పాడేవారు. భక్తులు, సంగీత ప్రియులు వచ్చి వినేవారు.

త్యాగయ్య 50వ ఏట భార్య కమలాంబ చనిపోయింది.

శంకరాచార్యులవారు కొన్ని చోట్ల శంకర పీఠాలు స్థాపించారు. కంచిలో ఉన్న శంకరపీఠానికి ఉపనిషద్బ్రహ్మేంద్ర స్వామి అధిపతిగా ఉండేవారు. ఆయన త్యాగయ్య సంగీతంలోనూ, సాహిత్యంలోనూ సంపాదించిన పేరు విని, త్యాగయ్యను కంచికి రమ్మని కబురు పంపాడు. 67 ఏళ్ళ వయస్సులో ఉన్న త్యాగయ్య తన శిష్యులతో కలిసి కంచికి బయలు దేరాడు. దారిలో కొన్ని చోట్ల ఆగుతూ, కొన్ని పుణ్యక్షేత్రాల్ని దర్శించుకొంటూ కంచికి వెళ్ళాడు.

మద్రాసుకు ఉత్తరాన ఉన్న తిరువొత్తియూర్ త్యాగయ్య మొదటి మజిలీ. అక్కడ తన ప్రియ శిష్యుడు వీణ కుప్పయ్యర్ ఇంట్లో కొంతకాలం ఉన్నాడు. అక్కడ రోజూ సాయంత్రం భజన గోష్టులు జరిగేవి. త్యాగయ్య రోజుకో కొత్త కీర్తన రచించేవాడు. ఆ ఊరిలో త్రిపురసుందరి అమ్మవారి గుడి ఉంది. త్రిపురసుందరి పైన ఐదు కృతుల్ని రాశాడు. పంచ అంటే ఐదు. ఈ ఐదు కృతుల్ని తిరువొత్తియూర్ పంచరత్నాలు అంటారు. అంటే ఐదు రత్నాలలాంటి కృతులన్నమాట. ఈ ఐదుకీర్తనలు (1) బేగడ రాగంలో 'సుందరి నన్నిందరిలో' (2) కల్యాణి రాగంలో 'సుందరి నీదివ్యరూపమును' (3) శుద్ధసావేరిలో 'దరిని తెలుసుకొంటి' (4) సావేరిలో 'కన్నతల్లి' (5) ఆరభిలో 'సుందరి నిను'.

ఆ తరువాత మద్రాసులో ఉన్న పార్థసారధి పైన 'సారివెడలిన ఈ పార్థసారధిని గనరె' అనే అసావేరి రాగంలో కృతి రాశాడు.

ఆ తరువాత త్యాగయ్య తన శిష్యులతో కలసి కోవూరు వెళ్ళారు. అక్కడ 'సుందరేశమొదలియార్' అనే ఆయన ఇంట్లో ఆగారు. కోవూరులో 'సుందరేశ్వరస్వామి' అనే ఈశ్వరుడి ఆలయం ఉంది. ఆ సుందరేశ్వరుని పైన ఐదు కీర్తనలు రాశాడు. వీటిని కోవూరు పంచరత్నాలు అంటారు. కోవూరు పంచరత్నాలు :

(1) శహన రాగంలో 'ఈ వసుధ నీవంటి దైవము'
(2) ఖరహరప్రియ రాగంలో 'కోరిసేవింపరారే'
(3) పంతువరాళి రాగంలో 'శంభోమహాదేవ'
(4) కల్యాణి రాగంలో 'నమ్మివచ్చిన నన్ను'
(5) శంకరాభరణం రాగంలో 'సుందరేశ్వరుని జూడ'

కోవూరు నుంచి తిరుపతి ప్రయాణం అయ్యాడు త్యాగయ్య. సుందరేశ మొదిలియార్ త్యాగయ్య శిష్యులకి కొంత ధనం ఇచ్చాడు. ఈ ధనాన్ని శ్రీరాముడి సేవకి (అంటే పూజ నైవేద్యాలు మొదలైన వాటికి) ఖర్చు పెట్టమని చెప్పాడు.

త్యాగయ్య, శిష్యులు ప్రయాణం చేస్తున్నారు. 'నాగులాపురం' అనే ఊరు చేరేసరికి రాత్రి అయ్యింది. అక్కడ కొందరు దొంగలు త్యాగయ్య దగ్గర డబ్బు ఉందని పసిగట్టారు. రాళ్ళతో శిష్యులను కొట్టసాగేరు. ధనం ఉన్న సంగతి త్యాగయ్యకు చెప్పారు. త్యాగయ్య ఆ ధనాన్ని దొంగలకు ఇచ్చివేయమన్నాడు. ఆ ధనం రాముల వారి సేవ కోసం ఇచ్చినది అని చెప్పగానే, త్యాగయ్య రాములవారే ఆయన సొమ్మును కాపాడుకొంటాడు

అని ''ముందు వెనుక ఇరు ప్రక్కలతోడై'' అన్న కీర్తన దర్బారు రాగంలో అప్పటికప్పుడే రచించి పాడాడు. రామలక్ష్మణులు దొంగల్ని తరిమి మాయమైపోయారు. ఆ దొంగలు మళ్ళీ త్యాగయ్య దగ్గరకు వచ్చి త్యాగయ్య కాళ్ళపైన పడి, మమ్మల్ని తరిమిన ఆ రాజకుమారుల్ని మళ్ళీ మాకు చూపించండి అని అడిగారు. త్యాగయ్యకు ఆ రాజకుమారులు రామలక్ష్మణులే అని అర్థం అయ్యింది. రామలక్ష్మణుల్ని చూడగలిగిన ఆ దొంగలు ఎంత అదృష్టవంతులో కదా! అని త్యాగయ్య ఆనందించాడు.

త్యాగయ్య తిరుమలలో వెంకటేశ్వరుణ్ని దర్శించుకోవడానికి వెళ్ళాడు. తీరా వెంకటేశ్వరుణ్ని చూద్దామనుకొనే సరికి తెరఅడ్డుగా ఉంది. అప్పుడు 'గౌళి పంతు' అనే రాగంలో 'తెరతీయగ రాదాలోని' అనే కీర్తన పాడేసరికి ఆ తెర తెగిపడింది. వెంకటేశ్వరుణ్ని కన్నులారా దర్శించుకొని 'వెంకటేశ నిను సేవింపను పదివేల కన్నులు కావలెనయ్య' అనే మధ్యమావతి రాగంలో కీర్తన రాశాడు.

త్యాగయ్య బృందం తిరుపతి నుంచి కంచికి బయలుదేరి వెళుతూండగా, దారిలో పుత్తూరు అనే ఊరు వచ్చింది. అక్కడ ఒకతను పొరపాటున బావిలో పడి చనిపోయాడు. అతని భార్య, పిల్లలు ఆ శవం దగ్గర కూర్చొని ఏడుస్తున్నారు. అది చూసిన త్యాగయ్య జాలితో బిలహరి రాగంలో 'నాజీవాధార' అన్న కీర్తన రచించేసరికి చనిపోయిన ఆ మనిషి బ్రతికాడు.

త్యాగయ్య కంచికి చేరాడు. కంచిలో ఉపనిషద్ బ్రహ్మేంద్రస్వామిని దర్శించుకొన్నాడు. కంచిలో ఉన్న వరదరాజస్వామిని, ఏకామ్రేశ్వరుణ్ని దర్శించుకొని కీర్తనలు

రాశాడు. 'వరదరాజ నిన్నే కోరి వచ్చితిరా' అనే స్వరభూషణి రాగంలో కీర్తన వరదరాస్వామిపైన 'వినాయకుని వలెను బ్రోవవే' అనే మధ్యమావతి రాగ కీర్తన కామాక్షి దేవిని దర్శించుకొన్నప్పుడు రాశాడు.

కంచి నుంచి వాలాజీపేట వెళ్ళాడు. అక్కడ 'వెంకటరమణ భాగవతార్' అనే త్యాగయ్య శిష్యుడు ఉన్నాడు. అతని ఇంట కొన్నాళ్ళు ఉన్నాడు త్యాగయ్య. ఆ తరువాత అక్కడ నుంచి త్యాగయ్య తిరువైయ్యూర్ చేరుకొన్నాడు.

త్యాగయ్య శిష్యబృందంతో మళ్ళీ యాత్రలు చేశాడు. ఈసారి శ్రీరంగం వెళ్ళాడు. అక్కడ ఉన్న రంగనాథుడిపై ఐదు కీర్తనలు రాశాడు. వీటిని శ్రీరంగ పంచరత్నాలు అంటారు.

అవి: (1) తోడి రాగంలో 'రాజువెడలె చూతామురారే'

(2) కాంభోజిరాగంలో 'ఓరంగశాయి'

(3) దేవగాంధారి రాగంలో 'వినరాద నా మనవి'

(4) ఆరభి రాగంలో 'చూతామురారే'

(5) సారంగ రాగంలో 'కరుణ జూడవయ్య'

శ్రీరంగం నుంచి నాగపట్టణం వెళ్ళి, అక్కడి 'నీలాయతాక్షి' అమ్మవారిపైన సావేరి రాగంలో 'కర్మమే బలవంతమాయె' అన్న కీర్తన రాశాడు.

అక్కడ నుంచి లాల్గుడి చేరాడు. అక్కడ అమ్మవారిపైన ఐదు కీర్తనలు రాశాడు. వాటిని లాల్గుడి పంచరత్నాలు అంటారు. తోడిరాగంలో 'గతినీవని', భైరవిరాగంలో 'లలితేశ్రీ', మధ్యమావతిలో 'దేవి శ్రీతపస్తీర్థ', కాంభోజి రాగంలో 'మహిత ప్రవృద్ధ' కాంభోజి ఇవి లాల్గుడి పంచరత్నాలలోవే.

ఆ తరువాత షోలింగాపూర్ వెళ్ళారు. అక్కడ ఉన్న లక్ష్మీ నరసింహస్వామిపైన 'నరసింహనన్ను బ్రోవవే' అనే కీర్తన; 'కలుగునా' అనే కీర్తన రచించాడు.

త్యాగయ్య కేవలం కీర్తనలే కాకుండా 'ప్రహ్లాద భక్తి విజయం, 'నౌకా చరిత్రం', 'సీతారామ విజయం' అనే సంగీత నాటకాలు కూడా రచించాడు.

త్యాగయ్యతో కర్ణాటక సంగీతంలో గొప్ప మార్పువచ్చింది. త్యాగయ్య పుట్టేనరికి సంగీతం ఎలా ఉండేదో చూద్దాం. అప్పటికి జయదేవుడి అష్టపదులు, అన్నమయ్య, రామదాసు, పురందరదాసు మొదలైన వాగ్గేయకారుల కీర్తనలు ఉండేవి. గ్రామాలలో వీధినాటకాలు, యక్షగానాల ప్రదర్శనలు జరుగుతూ ఉండేవి. ఇంకా **108** తాళాలలోంచి కష్టమైన తాళాలను తీసుకొని రాగం, తానం, పల్లవులు పాడేవారు. పల్లవి పాడడంలో పోటీలు కూడా జరిగేవి. కీర్తనల్ని, భజన గోష్ఠులలో అంతా కలిసి పాడుకొంటూ ఉండేవారు.

త్యాగయ్య కీర్తన స్వరూపాన్ని మార్చి దానిని కృతిగా రూపొందించాడు. కృతికి, కీర్తనకి ఉన్న తేడా మనం ముందే తెలుసుకొన్నాం కదా! కీర్తనలో సాహిత్యానికి ఎక్కువ ప్రాధాన్యత ఉంటుంది. కృతిలో అలాకాదు. సంగీతానికే ఎక్కువ ప్రాధాన్యత. సంగతులు కూడా ఉంటాయి. ఇలాంటి ఈ కృతులు కేవలం భజనలో పాడుకోవడానికే కాకుండా కచేరీ చేసేందుకు అవకాశం కల్పించాయి. అంతే కృతిలో తమ సంగీత పాండిత్యాన్ని ప్రదర్శించేందుకు వీలుంది. త్యాగయ్య **3,600** దాకా కృతులు రచించాడంటారు. కాని మనకు **600** దాకా దొరికాయి. **72**

మేళకర్త రాగాల్లోనూ కృతులు రాశాడు. కొన్ని అపురూప రాగాలలో కూడా కృతులు రాశాడు. అపురూప రాగాలు అంటే సంగీత గ్రంథాలలో ఎక్కడో మారుమూల ఉన్నరాగాలు. మనకి దొరికిన త్యాగయ్య కృతుల్లో 200 రాగాలు ఉపయోగించాడు. ఇన్ని రాగాలు వాడిన వాగ్గేయకారుడు త్యాగయ్య ఒక్కడే. మనం నాట, గౌళ, వరాళి, ఆరభి, శ్రీరాగాలని ఘనరాగాలంటారని ముందు చెప్పుకొన్నాం. ఈ ఘనరాగాలు ఐదింటిలోను త్యాగయ్య కీర్తనలు రాశాడు. వీటిని ఘనరాగ పంచరత్నాలు అంటారు. త్యాగయ్య జయంతికీ, వర్ధంతికీ ఈ పంచరత్నాలు తప్పకుండా పాడతారు.

ఘనరాగ పంచరత్నాలు :

(1) 'జగదానంద కారకా' నాటరాగం - ఆదితాళం
(2) 'దుడుకుగల నన్నే దొర కొడుకు బ్రోచురా' 'గౌళ' - ఆదితాళం
(3) 'సాధించెనే ఓమనసా ఆరభి రాగం ఆదితాళం
(4) 'కనకన రుచిరా' - వరాళి రాగం ఆదితాళం
(5) 'ఎందరో మహానుభావులు' శ్రీరాగం ఆదితాళం

శంకరాభరణం, తోడి, కల్యాణి, భైరవి లాంటి ప్రసిద్ధ రాగాలలో త్యాగయ్య కృతులు 30 దాకా దొరుకుతాయి. ధన్యాసి, సావేరి, అసావేరి, రీతిగౌళ, దర్బారు, కేదారగౌళ, ఆరభి, అఠాణా, దేవగాంధారి, బిలహరి, బేగడ రాగాలలో 10 నుండి 20 కీర్తనలు కనిపిస్తాయి. నాయకి, సారంగ, శహన, హుస్సేని, జయమనోహరి, శ్రీరంజని, నీలాంబరి, బలహంస, యదుకుల కాంభోజి రాగాల్లో 5, 6 కృతులు రాశాడు త్యాగయ్య.

త్యాగయ్య, తన కృతుల్లో సమాజంలో జరిగే చెడును

విమర్శిస్తాడు. కొన్నింటిలో, భగవంతుణ్ని చేరేందుకు మనం ఎలా జీవించాలో తెలుపుతాడు. భగవంతుణ్ని ఎలా పూజించాలో చెబుతాడు. సంగీతం యొక్క గొప్పదనాన్ని పొగుడుతూ కొన్ని కీర్తనలు రాశాడు. రామాయణంలో ఉన్న వివిధ ఘట్టాలు త్యాగయ్య కృతుల్లో కనిపిస్తాయి. కొన్ని కృతుల్లో తనను బ్రోవమని రాముడిని వేడుకొంటాడు. కొన్ని కీర్తనల్లో తనలో ఉన్న లోపాలకు బాధపడుతూ, ఆ లోపాల్ని, తను చేసిన పాపాల్ని క్షమించి, తనని రక్షించమని రాముణ్ని వేడుకొంటాడు. ఇలా త్యాగయ్య కీర్తనల్లో ఎన్నెన్నో భావాలు ఉంటాయి. తన కీర్తనల్లో త్యాగయ్య తన పేరునే ముద్రగా వాడాడు.

త్యాగయ్యకు ఎందరోశిష్యులు ఉండేవారని ముందుచెప్పుకొన్నాం. శిష్యులు త్యాగయ్య కీర్తనల్ని దేశంనలుమూలలా ప్రచారంచేశారు. వారితరం అయ్యాక మళ్ళీ త్యాగయ్య శిష్యులకి శిష్యులు, ఇలా ఒకతరం నుంచి మరోతరానికి కృతులు అందించబడ్డాయి. విదేశాలలోకూడా ఈనాడు ప్రచారంలో ఉన్నాయి. త్యాగయ్య శిష్యులలో వీణ కుప్పయ్య, సుబ్బరాయ శాస్త్రి, మానాంబుచావడి వెంకటు సుబ్బయ్య, వాలాజీపేట వెంకటురమణ భాగవతార్, కృష్ణ భాగవతార్ వీళ్ళంతా త్యాగయ్యలాగే వాగ్గేయకారులయ్యారు. సభాపతి శివన్, తంజావూరి రామారావు, రామయ్యంగార్, కన్నయ్య, సోల్జరి సీతారామయ్య, గణేశయ్య ఇంకా ఎందరోగాయకులుగా ప్రఖ్యాతిపొందారు. పాట్టి జోస్యులు, అరవాముదయ్యంగార్ త్యాగయ్యదగ్గర మంత్రశాస్త్రం నేర్చుకొన్నారు.

త్యాగయ్యకు 80 ఏళ్ళు వచ్చాయి. క్రీ.శ. 1847వ సంవత్సరంలో (పరాభనామ సంవత్సరం పుష్యమాసం, శుద్ధ దశమిరోజున) శ్రీరాముడు త్యాగయ్యకు కనిపించి 'పదిపూటలలో

నిన్ను నాలో కలుపుకొంటానని' చెప్పాడు. ఈ విషయం ఆయన రాసిన శహన రాగంలో 'గిరిపై నెలకొన్న రాముని' అనే కీర్తనలో ఉంది. శిష్యులకీ, మిత్రులకీ త్యాగయ్య 'పదిరోజుల తరువాత అంటే పుష్యబహుళ పంచమికి ఒక అద్భుతం జరుగుతుంది. మీరంతా రండని' చెప్పాడు.

పుష్య బహుళ చతుర్థి వచ్చింది. త్యాగయ్య సన్యాసం స్వీకరించాడు. త్యాగయ్య 'నాదబ్రహ్మానంద స్వామి' అని పేరు పెట్టుకొన్నాడు. ఆ మరునాడు పుష్యబహుళ పంచమి. తిరువైయారులో భక్తులు, విద్వాంసులు, సామాన్యజనం అంతా త్యాగయ్య ఇంటికి చేరారు. అంతా పాడుతుండగా ఆరోజు ఉదయం పదకొండు గంటలకి త్యాగయ్య కపాలంలోంచి ఒక జ్యోతి పైకి లేచి అలా అలా వెళ్ళి మాయం అయిపోయింది. త్యాగయ్య సిద్ధిపొందాడు. శ్రీరాముడిలో ఐక్యం అయ్యాడు.

త్యాగయ్యను తిరువారూరులో, ఆయన గురువుగారి సమాధి ప్రక్కనే సమాధి చేశారు. బృందావనం కట్టారు. 1907 నుంచి ప్రతీ పుష్య బహుళ పంచమికి సంగీత విద్వాంసులు అంతా సమాధి దగ్గరకు వెళ్ళి అక్కడ త్యాగరాజ స్వామి కీర్తనలు పాడుతూ వస్తున్నారు. ప్రస్తుతం ప్రతీ పుష్య బహుళ పంచమినాడు ఎందరెందరో విద్వాంసులు వచ్చి, అక్కడ త్యాగయ్య ఆరాధనలో పాల్గొంటున్నారు. పుష్య బహుళ సాధారణంగా పంచమి జనవరి నెలలో వస్తుంది. టి.వి.లో త్యాగరాజ ఆరాధనా కార్యక్రమం ప్రత్యక్ష ప్రసారం కూడా ఈ మధ్య ఇస్తున్నారు. త్యాగయ్య సమాధిని వీలైతే తిరువైయ్యారు వెళ్ళి చూడండి. ఆరాధనోత్సవాలు టి.వి.లో వస్తాయి చూడండి.

# 8. ముత్తుస్వామి దీక్షితార్



ఓ ఎడ్లబండి 'ఎట్టయాపురం' అనే ఊరివైపు సాగిపోత
ఆ ఎడ్ల బండిలో ఓ మహానుభావుడు ఉన్నాడు. ఆయన గొ
వాగ్గేయకారుడు. ఆ బండి వెడుతున్న మార్గానికి ఇటు
పంటపొలాలు ఉన్నాయి. అవి పచ్చగా లేవు. ఎండిపో
నేలఅంతా బీటలు తీసి ఉంది. ఆ ప్రాంతంలో వాన లేక క

తాండవిస్తోంది. ఆ ప్రాంతం పరిస్థితిని ఆ వాగ్గేయకారుడు గమనించాడు. అంతే ఆనందామృత కర్షిణి అమృత వర్షిణి' అన్న కీర్తన అమృతవర్షిణి రాగంలో అప్పటికప్పుడే రచించి పాడడం మొదలు పెట్టాడు. కీర్తన పూర్తి అయ్యింది. అంతే వెంటనే ఆప్రాంతం అంతా మేఘాలతో నిండిపోయి, చాలా పెద్ద వర్షం కురిసింది. తన పాటతో వర్షంపడేలా చేసిన ఆ వాగ్గేయకారుడు ముత్తుస్వామి దీక్షితార్

దీక్షితార్ **1776** లో తిరువారూరులో పుట్టాడు. ఈయన తమిళ బ్రాహ్మణుడు. తండ్రిరామస్వామి దీక్షితార్. తల్లి సుబ్బమ్మ. రామస్వామి దీక్షితార్ కూడా వాగ్గేయకారుడే. 'హంసధ్వని' రాగాన్ని సృష్టించింది ఈయనే. కొన్ని వర్ణాలు కీర్తనలు కూడా రచించాడు. రామస్వామి దీక్షితులకు చాలాకాలం సంతానం లేదు. సంతానం కోసం వైదీశ్వరన్ కొవెల అనే ఊళ్ళో ఉన్న బాలంబికా దేవిని ప్రార్థించాడు. ఆదేవి అనుగ్రహం వల్ల ఒక కొడుకు పుట్టాడు. అతనికి ముత్తుస్వామి దీక్షితులు అనిపేరు పెట్టాడు. తరువాత రామస్వామి దీక్షితులకు చిన్నస్వామి, బాలస్వామి అనే ఇద్దరు కొడుకులు, బాలంబిక అనే కుమార్తె పుట్టారు.

ముత్తుస్వామి వేదం, సంస్కృతం, సంగీతం బాగా నేర్చుకొన్నాడు. పాడడం, వీణ వాయించడం బాగా నేర్చుకొన్నాడు. దీక్షితార్ చిన్నతనంలో ముత్తుకృష్ణ మొదలియార్ అనే జమీందారు రామస్వామి దీక్షితులు సంగీతం విని తన ఆస్థానంలో ఉండమన్నాడు. అందుకు, ఒప్పుకొని, రామస్వామి దీక్షితులు తిరువారూరునుంచి 'మణలికి' మకాం మార్చాడు.

ముత్తుకృష్ణమొదలియార్ కొంతకాలానికి చనిపోయాడు. ఆయన కొడుకు వెంకటకృష్ణ మొదలియార్ రామస్వామి దీక్షితార్‌ను ఆదరించాడు. ఆరోజుల్లో ఇంగ్లీషువాళ్ళు మనదేశంలోకి, వచ్చేశారు. మద్రాసులో జార్జికోటలో 'ఈస్టిండియాకంపెనీ' ప్రభుత్వం నడుపుతూ ఉండేది. వెంకటకృష్ణ మొదలియార్ ఇంగ్లీషువాళ్ళ దుబాసీ. అందుచేత మద్రాసు తరుచువెళ్ళేవాడు. ముత్తుస్వామిని, చిన్నస్వామిని కూడా తీసుకువెళ్ళేవాడు. అక్కడ పాశ్చాత్య సంగీతం విని, ఆ సంగీతం రహస్యాల్ని కూడా దీక్షితార్ అర్థం చేసుకొన్నాడు. తెలుగు డిక్షనరీ రాసిన 'బ్రౌన్' దొరతో కూడా పరిచయం ఏర్పడింది దీక్షితార్‌కి. ఆయన కోరికమీద కొన్ని ఇంగ్లీషు పాటలకి సంస్కృత సాహిత్యాన్ని కూర్చాడు దీక్షితార్. పాశ్చాత్య సంగీతంలో వాడే వైలెన్ దీక్షితార్‌ను ఆకర్షించింది. ముత్తుస్వామి దీక్షితార్ తమ్ముడు బాలస్వామి దీక్షితార్ వైలెన్ పైన కర్ణాటక సంగీతాన్ని వాయించడం మొదలు పెట్టాడు. ముత్తుస్వామి దీక్షితార్ వీణ వాయిస్తుంటే దానితో సమానంగా వైలెన్ వాయించేవాడు. ఈ విధంగా వైలెన్ మన కర్ణాటక సంగీతంలోకి వచ్చింది.

దీక్షితార్‌కు ఇద్దరు భార్యలు ఉండేవారు ఇద్దరు భార్యలున్నా యోగిలాగే బ్రతికాడు. ఒకరోజున చిదంబరనాథయోగి అనే ఆయన దీక్షితార్ ఇంటికి వచ్చాడు. ఆయన రామస్వామి ముత్తుస్వామి దీక్షితులకు గురువు. ఈయన దీక్షితార్‌ను తీసుకొని కాశీ వెళ్ళారు. కాశీలో ప్రతీరోజూ విశ్వేశ్వరుణ్ని పూజించుకోవడం, ధ్యానం చేయడం, సంగీత సాధన చేయడం ఇలా కాశీలో 5, 6 సంవత్సరాలు

గడిచాయి. ఒక రోజున గంగానదిలో స్నానం కోసం దీక్షితార్ దిగుతుండే కాళ్ళను ఏదో తగిలింది. అది ఏమిటని చూస్తే వీణ. ఆ వీణను గురువుగారికి చూపించాడు. గురువుగారు ఆశీర్వదించి, ఆ వీణను తీసుకొమన్నారు కొద్ది రోజులకే యోగి మరణించాడు. దీక్షితార్ తిరిగి తన ఊరుకి ప్రయాణం అయ్యాడు.

కాశీనుండి తిరిగి వస్తూ 'తిరుత్తని' అనే ఊరు చేరాడు అక్కడ దీక్షితార్‌కి ఇష్టమైన దేవుడు సుబ్రహ్మణ్యస్వామి ఉన్నాడు. ఆయన దర్శనం చేసుకొని 40 రోజులు స్వామికి శ్రద్ధగా పూజ చేశాడు.41వ రోజు ఒక బ్రాహ్మణుడు వచ్చి 'ముత్తుస్వామి నోరు తెరు' అన్నాడు. దీక్షితార్ నోరు తెరిచేసరికి ఆయన నోటిలో పటిక బెల్లం వేసి మాయమై పోయాడు. ఆ వచ్చింది. సుబ్రహ్మణేశ్వరస్వామే! అంతే దీక్షితార్‌కు అప్రయత్నంగా కవిత్వం వచ్చింది. 'మాయామాళవగౌళ' రాగంలో శ్రీనాదాధి గురుగుహో జయతిజయతి' అన్నకీర్తన రాశాడు. గుహుడు అంటే సుబ్రహ్మణ్య స్వామి. ఆ గుహుడుడే తన గురువు అని భావించి ఆయన మీద ఇంకాకీర్తనలు రాశాడు 'మానస గురు గుహురూపం భజరే' (ఆనంద భైరవిరాగం) 'శ్రీ గురుగుహ దాసోహం', 'శ్రీగురుణా'; గురుగుహాయ' ఇలా చాలాకీర్తనలు తిరుత్తనిలోరచించాడు. ఈకీర్తనలు ఆయన రాసేసరికి ఆయన వయసు 25 సంవత్సరాలు మాత్రమే.

తిరుత్తని నుంచి తిరుపతి వెళ్ళాడు. వెంకటేశ్వర స్వామిపైన 'శేషాచలనాయకం' అనే వరాళి రాగ కీర్తన రాశాడు. శ్రీకాళహస్తి వెళ్ళి 'శ్రీకాళహస్తీశ' అనే హుసేని రాగ కీర్తన అక్కడ రచించాడు.

ఆ తరువాత కంచివెళ్ళి, కంచిలో కామాక్షి దేవిపైన 'కంజదళాయ తాక్షి' (కమలామనోహరి) 'నీరజాక్షి కామాక్షి' (హిందోళరాగం) అప్పుడు రచించినవే. అలాగే ఏకామ్రేశ్వరునిపై భైరవి రాగంలో 'చింతయమాకంద' అనే కృతి, పూర్వీకల్యాణి రాగంలో 'ఏకామ్రనాథం భజేహం' అనే కృతి రచించాడు. కంచిలో వున్న కైలాస నాథస్వామి పైన 'కైలాస నాథం' (వేగ వాహిని రాగం), కాంభోజి రాగంలో 'కైలాస నాథేనా' అనే కీర్తన రచించాడు.

కంచిలో ఉపనిషద్బ్రహ్మేంద్ర సరస్వతి ఉండేవారని మనం ముందు చెప్పుకున్నాం. ఆయన 'రామాష్టపది' అని జయదేవుడి గీత గోవిందంలాంటిది రచించాడు. ఆ రామాష్టపదికి దీక్షితార్ స్వరాల్ని కూర్చాడు. కంచిలో నాలుగు సంవత్సరాలు ఉన్నాడు. అక్కడనుంచి తిరువన్నామలై చేరాడు. అక్కడ ఉన్న ఈశ్వరుడి పేరు అరుణాచలేశ్వరుడు. ఆయన పైన 'అరుణాచల నాథం స్మరామి' అనే కీర్తన రాసి, గానం చేశాడు. అక్కడనుంచి చిదంబరం వెళ్ళాడు. అక్కడ శివుడిపేరు నటరాజస్వామి. ఆయన పైన చాలా కృతులు రాశాడు దీక్షితార్. కేదారరాగంలో 'ఆనందనట ప్రకాశం' అన్న కీర్తన బాగా ప్రచారంలో ఉంది. అక్కడ నుంచి వైదీశ్వరకోవెల్ వెళ్ళాడు. అక్కడ ఉన్న దేవతలపైన కీర్తనలురచించాడు. అక్కడ నుంచి మయూరం అనే ఊరువెళ్ళి అక్కడ ఉన్న మయూరనాథస్వామి పైన ఎన్నో కీర్తనలు రాశాడు. తిరిగి తిరువారూరు చేరాడు.

తిరువారూరులో త్యాగరాజేశ్వరుడి గుడి ఉంది. ఆ

త్యాగరాజేశ్వరుడిపైన ఎన్నో కీర్తనలు రాశాడు. తిరువారూరులో ఉన్న 'కమలాంబికా' అనే అమ్మవారిపైన నవావరణ కీర్తనలు అనే 11 కీర్తనలు రాశాడు. తిరువారూరులోనే ఉన్న త్యాగరాజస్వామి ఆలయంలో 16 రకాల గణపతి విగ్రహాలు ఉన్నాయి. ఆ పదహారు రకాల గణపతి విగ్రహాలపై 16 కీర్తనలు రాశాడు. తిరువారూరు దగ్గర ఉన్న కీవళూరులో 'అక్షయలింగ స్వామి' అనే ఈశ్వరుడి గుడి ఉంది. ఆయనపైన శంకరాభరణ రాగంలో 'అక్షయలింగవిభో' అనే కీర్తన రాశాడు.

తొమ్మిది గ్రహాలపైన కీర్తనలు రాశాడు. వాటినే నవగ్రహకీర్తనలు అంటారు.

దీక్షితార్ ముద్ర 'గురుగుహ'. దీక్షితార్ ప్రతీకీర్తనలోనూ, ఆ కీర్తన ఏ రాగంలో ఉందో ఆ రాగం పేరుకూడా వస్తుంది. ఉదాహరణకి హంసధ్వని రాగంలో 'వాతాపిగణపతింభజే' కీర్తన చివరిలో 'హంసధ్వని భూషిత హేరంభం' అని హంసధ్వని రాగం పేరు కూడా వస్తుంది. దీక్షితార్ కీర్తనలన్నీ ఎక్కువగా సంస్కృతంలో ఉన్నాయి. కొన్ని తెలుగులోను, కొన్ని తమిళంలోను ఉన్నాయి.

ఇంకా మధుర మీనాక్షిపైన రామేశ్వరంలో సుందరాజస్వామిపైన, శబరిమలైలో ఉన్న అయ్యప్పపైన, గురువాయూరులో ఉన్న కృష్ణుడిపైన కీర్తనలు రాశాడు. 1835లో ఎట్టయాపురంలో మరణించాడు దీక్షితార్.



# 9 శ్యామశాస్త్రి



శ్యామశాస్త్రి పూర్వీకుల ప్రకాశం జిల్లా కంభంలో ఉండేవారు. తమిళనాడుకి వలసపోయారు. శ్యామశాస్త్రి 26 ఏప్రియల్ 1762లో తిరువారూరులో పుట్టాడు. తండ్రి విశ్వనాధయ్యర్. 'బంగారు కామాక్షిదేవి' అనే దేవత విగ్రహం తిరువారూరులో త్యాగరాజేశ్వరుని గుడిలో ఉండేది. ఆ విగ్రహానికి శ్యామశాస్త్రి తండ్రి అర్చకుడు.

కొంతకాలం తరువాత ఈ విగ్రహం తంజావూరు చేరింది. ఆ విగ్రహంతోపాటు విగ్రహానికి పూజారి అయిన విశ్వనాధయ్యర్ కుటుంబం కూడా తంజావూరు చేరింది.

శ్యామశాస్త్రి అసలు పేరు 'వేంకట సుబ్రహ్మణ్యం' అయితే తల్లితండ్రులు ముద్దుగా శ్యామకృష్ణాఅని పిలచేవారు. 'శ్యామశాస్త్రి' అన్న పేరుతోనే ప్రఖ్యాతి గాంచాడు. 'శ్యామకృష్ణ' అన్న పేరును తనకీర్తనల్లో ముద్రగా వాడాడు.

చిన్నతనంలోనే శ్యామశాస్త్రి సంస్కృతం, తెలుగు, తమిళం భాషల్లో పాండిత్యం సంపాదించుకొన్నాడు. తనమేనమామ దగ్గర సంగీతం నేర్చుకొన్నాడు. చక్కగా పాడేవాడు.

ఒకరోజు సంగీత స్వామి అనే సన్యాసి శ్యామశాస్త్రి ఇంటికి వచ్చాడు. ఈ సన్యాసికి సంగీతం బాగావచ్చు. శ్యామశాస్త్రిని తన శిష్యుడిగాస్వీకరించి, సంగీత రహస్యాలు నేర్పాడు. ఆకాలంలోనే పచ్చి మిరియం ఆదెప్పయ్య అనే సంగీత విద్వాంసుడు ఉండేవాడు. శ్యామశాస్త్రిని, సంగీతస్వామి ఈ అదెప్పయ్యగానం రోజూ వినమని కోరాడు. భైరవి రాగంలో 'విరబోణి' అన్నవర్ణాన్ని అదెప్పయ్య రచించాడు. ఇది బాగా ప్రచారంలో ఉంది. శ్యామశాస్త్రి అదెప్పయ్య గానం వింటూండేవాడు. తండ్రి మరణించాక బంగారు కామక్షీ దేవికి పూజారి అయ్యాడు. భక్తితో ఆదేవిని పూజించుకొంటూ ఉండేవాడు. కామాక్షీదేవి ఆయనతో మాట్లాడేది. కామాక్షీదేవిని భక్తితో పూజిస్తున్న సమయంలో ఎన్నో కృతులు రచించేవాడు. శ్యామశాస్త్రి, కృతులేకాకుండా కొన్ని వర్ణాలు, స్వరజతులుకూడా రచించాడు.

శ్యామశాస్త్రికి ఆనందభైరవి రాగం చాలా ఇష్టం. ఆరాగంలో చాలా కీర్తనలు రాశాడు. తాళాల్లో మిశ్రచాపు అంటే చాలా ఇష్టం.

శ్యామశాస్త్రిని 'సంగీత సమ్రాట్టు' అని పిలచేవారు శ్యామశాస్త్రికి శిష్యులు తక్కువమంది ఉండేవారు. సుమారు 300 కీర్తనల్ని శ్యామశాస్త్రి రచించాడని చెబుతారు. కానీ మనకు దొరికినవి చాలా తక్కువే.

శ్యామశాస్త్రి మధురలో ఉన్న 'మీనాక్షి దేవిపైన తొమ్మిది కృతులు రచించాడు. అందులో ఏడు బాగా ప్రచారంలో ఉన్నాయి. అవి

1. సరోజదళనేత్రి - శంకరాభరణరాగం - ఆదితాళం
2. దేవి మీననేత్రి - శంకరాభరణరాగం - ఆదితాళం
3. మరివేరెగతి - ఆనందభైరవిరాగం - చాపుతాళం
4. నన్ను బ్రోవులలితా - లలిత - చాపుతాళం
5. మాయమ్మ - ఆహిరి - ఆదితాళం
6. దేవి నీదు పదసారస - కాంభోజి
7. మీన లోచన బ్రోవ - ధన్యాసి

శ్యామశాస్త్రి మామూలుగా ప్రసిద్ధరాగాలైన కల్యాణి, శంకరాభరణం, తోడి, మధ్యమావతి లాంటి రాగాలే కాకుండా, చింతామణి, మాంజి, కలగడ లాంటి అపురూప రాగాలలో కూడా కీర్తనలు రచించాడు. ఎక్కువ కృతులు తెలుగులోను, కొన్ని సంస్కృతంలోను, మరికొన్ని తమిళంలోను ఉన్నాయి. తాళం గురించిరాసిన గ్రంథం ఒకటి కూడా మనకు దొరికింది. లయ

విషయంలో శ్యామశాస్త్రి కీర్తనలు చాలాకష్టంగా ఉంటాయి. వీటిని సులువుగా నేర్చుకోలేము.

తంజావురు రాజ్యాన్ని 'శరభోజీ' పాలిస్తూండేవాడు. బొబ్బిలి కేశవయ్య అనే సంగీతవిద్వాంసుడు తంజావూరువచ్చి అప్పుడు విద్వాంసులను సంగీతంలో తనతో పోటీ చేయమన్నాడు. అక్కడ విద్వాంసులంతా అతనితో పోటీచేయడానికి భయపడ్డారు. శ్యామశాస్త్రి దగ్గరకు వెళ్ళి, కేశవయ్యతో పోటీచేయమని కోరారు. శ్యామశాస్త్రి అందుకు ఒప్పుకొన్నాడు. కామాక్షీదేవి దగ్గరకు వెళ్లి 'చింతామణి' రాగంలో దేవిబ్రోవసమయమిదే' అనే కీర్తన రచించి పాడాడు. ఆ తరువాత కేశవయ్యతో పోటీకి దిగాడు. కేశవయ్య 'సింహనందన' అనే ఒక తాళంలో పల్లవి పాడి, శ్యామశాస్త్రిని తిరిగి పాడమన్నాడు. శ్యామశాస్త్రి ఆ పల్లవిని అవలీలగా పాడాడు. శ్యామశాస్త్రి 'శరభనందన' అనే చాలాకష్టమైన తాళంలో పల్లవి పాడి, తిరిగి కేశవయ్యను పాడమన్నాడు. కేశవయ్య ఆ పల్లవిని పాడలేక ఓడిపోయాడు. శ్యామశాస్త్రికి రాజు ఎన్నెన్నో బహుమతులు ఇచ్చి గౌరవించాడు.

అప్పుకుట్టి అనే సంగీత విద్వాంసుడు కూడా శ్యామశాస్త్రితో పోటీచేసి ఓడిపోయాడు. శ్యామశాస్త్రికి జ్యోతిష్యంలోకూడా మంచి పాండిత్యం ఉండేది. ముఖం చూసి భవిష్యత్తు చెప్పేవాడు.

శ్యామశాస్త్రికి చాలా అనుకూలవతియైన భార్య ఉండేది. ఆమె మరణించిన రోజునే శ్యామశాస్త్రి కూడా సిద్ధిపొందాడు. ఆయన మరణించినది ఫిబ్రవరి **6, 1827** సంవత్సరం.

శ్యామశాస్త్రికి పంజుశాస్త్రి, సుబ్బరాయశాస్త్రి అని ఇద్దరు

కొడుకులు ఉండేవారు. సుబ్బరాయ శాస్త్రి తండ్రిదగ్గర సంగీతం నేర్చుకొని, వాగ్గేయకారుడయ్యాడు. శ్యామశాస్త్రి శిష్యులలో పొరుంబూర్ కృష్ణయ్యర్ మంచి గాయకుడు. అలసూరు కృష్ణయ్యర్ మైసూరు ఆస్థాన విద్వాంసుడిగా ఉండేవాడు. దాసరి అనే నాగస్వర విద్వాంసుడు కూడా శ్యామ శాస్త్రి శిష్యుడే.

## కర్ణాటక సంగీత త్రిమూర్తులు

మనం ఇతవరకు చెప్పుకొన్న త్యాగరాజు, ముత్తుస్వామి దీక్షితులు, శ్యామశాస్త్రి ఈ ముగ్గురు వాగ్గేయకారుల వల్ల మన కర్ణాటక సంగీతం ఎంతో అభివృద్ధి చెందింది. ఈ ముగ్గురూ కూడా సమకాలికులు కావడం, ముగ్గురూ తిరువారూరులోనే పుట్టడం కూడా విశేషం. ఈ ముగ్గురు వాగ్గేయకారుల్ని కలిపి, కర్ణాటక సంగీత త్రిమూర్తులు లేదా కర్ణాటక సంగీతరత్నత్రయం అని పిలుస్తారు.

శ్యామశాస్త్రికి త్యాగయ్యకు బాగాస్నేహం ఉండేది. వీళ్లిద్దరూ అప్పుడప్పుడు కలుసుకొంటూ ఉండేవారు. సంగీతం గురించి చర్చించుకొంటూ ఉండేవారు. దీక్షితార్ ఎప్పుడూ తీర్థయాత్రలు చేస్తూండడం వల్ల ఆయన మిగిలిన ఇద్దరిని ఎక్కువగా కలుసుకోనేవారు కారని అంటారు.

ఈ ముగ్గురు వాగ్గేయకారులు చిరస్మరణీయులు.

# 10. స్వాతి తిరునాళ్



శ్రీకృష్ణదేవరాయలు రాజైనా కూడా గ్రంథాలు ఎలా రాశాడో, అలాగే రాజైనా కూడా ఎన్నో సంగీత రచనల్ని చేశాడు 'స్వాతి తిరునాళ్'. చాలా భాషల్లో కూడా రచనలు చేశాడు. 1813 ఏప్రియల్ 16న జన్మించాడు. స్వాతి తిరునాళ్‌కి తల్లితండ్రులు పెట్టిన పేరు రామశర్మ కాని 'స్వాతి' నక్షత్రంలో పుట్టడంవల్ల

ఈయన స్వాతితిరునాళ్ అనేపేరుతో ప్రసిద్ధి చెందాడు. లక్ష్మీబాయి, రాజరాజ వర్మ స్వాతి తిరునాళ్ తల్లితండ్రులు. చిన్నతనంలో తల్లి, తండ్రి మరణించారు. పినతల్లి పార్వతీబాయి పెంచింది. స్వాతి తిరునాళ్ చిన్నతనంలోనే సంస్కృతం, మళయాళం, కన్నడ, తెలుగు, మరాఠీ భాషలు, కర్ణాటక హిందుస్థానీ సంగీతాలు కూడా నేర్చుకొన్నాడు. 16వ ఏటనుంచి కేరళ రాజ్యాన్ని ఏలడం ప్రారంభించాడు. ఎందరో సంగీత విద్వాంసుల్ని, భాషాపండితుల్ని కవుల్ని తన ఆస్థాన విద్వాంసులుగా నియమించాడు. అల్లావుద్దీన్ అనే హిందుస్థానీ సంగీత విద్వాంసుడు, వడివేలు, పొన్నయ్యాపిళ్ళె, చిన్నయ్యా పిళ్ళె, వేంకటాద్రి భాగవతార్, పరమేశ్వర భాగవతార్ లాంటి కర్ణాటక సంగీత విద్వాంసులు ఈయన ఆస్థానంలో ఉండేవారు.

స్వాతి తిరునాళ్ చాలామంది దేవుళ్లపైన, దేవతలపైన కృతులు రచించాడు. స్వరజతులు, వర్ణాలు, పద వర్ణాలు, పదాలు, జావళీలు, తిల్లానాలు, కూడా రచించాడు. అలాగే హిందుస్థానీ సంగీతానికి సంబంధించిన సంగీత రచనల్ని కూడా చేశాడు. హిందుస్థానీ సంగీతరచనలు చేసిన మొదటి దక్షిణ భారత వాగ్గేయకారుడు స్వాతి తిరునాళ్. సంగీత రచనలే కాకుండా కుచేలోపాఖ్యానం, అజామీళోపాఖ్యానం, అనే హరికథలు కూడా రచించాడు.

స్వాతి తిరునాళ్ తన సంగీతరచనల్లో చాలా ముద్రలు వాడాడు. 'అబ్జనాభ', 'అంభోరుహనాభ', 'సరసిజనాభ',

'పంకజనాభ', 'జలరుహనాభ' అనే చాలా రకాల ముద్రలు వాడాడు. 'పద్మనాభ' అన్న ముద్ర ఎక్కువగా వాడాడు.

చారుకేసి రాగంలో 'కృపయాపాలశౌరే' కానడ రాగంలో 'మామవసదాజననీ' కుంతలవరాళిలో 'భోగీంద్ర శాయినం' అనే కృతులు కచేరీలలో తరుచు వినపడతాయి. ఇవి స్వాతి తిరునాళ్ రచించినవే. అలాగే 'గీతదునికుతకతోం' అనే తిల్లానా 'ధనశ్రీ' రాగంలోది కూడా ఈయన రచనే. ఇది కూడా బాగా ప్రచారంలోఉంది. అలాగే తరుచు నృత్యప్రదర్శనలో వినిపించే కీర్తన ఒకటి ఉంది. అది 'భావయామి రఘు రామం' అన్నది. ఇది రాగమాలిక. అంటే చాలా రాగాలలో ఉంది. పల్లవి ఒకరాగం, చరణాలు ఒకొక్కటి ఒకొక్కరాగంలో ఉంటాయి. దీనినే రాగమాలిక అంటాం. ఈ 'భావయామి రఘురామం' కీర్తనలో మరో విశేషం కూడా ఉంది. రామాయణ కథ అంతా ఈ కీర్తనలో వస్తుంది. నృత్యప్రదర్శనలలో ఈ కీర్తన అర్థానికి తగినట్లు నృత్యం చేస్తారు.

స్వాతితిరునాళ్‌కు త్యాగయ్య గానం వినాలని ఉండేది. త్యాగయ్యను తీసుకొని రమ్మని తన అస్థానంలో ఉన్న వడివేలు అనే సంగీత విద్వాంసుణ్ని పంపాడు కాని, త్యాగయ్య రావడానికి ఇష్టపడలేదు. స్వాతి తిరునాళ్ **1846** డిసెంబరు **25**న మరణించాడు. మరణించేటప్పటికి ఆయనవయస్సు కేవలం **33** సంవత్సరాలే. స్వామితిరునాళ్ అంత చిన్నవయస్సులో మరణించడం మన సంగీతరంగానికి తీరనిలోటు.

# 11. వీణ కుప్పయ్యర్

త్యాగయ్య శిష్యుడు వీణ కుప్పయ్యర్ త్యాగయ్య లాగే వాగ్గేయకారుడు. 1798 - 1860 మధ్య జీవించాడు. మద్రాసు దగ్గర ఉన్న తిరువొత్తియూరులో కుప్పయ్యర్ పుట్టాడు. ఈయన తండ్రి 'సాంబమూర్తి' ఆయన చాలా గొప్పవీణ విద్వాంసుడు

కుప్పయ్యర్ తమిళ బ్రాహ్మణుడు. చిన్నతనంలోనే తెలుగు, సంస్కృతం బాగా నేర్చుకొన్నాడు. త్యాగయ్య దగ్గర శిష్యుడిగా చేరడానికి ముందే సంగీతం తండ్రి దగ్గర బాగానేర్చుకొన్నాడు. వీణ నేర్చుకొన్నాడు. ఫిడేలు (వైలెన్) బాగా వాయించేవాడు. అలాగే బాగా పాడేవారు. ఈయనకు 'గానచక్రవర్తి' అనేబిరుదు ఉండేది. కుప్పయ్యకు ' నారాయణగౌళ' రాగం అంటే చాలా ఇష్టం. ఈ రాగం ఆరోహణ, అవరోహణలోనూ వక్రం. దీనిని పాడడం చాలా కష్టం. ఈ రాగాన్ని చాలా గొప్పగా పాడేవాడు కుప్పయ్యర్. అలాగే రీతిగౌళ రాగం కూడా అద్భుతంగా పాడేవాడు. నారాయణ గౌళ, రీతిగౌళ రాగాలలో వర్ణాల్ని కూడా రచించాడు.

కుప్పయ్యర్, వేణుగోపాలస్వామి భక్తుడు. అందుకనే తన కీర్తనల్లో 'గోపాలదాస' అనే ముద్రను వాడేడు. త్యాగయ్య, కుప్పయ్య ఇంటికి వచ్చి కొన్నిరోజులు ఉండి కొన్ని కీర్తనలు కూడా రచించాడు.

1856 లో కుప్పయ్యర్ మైసూరువెళ్ళాడు. అక్కడ

చాముండేశ్వరీ దేవిపైన బేగడరాగంలో 'ఇంతవరాకేలనమ్మ' అనే కృతి రాశాడు.

కుప్పయ్యర్ తిరువొత్తియూర్ వదలి మద్రాసులోనే ఉండేవాడు. కుప్పయ్యర్ కొడుకే తిరుపత్తియూర్ త్యాగయ్యర్. ఈయన కృషివల్ల మద్రాసులో సంగీత సభలు చాలా స్థాపించబడ్డాయి.

కుప్పయ్యర్ వర్ణాలు, కృతులు, తిల్లానాలు కూడా రచించాడు. వీరి రచనలు తెలుగులోనే ఉన్నాయి. కొన్ని సంస్కృతంలో కూడా ఉన్నాయి అంటారు. వర్ణాల్ని రచించడంలో కుప్పయ్యర్ చాలా నిపుణుడు. ఈయన రచించిన వర్ణాలు విని త్యాగయ్య ఎంతగానో మెచ్చుకొన్నాడు. ఈయన కృతులు త్యాగయ్య కృతుల్ని పోలి ఉంటాయి.

కుప్పయ్య వెంకటేశ్వరస్వామి పైన ఐదు కీర్తనలు శ్రీకాళహస్తిలో ఉన్న ఈశ్వరుడిపైన ఐదు, తిరువత్తియూర్‌లో త్రిపురసుందరీ అమ్మవారిపైన ఎనిమిది కృతులు రచించాడు. పాశ్చాత్య సంగీతంతో కూడా కుప్పయ్యర్‌కు పరిచయం వుంది. ఈయన రచించిన బిలహరి రాగవర్ణంలో కొంచెం పాశ్చాత్య సంగీత పోకడలు కనిపిస్తాయి.

1900 సంవత్సరంలో కుప్పయ్యర్ కొడుకు తిరువొత్తియూర్ త్యాగయ్యర్, తన తండ్రి రచనలన్నింటినీ ముద్రించాడు. కుప్పయ్యర్‌కు చాలామంది శిష్యులు ఉండేవారు. పల్లవి సీతారామయ్య, కొత్తవాసన్ వెంకట్రామయ్య, ఫిడేలు పొన్నుస్వామి మొదలైన వాళ్ళు ఈయన శిష్యులే.

## 12. పట్నం సుబ్రహ్మణ్యయ్యర్

త్యాగరాజ స్వామికి ప్రశిష్యుడు పట్నం సుబ్రహ్మణ్యయ్యర్. ప్రశిష్యుడు అంటే త్యాగరాజు శిష్యుడికి శిష్యుడు. 1845లో తంజావూరులో పుట్టాడు. తిరువైయార్‌లో ఉండేవాడు. తనమేన మామ మేలట్టూర్ గణపతి శాస్త్రి దగ్గర సంగీతం నేర్చుకొన్నాడు. ఆ తరువాత, త్యాగరాజస్వామి శిష్యుడైన మానాంబు చావడి వెంకట సుబ్బయ్యర్ దగ్గర సంగీతం నేర్చుకొన్నాడు.

సుమారు వంద సంగీత రచనలు చేశాడు సుబ్రహ్మణ్యయ్యర్. కృతులు, జావళీలు, తిల్లానాలు రాశాడు. తెలుగు, సంస్కృతం, తమిళం లోకూడా రచనలు చేసాడు. ఈయన బేగడ రాగాన్ని బాగా పాడేవాడు. అందుకే బేగడ సుబ్రహ్మణ్యయ్యర్ అని కూడా ఈయన్ని పిలుస్తూండేవారు. ఈయన ముద్ర 'వెంకటేశ'. ఈయన కృతులు త్యాగయ్య కృతుల్ని పోలి ఉంటాయి. నారాయణి, సింహవాహిని, కన్నడ, మందారి లాంటి అపురూపరాగాలలో కూడా కీర్తనల్ని రచించాడు. రాగం, తానం, పల్లవి చాలా గొప్పగా పాడేవాడు. ఈయన తన కచేరీల్లో సగం సమయం దీనికే కేటాయించేవాడు. పూర్ణచంద్రిక, ఖరహరప్రియ, కన్నడగౌళ, శుద్ధసావేరి, బేగడ ఈయనకు ఇష్టమైన రాగాలు. ఈయన కచేరీ చేసేటప్పుడు ఎక్కువగా త్యాగరాజకృతులే పాడేవాడు. ఎవరైనా ఆయన రచనల్ని పాడమంటే అప్పుడు ఒకటి, రెండు తన రచనల్ని కచేరీ చివరలో పాడేవాడు. తను రాసిన కీర్తనల్ని

ముందు విద్వాంసులకి పాడి వినిపించేవాడు. వాళ్ళు ఆ రచనలు బాగున్నాయని మెచ్చుకొంటేనే తన శిష్యులకి నేర్పేవాడు. ఈయనకు చాలామంది శిష్యులు ఉండేవారు. వాళ్ళలో రామ్నాడ్ శ్రీనివాసయ్యంగార్, మైసూర్ వాసుదేవాచార్య, టైగర్ వరదాచారి చాలా ప్రఖ్యాతి గాంచిన వాగ్గేయకారులు.

పట్నం సుబ్రహ్మణ్యయ్యర్ 'కదనకుతూహలం' అన్న రాగాన్ని సృష్టించారు. అందులో 'రఘువంశ సుధాంబుధి చంద్రశ్రీ' అన్న కీర్తనని రాశారు. ఈ కీర్తన బాగా ప్రచారంలో ఉంది. **31-7-1902** లో సుబ్రహ్మణ్యయ్యర్ మరణించాడు.

## 13. సదాశివ బ్రహ్మేంద్ర

**17**వ శతాబ్దంలో ఉన్న వాగ్గేయకారుడు సదాశివ బ్రహ్మేంద్ర. ఈయన సన్యాసి. దిగంబరంగానే ఉండేవాడు. ఇల్లు ఉండేదికాదు. కావేరీ నదీ తీరాలలో తిరుగుతూ, ఏది దొరికితే అది తింటూండేవాడు. ఈయన తండ్రి మహాదేవ దీక్షితార్. సదాశివ బ్రహ్మేంద్ర కంచిలో ఉండే పరమశివేంద్రసరస్వతి శిష్యుడు. ఈయన ముద్ర 'పరమహంస'. చాలా కీర్తనల్ని సంస్కృతంలో రాశాడు. 'మానస సంచరరే బ్రహ్మణి' అన్న కీర్తన ఈయన రాసిందే. ఇది సామరాగంలో ఉంది. ఈయన శివమానస పూజ, ఆత్మ విద్యావిలాసమ్, బ్రహ్మసూత్ర ప్రవృత్తి అనే గ్రంథాలు రాశాడు. సంగీత కచేరీ చివరలో ఈయన కీర్తనలు పాడుతూంటారు. అప్పుడప్పుడు రేడియోలో ఉదయం వచ్చే భక్తిరంజని కార్యక్రమంలో

కూడా ఈయన కీర్తనలు వినిపిస్తాయి. 'బ్రూహిముకుందేతి' 'భజరేగోపాలం', 'స్మరవారం వారం' 'గాయతి వనమాలి', 'భజరేయదునాథం', 'పిబరే రామరసం', 'ప్రతివారం వారం', 'ఖేలతిమామా హృదయే' ఈ కీర్తనలు బాగా ప్రచారంలో ఉన్నాయి. **1714**లో కరూరుల్లో సిద్ధిపొందాడు సదాశివబ్రహ్మేంద్ర.

## 14. పల్లవి శేషయ్యర్

**1842-1909** ప్రాంతంలోవాడు పల్లవిశేషయ్యర్. త్యాగయ్య శిష్యపరంపరకు చెందినవాడు. తెలుగుబ్రాహ్మణుడు. పల్లవి పాడడంలో గొప్ప ప్రతిభకలవాడు. అందుకే ఈయనను (రాగం, తానం, పల్లవి) పల్లవి శేషయ్య అని పిలిచేవారు. ఈయన తండ్రి సుబ్బయ్యర్. ఈయన తనకీర్తనల్లో 'శేష' అనే ముద్రను వాడాడు. తిల్లానాలు, పదవర్ణాలు, కీర్తనలు రచించాడు. రాగభావంతో నిండి ఉంటాయి ఈయన రచనలు.

చిన్నతనంలోనే తండ్రినుంచి త్యాగరాజస్వామి కీర్తనలు నేర్చుకొన్నాడు. 'గౌళిపంతు' అనే రాగం ఉంది. ఇది చాలా కష్టమైన రాగం. దీనిని ఒకసారి మూడు గంటలసేపు పాడాడు. 'మల్లికావసంతం' 'శుద్ధ' అనే రాగాలలో కీర్తనలు రచించినది ఈయనే. 'భైరవి', 'పూర్ణషడ్జం', 'గౌరీమనోహరి', 'కేదారగౌళ', 'సామ', 'ఖమాస్', 'కేదారం', 'గరుడధ్వని', 'శుద్ధసావేరి', 'హిందుస్థానీ' 'బేహాగ్', 'శుభపంతువరాళి', 'కనకాంగి', 'మానవతి', 'తానరూపి', 'సేనాపతి', 'ధేనుక', 'నాటకప్రియ',

రాగభావంతో ఉంటాయి. ఈయన కృతులు కొన్ని త్యాగయ్య కృతుల్ని, కొన్ని ముత్తుస్వామి దీక్షితార్ కృతుల్ని, మరికొన్ని శ్యామశాస్త్రి కృతుల్ని పోలి ఉంటాయి. ఈయన కీర్తనల్లో 'జననీనిన్నువినా' (రీతిగౌళరాగం) 'నినువినాగతిగానజగాన' (కల్యాణిరాగం) ఇవి బాగా ప్రచారంలో ఉన్నాయి 1862లో మరణించాడు.

## 17. గోపాలకృష్ణ భారతి

1810 సంవత్సరంలో పుట్టిన గోపాలకృష్ణ భారతి వెయ్యికి పైగా కీర్తనలు రాశాడు. ఇవి తమిళ భాషలో ఉన్నాయి. 'నందనార్ చరిత్ర' అనే తమిళ సంగీత నాటకాన్ని రచించాడు. ఈయన ముద్ర 'గోపాలకృష్ణ' తంజావూరు జిల్లా ముడికొండన్‌లో పుట్టాడు. 1896లో మరణించాడు.

## 18. అరుణాచల కవిరాయర్

తిల్లైయాది అనే ఊళ్ళో 1711లో అరుణాచలకవిరాయర్ పుట్టాడు. తండ్రి నల్లతంబి 'రామనాటకం' అనే సంగీత నాటకాన్ని కవిరాయర్ రచించాడు. ఇందులో కీర్తనలు తమిళనాడులో ప్రతీఇంట వినిపిస్తూంటాయి.

## 19. పైడాల గురుమూర్తి శాస్త్రి

వెయ్యి గీతాలు, చాలా కీర్తనలు రచించినవాడు గురుమూర్తిశా స్త్రి. తెలుగు బ్రాహ్మణుడు. వెయ్యిగీతాలు గురుమూర్తి శాస్త్రి అని పేరుండేది. మదరాసులో ఉండేవాడు. 18వ శతాబ్దానికి చెందినవాడు. ఈయనగురువు వెంకటసుబ్బయ్య.

## 20. రామనాథపురం శ్రీనివాసయ్యంగార్

పట్నం సుబ్రహ్మణ్యాయ్యర్ శిష్యులు రామనాథపురం శ్రీనివాసయ్యంగార్. ఈయనకే పూచి అయ్యంగార్ అనే పేరు కూడా ఉంది. 16-8-1860లో పాపానకుళంలో పుట్టారు. చిన్నతనంనుంచీ సంగీతం అంటే ఎంతో ఇష్టం పట్నం సుబ్రహ్మణ్యాయ్యర్ దగ్గర సంగీతం నేర్చుకొని, పెద్దవిద్వాంసుల కచేరీలు వింటూండేవారు.

శ్రీనివాసయ్యంగార్ కచేరీలు అన్నీ అద్భుతంగా ఉండేవి. రామనాథపుర ఆస్థాన విద్వాంసులుగా ఉండేవారు. ఈయన ముద్ర 'శ్రీనివాస'. కృతులు, వర్ణాలు, జావళీలు, తిల్లానాలు కూడా రచించారు. మోహన, కానడ, పూర్వికల్యాణి, కేదారగౌళ, శుద్ధసావేరి, దేవమనోహరి, తోడి, ఆనందభైరవి, మధ్యమావతి,

బేహాగ్, ఖమాస్ వె దలైన రాగాలలో రచనలు చేశాడు. 'లక్ష్మీశత' అనే అపురూపమైన తాళంలో తిల్లానా రచించారు. ఈయన శిష్యులే శ్రీ అరియకుడి రామానుజయ్యంగార్.

ఒకసారి అరటి తొక్కపైన కాలువేసి జారిపడితే కాలు విరిగింది అయ్యంగార్‌కి. వైద్యులు వైద్యం చేయలేక పోయారు. అప్పుడు 'నరగున పాలింప' అనే కేదారగౌళరాగంలో కీర్తన రచించి, పాడేసరికి కాలు నయం అయ్యింది.

అయ్యంగార్ వంద దాకా రచనలు చేశారు. ఈయన వర్ణాలలో మోహనరాగంలో 'నిన్నుకోరి' కానడరాగంలో, 'నెరనమ్మితి నయ్యా' ఇవి బాగాప్రచారంలో ఉన్నాయి. 'ఫరజ్', తోడి, పూర్ణచంద్రిక రాగాలలో అయ్యంగారి తిల్లానాలు కచేరీలో తరుచు వినపడతాయి. శుద్ధసావేరి రాగంలో 'సామజవరదా' పూర్వికల్యాణిలో 'పరమపావనరామ', కేదారగౌళలో 'నరగున పాలింప' దేవమనోహరిలో 'నీకేలనాయడ నిశ్చలము' బేగడలో 'అనుదినమును గావుమయ్యా' కీర్తనలు బాగా ప్రచారంలో ఉన్నాయి. బేహాగ్‌లో 'నిరుపమానసామినినా' సురటిరాగంలో 'వేగనీవు వాని రమ్మనవే' చాలా ప్రచారంలో ఉన్నాయి. 1919లో అయ్యంగార్ మరణించారు.



# 21. సుబ్బరామ దీక్షితులు

కర్ణాటక సంగీత త్రిమూర్తులలో ఒకడైన ముత్తుస్వామి దీక్షితార్ సోదరుడు బాలుస్వామి దీక్షితార్. ఈయన ఎట్టియాపురం సంస్థానంలో సంగీతవిద్వాంసుడిగా ఉండేవాడు. ఈ బాలు స్వామి దీక్షితార్ కూతురు కొడుకు సుబ్బరామదీక్షితార్. అంటే సుబ్బరామ దీక్షితార్ ముత్తుస్వామి దీక్షితార్‌కి మనుమడు అన్న మాట. ఆయన 1839లో పుట్టాడు. తల్లి తండ్రులు అన్నపూర్ణ, శివరామ. సుబ్బరామ దీక్షితుల్ని బాలుస్వామి దీక్షితార్ దత్తత తీసుకొన్నాడు. సంగీతం బాగా నేర్పాడు. ముఖ్యంగా వీణ వాయించడం నేర్పాడు. సుబ్బరామ దీక్షితులు తెలుగు, సంస్కృతం, సంగీతం బాగా నేర్చుకొన్నాడు. 'సంగీత సంప్రదాయ' ప్రదర్శిని' అనే గ్రంథం రాశాడు. ఇందులో ఈయన రచించిన వర్ణాలు, కీర్తనలు ఉన్నాయి. ఎట్టయాపురం రాజాస్థానంలో సుబ్బరామ దీక్షితులు కూడా ఆస్థాన విద్వాంసుడిగా ఉండేవాడు. సంగీత సంప్రదాయ ప్రదర్శినిలో ఎన్నో ముత్తుస్వామి దీక్షితార్‌కృతులు కూడా ఉన్నాయి. ఇవన్నీ స్వరంతో సహాఉన్నాయి. 'సంప్రదాయ ప్రదర్శిని'ని 1904లో మొదటి సారి ప్రచురించారు. 1906 లో సుబ్బరామ దీక్షితార్ మరణించాడు.

## 22. మహావైద్య నాథయ్యర్

**1844 - 1893** మధ్యకాలంలో వాడు మహావైద్యనాథయ్యర్. తంజావూరు దగ్గర ఒక చిన్న గ్రామంలో పుట్టారు. 'ఆనయ్య' అనే ఆయన దగ్గర సంగీతం బాగా నేర్చుకొన్నాడు. ఆ తరువాత త్యాగయ్య శిష్యుడైన మానాంబుచావడి వెంకట సుబ్బయ్య దగ్గర కూడా సంగీతాన్ని అభ్యసించాడు. వైద్యనాథయ్యర్ తండ్రి పంచనదయ్యర్ కూడా గొప్పగాయకుడు.

వైద్యనాథయ్యర్‌కు 'మహా' అన్నది బిరుదు. 'మహా' అంటే గొప్ప అని. చాలా పెద్ద విద్వాంసుల సమక్షంలో వైద్యనాథయ్యకు **12**వ ఏట ఈ బిరుదును ఇచ్చారు. ఏడవ ఏటనే 'రాగం, తానం, పల్లవి' పాడే నైపుణ్యాన్ని సంపాదించుకొన్నాడు వైద్యనాథయ్యర్.

మైసూరు, తిరునాన్కూరు, కొచ్చిన్ రాజుల దగ్గర కచేరీలు చేసి వాళ్ళ చేత ఎన్నెన్నో బహుమానాలు, సన్మానాలు అందుకొన్నాడు వైద్యనాథయ్యర్ 'వేణు' అనే విద్వాంసుణ్ని, 'సింహనందన' అనే తాళంలో పల్లవిపాడి ఓడించాడు. ఈ సింహనందన తాళంలో తిల్లానా కూడా రచించాడు. తమిళంలో చాలా కీర్తనలు రాసాడు. **72** మేళకర్త రాగాల మాలికను రచించాడు. **72** మేళకర్త రాగమాలిక అంటే ఏమిటో చూద్దాం. మేళకర్త రాగాలు **72** ఉన్నాయని చెప్పుకొన్నాం కదా! ఈ రచనలో **72** మేళకర్తరాగాలు అన్నీ వస్తాయి. అంటే ఒక్కొక్క చరణం ఒక్కొక్కరాగంలో ఉన్నాయి.

# 23. మైసూర్ వాసుదేవాచార్య



'బ్రోచేవారెవరురా' అన్న ఖమాస్ రాగకీర్తన అందరికీ బాగా పరిచయం ఉన్న కీర్తన, దీనిని రచించినది మైసూర్ వాసుదేవాచార్య. ఈయన మే 28, 1865 లో పుట్టాడు. తండ్రి సుబ్రహ్మణ్యాచార్య ఈయన మైసూరు రాజాస్థానంలో పురాణం చెప్పేవిద్వాంసుడు. వాసుదేవాచార్య తండ్రి చిన్న తనంలోనే మరణించాడు. వాసుదేవాచార్య తన తాత గోపాలాచార్య దగ్గర పెరిగాడు. 'వాసు' తాత గొప్ప సంస్కృత పండితుడు. 'వాసు' సంస్కృతం, సంగీతం చక్కగా నేర్చుకొన్నాడు. మొదట్లో సంగీతం వీణ పద్మనాభయ్య దగ్గర నేర్చుకొన్నాడు. ఆ తరువాత తిరువయ్యారు వచ్చి పట్నం సుబ్రహ్మణ్యయ్యర్ దగ్గర సంగీతం నేర్చుకొన్నాడు.

వాసుదేవాచార్యది మంచి గాత్రం, రాగం, తానం, పల్లవి, నెరవల్ చాలా గొప్పగా పాడేవాడు. ప్రతీ శుక్రవారం తన ఇంటిలో భజన ఏర్పాటు చేసేవారు. 1920 ప్రాంతంలో ఒకసారి శహన రాగాన్ని అద్భుతంగా గంటన్నర సేపు గానం చేశాడు. శిష్యులకు ఎంతో సహనంతో, శ్రద్ధతో విద్యచెప్పేవాడు. శిష్యుల్ని స్నేహితుల్లా చూసేవాడు.

వాసుదేవాచార్య రెండు వందల రచనలు చేశాడు. ఆయన రచనల్ని ఆయనే ప్రచురించారు. వర్ణాల్ని, కీర్తనల్ని, తిల్లానాలు కూడా రాశారు. ఈయన రచనల్లో వంద రాగాలు వాడారు. 'మేఘరంజని' లాంటి అపురూప రాగాలలో కూడా ఈయన రచనలు చేశాడు. కొన్ని రచనలు తెలుగులోను, కొన్ని సంస్కృతంలోను చేశాడు. 'అభినవత్యాగరాజు' అని అంతా పొగిడేవారు.

వాసుదేవాచార్యకు 'సంగీతశాస్త్రరత్న' 'సంగీత సాహిత్య విద్వాన్ మణి' 'సంగీతకళాకోవిద' లాంటి బిరుదులు ఉండేవి. 1935లో మద్రాస్ మ్యూజిక్ అకాడమీ 'సంగీతకళానిధి' బిరుదును ఇచ్చి సత్కరించింది. 1959లో భారత ప్రభుత్వం 'పద్మభూషణ' అవార్డును ఇచ్చింది. మే 17, 1961లో వాసుదేవాచార్య మరణించాడు.

# 24. హరికేశ నల్లూర్ ముత్తయ్యా భాగవతార్



15-11-1877 పూనల్‌వెల్లి అనే ఊరిలో పుట్టాడు. ముత్తయ్యా భాగవతార్ తండ్రి లింగం అయ్యర్, తల్లి ఆనందమ్మాళ్. ఆరేళ్ళ వయసులో ముత్తయ్యా తండ్రి మరణించాడు. లక్ష్మణసూరి ముత్తయ్యకు మేన మామ. ఆయన హరి కేశ నల్లూర్‌లో ఉండేవాడు. ముత్తయ్యను చేరదీసి ఈయనే పెంచాడు. సాంబశివయ్యర్ దగ్గర సంగీతం నేర్చుకొన్నాడు ముత్తయ్యా. 1893లో కచేరీలు చేయడం ప్రారంభించాడు. 1897లో తిరువాన్‌కూర్ మహారాజా ఆస్థానంలో కచేరీచేసి, సన్మానాలు పొందాడు. అలాగే ఎట్టయాపురం జమిందారులచేతకూడా సన్మానాలు అందుకొన్నాడు 1927లో మైసూరురాజు చేత సన్మానం పొందాడు. 'గాయక శిరోమణి'

అన్న బిరుదుకూడా పొందాడు. మైసూర్‌లో ఉన్న చాముండేశ్వరీ దేవి పైన, శివుడిపైన కీర్తనలు రాశాడు. ముత్తయ్యా కీర్తనలేకాకుండా వర్ణాలు, రాగమాలికలు, ఎన్నో రాశాడు మద్రాసులో మ్యూజిక్ అకాడమీని స్థాపించిన వారిలో ముత్తయ్యాభాగవతార్ ఒకడు. 1930లో అకాడమీ 'సంగీతకళానిధి' బిరుదును ఇచ్చి సత్కరించింది. గోటువాద్యం నారాణయ్యార్, టి.ఎల్. వెంకట్రామయ్యార్, మధురైమణి అయ్యార్, ఖుడలూర్ కృష్ణశాస్త్రి మొదలైనవాళ్ళంతా ఈయనశిష్యులే.

ముత్తయ్యా భాగవతార్ నాలుగు వందల దాకా కృతులు రాశాడు. ప్రచారంలో ఉన్న రాగాల్లోనేకాకుండా, కొన్ని అపురూప రాగాలలో కూడా కృతులు రాశాడు. 'హంసానంది' అనేరాగం హిందుస్థానీ రాగం. దీనిని మన కర్ణాటక సంగీతంలోకి ముత్తయ్యా తీసుకొచ్చాడు. ఈ రాగంలో 'నీదుమహిమపొగడ' అనే కీర్తన రాసాడు. ఇది బాగా ప్రచారంలో ఉంది. మోహన కల్యాణి, గౌడమల్హారు, వలజి రాగాలలో కీర్తనలు రాశాడు. ఆరాగాలు బాగా ప్రచారంలోకి వచ్చేందుకు కృషి చేశాడు. అంతేకాదు. ఇరవైకి పైగా కొత్తరాగాలు కనుగొన్నాడు. ఈ కొత్తరాగాల్లో కీర్తనలు కూడా రచించాడు. పశుపతిప్రియ, బుధమనోహరి, విజయనాగరి, కర్ణరంజని ఇవి ఈయన కనుగొన్న కొన్ని కొత్తరాగాలు, తెలుగు, సంస్కృతం, తమిళం, కన్నడ భాషలలో కీర్తనలు రచించాడు. ఈయన ముద్ర 'హరికేశ'.

## 25. సారంగపాణి

క్షేత్రయ్యలా పదాలను రాసిన వాగ్గేయకారుడు సారంగపాణి. 17వ శతాబ్దంలో చిత్తూరు జిల్లాలో కార్వేటి నగరంలో ఉండేవాడు. సంస్కృత, తెలుగు భాషల్లో పండితుడు. క్షేత్రయ్యలాగే మువ్వగోపాలుడి భక్తుడు. ఈయన పదాలలో 'వేణుగోపాల' ముద్ర ఉంటుంది. సుమారు రెండు వందల పదాల్ని ఈయన రచించాడు.

## 26. పాపనాశన్ శివన్



1890లో పాపనాశన్ శివన్ తమిళనాడులో పోలగమ్ అనే ఊళ్ళో పుట్టాడు. తల్లియోగాంబాళ్, తండ్రి రామమూర్తి అయ్యర్. పాపనాశన్ శివన్‌కు ఆరేళ్ళున్నప్పుడు తండ్రి మరణించాడు. శివన్ చిన్నతనంలోనే సంస్కృతం బాగాచదువుకొన్నాడు. చిన్నతనంలో చక్కనిగొంతుతో బాగాపాడేవాడు. కోనేరిరాజపురం వైద్యనాథయ్యర్

దగ్గర సంగీతం నేర్చుకొన్నాడు. సంస్కృతంలోను, ఎక్కువగా తమిళంలోను కీర్తనలు రాశాడు. ఈయనను' తమిళ త్యాగరాజు' అని పిలచేవారు. ప్రసిద్ధరాగాలు అన్నింటిలోను కీర్తనలు రచించాడు. నవరస కన్నడ, బలహంస, తిలంగ్, మాండ్ లాంటి రాగాలలో కూడా రచనలు చేశాడు. కొన్ని సినిమాలకి సంగీతం కూర్చాడు. కొన్ని సినిమాలలో నటించాడు కూడా. 83 వ ఏట మరణించాడు.

## 27. తూమునరసింహదాసు

**1753 - 1820** మధ్య ప్రాంతంలో ఉన్న వాగ్గేయకారుడు తూము నరసింహదాసు. తెలుగు బ్రాహ్మణుడు రామభక్తుడు, తల్లితండ్రులు వెంకమాంబ, అప్పయ్యమంత్రి. గుంటూరు జిల్లాలో ప్రభుత్వోద్యోగిగా ఉండేవాడు. నరసింహదాసు తన ఇంట భజనలు, సంకీర్తనలు జరిపేవాడు. భద్రాచలంలో రాముణ్ని దర్శించుకొని, 'దాశరధితో సరిదైవ మేడ' అన్న కీర్తన జింగ్లారాగంలో రాశాడు. శ్రీరంగ పట్నం వెళ్ళి అక్కడ శ్రీరంగనాధుడిపైన 'కస్తూరి రంగ ననుకావవయ్యా' అన్న కీర్తన తోడిరాగంలో రాశాడు. అలాగే 'రంగనిసేవింప' అనే దేవగుప్తి రాగంలో కీర్తన రాసాడు. కంచి వెళ్ళి అక్కడ శహన రాగంలో 'వరదునిగంటి కంచి వరదునిగంటి' అనేకీర్తన రాశాడు. తిరువయ్యార్‌లో త్యాగరాజ స్వామిని కలుసుకొన్నాడు. త్యాగయ్య రామభక్తిని చూసి ఎంతో పరవశించాడు తూము నరసింహదాసు.

నరసింహదాసు రచించిన కీర్తనలు ఐదు వందల దాకా ఉన్నాయి. 'భజన చేసే విధము తెలియండి' అనే సౌరాష్ట్రరాగ కీర్తన, 'సెలవమాకికో' అన్న యదుకుల కాంభోజికీర్తన,

'సీతామనోహర' అన్న కీర్తనలు బాగా ప్రచారంలో ఉన్నాయి. నరసింహదాసు **45** రాగాల్ని తనకీర్తనల్లో వాడాడు. ఆకాలంలో బాగా ప్రచారంలో ఉన్న యదుకుల కాంభోజి, నాట, నాదనామక్రియ, పున్నాగవరాళి, కాపి, కేదారగౌళ, శ్రీరాగం, భూపాల, ముఖారి, మోహన లాంటి రాగాలు వాడాడు.

ఇది వరకు భజన గోష్ఠులలో ఈయనకీర్తనలు బాగా వినపడేవి. భద్రాచలంలో రోజూ రాముడి పూజచేసేటప్పుడు ఈయన కీర్తనల్ని పాడుతూంటారు. రేడియోలో ఉదయం పూట వచ్చే భక్తిరంజని కార్యక్రమంలో ఈయన కీర్తనలు అప్పుడప్పుడు వినిపిస్తాయి.

## 28. మునిపల్లె సుబ్రహ్మణ్యకవి

రామాయణ కథని కీర్తనల రూపంలో రాసిన వాగ్గేయకారుడు మునిపల్లె సుబ్రహ్మణ్యకవి. కృష్ణా జిల్లాలో ఉన్న మునిపల్లెలో **1730 - 1780** ప్రాంతంలో ఉండేవాడు. ఈయన నూట నాలుగు కీర్తనలు రచించాడు. సావేరి, శుద్ధసావేరి, కల్యాణి, మోహన, కేదారగౌళ, ముఖారి, సౌరాష్ట్ర ఆనందభైరవి, నాటలాంటి ప్రసిద్ధ రాగాలలో ఈయన కీర్తనలున్నాయి. ఈయన కీర్తనల్ని అధ్యాత్మ రామాయణ కీర్తనలు అంటారు.

## 29. అల్లూరి వెంకటాద్రిస్వామి

కృష్ణజిల్లా అల్లూరులో **1807**లో జన్మించిన వెంకటాద్రి స్వామి తల్లితండ్రులు వెంకమాంబ, వెంకయ్య. దక్షిణ భారతదేశంలో ఉన్న చాలా దేవాలయాలను దర్శించి వెంకట్రాది స్వామి ఆయా

దేవతలపైన కీర్తనలు రచించాడు. కంచిలో చాలా రోజులున్నాడు. అక్కడ వరద రాజస్వామి, పైన ఎన్నో కీర్తనలు రచించాడు. ఈయనకీర్తనల్లో 'కస్తూరి రంగ కరుణింపవయ్య' 'మ్రొక్కెదరారా మోహనరంగ', 'మేలుకో శ్రీరంగనాథ దయానిధే' లాంటి ఈయన కీర్తనలు ప్రచారంలో ఉన్నాయి.1877లో మరణించిన వెంకటాద్రి స్వామి మరణించేముందు సన్యాసం తీసుకొన్నాడు. నలభై రాగాలలో రచనలు చేశాడు.

ఇలా ఎందరెందరో వాగ్గేయకారులు ఉన్నారు. కొందరు ముఖ్యమైన వాగ్గేయకారుల జీవిత చరిత్రలు మీకు చెప్పాను. ప్రత్యేకంగా వాగ్గేయకారుల జీవితచరిత్రలు కొన్ని పుస్తకాలలో ఉంటాయి. అవి చదివితే మీకు ఇంకా చాలామంది వాగ్గేయకారుల జీవిత చరిత్రలు తెలుస్తాయి. ఇటీవల కాలంలో శ్రీరాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ, శ్రీ జి.యన్. బాలసుబ్రహ్మణ్యం, శ్రీ ఓగిరాల వీర రాఘవశర్మ, శ్రీ మంగళంపల్లి బాలమురళీకృష్ణ, శ్రీ ఎన్.సి.హెచ్. కృష్ణమాచార్యులు, శ్రీలాల్గుడిజయరామన్ లాంటి వారు కూడా ఎన్నో సంగీత రచనలు చేశారు.

కచేరీలకి వెళ్ళినప్పుడు, విద్వాంసులు పాడే కీర్తన ఏ రాగంలో ఉందో, ఏ తాళంలో ఉందో ఒక పుస్తకంలో రాసుకోమని చెప్పాను గుర్తుందా. అలా రాసుకొనే టప్పుడు ఆ సంగీతరచన రచించిన వాగ్గేయకారుడి పేరుకూడా ఎవరినైనా అడిగి తెలుసుకొని రాసుకోండి. అలా చేస్తే వివిధ వాగ్గేయకారుల రచనలతో మీకు పరిచయం ఏర్పడుతుంది. వాగ్గేయకారుల జీవితచరిత్రలు, బొమ్మలు, సేకరించండి, వాగ్గేయకారుల బొమ్మలతో ఆల్బమ్‌ను తయారు చేయండి. సరేనా?

# సంగీత విద్వాంసులు

వాగ్గేయకారుల జీవిత చరిత్రల్ని మనం చెప్పుకొన్నాం. ఈ వాగ్గేయకారులే కాకుండా, గాత్ర విద్వాంసులు, వైలెన్, వీణ, వేణువు, నాగస్వరం, మృదంగం, ఘటం ఇలా వివిధ వాద్యాలలో నిపుణులైన విద్వాంసులు ఎందరెందరో ఉన్నారు. వారిలో కొంతమంది పేర్లు, వారు దేనిలో నిపుణులో తెలుసుకొందాం.

ఇంచుమించు 20వ శతాబ్దం ప్రారంభం నాటికి ఉన్న విద్వాంసుల పేర్లు ముందు తెలుసుకొందాం.

1. నయానా పిళ్ళై (గాత్రం)
2. దక్షిణామూర్తి పిళ్ళై (మృదంగం)
3. సీతారామయ్యర్ (మోర్‌సింగ్)
4. అళహనంబి (మృదంగం)
5. తిరుక్కోడి కావల్ కృష్ణయ్యరు (వైలెన్)
6. చిదంబర భాగవతార్ (గాత్రం)
7. పొన్నయ్య పిళ్ళై (గాత్రం) (వాగ్గేయకారుడు)
8. టైగర్ వరదాచారి (గాత్రం)
9. నటేశయ్యర్ (గాత్రం)
10. కారైకుడి సాంబశివయ్యరు (వీణ)
11. పల్లడం సంజీవరావు(వేణువు)
12. శరభశాస్త్రి (వేణువు)

13. వీణ ధనమ్మాళ్ (వీణ)
14. అనంతరామ భాగవతార్ (గాత్రం)
15. అశ్వధాటి రామమూర్తి (మృదంగం)
16. బలిజేపల్లి సీతారామయ్య (గాత్రం)
17. కడప రామసుబ్బయ్య (గాత్రం)
18. సుసర్ల దక్షిణామూర్తి శాస్త్రి (గాత్రం)
19. పాప వెంకట్రామయ్య (ఫైలెన్)
20. అరియకుడి రామానుజయ్యంగార్ (గాత్రం)
21. మహారాజపురం విశ్వనాధయ్యర్ (గాత్రం)
22. మధురై శ్రీరంగం అయ్యంగార్ (గాత్రం)
23. ముసిరి సుబ్రహ్మణ్యాయ్యర్ (గాత్రం)
24. జి. యన్. బాల సుబ్రహ్మణ్యం (గాత్రం)
25. చిత్తూరు సుబ్రహ్మణ్య పిళ్లే (గాత్రం)
26. మధురై మణి అయ్యర్ (గాత్రం)
27. గోటు నారాయణయ్యంగార్ (గోటు)
28. మైసూర్ టి. చౌడయ్య (ఫైలెన్)
29. మైసూర్ టి. గురురాజప్ప (ఫైలెన్)
30. పాల్ఘాట్ మణి అయ్యర్ (మృదంగం)
31. పళని సుబ్రహ్మణ్యపిళ్లే (మృదంగం)
32. స్వామినాధ పిళ్లే (వేణువు)
33. ఆర్. కె. వెంకట్రామ శాస్త్రి (ఫైలెన్)
34. మహావాది వెంకటప్పయ్య (గాత్రం)

35. క్రోవి సత్యనారాయణ (గాత్రం)
36. మునుగంటి వెంకట్రావు పంతులు (గాత్రం)
37. వంకదారి వెంకట సుబ్బయ్య (గాత్రం, వైలెన్)
38. చిలకలపూడి వెంకటేశ్వర శర్మ (గాత్రం)
39. డొక్కా శ్రీరామమూర్తి (గాత్రం)
40. పురాణం కనకయ్యశాస్త్రి (గాత్రం)
41. తాడిగడప శేషయ్య (గాత్రం)
42. పారుపల్లి రామకృష్ణయ్య పంతులు (గాత్రం, వైలెన్)
43. శిమిళి సుందరం అయ్యర్ (గాత్రం)
44. పాలఘాట్ రామభాగవతార్ (గ్రాతం)
45. బిడారం కృష్ణప్ప (గాత్రం)
46. బిడారం రాచప్ప (గాత్రం)
47. బి. యస్. రాజయ్యంగార్ (గాత్రం)
48. మైసూర్ దేవేంద్రప్ప (గాత్రం)
49. వాసా వెంకట్రావు (వీణ)
50. నందిగామ వెంకన్న (వీణ)
51. తుమరాడ సంగమేశ్వరశాస్త్రి (వీణ)
52. దుర్వాసుల సోమయాజులు (వీణ)
53. ద్వారం వెంకటస్వామినాయుడు (వైలెన్)
54. ద్వారం వెంకట కృష్ణయ్య (వైలెన్)
55. పిరాట్ల శంకరశాస్త్రి (గాత్రం)
56. బెంగుళూరు నాగరత్నమ్మ (గాత్రం)

57. కోయంబత్తూరు తాయి (గాత్రం)

58. గోవిందస్వామి పిళ్ళై (వైలన్)

59. రాజ మాణిక్యం పిళ్ళై (వైలన్)

60. అలత్తూర్ సోదరులు (గాత్రం)

ఇటీవల మరణించిన విద్వాంసులలో కొందరి పేర్లు తెలుసుకొందాం.

1. శ్రీమతి ఎమ్. ఎల్ వసంతకుమారి (గాత్రం)
2. శ్రీ డి.కె. జయరామన్ (గాత్రం )
3. శ్రీ మహారాజపురం సంతానం (గాత్రం)
4. శ్రీ యస్. రామనాధన్ (గాత్రం)
5. శ్రీ ఓలేటి వెంకటేశ్వరులు (గాత్రం)
6. కుమారి శ్రీ రంగం గోపాలరత్నం (గాత్రం)
7. శ్రీ ఎమ్. వి. రమణ మూర్తి (గాత్రం)
8. శ్రీ ఎమ్.డి. రామనాధన్ (గాత్రం)
9. శ్రీ మారెళ్ళ కేశవరావు (వైలన్)
10. శ్రీ మహాదేవ్ రాధాకృష్ణ రాజు (మృదంగం)
11. టి. ఆర్. మహాలింగం (వేణువు)
12. శ్రీ శంకరశాస్త్రి (వీణ)
13. శ్రీ ఎస్. బాలచందర్ (వీణ)

ప్రస్తుతం ఉన్న కొందరు విద్వాంసుల పేర్లు కూడా తెలుసుకొందాం.

1. శ్రీ శ్రీపాద పినాకపాణి (గాత్రం)

2. శ్రీ నేదునూరి కృష్ణమూర్తి (గాత్రం)
3. శ్రీ సెమ్మంగుడి శ్రీనివాసయ్యర్ (గాత్రం)
4. శ్రీమతి డి.కె. పట్టమ్మాళ్ (గాత్రం)
5. శ్రీ టి. లోకనాధశర్మ (గాత్రం)
6. శ్రీ టి. ఆర్. సుబ్రహ్మణ్యం (గాత్రం)
7. శ్రీ నూకల చినసత్యనారాయణ (గాత్రం)
8. శ్రీ మంగళం పల్లి బాలమురళీకృష్ణ (గాత్రం, వైలెన్)
9. శ్రీమతి ఎమ్. ఎస్. సుబ్బులక్ష్మి (గాత్రం)
10. రాధ అండ్ జయలక్ష్మి (గాత్రం)
11. హైదరాబాదు సోదరులు (గాత్రం) (డి. రాఘవాచారి
డి. శేషాచారి గార్లు)
12. శ్రీ టి.ఎన్. శేషగోపాలన్ (గాత్రం)
13. శ్రీ కె.వి. నారాయణస్వామి (గాత్రం)
14. శ్రీ సి. చిట్టిబాబు (వీణ)
15. శ్రీ పుదుక్కోటై కృష్ణమూర్తి (వీణ)
16. శ్రీ శివానందం, శ్రీమతి శారదా శివానందం (వీణ)
17. శ్రీ లాల్గుడి జయరామన్ (వైలెన్)
18. శ్రీ టి. యన్. కృష్ణన్ (వైలెన్)
19. శ్రీ ఎమ్. ఎస్. గోపాల కృష్ణన్ (వైలెన్)
20. శ్రీమతి టి. రుక్మిణి (వైలెన్)
21. కుమారి ఎ. కన్యాకుమారి (వైలెన్)
22. శ్రీమతి రాజేశ్వరీ పద్మనాభన్ (వీణ)

23. శ్రీ ఎన్. రమణి (ఫ్లూట్)

24. సిక్కిల్ నీల, కుంజుమణి (ఫ్లూట్)

25. శ్రీ రవికిరణ్ (గోటు)

26. శ్రీ అల్లం దుర్గాప్రసాద్ (గోటు)

27. శ్రీ ద్వారం దుర్గాప్రసాదరావు (వైలెన్)

28. శ్రీ ముళ్ళపూడి శ్రీరామమూర్తి (మృదంగం)

29. శ్రీ ఎమ్.ఎస్. బాలసుబ్రహ్మణ్య శర్మ (గాత్రం)

30. శ్రీ దండమూడి రామమోహనరావు (మృదంగం)

31. శ్రీ కె.వి. ప్రసాద్ (మృదంగం)

32. శ్రీ వినాయకరామ్ (ఘటం)

33. శ్రీహరిశంకర్ (కంజీరా)

34. శ్రీ గురువాయూర్ దొరై (మృదంగం)

35. బొంబాయి సోదరీమణులు (గాత్రం) (శ్రీమతులు సరోజ, లలిత)

36. శ్రీ ఎన్. సి. హెచ్. కృష్ణమాచార్యులు (వైలెన్, గాత్రం)

37. శ్రీ అన్నవరపు రామస్వామి (వైలెన్)

38. శ్రీ మండ బలరామ శర్మ (వేణువు)

39. శ్రీయువటూరి విజయేశ్వరరావు (గాత్రం, వైలెన్)

40. శ్రీ నేతి శ్రీ రామ శర్మ (గాత్రం, వైలెన్)

41. శ్రీ అంపోలు మురళీకృష్ణ (వైలెన్)

42. శ్రీ వి. కమలాకర్ (మృదంగం)

43. శ్రీ మహదేవ్ లక్ష్మీనారాయణ రాజు (మృదంగం)

44. శ్రీ వి.యల్. జానకిరాం (వీణ)
45. శ్రీ వంకాయల వెంకటరమణ (మృదంగం)
46. శ్రీ కొమాండూరి కృష్ణమా చార్యులు (వైలెన్)
47. శ్రీ పేరి శ్రీరామమూర్తి (వైలెన్)
48. శ్రీ ఆకెళ్ళ మల్లికార్జునశర్మ (వైలెన్)
49. శ్రీ ఎల్లా వెంకటేశ్వరరావు (మృదంగం)
50. శ్రీ దోమాడ చిట్టి అబ్బాయి (నాదస్వరం)
51. శ్రీ ఆర్. కె. సూర్యనారాయణ (వీణ)
52. శ్రీ జయశంకర్ (నాదస్వరం)
53. శ్రీ షేక్ చిన్నమౌలానా (నాదస్వరం)
54. శ్రీ యు. శ్రీనివాస్ (మేండొలిన్)
55. శ్రీ ఎ.కె.సి. నటరాజన్ (క్లారినెట్)
56. శ్రీ వలయపట్టి దండపాణి (జలతరంగిణి)
57. శ్రీ ఆర్.కె. శ్రీకంఠన్ (గాత్రం)
58. శ్రీమతి సుధారఘునాథన్ (గాత్రం)
59. శ్రీమతి నాగమణి శ్రీనాథ్ (గాత్రం)
60. కుమారి బొంబే జయశ్రీ (గాత్రం)

ఇలా చెప్పుకొంటూ పోతే ఎందరెందరో విద్వాంసులు ప్రస్తుతం ఉన్నారు. కచేరీలు వింటుంటే మీకు చాలా మంది విద్వాంసుల పేర్లు తెలుస్తాయి. విద్వాంసుల ఫోటోలు, జీవితచరిత్రలు కూడా సేకరించండి. ఆల్బమ్ తయారుచేయండి.

# కర్ణాటక సంగీతం - ఇతర సంగీతాలు

మన సంగీతానికి, పాశ్చాత్య సంగీతానికి ఉన్న భేదాల్ని మనం తెలుసుకొందాం. పాశ్చాత్య సంగీతానికి, మన సంగీతానికి ఉన్న ముఖ్యమైన భేదం - పాశ్చాత్యసంగీతంలో చెవికి ఇంపుగా ఉండే కొన్ని స్వరాల్ని ఏకకాలంలో వినిపింపచేస్తారు. మనసంగీతంలో అలాకాదు. చెవికి, ఇంపుగా ఉండే స్వరాల్ని ఒకదానితరువాత ఒకటి పాడడమో, వాయించడమో చేస్తారు. పాశ్చాత్యసంగీతంలో పాట పాడడం కన్నా వాద్యాలకే ఎక్కువ ప్రాధాన్యత ఉంటుంది. ఒకేసారి రకరకాల వాద్యాలమీద, రకరకాల స్వరాల్ని వాయిస్తారు. ఒకసారి కొన్ని వాద్యాలు, ఇంకోసారి కొన్ని ఇలా వాయిస్తూంటారు. వాద్యాలన్నింటికీ శృతి కూడా ఒక్కటి ఉండదు.

పాశ్చాత్య సంగీతంలో 'ఆర్కెస్ట్రా' అనేది ఉంటుంది. ఆర్కెస్ట్రా అంటే వాద్యసమ్మేళనం అన్నమాట. ఇరవై నుండి అరవై దాకా వాద్యాల పైన కొన్ని స్వరసమూహాలను ఒకేసారి వాయించి, వినేవాళ్ళకు ఆనందాన్ని కలిగిస్తారు.

పాశ్చాత్య సంగీతంలో రాగాలు ఉండవు. కేవలం స్వరాల సమూహాలే ఉంటాయి. వాళ్ళరచనలు అన్నీ ఎక్కువగా మన శంకరాభరణ రాగంలోనే ఉంటాయి. కొన్ని రచనలు మాత్రం మన కీరవాణి, గౌరీమనోహరి రాగాలలో ఉంటాయి. శంకరాభరణ

రాగాన్ని మేజర్‌స్కేల్ అని, కీరవాణిని హార్మోనికల్ మైనర్‌స్కేల్ అని, గౌరీమనోహరిని మెలాడికల్ మైనర్ స్కేల్ అని అంటారు.

పాశ్చాత్య సంగీతంలో మన కర్ణాటక సంగీతంలోలా మనోధర్మ సంగీతం ఉండదు. ఒకళ్ళు సంగీత రచనల్ని రాస్తారు. అలా రాసేవారిని 'కంపోజర్' అంటారు. 'కంపోజర్' తయారు చేసిన సంగీతాన్ని వాయిస్తారు లేదా పాడతారు. అంతేకాని అప్పటికప్పుడు తమ కల్పనని ఉపయోగించి పాడడం, వాయించడం కాని పాశ్చాత్య సంగీతంలో లేదు.

మనం గమకాలను గురించి చెప్పుకొన్నాం. ఈ గమకాలు పాశ్చాత్యసంగీతంలో ఉండవు. గమకంలేకుండా కేవలం స్వరాలన్ని మాత్రమే పాడతారు లేదా వాయిస్తారు.

కర్ణాటక సంగీతంలో ఎన్నో తాళాలు ఉన్నాయి అని చెప్పుకొన్నాం. పాశ్చాత్య సంగీతంలో తాళాలు ఉండవు. కేవలం లయ మాత్రమే ఉంటుంది. అండే ఒక క్రియతోనే పాటల్ని కొలుస్తారు.

మనకర్ణాటక సంగీతానికి, పాశ్చాత్యసంగీతానికి మరో ముఖ్యమైన భేదం ఉంది. మన కర్ణాటక సంగీతం మనసుని కదిలిస్తుంది. పాశ్చాత్య సంగీత కేవలం మన శరీరాన్ని మాత్రమే కదిలిస్తుంది. అండే పాశ్చాత్య సంగీతం వింటే మనకి హుషారు వచ్చి డాన్స్ చేయవచ్చు. అయితే మన కర్ణాటక సంగీతం కేవలం శరీరానికి ఆనందం ఇచ్చేదికాదు. మన సంగీతం మనస్సులోకి చొచ్చుకొని పోయి, మనకు ఎంతో హాయిని, ప్రశాంతతని

కలిగిస్తుంది. మన సంగీతంలో ముఖ్యమైనది భక్తి. మన సంగీతంతో భగవంతుణ్ని చేరవచ్చు. వాగ్గేయకారులు ఎందరోసంగీతం ద్వారా మోక్షాన్ని పొందారు. మరి పాశ్చాత్య సంగీతంలో అలాంటి అవకాశం లేదు.

పాశ్చాత్య సంగీతం ప్రభావం మన సంగీతంపైన చాలా కొద్దిగా ఉంది. 'రమించువారెవరురా', 'రఘువంశ సుధాంబుధిచం-ద్ర శ్రీ', నెనరుంచినారు' ఇలాంటి కొన్ని కృతులు విన్నప్పుడు, వాటిపై పాశ్చాత్య సంగీత ప్రభావం కొద్దిగా ఉన్నట్లు కనిపిస్తుంది.

పాశ్చాత్య సంగీతం నుంచి వైలిన్ మనకర్ణాటక సంగీతంలోకి వచ్చింది. వైలిన్ ప్రక్కవాద్యంగా వాయించడానికి, విడిగా వాయించడానికి ఎంతో బాగుండడంతో మన సంగీతంలో వైలిన్ ఒక భాగం అయిపోయింది. వయోలా, గిటార్, మాండొలిన్ ఇవికూడా పాశ్చాత్య సంగీతవాద్యాలు వీటిపైన కూడా మన కర్ణాటక సంగీతాన్ని వాయిస్తున్నారు. వయోలా, వైలిన్ లాగే ఉంటుంది. ఇది వైలిన్‌కన్నా కొంత సైజులో పెద్దది. నాదం కూడా ఇంచుమించు వైలిన్ నాదంలాగే ఉంటుంది. దీనితో కొందరు ప్రక్కవాద్యం వాయిస్తున్నారు. అలాగే కొందరు సోలో కచేరీలు కూడా చేస్తున్నారు. మాండొలిన్‌ను మనకర్ణాటక సంగీతంలోకి తీసుకొచ్చినది శ్రీ యు. శ్రీనివాస్ అని మనం ముందేతెలుసుకొన్నాం. అలాగే శ్రీ సుకుమార్ ప్రసాద్, శ్రీ బాలు విశ్వనాథన్ మొదలైన వాళ్ళు గిటార్‌పైన కర్ణాటక సంగీతాన్ని వినిపిస్తున్నారు. 'శాక్సోఫోన్' అనే గాలివాద్యం పాశ్చాత్య సంగీత వాద్యం. దీనిపైన

కూడా కొందరు మన కర్ణాటక సంగీతం వాయిస్తున్నారు. మన కర్ణాటక సంగీతాన్ని స్వరంతో రాయడానికి పద్ధతులు ఉండేవికావు. ఇలా స్వరంతో రాయడాన్నే నొటేషన్ రైటింగ్ అంటారని ముందు తెలుసుకొన్నాం. పాశ్చాత్యసంగీతాన్ని రాయడానికి పద్ధతులు ఉన్నాయి. వాటి ప్రభావంతో మన కీర్తనలు స్వరంతో రాయడానికి పద్ధతులు ఏర్పడ్డాయి.

మన సంగీతంలో స్వరాల్ని గమకంతో పాడతారు. ఈ గమకాల్ని నొటేషన్‌లో స్పష్టంగా చూపించలేము. కనుక గురువు ద్వారానే మన సంగీతం నేర్చుకోవాలి. అయితే బాగా సంగీతం వచ్చిన విద్వాంసులు ఈ నొటేషన్ సహాయంతో కీర్తనల్ని నేర్చుకోగలుగుతారని ముందే మనం తెలుసుకొన్నాం.

ఇప్పుడు కర్ణాటక సంగీతానికి హిందుస్థానీ సంగీతానికి ఉన్న పోలికలు, భేదాలు గురించి చెప్పుకొందాం. హిందుస్తానీ సంగీతంలో కూడా శృతులు, స్వరస్థానాలు, స్వరాలు మన కర్ణాటక సంగీతంలో ఉన్నట్లుగానే ఉంటాయి. కాని గమకాల్లో, వాద్యాలలో సంగీతరచనల్లో, కచేరీపద్ధతి, మనోధర్మసంగీతం, బోధనా పద్ధతులు, రాగపద్ధతులు మొదలైన వాటిలో వాళ్ళకు, మనకు తేడాలున్నాయి. హిందుస్థానీ, సంగీతం రాజదర్బారులలో పెరిగింది. కర్ణాటక సంగీతం దేవాలయాలతో అభివృద్ధి చెందింది. అందే హిందుస్థానీ సంగీతం కేవలం వినోదప్రధానం. కర్ణాటక సంగీతం వినోదంతో పాటు, మోక్షాన్ని ఇచ్చేసాధనం. కర్ణాటక, హిందుస్థానీ సంగీతాలకు గలతేడాలు చెప్పుకొందాం.

గమకాలు : మన కర్ణాటక సంగీతంలో పదిరకాలగమకాలు ఉన్నాయని, ఇవేకాకుండా చాలా రకాల గమకాలు వాడతాం అని చెప్పుకొన్నాం. అయితే హిందుస్థానీలో ఇన్ని రకాల గమకాలు ఉండవు. గమకాలు వినగానే అది హిందుస్థానీ సంగీతమో, కర్ణాటక సంగీతమో చెప్పవచ్చు. హిందుస్థానీలో ఎక్కువ గమకం లేకుండా పాడతారు. జారు గమకం (అంటే ఒక స్వరం లోంచి, ఇంకో స్వరంలోకి జారడం) ఎక్కువగా వాడతారు.

వాద్యాలు : హిందుస్థానీలో కూడా శృతికి తంబూరాయే వాడతారు అయితే ఇంకా ఇతర వాద్యాలలో తేడాలున్నాయి. హిందుస్థానీ సంగీతంలో వాడే సారంగి, సరోద్, సంతూర్ మన సంగీతంలో లేవు. అలాగే మన కర్ణాటక సంగీతంలో తాళవాద్యాలు అయిన కంజీరా, మోర్సింగ్, ఘటం ఇవి హిందుస్థానీలో లేవు. గాత్రానికి ప్రక్కవాద్యంగా మనకర్ణాటక సంగీతంలో వైలెన్ ఉపయోగిస్తారని తెలుసుకొన్నాం. హిందుస్థానీలో ప్రక్కవాద్యంగా సారంగి అనే వాద్యాన్ని కాన్ని, హార్మోనియంను కాని ఉపయోగిస్తారు. సారంగి వైలెన్‌ను పోలి ఉంటుంది. మన వీణలాంటి వాద్యం వాళ్ళకు ఉంది. దానినే సితార్ అంటారు. పూర్వం ధృవవీణ, చలవీణ అని రెండు రకాల వీణలు ఉండేవి. ధృవవీణ అంటే ప్రస్తుతం మనం వాడేవీణ. చలవీణ అంటే మెట్లు కదుపుకోడానికి వీలైన వీణ. అంటే రాగాల్ని బట్టి మెట్లును మార్చుకోవాలన్నమాట. ధృవవీణలో అలా మెట్లును కదపడానికి వీలుండదు. సితార్ చలవీణ అన్నమాట. అంటే రాగాన్ని బట్టి దాని మెట్లను

జరుపుకోవాలి. సితార్‌నాదం లలితంగా ఉంటే వీణ నాదం ఘనంగా ఉంటుంది.

మనం సంగీతంలో తాళ వాద్యాలలో ముఖ్యమైనది మృదంగం అని చెప్పుకొన్నాం. ఈ మృదంగాన్ని రెండు భాగాలుచేస్తే అది 'తబలా' అనేవాద్యం అవుతుంది, ఈ తబలా హిందుస్థానీలో తాళవాద్యం. మృదంగాన్ని రెండు భాగాలుచేసి, ఆ రెండు భాగాలనీ చర్మం మూతలతో మూస్తారు. కుడిచేతితో ఒక భాగాన్ని వాయిస్తారు. దానిని 'తబల' అంటారు. ఎడమ చేతితో మరోభాగాన్ని వాయిస్తారు. దానిని 'బాయ' అంటారు. మృదంగంకు బోనం పెడతారని తెలుసుకొన్నాం. తబలాకు అలా పెట్టరు. రెండు భాగాలకీ కరిణి ఉంటుంది. తబలా నాదంకి, మృదంగ నాదంకి తేడా ఉంది. నాదాన్ని బట్టి ఇది తబలా అని, ఇది మృదంగం అని చెప్పేయచ్చు. మృదంగంపై వచ్చేశబ్దాల్ని జతులంటారని చెప్పుకొన్నాం. ఈ జతులని 'త, ధి, గి, ణ, తోం, ఝం, కి, ట, త, కో ఇలా పిలుస్తారు. అయితే 'తబలాపైన వచ్చే శబ్దాల్ని 'నాధింధినాన ధింకిట రిన్న' ఇలా పిలుస్తూంటారు.

గోటు, వైలెన్ వాద్యాలపైన కూడా హిందుస్థానీ సంగీతం వాయిస్తారు. గోటును విచిత్ర వీణ అంటారు వాళ్ళు. మన వేణువుకన్నా వాళ్ళ వేణువులావుగా, పొడవుగా ఉంటుంది. దాన్ని బాంసురి అంటారు.

మన సన్నాయి కన్నా చిన్నదిగా ఉండే సన్నాయి లాంటి వాద్యం హిందుస్తానీలో ఉంది. దానినే 'షెహనాయ్' అంటారు.

సంగీతరచనలు: మనకు ఉన్నన్ని సంగీతరచనలు వాళ్ళకు లేవు. ద్రుపద్, ఠుమ్రి, తరానా, గజల్, దాద్రా, ఖవ్వాలి అనేవి వాళ్ళ సంగీతరచనల్లో రకాలు. ఇవన్నీ పాడడానికే. వాద్యాలపైన ఇవి వాయించరు. 'జోద్' అనే దానినే వాయిస్తారు.

మనోధర్మ సంగీతం: మన కర్ణాటక సంగీతంలో రాగాలాపన, స్వరకల్పన, నెరవు, రాగం, తానం, పల్లవి ఇలాంటి మనోధర్మ సంగీతానికి సంబంధించిన అంశాలుంటాయని చెప్పుకొన్నాం. మన కర్ణాటక సంగీతంలో రాగాలాపన పాడి ఆ తరువాత, సంగీతరచనను పాడతారని చెప్పుకొన్నాం. అయితే హిందుస్థానీ సంగీతంలో రాగాన్ని ప్రత్యేకంగా ఆలాపన చెయ్యరు. ఒక చిన్న పల్లవిని తీసుకొని, ఆ పల్లవినే నెరవు పాడినట్లు పాడుతూంటారు. మధ్యమధ్యలో రాగాన్ని పాడతారు. అలా పాడేటప్పుడు రాగాన్ని వేగంగాను, నెమ్మదిగాను, కూడా పాడతారు. ఇలా తీసుకొన్న పల్లవినే 'ఖ్యాల్' అంటారు.

రాగం, తానం, పల్లవి అనేది ప్రత్యేకంగా వాళ్ళకు లేదు. స్వరకల్పన కూడా అంతగా ఉండదు హిందుస్థానీలో

బోధనాపద్ధతులు: మన సంగీతం నేర్చుకొనే విద్యార్థులు సరళీస్వరాలు, జంటస్వరాలు, అలంకారాలు ఇలా నేర్చుకొంటారని, నేర్చుకోడానికి పనికి వచ్చేరచనలు చాలా ఉన్నాయని మనం చెప్పుకొన్నాం. ఇలాంటివి వాళ్ళకు లేవు. ఇప్పుడిప్పుడే మన పద్ధతిలో నేర్పడం వాళ్ళుకూడా మొదలు పెట్టారు.

రాగాలు: హిందుస్థానీలో మేళకర్త, రాగాలు చాలా తక్కువగా

ఉన్నాయి. మేళకర్త రాగాలనే వాళ్ళు 'థాట్' అంటారు. మనకి ఉన్న హంసధ్వని, అభోగి, ఖమాస్, శహన రాగాలను వాళ్ళు కూడా అదే పేరుతో పిలుస్తున్నారు.

కొన్ని రాగాలను మనం ఒక పేరుతో పిలిస్తే, అదేరాగాన్ని వాళ్ళు వేరేపేరుతో పిలుస్తున్నారు. హిందోళరాగాన్ని వాళ్ళు 'మాల్‌కోస్' అంటారు. మోహన రాగాన్ని 'భూపాల' అని, శంకరాభరణాన్ని 'బిలావల్' అని, శుభపంతువరాళిని 'తోడి' అని; సింధుభైరవిని, భైరవిఅని; ద్విజావంతిని జై జైవంతిఅని ఇలా ఒకేరాగాన్ని మనం ఒకపేరుతో పిలిస్తే వాళ్ళు మరోపేరుతో పిలుస్తున్నారు.

రాగాలను వాళ్ళు స్త్రీ రాగాలని, పురుష రాగాలని విభజిస్తారు. అలాంటి పద్ధతి మనకి లేదు.

తాళాలు : హిందుస్థానీలో, మనకి ఉన్నన్ని తాళాలు లేవు. హిందుస్థానీగాయకులు చేతితో తాళం వేస్తూ పాడరు. తబలా వాయించేవారు తాళాన్ని చూపిస్తూ వాయిస్తారు. దానిని బట్టి పాడేవాళ్ళు పాడతారు. వాయించేవాళ్ళు వాయిస్తారు. 'ఏక్‌తాళ్' 'తీన్‌తాళ్' అనే తాళాలు వాళ్ళకి ఉన్నాయి.

కచేరీపద్ధతి : మనకచేరీలు తానవర్ణంతో మొదలు అవుతాయని, ఆ తరువాత వినాయక ప్రార్థన పాడతారని, ఆతరువాత కొన్ని రచనలు పాడతారని మనం ముందు తెలుసుకొన్నాం. హిందుస్థానీ సంగీత కచేరీలలో విఘ్నేశ్వర ప్రార్థన ఉండదు. కీర్తనలు పాడడం ఉండదు. ఒక రాగంలో విలంబిత్ ఖ్యాల్ అదే రాగంలో ధృత్

ఖ్యాల్, ఆ తరువాత అదేరాగంలో తరానా, ఆ తరువాత ఒక భజన్, ఠుమ్రీతో కచేరీ ముగిస్తారు. నాలుగు, ఐదు గంటలు కచేరీ ఉంటుంది. కర్ణాటక సంగీత కచేరీల్లో పది, పదిహేను రాగాలు వినిపిస్తాయి. అయితే హిందుస్థానీ సంగీతచేరీల్లో రెండు, మూడు రాగాలకన్నా ఎక్కువ వినిపించవు.

మన సంగీత కచేరీల్లో వైలిన్, మృదంగాలకి కూడా ప్రాధాన్యత ఉంటుంది. అయితే హిందుస్థానీ కచేరీలలో ప్రక్కవాద్యాలకి ప్రాధాన్యత తక్కువ.

హిందుస్థానీ సంగీతంలో విలంబిత కాలంలో (నెమ్మదిగా పాడేకాలం) ప్రతీ అంశాన్ని పాడతారు. ఆ తరువాతనే వేగంగా పాడతారు. అయితే మన కర్ణాటక సంగీతంలో ప్రత్యేకంగా 'విలంబిత కాలం' వినిపించదు.

ఇలా కర్ణాటక, హిందుస్థానీ సంగీతాలకి చాలాభేదాలు న్నాయి.

# సంగీతం ఎందుకు నేర్చుకోవాలి? ఎందుకు వినాలి?

సంగీతం గురించి మనం ఇంతవరకు చాలా విషయాలు నేర్చుకొన్నాం. మీ అందరికీ ఒక సందేహం వచ్చి ఉండవచ్చు అసలు సంగీతం ఎందుకు నేర్చుకోవాలి? ఎందుకు వినాలి? అని.

సంగీతం మనల్ని ఎంతో ప్రభావితం చేస్తుంది. మనలో అంతర్గతంగా ఉన్న మృదుస్వభావాన్ని తట్టిలేపి, సౌమ్యతను అలవరిచే గుణం సంగీతానికి ఉంది. పిల్లల మానసిక వికాసానికి సంగీతం దోహదపడుతుంది. సంగీతం నేర్చుకోవడం వల్ల మెదడు పనితీరు వేగంవంతమై వ్యక్తిలో ఉన్న శక్తి యుక్తులతో ఆ వ్యక్తి ఏ రంగంలోనైనా రాణించ గలడు. అతనికి అన్ని రంగాలలోనూ విజయం లభించగలదు.

మనకు చాలా చికాకులు కలుగుతాయి. మనం ఒకసారి బాగా పనిచేసి అలిసి పోతూఉంటాం. అలాంటప్పుడు మంచి సంగీతం వింటే ఎంతో మానసిక ప్రశాంతత దొరుకుతుంది. సంగీతం వల్ల ఎన్నో రోగాల నయం అవుతాయని ఇటీవల చేస్తున్న పరిశోధనల వల్ల తేలింది. రోగాల్ని నయం చేసేందుకు సంగీతాన్ని వినిపిస్తారు. రోగులకు ఆపరేషన్ చేసేముందు వాళ్ళకు సంగీతం వినిపిస్తారు. ఇలా చేయడం వల్ల వాళ్ళకు ఆపరేషన్ అంటే ఉన్న భయం పోతుంది. పోటీలలో పాల్గొంటున్న క్రీడాకారులకి గెలుస్తామో,

లేదో అనే మానసిక ఒత్తిడి ఉంటుంది. ఈ ఒత్తిడి తగ్గించడానికి సంగీతం వినిపిస్తున్నారు. ఎన్నో మానసిక వ్యాధుల్ని పోగొట్టడానికి సంగీతం పనికొస్తుందని, పరిశోధనలవల్ల తేలింది.

సంగీతం బాగా నేర్చుకొని, రోజూ భక్తితో, శ్రద్ధతో, ఏకాగ్రతతో సాధన చేస్తే మనం భగవంతుణ్ని చేరవచ్చు. త్యాగయ్య, రామదాసు, పురందరదాసు, శ్యామశాస్త్రి, అన్నమయ్య ఇలా ఎందరెందరో వాగ్గేయకారులు సంగీతంతో మోక్షం పొందారు. మోక్షం పొందడానికి సంగీతం చాలా సులువైన మార్గం.

ప్రపంచంలో ఉన్న అన్ని సంగీతాలలోకి మన కర్ణాటక సంగీతం చాలా గొప్పది. మనకి ఉన్నన్ని రాగాలు, తాళాలు, ఇన్ని సంగీతరచనలు మరి ఏ ఇతర సంగీతాలలోనూ కనిపించవు. ఎందరెందరో వాగ్గేయ కారులు మన సంగీతాన్ని బాగా అభివృద్ధిచేసి మనకు అందించారు. సంగీతం వాళ్ళు మనకి ఇచ్చిన వరం. ఒక అమూల్య సంపద. ఎక్కడైనా బాగా పాత శిల్పాలు, దేవాలయాలు ఉండే వాటిని మనం రక్షించు కొంటాం కదా! ప్రభుత్వం వాటిని కాపాడడానికి చర్యలు తీసుకొంటుంది. అలాగే మనకు ఎంత కాలంగానో వస్తున్న సంగీతాన్ని కూడా మనం కాపాడుకోవాలి. సంగీతాన్ని కాపాడుకోవాలంటే మనమంతా సంగీతం నేర్చుకోవాలి. మనం సంగీతాన్ని నేర్చుకొని తరువాత తరానికి అందించాలి. ఇలా ఒకతరం నుంచి మరోతరానికి సంగీతాన్ని అందించినప్పుడే అది నిలుస్తుంది. అయితే అందరూ సంగీతం నేర్చుకోలేరు. కొందరు మాత్రమే సంగీతం చక్కగా పాడగలరు. కొందరు చక్కగా వాద్యాల్ని వాయించగల్గుతారు.

సంగీతం నేర్చుకొన్నవాళ్ళు పిల్లలకు తొందరగా సంగీతం వచ్చేస్తుంది. అందరూ సంగీతం నేర్చుకోలేకపోయినా, కనీసం సంగీతం వినే అలవాటైనా చేసుకోవాలి. విద్వాంసులు కచేరీలు చేయాలంటే వినేవాళ్ళు కూడా ఉండాలి కదా! వినేవాళ్ళు లేనిదే కచేరీ ఎవరకోసం చేస్తారు? అందుచేత సంగీతం వినే అలవాటు చేసుకోవాలి. తల్లి, తండ్రులు, తమ పిల్లలకు చిన్నతనం నుంచీ, రామదాసు, అన్నమయ్య, కీర్తనలు లాంటివి ప్రతీరోజూ వినిపించాలి. రేడియోలో వచ్చే 'భక్తిరంజని' కార్యక్రమాన్ని కూడా వినే అలవాటు పిల్లలకు కలిగించాలి. ఇలా చేయడం వల్ల పిల్లలకు సంగీతం అంటే ఆసక్తి ఏర్పడుతుంది. వాళ్ళుకూడా పాడడానికో, ఏదైనా వాద్యం నేర్చుకోడానికో ఉత్సాహం చూపిస్తారు. అప్పుడు తల్లిదండ్రులు వాళ్ళను ప్రోత్సహించి, సంగీతం నేర్పించాలి. చిన్నప్పటి నుంచీ మంచి సంగీతం వినిపించడం వల్ల పెద్దఅయ్యాక మంచి సంగీతాన్ని విని ఆనందించగల్గుతారు. కొందరు పిల్లలు విద్వాంసులుగా తయారు అవుతారు. ఇలా సంగీతం ఒక తరంనుంచి మరొక తరానికి అందుతుంది. ఇలా ఒకతరం నుంచి మరోతరానికి సంగీతాన్ని అందిస్తూ దాన్ని కాపాడుకోవడానికి మనం సంగీతం నేర్చుకోవాలి. వినాలి. చివరిగా సంగీతం నేర్చుకోవడం వల్ల మరో ప్రయోజనం ఏమిటంటే - సంగీత విద్వాంసులుగా తయారు అయ్యి కచేరీల వల్ల డబ్బు పేరు సంపాదించుకోవచ్చు. అలాగే రేడియోలోను సంగీత కళాశాలల్లోనూ, పాఠశాలల్లోనూ ఉద్యోగాలు సంపాదించు కోవచ్చు. ఈ కారణాల వల్ల సంగీతం నేర్చుకోవాలి. వినాలి.

# సంగీతం ఎలా వినాలి?

మనం సంగీతం గురించి చాలా విశేషాలు చెప్పుకొన్నాం. సంగీతం నేర్చుకోవాలసిన ఆవసరాన్ని కూడా గుర్తించాం. అయితే సంగీతం ఎలా వినాలి? ఎలా నేర్చుకోవాలి? అని మీకు సందేహం వచ్చిందా? ఇప్పుడు మనం సంగీతం ఎలా విని, ఆనందించాలో తెలుసుకొందాం.

సంగీతం వినడం వల్ల బ్రహ్మానందం కలుగుతుంది. బ్రహ్మానందం అంటే అంతులేని ఆనందం. ఎప్పుడు సంగీతం విన్నా ఆనందమేకలుగుతుంది కాని, ఆనందం కలగక పోవడం అన్నది ఉండదు. అయితే ఈ బ్రహ్మానందం అందరికీ కలగదు. భగవంతునిపై ఎంతో భక్తి ఉన్నవాళ్ళకే కలుగుతుంది. త్యాగరాజు, దీక్షితార్, రామదాసు, పురందరదాసు, అన్నమయ్య, శ్యామశాస్త్రి లాంటి వాగ్గేయకారులు ఎందరో సంగీతంతో బ్రహ్మానందం పొందారు. మనం కూడా సంగీతంతో బ్రహ్మానందం పొందడానికి ప్రయత్నించాలి. భగవంతుడిపై భక్తిని పెంపొందించుకొని శ్రద్ధగా సంగీతం వినాలి.

కచేరీకి వచ్చే శ్రోతలు చాలా రకాలుగా ఉంటారు. సంగీతం బాగా వచ్చిన విద్వాంసులు, సంగీతం తెలియని సాధారణమైన శ్రోతలు, సాహిత్యం బాగాతెలిసి, సంగీతం కొంత తెలిసిన సాహిత్యవేత్తలు ఇలా చాలా రకాల శ్రోతలు ఉంటారు. ఇంకా సంగీతం నేర్చుకొనే విద్యార్థులు కూడా కచేరీలకు వస్తారు.

అస్సలు సంగీతం తెలియని శ్రోతలు ఎలా వింటారో చూద్దాం. గాయకుడు లేదా గాయకురాలి గొంతు బాగున్నా, వేగంగా ఉన్న కీర్తనలు పాడుతున్నా, స్వరకల్పన వేగంగా చేస్తున్నా, బాగా తెలుసున్న కీర్తనలు పాడుతున్నా, రాగాలాపన వేగంగా చేస్తున్నా, హెచ్చు స్థాయిలో రాగాన్ని ఆలపించినా విని మెచ్చుకొంటారు. సాహిత్యం బాగా తెలిసున్న వాళ్ళు పాడేవాళ్ళు సాహిత్యం సరిగా ఉచ్చరిస్తున్నారా? లేదా? పదాల్ని సరిగా విడదీస్తున్నారా లేదా! మొదలైన విషయాలు గమనిస్తారు.

ఇంక సంగీతం బాగా వచ్చిన విద్వాంసులు ఎలా వింటారో చూద్దాం. గాయకుడు చక్కగా శృతిలోపాడుతున్నాడా లేదా? మంచి లయజ్ఞానం ఉందా? లేదా? అని ముందు చూస్తారు. కీర్తనల్లో మంచి సంగతులు పాడినా, రాగాలాపనను బాగా పాడినా, స్వరకల్పన కొత్త పద్ధతుల్లో చేసినా విద్వాంసులు మెచ్చుకొంటారు. అలాగే కష్టమైన తాళాలలో రాగం, తానం, పల్లవి, పాడినా 'భేష్' అంటారు. విద్వాంసులు వీటన్నింటిని మించి, చక్కని గమకాలతో పాడుతున్నాడా? లేదా? అని కూడా చూస్తారు. సాధారణంగా కచేరీలలో వినిపించని మారుమూల రాగాలు, కీర్తనలు పాడినా విద్వాంసులు మెచ్చుకొంటారు. ఇలా విద్వాంసులు కచేరీని చాలా రకాలుగా పరిశీలిస్తూ వింటారు.

సంగీతం నేర్చుకొనే విద్యార్థులు కూడా కచేరీలో ప్రతీదీ చాలా జాగ్రత్తగా పరిశీలిస్తూ వినాలి. రాగాలాపన ఎలా చేశారు స్వరకల్పన ఎలా చేశారు? గమకాల్ని ఎలా స్వరాలకు ఇస్తున్నారు? ఏరాగం తరువాత ఏరాగం పాడుతున్నారు? ఏ

కీర్తన తరువాత దేనిని పాడుతున్నారు? ఇలా కచేరీలో అన్ని అంశాల్ని సంగీతం నేర్చుకొనే విద్యార్థులు జాగ్రత్తగా పరిశీలిస్తూ వింటే ఎన్నెన్నో కొత్త విషయాల్ని వాళ్ళు నేర్చుకోగల్గుతారు. రాగాలాపన వినడం వల్లనే పట్టుపడుతుందని చెప్పుకొన్నాం. అందుచేత రాగాలాపనల్ని శ్రద్ధగా విద్యార్థులు వినాలి.

ఈ పుస్తకం చదవడం వల్ల సంగీతం గురించి మీకు కొంత అవగాహన అయిఉంటుంది. అందుచేత నెమ్మదిగా సంగీతం వినడం అలవాటు చేసుకోండి. మొదట్లో మీరు సాధారణ శ్రోతగానే ఉండవచ్చు. కాని నెమ్మది నెమ్మదిగా సంగీతం గురించి ఎన్నో విషయాల్ని అర్థం చేసుకొన గలిగే స్థితికి మీరు ఎదగగల్గుతారు.

సంగీతం ఎలా వినాలి అని మనం చర్చిస్తూ కూర్చోవడం కన్నా సంగీతాన్ని వింటే మీకే తెలుస్తుంది. అందులో ఉన్న ఆనందం ఏమిటో 'ఈ లాగని వివరింపలేను చాలా స్వానుభవైక వేద్యము' అన్నాడు త్యాగరాజు. సంగీతం వినడం వల్ల వచ్చే ఆనందం ఇంత అని మనం చెప్పలేం. ప్రతి ఒక్కరూ సంగీతం విని స్వయంగా అందులో ఆనందాన్ని అనుభవిస్తేనే తెలుస్తుంది ఆ ఆనందం ఏమిటో. మరి ఈ రోజునుంచీ సంగీతాన్ని విని ఆనందాన్ని అనుభవించండి.



# సంగీతం పై నూతన పరిశోధనలు

సంగీతానికి ఎంతో శక్తి ఉంది. త్యాగరాజు 'జ్యోతి స్వరూపిణి' అనే రాగం పాడితే దీపం దానంతట అదే వెలిగిందని చెబుతారు. అలాగే త్యాగయ్య బిలహరి రాగం పాడి చనిపోయిన వ్యక్తిని బ్రతికించాడని చెప్పుకొన్నాం. అలాగే తాన్‌సేన్ అనే గాయకుడు 'దీపక్' రాగం పాడి దీపం దానంతట అదే వెలిగేలా చేశాడని చెబుతారు. ముత్తుస్వామిదీక్షితార్ అమృత వర్షిణి రాగం పాడి, వర్షం కురిసేలా చేశాడని ముందు తెలుసుకొన్నాం. ముత్తుస్వామి దీక్షితార్ సోదరుడు చిన్నస్వామి దీక్షితార్ 'నాగవరాళి' అనే రాగం పాడితే ఒక పామువచ్చి, రాగం విని, రాగం అయ్యాక వెళ్ళిపోయిందట. ఇవన్నీ కట్టుకథలుఅని మనం కొట్టి పారవేయనవసరం లేదు. ఎందుకంటే ప్రస్తుతం దేశ విదేశాలల్లో సంగీతం పైన ఎన్నో పరిశోధనలు జరుగుతున్నాయి. ఈ పరిశోధనల ఫలితంగా సంగీతానికి ఎంతో శక్తిఉందని ఋజువు అవుతోంది. అలా సంగీతం పైన దేశవిదేశాల్లో జరుగుతున్న కొన్ని కొత్త పరిశోధనలు గురించి తెలుసుకొందాం.

1969లో అమెరికాలో శ్రీమతి డోరోతి మొక్కలపైన సంగీత ప్రభావం ఎలా ఉంటుందో పరిశోధన చేశారు. ఆవిడ గాజు పెట్టెల్లో మొక్కల్ని పెట్టారు. కొన్ని మొక్కలకి పాశ్చాత్య సంగీతం వినిపించారు. కొన్నింటికి మన హిందుస్థానీ సంగీతం వినిపించా ఇలా రోజూ చేసేవారు. కొన్ని రోజులకి, హిందుస్థానీ సంగీతం

వినిపిస్తున్న మొక్కలు స్పీకరువైపు వంగి ఉన్నాయి. అంటే అవి ఆ సంగీతం వినడానికి బాగా ఇష్టత చూపుతున్నాయన్నమాట. పాశ్చాత్య సంగీతం వినిపించినవ మొక్కలు లౌడు స్పీకరుకు మరోవైపు వంగాయి. అంటే అవి ఆ సంగీతాన్ని ఇష్టపడడం లేదన్నమాట. ఈ ప్రయోగం వల్ల మొక్కలకి సంగీతం అంటే ఇష్టమని, అందులోనూ రణగొణ ధ్వనులు లేని మనసంగీతం అంటే ఇంకా ఇష్టం అని తేలింది.

రష్యాలో కొందరు శాస్త్రజ్ఞులు పంటపొలాలికి సంగీతం వినిపిస్తే దిగుబడిబాగా పెరుగుతుందని కనుగొన్నారు. అలాగే పాడి పశువులకి సంగీతం వినిపిస్తే పాల ఉత్పత్తి బాగా పెరుగుతుంది. షాకల్టన్ అనే శాస్త్రవేత్త అంటార్కిటికా పరిశోధనలకోసం వెళ్ళాడు. ఆయన ఓమంచుదిబ్బమీద గ్రామఫోన్ పెట్టి సంగీతం వింటుంటే ఆ గ్రామఫోన్ చుట్టూ పెంగ్విన్ పక్షులు చేరి సంగీతం వింటూండేవి. ఈ విషయాన్ని కెప్టెన్ స్కాట్ కూడా సమర్థించాడు. పెంగ్విన్‌లు ఎవరైనా పాడినా కూడా విని ఆనందిస్తాయని చెప్పాడు. ఓ ఫ్రెంచి పశువైద్యుడు గుర్రాలకు, గాడిదలకు సంగీతం వినిపిస్తే అవి ఎంత శ్రమనైనా ఓర్చుకొని పనిచేస్తాయని చెప్పాడు.

లండన్‌లో ఓ మానసిక శాస్త్రవేత్త సంగీతానికి జంతువులు ఎలా ప్రభావతం అవుతాయో తెలుసుకోవాలను కొన్నాడు. ఒక జూకి వెళ్ళి జంతువులకి సంగీతం వినిపించాడు. సంగీతం విని అవన్నీ ఎంతో ఆనందించాయని, వాటి ఆనందాన్ని రకరకాలుగా తెలియపరిచాయని ఆయన ఓవ్యాసంలో రాశాడు.

సింహాలు, పెద్దపులులు తమకి ఇష్టమైన సంగీతం విన్నప్పుడు

అవి తలలుపైకెత్తి, ఆకాశం వైపు చూస్తూ పెద్దగా అరుస్తాయి. ఖడ్గమృగాలు, చిరుతపులులు కూడా సంగీతాన్ని ఎంతగానో ఇష్టపడతాయి. చక్కని సంగీతం వినిపిస్తే సాలెపురుగులు తాముదాక్కొన్న చోటునుంచి బయటకు వస్తాయి. కుక్కలు, పిల్లులు కూడా సంగీతం అంటే ఎంతో ఇష్టంగా వింటాయి. ప్రఖ్యాత ఫ్రెంచికవి థియోఫిలెగాటియర్ తన పెంపుడు పిల్లి గురించి ఇలా రాశాడు ''దీనికి సంగీతం అంటే ఇష్టమేకాదు సంగీతంలో మంచి పరిజ్ఞానం కూడా ఉంది. మా ఇంటికి ఎవరైనా వచ్చి పాడుతుండే, బాగున్నంతసేపు వింటుంది. నచ్చకపోతే పాడేవారి నోటిని, తన పంజాతో మూసేయడానికి కూడా వెనుకాడదు.'' అని.

చిన్నపిల్లలు సంగీతం అంటే బాగా ఇష్టపడతారని తెలుసుకొన్నాం. అయితే చిన్న పిల్లలేకాదు. తల్లిగర్భంలో ఉన్న శిశువులు కూడా సంగీతం అంటే బాగా ఇష్టపడతారు. ఈ విషయాన్ని బ్రిటన్‌కు చెందిన సైకాలజీ ప్రొఫెసరు 'క్లిఫర్డు వోల్ఫ్స్' కనుగొన్నారు. ఆయన ఎందరో గర్భవతులైన స్త్రీలపైన పరిశోధనలు చేశారు. ఆయన గర్భంతో ఉన్న స్త్రీ పొట్టపైన సంగీతం వచ్చే హెడ్ ఫోన్స్ ఉంచేవారు. లోపల పిండం సంగీతానికి చాలా వేగంగా కదలడం. పిండం గుండె కొట్టుకోవడంలో మార్పులు రావడం ఆయన గమనించాడు. అయితే అన్నిపిండాలలోను ఈ చలనం ఒకేలా ఉండేదికాదు. కొన్నింటిలో ఒక మాదిరిగాను, కొన్నింటిలో అస్సలు లేకుండాను, కొన్నింటిలో ఎక్కువగాను ఉండేది. ఆరోనెల దాటాక పిండం శబ్దాలను వినగల్గుతుంది. పిండం ఎనిమిదోనెల నుంచి బయట శబ్దాల్ని బాగా వినగల్గుతుంది.

సంగీతంలో రోగాల్ని నయం చేయవచ్చునని శాస్త్రవేత్తలు నిరూపిస్తున్నారు. **1890**లో శ్రీ విలియమ్ జేమ్స్ మొదటిసారిగా సంగీతాన్ని వైద్యానికి ఉపయోగించారు. దీనిపై ఎన్నో పరిశోధనలు చేసి బ్రిటన్ సొసైటీ 'మ్యూజిక్ థెరపీని' ప్రవేశపెట్టింది. మ్యూజిక్ థెరపీ అంటే సంగీతంతో రోగాల్ని నయం చేసే చికిత్స అన్నమాట. బ్రిటన్‌లో మానసిక వ్యాధుల్ని నయం చేయడానికి సంగీతమే మంచి మందు అని కనుగొన్నారు. మానసిక వ్యాధులను, సంగీతంతో నివారించారు కూడా. అమెరికాలో డా.శ్యామ్ భట్నాగల్ సంగీతంతో మానసిక వ్యాధుల్ని తగ్గిస్తున్నారు. అమెరికాలోనే చాలామంది వ్యాపారస్తులు, వ్యాపారంలో ఎదుర్కొనే సమస్యల వల్ల తమకు ప్రశాంతత లేకుండాపోతోందని, దీనికి ఏదైనా పరిష్కారం చూపించండి అని మానసిక వైద్యుల్ని అడుగుతున్నారు. వీరందరికీ ఫ్లాయిడ్ యస్. బోర్స్టెన్ అనే శాస్త్రవేత్త సంగీతంతో మానసిక ప్రశాంతతని చేకూర్చుతున్నాడు.

అమెరికా యువతి కుమారి కెల్మెన్ మనదేశం వచ్చి, మన కర్ణాటక సంగీతంతో రోగాల్ని నయం చేసే విషయంపైన పరిశోధనలు చేసింది. 'వీణ వాయించ గలననే భావనే నాలోని అన్ని రుగ్మతల్ని నాశనం చేసింది' అంటుందామె. శ్రీ మంగళం పల్లి బాలమురళీ కృష్ణ కూడా మ్యూజిక్ థెరపీపైన పరిశోధనలు చేస్తున్నారు. ఢిల్లీలో ఇటీవల రక్తపోటు, మాదకపదార్థాలకు అలవాటు పడడం లాంటి రోగాలను సంగీతంతో నయం చేయడానికి పరిశోధనలు చేశారు.

ఇలా సంగీతం మీద ఎన్నో పరిశోధనలు జరుగుతున్నాయి.

భవిష్యత్తులో మాత్రలు, ఇంజెక్షన్లకి బదులు సంగీతమే అన్నిరోగాలకీ మందు అవుతుందేమో ?

## అవరోహణ

సంగీతంగురించి ఎన్నెన్నో విషయాలు తెలుసుకొన్నారు. సంగీతం నేర్చుకోవలసి అవసరాన్ని, వినవలసిన అవసరాన్ని కూడా మీరు గుర్తించే ఉంటారు. కర్ణాటక సంగీతంపైన ఆసక్తిని, అభిరుచిని పెంచుకొని తద్వారా మన కర్ణాటక సంగీతాన్ని కలకాలం నిలుపుకోవలసిన బాధ్యత మనందరి పైనా ఉంది. ఈపుస్తకం చదివిన పాఠకుల్లో కొద్దిమందైనా సంగీతం మీద ఆసక్తిని పెంపొందించుకొని, సంగీత ప్రియులుగా మారితే మా ప్రయత్నం సఫలీకృతం అయినట్లే.

### మంగళం

సౌరాష్ట్ర రాగం - ఆదితాళం - రచన: త్యాగరాజు

| | | |
|---|---|---|
| పల్లవి | నీ నామ రూపములకు - నిత్యజయ మంగళం | ॥ నీ ॥ |
| అనుపల్లవి | పవమాన సుతుడు బట్టు- పాదరవిందములకు | ॥ నీ ॥ |
| చరణం | రాజీవ నయన త్యాగరాజ వినుతమైన | ॥ నీ ॥ |



# ఉపయుక్త గ్రంథసూచి

1. గానకళాభోధిని — శ్రీ ఎస్.సి. పార్థసారధి & శ్రీమతి ద్వారక పార్థసారధి

2. రామదాసు — శ్రీ తాళ్ళూరి ఆంజనేయులు

3. అన్నమయ — శ్రీ కామిశెట్టి శ్రీనివాసులు

4. ఆంధ్ర సంగీత శాస్త్రము — శ్రీ కె.వి.యస్.ఎమ్. గిర్మాజీరావు

5. శ్రీ రామనాధపురం శ్రీనివాసయ్యంగారి రచనలు: — శ్రీ ఎస్.సి. పార్థసారధి & శ్రీమతి ద్వారక పార్థసారధి

6. మనోధర్మ సంగీతం — శ్రీ శ్రీపాద పినాకపాణి

7. శ్రీముత్తుస్వామి దీక్షితుల కృతులు — శ్రీ టియస్. పార్థసారధి, & శ్రీ భావరాజు నరసింహారావు

8. శ్రీ శ్యామశాస్త్రి కీర్తనలు — శ్రీ టియస్. పార్థసారధి, & శ్రీ భావరాజు నరసింహారావు



9. త్యాగరాజు స్వామి — శ్రీ బాలాంత్రపు రజనీ కాంతరావు

10. Carnatic Music Composers — Edited by Dr.B.Dayananda Rao.



11. సంగీతశబ్దార్థ చంద్రిక — శ్రీ అరిపిరాల సత్యనారాయణ మూర్తి

12. నృత్య, సంగీత వ్యాస రత్నావళి — శ్రీ విస్సా అప్పారావు

13. 'గానకళ'(సంగీత మాసపత్రిక) — కొన్ని సంచికలు

14. రాగరంజని (ఆంధ్రభూమి దినపత్రికలో ప్రచురితమైన వ్యాసాలు) — మధురిమ

15. సంగీత శాస్త్ర సారము (ప్రథమ భాగం) — శ్రీ ఎస్.ఆర్.జానకి రామన్

16. ఆంధ్రజ్యోతి, ఈనాడు, ఉదయం మొదలైన దిన పత్రికలలో ప్రచురితమైన కొన్ని సంగీతవ్యాసాలు.

17. Madras Music Academy Dairy

# రోహిణి పబ్లికేషన్స్

## రాజమండ్రి వారి

## వినూత్న ప్రచురణలు

| | |
|---|---|
| **సంపూర్ణ నీతి చంద్రిక** | పరవస్తు చిన్నయసూరి & కందుకూరి వీరేశలింగం |
| **నీతి కథామంజరి** | కందుకూరి వీరేశలింగం |
| **సత్యరాజా పూర్వదేశ యాత్రలు** | కందుకూరి వీరేశలింగం |
| **సంగ్రహ వ్యాకరణము** | కందుకూరి వీరేశలింగం |
| **రాధాకృష్ణ** (శృంగార నాటకం) | పానుగంటి లక్ష్మీనరసింహారావు |
| **కోకిల** | పానుగంటి లక్ష్మీనరసింహారావు |
| **విప్రనారాయణ** | పానుగంటి లక్ష్మీనరసింహారావు |
| **కంఠాభరణం** (హాస్యనాటకం) | పానుగంటి లక్ష్మీనరసింహారావు |
| **అష్టలక్ష్మీప్రసన్నం** | శాంతిశ్రీ బొత్సకవి |
| **పోతన భాగవత రత్నాలు** | శాంతిశ్రీ బొత్సకవి |
| **ఆయుర్వేద చికిత్సా విధానం** | చక్రవర్తుల పద్మనాభశాస్త్రి |
| **నల దమయంతుల కథ** | జయంతి సుబ్రహ్మణ్యశాస్త్రి |
| **నీతి శతక రత్నావళి** | ఏనుగు లక్ష్మణ కవి |
| **చంద్రాలోకము** | డా. బి.వి.ఎస్.ఎన్. మూర్తి |

| | |
|---|---|
| వివేక సింధువు | బి.వి. సుబ్రహ్మణ్యశాస్త్రి |
| హరిశ్చంద్ర నాటకం | వడ్డాది సుబ్బారాయుడు |
| సంగీత విద్యా ప్రకాశిక | ఆకొండి శ్రీనివాస రాజారావు |
| ఆంధ్ర నామ సంగ్రహణ | పైడిపాటి లక్ష్మణ కవి |
| భక్తచింతామణి | వడ్డాది సుబ్బారాయుడు |
| నక్షత్ర చింతామణి | బి.వి. సుబ్రహ్మణ్య శాస్త్రి |
| ఇంగ్లీషు గ్రామర్ | పప్ప భాస్కరరావు |
| హిందీ వ్యాకరణం | పురాణపండ శ్రీ చిత్ర |
| కాంతాలలామ శతకము | బి.వి. సుబ్రహ్మణ్యశాస్త్రి |
| విశ్వబ్రాహ్మణ గోత్రములు | పి.బి. వీరాచార్యులు |


# రోహిణి పబ్లికేషన్స్

**మెయిన్ రోడ్, రాజమండ్రి - 1**

**ఫోన్ : 73444**